H244

# తంజాపురాంధ్రనాయక రాజ చరిత్రము





కురుగంటి సీతారామయ్య, యం. ఏ.

ఆంధ్రగ్రంథమాల పదునేడవ కుసుమము

శ్రీరస్తు

# తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము

(ఆంధ్రవిశ్వవిద్యాలయపక్షమున నిచ్చిన యుపన్యాసముల సారము)

"యద్దృశ్యతే లుప్యతే యత్ప్రరోక్ష్యతే,
శత్రుతమిా సా తనూ ర్మే బభూవ"

గ్రంథకర్త:
కురుగంటి - సీతారామయ్య, యం. ఏ.,
ఉపద్రష్ట, సరస్వతీమహల్ పుస్తకాలయము,
తంజాపూరు

౧౯౩౨] [రు. ౨-౦-౦

# తొ లి ప లు కు

---

అనంతమైన కాలమహా ప్రవాహమునందు కల్పములు, మన్వంతరములు, యుగములు, ద్వీపములు, ఖండములు, సామ్రాజ్యములు, దృశ్యాదృశ్యములగుచు నిత్యమైన ధర్మాభ్యుదయమునకు వినియోగపడుచున్న విధము ప్రపంచేతిహాసము లనంతముఖములను బోధించుచున్నవి. చరిత్రమునకు నామరూపవిలసితములైన దేశకాలపాత్రములు విషయములైనను దేశకాలపాత్రముల కాధారభూతమైన ధర్మము హృదయముగ నున్నది. జీవరహితమైన దేహమువలెను ధర్మరహితమైన చరిత్రాంశములు విశ్వశ్రేయస్సునకు నిరర్థకములు. ప్రపంచచరిత్రను నూతన ధర్మలక్ష్యముతో నవలోకింపపలసిన విధమును హెచ్. జి. వెల్సుగారు విశదీకరించిరి:—

"చరిత్రకారులు సామాన్యముగను గొప్పపండితులు; వారు సాధారణముగను అసంగతవిషయములపట్లకన్నను స్వల్ప ప్రమాదములపట్లను పట్టుదలను జూపుచుందురు; వారు అనుపపన్న ప్రయోజన నిర్ణయముకన్నను, అసత్యతిథి నిర్ణయము గలుగజేసెడి పరిహాస ఖండనమునకు భయపడుదురు. చరిత్రకారుని లక్ష్యము కాలనిర్ణయము

నందు లగ్నమగుట సహజమైనను సామాన్యపాఠకుల కిట్టివిషయములం దభిరుచి గలుగజాలదు......విశాలమైన రాజకీ యార్థిక మత సాంఘిక విషయములందు పాఠకులచిత్తవృత్తినిలగ్నముచేయుట చరిత్రకు ప్రయోజనము......నెపోలియనుమహత్త్వ మర్దనశీలము నాసురమునైన మూఢవిశ్వాసము...............విశ్వశ్రేయస్సునకు సాధనములైన "శాంతం, శివం, సుందరం" ధర్మముల యభ్యుదయావతరణములు చరిత్రకు పరమార్థములు. ప్రపంచమునందు లక్షలమంది రాజులు, మహారాజులు, రారాజులు, చక్రవర్తులు పుట్టి గిట్టిరి......... వారియందు ధర్మదీక్షాపరాయణుండైన అశోకచక్రవర్తి పరంజ్యోతి వలెను ప్రకాశించుచున్నాఁడు."

ధర్మాభ్యుదయావతరణములేని రాజచరిత్రములు జీర్ణసామ్రాజ్యముల చరిత్రములవలెను కాలప్రవాహము నందు జీర్ణములైనవి. బలపరాక్రమముల లక్ష్యములకు నిలయములైన రాజచరిత్రములును ధర్మలక్ష్యమునకు సాధనభూతమైన విధమును విశదముచేయుట చరిత్రకు పరమార్థము. ఈపరమార్థమును చరిత్రవిషయములందు ప్రతిబింబింపజేయుట చరిత్రాంశకు ప్రయోజనము.

శ్రీ కురుగంటి సీతారామయ్య (ఎమ్. ఏ.) గారు తంజావూరు సరస్వతీ మహాలుపుస్తకాలయమునందు ఉపద్రష్టలుగ నున్నారు. ఆపదవియందు వారు చేసిన పరిశ్రమ ఈ "తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము" రూపమునను ఆంధ్రగ్రంథమాలయందు పదునేడవ కుసుమముగను ప్రకటింపబడినది. సీతారామయ్యగారు మొదటను ఆంధ్ర

విశ్వవిద్యాలయపక్షమున నిందలి విషయములను ఉపన్యాస రూపమునను వ్యక్తముచేసిరి. స్వదేశాభిమానము, స్వభాషాభిమానము, స్వజాత్యభిమానము ప్రబలముగను ప్రవర్ధమానంబగుచున్న వర్తమానసమయమునం దాంధ్రనామ సంస్మరణసంకీర్తనము లాంధ్రుల కత్యంతోత్సాహదాయకములుగ నుండుట సహజము. ఆంధ్రుల దక్షిణదేశ దండయాత్ర లాంధ్రాభ్యుదయమునకును, భారతీయసంస్కార సంరక్షణమునకును నుపకరించినవిధము నీగ్రంథము విశదము చేయుచున్నది.

అంతర్ముఖపత్రమునందు గ్రంథకర్త నిర్దేశించిన

"యద్దద్యతే లుప్యతే యత్పరోప్యతే
శత్తత్తమిా సా తనూర్మే బభూవ"

అను వేదవాక్యము వెల్సుగారు ప్రతిపాదించిన పరమార్థమునే ప్రతిపాదించుచున్నది. విశ్వశ్రేయస్సునకు నామరూప విలసితమైన ప్రపంచము నిరంతరము పునరావృత్తమగుచు ధర్మాభ్యుదయము గలుగుచున్నది. కాలగర్భమునందు సామ్రాజ్యము లస్తమించినను, సార్వభౌము లదృశ్యులైనను కాలాత్మపరమైన ధర్మ మవిచ్ఛిన్నముగను విశ్వశ్రేయస్సునకు వినియోగపడుచున్నది.

భరతవర్షమునందు దక్షిణోత్తరభాగములకు సంఘర్షము చిరకాలానుగతము. వింధ్యాద్రికి దక్షిణమున

నున్న పీఠభూమి మానవులకు ప్రాచీన వాసస్థలము. దక్షిణాపథమునం దుదీచ్యాగతులకును, దాక్షిణాత్యుల కును సంప్రాప్తములైన సాహచర్య సంఘర్షణములు భారతీయ విజ్ఞానధర్మాభ్యుదయములకు వినియోగపడినవిధము భారతీయేతిహాసములం దజ్ఞాతాధ్యాయముగ నున్నది. ఈ యజ్ఞాతాధ్యాయమునందు విశేషభాగ మాంధ్రులకు సంబంధమును గలిగియున్నది. దండకారణ్యప్రాంతవాసులైన యాంధ్రులీభారమును వహించుచుండిరి.

ఆంధ్రరాజ్య మాదియుగమునందు శకయవనాదుల విజృంభణము నరికట్టినవిధమునను మధ్యయుగమునందు విజయనగరసామ్రాజ్యము మహమ్మదీయ విజృంభణము నరికట్టినది. దక్షిణభాగమునందు భారతీయసంస్కార సంరక్షణమునకును, ఆంధ్రాభ్యుదయమునకును విజయ నగర సామ్రాజ్యమును, సామ్రాజ్యాంతర్భాగములును వహించినభారము పండితులకు పరిశోధనార్హముగ నున్నది. విజయనగరసామ్రాజ్యవిధ్వంసానంతరము దక్షిణాపథము, ముఖ్యముగ నాంధ్రావని, యనుభవించిన దుఃఖవేదనకు జీర్ణవిజయనగరము ప్రత్యక్షప్రమాణము. మహమ్మదీయవిజృంభణము, మహారాష్ట్రవిజృంభణము, పాశ్చాత్త్యవిజృంభణము దక్షిణదేశమును 1565 సంవత్సరానంతరము సంక్షోభక్షేత్రముగను పరిణమింపజేసినవిధ

మును దేశచరిత్రము వేయిముఖములను ప్రత్యక్షము చేయుచున్నది. ఆసంక్షోభమహాక్షేత్రమునందు తంజాపురాంధ్రనాయకరాజ్యము సుక్షేత్రమై కొంతకాలము సంక్షోభమును ప్రతిఘటించుచు స్వదేశవిజ్ఞానసంస్కారములను సంరక్షించినవిధము నీగ్రంథము సందర్భానుకూలముగను తెలుపుచున్నది.

చోళపాండ్య రాజ్యములు దక్షిణదేశమునందలి ప్రాచీనరాజ్యములు. ఈరాజ్యములు పదునాల్గవ శతాబ్దాంతమునందు విజయనగరసామ్రాజ్యాంతర్భాగములైనవి. చోళపాండ్యరాజులు ప్రాచీనకాలమునుండియును కావ్యకళాశిల్పపోషకులు. విజయనగరప్రతినిధులైన నాయకరాజులును చోళపాండ్యరాజుల మార్గము నవలంబించి తంజనగరమధురానగరముల గౌరవప్రతిష్ఠలను వృద్ధిచేసిరి. తంజాపురరాజులు సామ్రాజ్యపాశబద్ధులై సామ్రాజ్యాధికారమును గౌరవించుచుండిరి. భారతీయదౌర్భాగ్యమునకు మూలబీజమైన పరస్పరకలహములు, తంజాపుర మధుర రాజ్యములకు సహజావస్థలు. కేంద్రాధికారము ప్రబలముగ నున్నపు డంతఃకలహములను దీర్చుట కేంద్రప్రభుత్వమునకు సాధ్యమైనను నయ్యది శిథిలమైనపుడు దేశమంతఃకలహములకు నిలయమై దుఃఖభూయిష్ఠము గాగల విధమును జీర్ణసామ్రాజ్యములచరిత్రములు సహస్రముఖ

ములను ప్రత్యక్షము చేయుచున్నవి. జీర్ణవిజయనగర సామ్రాజ్యచరిత్ర మీపరమార్థమును బోధించుచున్నను వర్తమానరాజ్యాంగనిర్మాణసమస్యకును కేంద్రరాష్ట్రప్రభుత్వాధికారనిర్ణయము క్లిష్టమై దేశ ధర్మారాధనము దురారాధ్యముగ నున్నది.

తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రమును సూక్ష్మరూపమున నీపరమార్థమును ప్రదర్శించుచున్నది. నాగమనాయకుడు 1528 ప్రాంతమునందు శ్రీ కృష్ణదేవరాయల యాజ్ఞానుసారముగను పాండ్యరాజునకు సహాయమును చేయుటకు బోయి చోళరాజును జయించి పాండ్యునకు రాజ్యము నిచ్చుటకు బదులు తానే పాండ్యరాజ్యమున కాధిపత్యమును వహించెను. నాగమనాయని సుతుడు విశ్వనాథనాయకుడు రాయలవారి యాజ్ఞానుసారముగను తండ్రి నోడించి పాండ్యరాజ్యమును చంద్రశేఖరపాండ్యున కిచ్చెను. చంద్రశేఖరుని యనంతరము విశ్వనాథనాయకుడును ఆయన వంశమువారైన తిరుమలనాయకాదులును మధురరాజ్యము నేలుచు స్వాతంత్ర్యమును బూనుచుండిరి. విశ్వనాథనాయకుడే తంజాపురరాజ్యమున కధిపతి యైనటులు కొందర భిప్రాయపడుచున్నారు. సీతారామయ్యగా రీయభిప్రాయమును ఖండించుచు తంజాపురాంధ్రరాజచరిత్రము నిటులు నిర్ణయించుచున్నారు.

అచ్యుత దేవరాయలు క్రీస్తుశకము 1535 ప్రాంతములందు తన తోడి యల్లుడగు చినచెవ్వప్పనాయకుని తంజాపురము రాజధానిగగల చోళరాజ్యమున కభిషిక్తుని చేసినటులును, చెవ్వప్పనాయకుని పుత్రుడు అచ్యుతనాయకుడు 1561 - 1614 వరకును, పౌత్రుడు రఘునాథ నాయకుడు 1614 - 1633 వరకును నీ చోళరాజ్యమును పాలించినటులును సహేతుకముగా మిషనరీలలేఖలు, శాసనములు, గ్రంథములు మొదలగు నాధారములతో గ్రంథకర్త నిర్ణయించుచున్నారు. రఘునాథనాయకుని శౌర్యప్రతాపములను 1616 సంవత్సరమునందు జరిగిన తోపూరుయుద్ధము విశదము చేయుచున్నది. తోపూరువిజయము దక్షిణదేశసంక్షోభమును 40 ఏండ్లరికట్టినను చిరకాలసంవర్ధితంబులైన విలయబీజముల ఫలము కాలక్రమమున పరిపక్వమై ఫలించినది. విజయ రాఘవనాయకుడును, నాతనిసంతతివారును నీప్రళయ ఫలము ననుభవించిరి.

గ్రంథమునందు మధుర తంజాపురరాజ్యముల ఉద్భవనిర్గమనములకును, వంశావళులకును, పరస్పర కలహములకును, కేంద్రాధికారమునకును గల సంబంధములు సందర్భానుసారముగను జర్చింపబడినవి. ఈ రాజ్యములందు సహజముగను ప్రతిష్ఠితమైన ప్రళయబీజములకు మహమ్మదీయవిజృంభణము, మహారాష్ట్రవిజృం

భణము, పాశ్చాత్త్యవిజృంభణము దోహదంబు నొసంగి సర్వసంహారమునకు వినియోగపడినవిధమును దక్షిణదేశ చరిత్రము విశదముచేయుచున్నది. దక్షిణదేశరాజ్యముల చరిత్రము 17, 18 శతాబ్దములందు దుఃఖభూయిష్ఠమై అంధకారబంధురముగ నున్నది.

తంజాపురాంధ్రరాజచరిత్ర మాంధ్రచరిత్రము నందే కాక, దక్షిణహిందూరాజ్య చరిత్రమునందును మధ్యయుగమునందు చరమాధ్యాయము. ఈచరమా ధ్యాయమునందు రఘునాథనాయకుని పరిపాలనమును, గోవిందదీక్షితుని మంత్రిత్వమును సకలవిధములను శ్రీ కృష్ణదేవరాయలచరిత్రను స్మరింపజేయుచున్న విధమ నిటులు గ్రంథమునందు దెలుపబడినది.

"ఈచరిత్రమునకు రఘునాథుడు నాయకమణి. ఈయనను కృష్ణరాయలతో నన్నివిషయములలో బోల్పవచ్చును. లక్ష్మీసరస్వతు లిద్దరును తంజనగరము తమకు రాజధానిగా చేసికొని నిరంతర నృత్యము గావించిరి. ఆంధ్రభాషామతల్లికి ముద్దుకుమారుడై, యాంధ్ర కవితావధూటికి ప్రేమాస్పదుడైన నాయకుడై యీయన వరలెను. విద్యానగరమున కృష్ణరాయభోజుని కాలమున నాంధ్రకవితావధూటి యెట్లు పల్లకిలో నూరేగింపబడెనో యట్లె రఘునాథుని కాలమున శారద ధ్వజాదిరాజచిహ్నములతో వరలెను."

చోళ నాయక మహారాష్ట్ర మహమ్మదీయ బ్రిటీషు ప్రభుత్వముల సమరములకును, ద్వైతాద్వైత విశి

ష్టాద్వైత సంవాదములకును, హిందూమహమ్మదీయ క్రైస్తవమతసంస్కారపరివర్తనములకును రంగస్థలముగను పరిణమించిన తంజాపురము వర్తమానకాలమునందును విజ్ఞానస్థానముగను వెలయుచున్నది – చిరకాలాగతమైన రాజకీయమతసాంఘికార్థికాది సంస్కారములు వర్తమాన యుగమునందును రాజకీయములందును, సారస్వతమునందును, కళలయందును, శిల్పమునందును, ప్రజాశీలమునందును గోచరంబగుచు ధర్మప్రతిష్ఠకు సాధనంబగుచున్నవి. తంజాపురమునందు స్థాపితమైన సరస్వతీమహలు గ్రంథాలయము తంజాపురప్రాచీన వైభవదైన్యములను ప్రత్యక్షము చేయుచు సకలకర్మలకును నాధారభూతమైన విజ్ఞానవిజయమును సువ్యక్తము చేయుచున్నది. నామరూప విశిష్టములైన రాజ్యములు, కోటలు, గుళ్లు, గోపురములు, మిద్దెలు, మేడలు, మసీదులు, చర్చిలు జీర్ణము లగుచున్నను నామరూపాధిష్ఠితమైన విజ్ఞాన మప్రతిహతముగను, సజీవమైన కావేరీ ప్రవాహమువలెను, ప్రవహింపగలవిధమును జీర్ణమందిరస్థములైన జీర్ణగ్రంథములు స్ఫుటము చేయుచున్నవి.

నాయకరాజచంద్రుడు రఘునాథనాయకుడు కాలధర్మమును పొందినను రఘునాథాభ్యుదయాదికావ్యనాటకములును, గ్రంథాలయమును సజీవముగ నున్నవి.

అప్పయదీక్షితులు, గోవిందదీక్షితులు గతించినను వారి గ్రంథములు విలసిల్లుచున్నవి. గ్రంథాలయమునందు గల సంస్కృతాంధ్ర తమిళ కర్ణాట మహారాష్ట్రాది గ్రంథములును, చిత్రపటములును, రాజులును, రాజ్యములును నంతరించినను వానికి ప్రయోజనమైన విజ్ఞానవిజయమును విశదము చేయుచున్నవి.

శ్రీ సీతారామయ్యగారీగ్రంథాలయాధారమున తంజాపురాంధ్రనాయక చరిత్రమును రచించి సరస్వతీ మహాలు గ్రంథాలయప్రయోజనము నాంధ్రలోకమునకును, పండితబృందమునకును వ్యక్తముచేసి వారిధన్యవాదములకు పాత్రులగుచున్నారు. తంజాపురాంధ్రనాయక చరిత్రరచనయందు గ్రంథకర్తలక్ష్యము సంప్రదాయసిద్ధమైనమార్గము నవలంబించుచున్నది. వెల్సుగారు తెలిపినటులు వంశావళులు, విజయములు, కాలనిర్ణయములు చరిత్రపరిజ్ఞానమున కవసరములైనను మానవాభ్యుదయమునకు విశేషప్రయోజనకరములు గావు.

గ్రంథాలయమున కుపద్రష్టయైన సీతారామయ్యగారు తమలక్ష్యము నాంధ్రరాజ్యవ్యాపనచరిత్రలక్ష్యమునకువలెనే యాంధ్రసాహిత్యచరిత్రరచనకును మరల్చి ఆంధ్రసాహిత్యచరిత్రమం దీయజ్ఞాతాధ్యాయమును సువ్యక్తము చేయుదురుగాక.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందు పెద్ద నాదులహస్తములందు వర్ధిల్లిన ఆంధ్రసాహిత్యప్రవాహము తంజాపురాంధ్రరాజ్యమునందును ప్రవహించి నాయక రాజ్యమును సారవంతము చేసినది. స్త్రీలు, పురుషులు సంగీతసాహిత్యములందు ప్రావీణ్యమును గడించి రాజ సమ్మానము బడసినవిధమును పరిణయములు, విలాసములు, రత్నాకరములు, కావ్యములు, చరిత్రములు, గ్రంథములు విశదము చేయుచున్నవి. చోళపాండ్య రాజ్యములం దాంధ్రనాయకరాజ్యవ్యాపన మాంధ్రప్రజా సంస్కారములవ్యాపనమునకు వినియోగపడినవిధమును శిల్పకళాసాహిత్యములు విశదముచేయుచున్నవి. శ్రీరామ భక్తిభరితములైన సంగీతసాహిత్యనిధులైన త్యాగరాజ కృతులు తంజాపురాంధ్రరాజ్యవ్యాపనమున కమూల్య ఫలముగ నాచంద్రార్కము వెలయుచున్నవి.

గ్రంథము సప్రమాణముగ నుండుటకుగాను మూలగ్రంథమునందును, అనుబంధములయందును ముద్రితములైన దీర్ఘప్రమాణములు గ్రంథబాహుళ్యమునకు కారణములు.

ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్వాహకులు విస్తృతమును, వివాదగ్రస్తమును నైన తంజాపురాంధ్రరాజ్య

అప్పయదీక్షితులు, గోవిందదీక్షితులు గతించినను వారి గ్రంథములు విలసిల్లుచున్నవి. గ్రంథాలయమునందు గల సంస్కృతాంధ్ర తమిళ కర్ణాట మహారాష్ట్రాది గ్రంథములును, చిత్రపటములును, రాజులును, రాజ్యములును నంతరించినను వానికి ప్రయోజనమైన విజ్ఞానవిజయమును విశదముచేయుచున్నవి.

శ్రీ సీతారామయ్యగారీగ్రంథాలయాధారమున తంజాపురాంధ్రనాయక చరిత్రమును రచించి సరస్వతీ మహాలు గ్రంథాలయప్రయోజనము నాంధ్రలోకమునకును, పండితబృందమునకును వ్యక్తముచేసి వారిధన్యవాదములకు పాత్రులగుచున్నారు. తంజాపురాంధ్రనాయక చరిత్రరచనయందు గ్రంథకర్తలక్ష్యము సంప్రదాయసిద్ధమైనమార్గము నవలంబించుచున్నది. వెల్సుగారు తెలిపినటులు వంశావళులు, విజయములు, కాలనిర్ణయములు చరిత్రపరిజ్ఞానమున కవసరములైనను మానవాభ్యుదయమునకు విశేషప్రయోజనకరములు గావు.

గ్రంథాలయమున కుపద్రష్టయైన సీతారామయ్యగారు తమలక్ష్యము నాంధ్రరాజ్యవ్యాపనచరిత్రలక్ష్యమునకువలెనే యాంధ్రసాహిత్యచరిత్రరచనకును మరల్చి ఆంధ్రసాహిత్యచరిత్రమం దీయజ్ఞాతాధ్యాయమును సువ్యక్తము చేయుదురుగాక.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందు పెద్ద నాదులహస్తములందు వర్ధిల్లిన ఆంధ్రసాహిత్యప్రవాహము తంజాపురాంధ్రరాజ్యమునందును ప్రవహించి నాయక రాజ్యమును సారవంతము చేసినది. స్త్రీలు, పురుషులు సంగీతసాహిత్యములందు ప్రావీణ్యమును గడించి రాజ సమ్మానము బడసినవిధమును పరిణయములు, విలాస ములు, రత్నాకరములు, కావ్యములు, చరిత్రములు, గ్రంథములు విశదము చేయుచున్నవి. చోళపాండ్య రాజ్యములం దాంధ్రనాయకరాజ్యవ్యాపన మాంధ్రప్రజా సంస్కారములవ్యాపనమునకు వినియోగపడినవిధమును శిల్పకళాసాహిత్యములు విశదముచేయుచున్నవి. శ్రీరామ భక్తిభరితములైన సంగీతసాహిత్యనిధులైన త్యాగరాజ కృతులు తంజాపురాంధ్రరాజ్యవ్యాపనమున కమూల్య ఫలముగ నాచంద్రార్కము వెలయుచున్నవి.

గ్రంథము సప్రమాణముగ నుండుటకుగాను మూలగ్రంథమునందును, అనుబంధములయందును ముద్రి తములైన దీర్ఘప్రమాణములు గ్రంథబాహుళ్యమునకు కారణములు.

ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్వాహకులు విస్మృత మును, వివాదగ్రస్తమును నైన తంజాపురాంధ్రరాజ్య

చరిత్రము నుపన్యాసములను చేయుటకు సీతారామయ్య గారికిని, తన్మూలమున నాంధ్రాభ్యుదయమునకును అవకాశములను గల్పించినందుల కభివంద్యులు. ఆంధ్రగ్రంథమాలయం దీగ్రంథమును ముద్రించి గ్రంథమాలాప్రయోజనమును విస్తరింపజేయుటకు సహాయభూతు లైన శ్రీయుత సీతారామయ్యగారి కభివందనములు.

శ్రావణ శుద్ధ 3 శుక్రవారము,
చెన్నపురి.

కా. నాగేశ్వరరావు.

# సమర్పణము

తంజాపురాంధ్రరాజానాం చరితం విలిఖ మ్యహం,
కురుగంట్యన్వయే జాత స్సీతారామాభిధో ముదా.

శ్రీమ ద్వేంకట్రాయభట్టాచార్య స్తార్కికకేసరీ,
బహురాజప్రపూజ్యోయం మద్వంశమణిమండనమ్.

విజిత్య పండితమ్మన్యా నాసేతో రా హిమాచలాత్,
విర చ్యానుగమ గ్రంథాన్ స్వనామ్నా ప్రథితాన్ బభౌ.

తస్యాసీ త్కృష్ణశాస్త్రీతి పౌత్రః ప్రథితపండితః,
శుచి స్సాధ్వీ రామలక్ష్మీ స్తజ్జాయా సుగుణాన్వితా.

తయోః పుత్త్రత్రయే చాహం కనిష్ఠో హ్యూణశాస్త్రవిత్,
జ్యేష్ఠః పిచ్చయ్యశాస్త్రీతి మార్కండేయశ్చ మధ్యమః.

తత్ర పిచ్చయశాస్త్రీతు తర్కవేదాంతపారగః,
బహుశిష్యప్రవక్తాచ మంత్రశాస్త్రవిశారదః.

జ్యేష్ఠో మాం దత్తవాన్ పుత్రం తృతీయే హాయనే మమ,
పుత్రార్థినే సపిండాయ సుబ్రహ్మణ్యాయ యజ్వనే.

లక్ష్మీసమా మహాలక్ష్మీ స్తద్భార్యా సోమపీథినీ,
మద్బాల్యే మాం పరిత్యజ్య మాతా సా త్రిదివం గతాః

కంచి త్కాలం నిరీక్ష్యాథ ప్రవ్రజ్యాం మత్పితా గతః,
అద్వైతానందతీర్థాఖ్య యోగపట్ట సమన్వితః.

నైకగ్రంథప్రణేతాభూ ద్వేదవేదాంతపారగః,
భాష్యంచ బ్రహ్మసూత్రాణాం తేషాం తాత్పర్యదీపికామ్.

భాష్యం పురుషసూక్తస్య తైత్తిరీయస్య భాష్యకమ్,
గీతాతాత్పర్యదీపార్ద్ విరచ్య ప్రథితోఽభవత్.

సోఽయం వంశ స్త్వాంధ్రదేశే కీర్త్యతేద్యాపి పండితైః,
ప్రణమ్య ప్రథమం తావ న్మద్దైవం వేంకటేశ్వరమ్.

నత్వాథ సర్వాన్ స్వగురూన్ భక్తియుక్తేన చేతసా,
సమర్పితోఽయం గ్రంథస్తు రాధాకృష్ణాయ సూరయే.

---

వేదాంతశాస్త్రసామ్రాజ్యప్రభవే ఖ్యాతకీర్తయే,
యస్మా ద్గృహీతవిద్యేన మయా త్వత్యంతభక్తితః.

రాధయా సహితః కృష్ణో రాధాకృష్ణాయ ధీమతే,
ఆయు రారోగ్య మైశ్వర్యం దద్యా త్కీర్తించ సంతతిమ్.

కురుగంటి సీతారామయ్య.

---



శ్రీయుత
డాక్టరు, సర్ రాధాకృష్ణన్‌గారు
కృతిభర్త

# పరిష్కార శ్లోకములు

---

కలౌ ద్వాత్రింశదధిక పంచసాహస్రికే సమే,
గతే చాంగీరసాషాఢశుక్లాదా విందువాసరే.

కురుగంటి కులాబ్ధీందు వేంకటరమణశాస్త్రిణా,
లోకే పిచ్చయ్యశాస్త్రీతి వ్యవహార ముపేయుషా.

తంజాపురాంధ్రరాజానాం చరితం సుపరిష్కృతమ్,
తత్కర్తు రాయు రారోగ్యం దద్యాచ్ఛ్రీవేంకటేశ్వరః.

---

N. B. మాయన్నగారు రచించిన శ్లోకములు—ను. సీ.

# గ్రంథకర్తృవంశము

పుచ్చగంటి
వెంకట్రాయ భట్టాచార్యులు
(అనుగమ భట్టాచార్యుడు)

రామస్వామిశాస్త్రి

కృష్ణశాస్త్రి=రామలక్ష్మి

పిచ్చయ్య శాస్త్రి లేక వెంకటరమణశాస్త్రి

మార్కండేయ శాస్త్రి (దివంగతుడయ్యెను)

సీతారామయ్య = సీతారామయ్య
(గ్రంథకర్త)

పురుగంటి
బ్రహ్మీభూతమాధవశాస్త్రి

బ్రహ్మీభూత సుబ్రహ్మణ్య మహాగ్నిచిత్ =లక్ష్మీసోమపీథిని

సూర్యనారాయణ శాస్త్రి

వెంకట రమణయ్య

(అంకితశ్లోకములలోని వంశావతారమును చూడుడు.)

# అ వ తా రి క

---

1931-వ సంవత్సరము జనవరి 17-వతేదిన ప్రొఫె సరు పి. పి. యస్. శాస్త్రిగారి సాయమున నదివరకు తెనా లిలో నే నున్న న్యాయవాదవృత్తిని వదలి తంజావూరు నందలి సరస్వతీమహాలుపుస్తకాలయమున నుపద్రష్టృపద విలో ప్రవేశించితిని. స్వభావముచే జ్ఞానసంపాదనకుతూ హాలి నగుటచేతను, భాషాసేవకుడ నగుటచేతను, నీనూతన పదవి పరిశోధనమున కవకాశమిచ్చునదగుటచేతను న న్నీ యుద్యోగ మాకర్షించెను. ఇచ్చటికి వచ్చిన వెంటనే పదు నారు పదునేడవశతాబ్దముల నిచ్చట నేలినయాంధ్రనాయక రాజకుటుంబమునుగూర్చియు, నప్పుడు సమస్తభాషలం దును జరిగిన వాఙ్మయవ్యాప్తినిగూర్చియు పరిశోధనము చేయ మొదలిడితిని. నాతోపాటు పుస్తకాలయమున నుద్యోగిగా నున్న శ్రీయుత య్న. వైద్యనాథశాస్త్రి, శిరోమణిగారు న న్నీగ్రంథమును వ్రాయ ప్రప్రథమమున పురికొల్పిరి. ప్రారంభించి సామగ్రి సమకూర్ప మొదలిడిన తరువాత క్రమముగా నుత్సాహ మభివృద్ధినొందెను.

1931-వ సంవత్సరము జూన్ నెలాఖరులో పున నొకప్రతి వ్రాసితిని. తరువాత నాకు మిక్కిలి జబ్బుచేసి దానితో సెప్టెంబరునెలవరకు ననారోగ్యస్థితిలో నుంటిని. పునరారోగ్యవంతుడ నైన వెంటనే శ్రీయాంధ్రవిశ్వవిద్యాలయమువారికి నా గ్రంథమునుగూర్చి తెలియజేయ, వారు వెంటనే తమపక్షమున నేతద్విషయమునుగూర్చి యుప న్యాసముల నియ్యుమని కోరగా నే నందులకు సమ్మతించి, 1931-వ సంవత్సరము డిసెంబరు 23-వ తేది మొదలు 28-వ తేదివరకు విశాఖపట్టణమున ఎ. వి. యన్. కాలేజిహాలులో శ్రీ మా. వెంకటరంగయ్యగారి యధ్యక్షతక్రింద యా రుపన్యాసముల నిచ్చితిని. అప్పటికిపూర్వమే గ్రంథము నొక విధముగా ప్రకరణములుగా విభాగించి వ్రాసియుంటిని. గ్రంథమును వ్రాయ నూహవొడమినప్పుడే మద్గురువర్యులగు శ్రీడాక్టరు సర్. రాధాకృష్ణన్ గారి కంకిత మియ్యవలెననికూడా యుద్దేశించి వారికి వ్రాయగా వారు నా యందలి వాత్సల్యముచే హృదయపూర్వకముగా నందుల కంగీకరించి నాసంపూర్ణకృతజ్ఞతను బడసిరి. విశాఖపట్టణమున నేను వారి దర్శనముచేసి గ్రంథమును వారి పాదములకడ సమర్పించితిని. వారును నుపన్యాసముల నిచ్చిన రీతిని గ్రంథమును మరల వ్రాసి యంపిన విశ్వవిద్యాలయపక్షమున ముద్రణముగావించుటకు ప్రయత్నింతుమని

సెలవిచ్చిరి. మఱియు మొదట గ్రంథమును తయారు చేయునప్పటికంటె నింకను కొన్ని నూతనవిషయముల చేర్పవలసియుండుటచే మరల పరిష్కరించుట యవసర మయ్యెను. కావున నిప్పటి గ్రంథము వెనుకటిదానికంటె ననేకవిషయముల నూతనమనియే చెప్పవలెను. మొదటి దానియందుకంటె నిటీవల నాచేసిన పరిశోధనలచే బయలు పడిన విషయములనుకూడా యిందు చేర్చి వ్రాసితిని. గ్రంథ మును సంపూర్ణముగా వ్రాసినవెనుక నాయార్థికపరిస్థితు లనుబట్టి విశ్వవిద్యాలయమువారిని కోరక చెన్నపురియం దలి యాంధ్రగ్రంథమాలాధికారులను కోరగా వారు మిక్కిలి ప్రేమతో వెంటనే ముద్రణకార్యమున కియ్య కొనిరి. సర్ రాధాకృష్ణగారి కీసంగతి తెల్ప వారు దయతో ననుజ్ఞ నొసంగిరి. దేశోద్ధారక, శ్రీ కా. నాగేశ్వరరావుపంతులుగారు కారాగృహమున నుండినప్ప టికిని తత్ స్థానమున శ్రీయుత మ. రామచంద్రరావు పంతులుగారు పుస్తకముద్రణముపషయమున చూపిన యౌదార్యమునకును, ప్రేమకును మిక్కిలి కృతజ్ఞుడను.

మొదటినుండియు సందర్భోచితములుగా చిత్రపట ములతో ప్రచురింపవలెనని యనుకొంటిని. అందులకు తంజావూరువాసులును, న్యాయవాదులును, మన్మిత్రు లును నగు శ్రీయుత కె. వి. శ్రీనివాసయ్యరు బి. ఏ.,

బి. యల్. గారు తమ సహజసుహృద్భావమున పుస్తకము నకు కావలసిన ముఖ్యచిత్రములను తీసి యొసంగిరి. ఇవి గాక యడిగినవెంటనే తమ పటములను కొన్ని ప్రచురించు టకు సమ్మతించిన శ్రీయుత, మె. జె. పాండ్యానుగారును, తంజావూరునందలి నేషనల్ స్టూడియోవారును, పూనా చిత్రశాలాముద్రాలయాధికారులును నాకు వందనీయులు.

ఏతద్రచనమునందు చుక్కానిగా నున్న గ్రంథము శ్రీయుత యస్. కృష్ణస్వామయ్యంగారు ప్రచురించిన "విజయనగరచరిత్రాసామగ్రి"యను గ్రంథము. ఈగ్రంథ మును ప్రచురించిన శ్రీ అయ్యంగారును, దానియందలి యనువాదములనుకూర్చిన శ్రీరంగస్వామిసరస్వతిగారును నాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. శ్రీకుప్పుస్వామిశాస్త్రి కృతమగు గ్రంథ మరవభాషయం దుండుటచే దానిని నేను చదువలేకపోతిని. దాని నింగ్లీషుభాషలోనికి తర్జు మాచేసి నాకిచ్చిన మన్మిత్రులును, తోడియుద్యోగియు నగు శ్రీ పి. వి. వరదరాజశర్మగారికి వందనములు. నా కుపన్యాసము లొసంగుటకును, నీగ్రంథమును వ్రాయుట కును సమ్మతి నొసంగిన పుస్తకాలయాధికారులకు నా ఘనఃపూర్వకవందనముల నర్పింపవలసియున్నది.

ఏతన్ముద్రణము చురుకుగను, సుందరముగను నడ చినదన్న తత్కీర్తి యంతయు నాంధ్రపత్రికా ముద్రాల

యాధికారులది. వారియెడ నేనెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథరచనమునందు నాకు సాయపడిన యితర గ్రంథముల కర్తల కందరకును నావందనముల నర్పించుచున్నాను. ముఖ్యముగా మధురనాయక చరిత్రకారులగు శ్రీ సత్యనాథయ్యరుగారు మిషనరీయుత్తరములకు చేసిన పరివర్తనములు నాకు మిక్కిలి యుపకారకములయ్యెను. నేను వ్రాసిన విషయములలో కొన్నిటిని చారిత్రకదృష్టితో విమర్శించిన దొ॥ కహీరాసుఫాదరీగారు. కొన్ని స్థలములలో వారినుండి భిన్నాభిప్రాయుడను కావలసివచ్చెను. కాని యచ్చట చారిత్రకదృష్టితోనే నేనును విమర్శించితినని తలంచుచున్నాను. ఎచ్చటనైన పొరవడినయెడల క్షంతవ్యుడను. ఇందలి యనువాదములను నేను పరిష్కరించక యముద్రితగ్రంథముల వ్రాతప్రతులం దవి యెట్లున్నవో యట్లే యుంచితిని. ఒక్కొకచో నవి దోషభూయిష్ఠమై యున్నవి.

ఈగ్రంథమున శ్రీయుత శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు రఘునాథునిదియని ప్రచురించిన రామాయణభాగమునుగూర్చి కొంతయనుమానమును జూపితిని. నాల్గయిదు దినముల క్రిందట తంజావూరు పుస్తకాలయమునందలి యాంధ్రగ్రంథములను మరల పరీక్షించుటలో నకస్మాత్తుగా

రఘునాథుని రామాయణభాగమును కనుగొంటిని.[1] దానిని పరిశీలించిన శ్రీశాస్త్రులవారు ప్రచురించినభాగము దాని లోని ప్రథమాశ్వాసములోని భాగ మని తెలిసికొంటిని. నేను కనుగొన్నగ్రంథము నాల్గవయాశ్వాసమునడుమ తెగి పోయినది. తమవద్ద సమగ్రముగా గ్రంథ మున్నయెడల దానిని ప్రచురించి శ్రీశాస్త్రులవా రాంధ్రుల కృతజ్ఞతకు పాత్రు లగుదురుగాక! వారి ప్రచురణమునుగూర్చి నేను వ్రాసినదానికి వారు నన్ను మన్నింపవేడుచున్నాను.

ఏతద్విషయమున ప్రథమ విపులచరిత్రగ్రంథము నాదియైనందులకు పరమేశ్వరునకు ధన్యవాదమునొసంగుచు, నేతద్రచనమున కవకాశము కల్పించినట్టి శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారు, కృతినివడసిన సర్. రాధాకృష్ణ గారు మొదలగు మహనీయులకందరకును పునఃపునర్వందనముల నాచరించి నాయీ స్వల్పపుష్పాంజలి నాంధ్ర మాతకు సమర్పించుచున్నాను.

సరస్వతీమహాలు,
తంజావూరు.
1-7-32

ఇట్లు,
కురుగంటి సీతారామయ్య.

1. ఇందలి గద్యమును రఘునాథుని రామాయణసంగ్రహభారత సంగ్రహములలోనిదియు సమానములుగా నున్నవి. శ్రీశాస్త్రులవారేలకో ప్రస్తావనాభాగమును వదలినారు.

## తంజావూరు నాయక వంశానుక్రమణిక




* కవిత్వవేది రచియించిన యాంధ్రవాఙ్మయసంగ్రహమున 162-వ పుటలో "చెవ్వప్పనాయని మనుమడను రఘునాథరాయలు" అనియు, 213-వ పుటలో "చెవ్వప్పనాయని కొడుకు శ్రీ రఘునాథరాయలు" అనియు చెప్పబడియున్నది. రెండవమాట ప్రమాదజనితము.

## మధుర నాయక వంశానుక్రమణిక




(From the History of Nayaks of Madura—
by R. Satyanatha Iyer.)

# విషయసూచిక

పుటలు

౬. ఉపన్యాసము



అనుబంధములు

# చిత్రపటముల సూచిక

# మ్యాపుల సూచిక

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౮ | ౨౩ | on the raged | that raged |
| ౪౭ | శుది | gaxettee | gazetteer |
| ౫౦ | ౧౮ | "నాల్గుగా" ముందర | "ముఖ్యముగా" సని చేర్చుకొనవలెను |
| ౫౧ | ౪ | గణపతి | గజపతి |
| ౧౧౦ | ౧ | కుప్పుస్వామిఅయ్యరు | కుప్పుస్వామి శాస్త్రి |
| ౧౩౨ | ౧౨ | విఘ్నేశ్వరాలయమున | వెంకటరమణాలయమున |
| ౧౩౩ | ౧౪ | రాశిః | రాశి |
| ౧౪౨ | ౧౫ | రథ్యు రం | రథ్యుదారం |
| ,, | ౧౯ | సుధాంశు | సుధాంశుః |
| ౧౬౧ | ౧౫ | యాలోచించెను | యాలోచించెను. |
| ౧౬౭ | ౩ | మధమున | మధ్యమున |
| ౨౧౦ | ౧౭ | పళమారనేని. | పళమారనేరి |
| ౨౫౧ | [illegible] | వగ్గః | వర్గ |
| ౨౮౩ | ౧౦ | రఘునాధా!! | విజయరాఘవా!! |
| ౨౮౪ | ౧ | వరకు | తవరకు |
| ౩౧౧ | ౬ | 1600 | 1660 |
| ౩౧౮ | ౨, ౩ | మన్నారుదాస విలాసమున | యుషాపరిణయమున |
| ౩౧౭ | ౧౧ | క్రీళానీసై " | "క్రీళానీలై." |
| ౩౬౫ | ౧౩ | gacar | great |
| ౩౬౬ | ౨ | there | these |



సుబ్రహ్మణ్యాలయము-తంజావూరు

(దీనిని బృహదీశ్వరాలయముకట్టిన శిల్పియొక్క కుమారుడు కట్టె నందురు. ఇది రాతిచెక్కడముల మిక్కిలి యందమని శిల్పులచే కొనియాడబడుచున్నది.)

# ౧. సామగ్రి

ఆంధ్రులచరిత్రమునం దిది యొక యధ్యాయము. తేజోవంతమయ్యును విస్మృతము. ఈ యధ్యాయ విషయముంగూర్చి విపులమగునట్టియు, చరిత్రయనదగినట్టియు గ్రంథ మేభాషయందును లేదు. పని కష్టసాధ్యమైనదైనను భాషాసేవారతి నాకు ముఖ్యప్రేరకమయ్యెను. నేను నాభాగ్యవశమున తంజావూరునందలి సరస్వతీమహాలుపుస్తకాలయమున నుద్యోగిగా నుండుటచే నాచేయు దైనందినకర్మలో నిందలికొన్నియంశములు బయల్పడుట తటస్థింప నాయాతురత హెచ్చెను. అంతట పరిశోధించితిని. తుదకు నాచేతనైనట్లు ఏత్రోవయో మొఱ్ఱయో చరిత్రమును కూర్చితిని. నేను చారిత్రకుడను కాక భాషాసేవకుడ నగుటచే విషయచర్చలలో నవశ్యమగు చారిత్రకదృష్టి కొఱవడియుండును. కాని యేతద్రచనమునందు నాచేసినపరిశ్రమ భావిచర్చలకు మూలభూతమై నిష్కృష్టచరిత్రలేఖనమున కుపకారక మగుట నాభాగ్యమని తలంచుచున్నాను. సుప్రసిద్ధచారిత్రకు

లున్నయీసభలో నేను చరిత్రమునుగూర్చి యుపన్యసించుట సాహసము. అయినను ఏతత్కాలీభర్తృకృపాబలముచే ప్రయత్నింతును. పౌరాణికములగానైనను నాయీయుపన్యాసముల విన వేడుచున్నాను.

ప్రప్రథమమున నేతద్రచనమునందు నాకుపయుక్తమైన ముఖ్యసాధనసామగ్రినిగూర్చి ముచ్చటింతును. దానినీ క్రింది మూడుభాగములుగా విభాగింపవచ్చును.

I ముద్రితగ్రంథములు.

II అముద్రితగ్రంథములు.

III శాసనములు.

తాత్కాలికులగు వ్యక్తులవ్రాతలు చరిత్రరచనమునందు మిక్కిలి యుపకారకములు. విన్సెంటుస్మిత్తుగా రట్టివారివ్రాతలకు చాలవిలువ నిచ్చియున్నాడు.[1] అట్టివ్రాతలను పై 1, 2 విభాగములలో చేర్చినాను. మన కిందుపలబ్ధములైన కొన్నిగ్రంథములు కావ్యములై యలంకారయుక్తములై యున్నవి. కాని, వానిలోనియలంకారములను చదివి చరిత్రాంశముల గ్రహించుటకు వీలు లేకపోలేదు. ఆస్థానకవికృతగ్రంథము లట్లుండుట తప్పదు.

1. Early History of India, p. 19.

అంతమాత్రమున వానిని త్రోసివేయరాదు. ఏతదుప న్యాసకథనమునందు నాకు ముదావహమగు మరియొక విషయము కలదు. ఆంధ్రదేశమున కపరిచితములైనట్టియు, కాని యవశ్య పఠనీయము లైనట్టియు ననేకయుద్గ్రంథ ముల చదివి వానినిగూర్చి యాంధ్రప్రపంచమునకు కొంచెమైనను తెల్పుభాగ్యము నాకు లభించినందులకు మిక్కిలి గర్వపడుచున్నాను. వానిలో కొన్ని శిథిలములై పోవుచున్నవి. అట్టివి నశింపకుండ చేయుభారము ఆంధ్రుల యందు— అందును విశ్వవిద్యాలయాదిసంస్థలయందు— కలదు.

I ముద్రితగ్రంథములు

1. తంజావూ రాంధ్రరాజులచరిత్రము :

ఇది చిన్నగ్రంథమయ్యును ఉపకారకము. కాని తరువాత చాలకాలమునకు రచియింపబడినది. అందుచే పరమప్రమాణము కాదు. వైరుధ్యము లేనట్టియు, సాక్ష్య మున్నట్టియు విషయములను ప్రమాణముగా గొన నగును. దీనిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రక టించినారు.

2. తంజావూరు నాయకరాజులచరిత్రము ; టి. ఆర్. కుప్పుస్వామిశాస్త్రి కృతము:

ఇది యరవభాషయందు వ్రాయబడిన యొకచిన్న గ్రంథము. ఇయ్యది చారిత్రకదృష్టితో వ్రాయబడియుండ లేదు. దీని నింగ్లీషుభాషలోనికి పరివర్తింపజేసికొని చదివితిని. శాసనములుకూడ పరీక్షింపబడినవి. పైరెండు గ్రంథములును తరువాతి యన్నివ్రాతలకును ముఖ్యాధారభూతములు.

3. టైలరుగారి ప్రాచ్యచరిత్రగ్రంథము :[1]

ఇదికూడ తంజావూరాంధ్రరాజులచరిత్రమువంటి పురాణము. దానివలెనే యుపయోగించుకొనవలసి యున్నది. కొన్నివిషయములందుతప్ప ఈరెండుగ్రంథములును ముఖ్యవిషయముల నేకీభవించుచున్నవి.

4. తంజావూరుజిల్లామాన్యూలు ;[2] ది. బ. టి. వెంకాసామిరాయకృతము:

ఇందీ చరిత్రవిషయమంతయు పదిపుటలలో పున వ్రాయబడినది. అతిసంక్షిప్తము. పైన వివరించిన టి. యస్. కుప్పుస్వామిశాస్త్రి కృతగ్రంథమును, పుక్కిటిపురాణములును దీని కాధారములు.

1. Taylor's Oriental Historical Manuscripts.

2. Tanjore District Manual by Dewan Bahadur T. Venkasami Rao.

5. తంజావూరుజిల్లా గెజెటీయరు;[1] హెమింగు వేకృతము; ప్రభుత్వప్రచురణము :

పైనచెప్పిన జిల్లామాన్యూలును, తన్మాతృకయగు శాస్త్రికృతగ్రంథమును దీనికి మాతృకలు. గ్రంథకర్త తద్విషయము లన్నియు శాస్త్రికృత గ్రంథమునుండి గ్రహించితినని కంఠోక్తిగా చెప్పినాడు. ఇందుకూడ ఏతచ్చరిత్ర మతిసంక్షిప్తమై కార్యకారణభావరహితమై యున్నది.

6. విజయనగరచరిత్రసామగ్రి :[2]

ఇది మిక్కిలి యుపకారకమగుగ్రంథము. పరిశోధన మేదారిని,ఎచ్చట చేయవలెనో మార్గదర్శకమే గాక స్వయముగా ననేకవిషయముల సందేహనివర్తకము.

7. మిషనరీ యుత్తరములు:[3]

ఇవి మనచరిత్రమునకు దాదాపు సమకాలీనములు. కావున మిక్కిలివిశ్వసనీయములు; అవశ్యాదరణీ

1. Tanjore Dt. Gazetteer by F. W. Hemming-way.

2. Sources of Vijianagar History by Dr. S. K. Iyengar.

3. La Mission du Madure.

యములు. హీరాసుఫాదిరీగారుకూడ తమ చరిత్రగ్రథ
నమునందు వీనిని మిక్కిలిగా నుపయోగించినారు.

8. మధుర నాయకరాజ చరిత్రము:[1]

అనేకస్థలములయందు తంజావూరు మధురచరి
త్రము లత్యంతసంబంధము కలిగియున్నవి. అట్టిస్థలముల
నిది యుపకారక మయ్యెను. ఇందలియభిప్రాయములలో
చాలవరకు సుప్రసిద్ధచారిత్రకులగు యస్. కె. అయ్యం
గారిమన్ననల బడసెను. వారు దీని కుపోద్ఘాతము కూడ
వ్రాసిరి.

9. ఆరవీటివంశము:[2]

ఇది యిటీవల వ్రాయబడినగ్రంథము. ఇం దచ్చ
టచ్చట తంజావూరాంధ్రనాయకచరిత్రము సందర్భమును
బట్టి కొంచెముకొంచెముగా నియ్యబడినది. అట్టి సందర్భ
ముల విషయచర్చలలో చారిత్రకదృష్టితో విమర్శించిన
గ్రంథములలో నిది యగ్రస్థానము నలంకరించుచున్నది.
చాలవరకు వీరు నిష్పక్షపాతముగా వ్రాసినారని చెప్ప
నగును.

1. History of the Nayaks of Madura, S. Satya-natha Iyer.

2. Aravidu Dynasty of Vijianagara, Father Heras, S. J.

10. అళియ రామరాజు. సుప్రసిద్ధాంధ్రచరిత్ర కార చిలుకూరి వీరభద్రరాయకృతము:

ఈగ్రంథము హీరాసుగారిగ్రంథమునకు విమర్శనముగా వెలువడినది. మన ప్రత్యేకచరిత్రవిషయ మిందత్యల్పము.

11. విజయ విలాసము; చేమకూర వేంకటకవి కృతము:

ఈప్రబంధము మనచరిత్రలోని రాజులలో ముఖ్యుడును, మూడవవాడును నగు రఘునాథుని కంకితమియ్యబడినది. పీఠిక యుపకారకము.

12. అచ్యుతరాయాభ్యుదయము; రాజనాథడిండిమకృతము :[1]

కృష్ణరాయలతమ్ముడును, తరువాతిచక్రవర్తియు, మనప్రథమనాయకరాజనియామకము చేసినట్టియు నచ్యుతదేవరాయల దండయాత్రాదులను తెలుపుగ్రంథము.

1. గ్రంథము అచ్యుతరాయనిపట్టాభిషేకముతో ప్రారంభమునని చెప్పనగును.

## II అముద్రిత గ్రంథములు

1. సాహిత్యరత్నాకరము; యజ్ఞనారాయణదీక్షితకృతము :

ఈగ్రంథకర్త రఘునాథరాయల సమానకాలీనుడును, ఆస్థానకవియు గాక రఘునాథునిశిష్యుడు.[1] నాయకరాజులకు మంత్రిశేఖరుడై రాజ్యము నత్యుచ్చస్థితికి తెచ్చిన గోవిందదీక్షితుని జ్యేష్ఠపుత్రుడు.[2] ఈకవి దీనిని

1. "కావ్యాలంకృతినాటకాదికలనాపాండిత్య మత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథభూశతమఖో య స్యోపదిశ్య స్వయమ్,
ఆదాతుం గురుదక్షిణా మభిమతా మర్థ్యోఽప్యహో దత్తవాన్
కర్ణాలంకరణం నిజంచ పతకం పాదాంగదం కంకణమ్."
(అలంకారరత్నాకరము, యజ్ఞనారాయణదీక్షితకృతము, 1తరంగము.)

"తత్రభవతా రఘునాథభూభృతా శిక్షిత
ఇత్యనేనైవ తావ దస్యాపి కవయితా
యజ్ఞనారాయణయాయజూక ఇతి జానామి."
(రఘునాథవిలాసము ప్రస్తావన, యజ్ఞనారాయణకృతము.)

2. "అద్వైతవిద్యావిభవావలంబాన్
గోవిందయజ్వేంద్రగురూ నుపాసే,
నిర్మథ్య షడ్దర్శనసీరధీన్ యే
ధియైవ సారాన్ దదతే బుధేభ్యః."
(సాహిత్యరత్నాకరము, 1, 13.)

మరియు సాహిత్యరత్నాకరసర్గాంతగద్యము చూడనగును.

రఘునాథున కంకిత మిచ్చెను. ఇది మహాకావ్యమై యలంకారయుక్తమయ్యు చరిత్రాత్మకము. ఈగ్రంథ మిప్పుడు శ్రీ టి. ఆర్. చింతామణిగారిచే చెన్నపురివిశ్వవిద్యాలయపత్రికయందు ప్రచురింపబడుచున్నది.

2. అలంకారరత్నాకరము; యజ్ఞనారాయణదీక్షితకవికృతము:

ఇయ్యది ప్రతాపరుద్రీయమువలె ప్రతిపద్యరఘునాథాంకిత మగు నొకయలంకారగ్రంథము. ఇందు సందర్భానుసారముగ రఘునాథుని నేతలు వర్ణింపబడినవి.

3. రఘునాథాభ్యుదయకావ్యము; రామభద్రాంబాకృతము:

ఇది రఘునాథుని చిన్ననాటినుండి వార్ధక్యము వరకు నాయన చేసినపనులను తెల్పు చరిత్రాత్మకమగు సంస్కృతకావ్యము. రఘునాథున కంకిత మియ్యబడినది. ఈకవయిత్రి రఘునాథుడు తననాథుడని ఒకచోట చెప్పుకొనెను.[1] కాని యీయమయె 11 వ సర్గలో రఘు

1. "శబ్దార్థయోర్మర్మ సమప్రధానం
వశంవదం యస్య వదంతి సర్వే,
కృతీ సఏవాత్ర కృతౌ సహాయో
న్నాథో మమ శ్రీరఘునాథనేతా."
(రఘునాథాభ్యుదయకావ్యము, 1, 10.)

నాథునకు అయిదుగురు భార్యలని చెప్పుచు తనపే రిచ్చి యుండలేదు.[1] అందుచే కొంచె మనుమానింపవలసివచ్చు చున్నది. సాహిత్యరత్నాకరమును నీకావ్యమును ముఖ్య విషయముల నేకీభవించుచున్నవి. సాహిత్యరత్నాకరము కంటె నిది సమగ్రము. ఈరెండును నేతచ్చరిత్రగ్రథన మున మిక్కిలియుపకారకము లయ్యెను.

4. సంగీతసుధ: ఇది యొకగొప్పసంగీతగ్రంథము: ఇయ్యది రఘునాథుడు రచియించెనని యుపోద్ఘాతము తెల్పుచున్నది. కాని చతుర్దండిప్రకాశికయను మరియొక సంగీతశాస్త్రగ్రంథమును రచియించినట్టియు, గోవింద దీక్షితద్వితీయపుత్రుడును నగు వేంకటమఖి తనగ్రంథము నందు సంగీతసుధానిధియనుగ్రంథమును తనతండ్రియగు గోవిందదీక్షితుడు రచియించెనని చెప్పియున్నాడు.[2] పేరు

1. రఘునాథాభ్యుదయకావ్యము, 11, 91—94. ఇందు రఘు నాథునకు పాండ్య, తుండీర, కళింగ, మగధ, విదర్భ దేశకన్యలు, భార్యలయిరని చెప్పబడినది. వీరిలో పాండ్య, తుండీర, కన్యల పరిణయమయ్యె నని సాహిత్యరత్నా కరమునకూడ చెప్పబడియున్నది.

2. "తతోఽను రఘునాథేంద్ర మేళవీణా నిరూప్యతే,
తల్లక్షణంతు సంగీతసుధానిధి రీతి శ్రుతే,

వేరుగా నుండుటచే నాగ్రంథము 'సంగీతసుధ' కాదనియు, మరియొకటిపై యుండనలెననియు కొందరు వాదించు చున్నారు. ఇప్పు డట్టి 'సంగీతసుధానిధి' యనుగ్రంథ మెచ్చటను లేదు. కాని 'సంగీతసుధ' మాత్రము తంజా వూరు భండారమున కలదు. దానిని శ్రీయుత పి. యస్. సుందరయ్యరుగారు సంగీతపరిషత్పత్రికలో కొంచెముకొంచె ముగా ప్రకటించుచున్నారు. అందలి యుపోద్ఘాతాధ్యాయ మును పరిశీలించిన తద్గ్రంథము తనయాస్థానమునందలి పండితమండలి యభ్యర్థనమున రఘునాథనాయకుడు రచి యించినట్లు తెలియును.[1] ఎవరు రచియించినను మన కీ గ్రంథ మభ్యర్హణీయమె. ఇందలియుపోద్ఘాతమున రఘు నాథుని వరకు వంశచరిత్రము విపులముగా నొసంగబడి యున్నది. ఏతద్గ్రంథమును ముద్రించుచున్నందులకు శ్రీ అయ్యరుగా రాంధ్రలోకమునకు చిరస్మరణీయులు.

చెవ్వయాచ్యుతభూపాలరఘునాథనృపాంకితే,
అస్మత్తాతకృతే గ్రంథే ప్రోక్తా శ్లోకా లిఖామి తాన్."

(చతుర్దండిప్రకాశిక, 135.)

భారతి యందలి నా "గోవిందదీక్షితులు" అను వ్యాసముల జూడుడు.

1. Journal of The Madras Music Academy, p. 57.

5. రఘునాథాభ్యుదయనాటకము ; విజయరాఘవ నాయకకృతము:

ఈవిజయరాఘవనాయకుడు చతుర్థనాయకరాజు. తండ్రియగురఘునాథునిజీవితచరిత్రమును నాటకరూపముగా రచియించెను. ఇది తుదకు కల్పితకథగాపరిణమించినను దీన ప్రథమభాగములు మిక్కిలి చారిత్రకములు. ఇయ్యది కూడ మన కవశ్యాదరణీయగ్రంథములలో నొకటి. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు "రఘునాథాభ్యుదయ" మనుపేర విజయరాఘవుడు రెండు గ్రంథములను వ్రాసి నట్లును, నట్టివి రెండుగా తంజావూరుగ్రంథాలయమున నున్నట్లను వ్రాసినారు.[1] ఒకటి ద్విపదకావ్యమనియు, రెండవది నాటకమనియు చెప్పుచున్నారు. కాని యది ప్రమాదము. గ్రంథ మొక్కటియే. అదియే ద్విపద నాటకము. "రఘునాథాభ్యుదయ" మనుసంస్కృతకావ్యమును మనము వెనుక తెలిసికొనియున్నాము.

6. మన్నారుదాసవిలాసము ; } రంగాజమ్మకృతములు:
7. ఉషాపరిణయము ;[2]

1. Journal of the Andhra Historical Reseach Society, Vol. II, Parts 3 & 4, page 171.

2. మిక్కిలిశిథిలమై యున్నది. ఇది యత్యుత్తమప్రబంధశ్రేణిలో జేరదగినది.

ఇవి రెండును ప్రబంధములు. విజయరాఘవనాయకుని యాస్థానకవయిత్రి యీగ్రంథకర్త్రి. వీనిరెంటియందలిపీఠికలు మన కుపయుక్తములు.

7. విజయరాఘవవంశావళి; చెంగల్వల కాళకవి కృతము:

ఈకవికూడ విజయరాఘవుని యాస్థానముసందలి వాడే. ఇయ్యది వంశచరిత్రమును తెల్పుచుండుటచేతను, ఆస్థానకవిచే వ్రాయబడియుండుటచేతను మన కుపకారకము.[1]

9. వాల్మీకిచరిత్రము:[2] రఘునాథనాయకకృతము:

ఇయ్యది మూడవనాయకరాజును, విజయవిలాస కృతిభర్తయు నగు రఘునాథునిచే రచియింపబడిన యాంధ్రకావ్యము; మిక్కిలి రసవంతము. ఇందలివంశావతారమును, గద్యమును మన కుపయుక్తములు.

10. మహాభారతతాత్పర్యసంగ్రహము; రఘునాథ నాయకకృతము:

1. ఈయన రాజగోపాలవిలాస మను మరియొక ప్రబంధమును వ్రాసెను. అందలిపీఠికయు, నేతద్గ్రంథపీఠికయు సమానములు.

2. ఈ గ్రంథము "సరస్వతి" యందు ముద్రిత మని తరువాత తెలియవచ్చినది. కాని నేను చూచియుండలేదు.




పాండ్య చోళ చేరరాజ్యములు

[పుటలు ౨౧, ౨౨.

స్పష్టముగా వ్రాయుచుండ[1] శ్రీపంతులువారంపుడు కర్త్రియని వ్రాయుట సాహసమని మనవిచేయుచున్నాను. "దేవి" యనునామమే శ్రీపంతులవారివాదమునకు ప్రతిబంధక మగుచున్నది. వారు తమసమూహాకు కారణ జాతము నిచ్చువరకు దానిని తప్పని చెప్పక తప్పదు. చూపకపోయిన పశ్చాత్తప్తులై "గంగాదేవి" క్షమాపణ మును వేడుకొందురుగాక!

13. వరదాంబికాపరిణయము;[2] తిరుమలాంబా కృతము:

ప్రథమనాయకరాజగు చినచెవ్వనృపతిని నియమించినట్టియు, నాయనకు తోడియల్లుడైనట్టియు నచ్యుత దేవరాయలపట్టాభిషేకాదులను, తరువాతిచర్యను తెలుపు గ్రంథము. అచ్యుతరాయలయాస్థానకవయిత్రిచే వ్రాయ బడినది.

### 3. శాసనములు

చరిత్రమార్గమందు చారిత్రకునిదృష్టి నాకర్షించు మైలురాళ్లవంటివి శాసనములు. తా నెచ్చట

1. Sources of Vijianagar History, p. 2.

2. ఇయ్యది యచ్యుతరాయల వివాహముమొదలు వర్ణించుచున్నది.

ఇయ్యది యొకసంస్కృతగ్రంథము. పండిత రాజగు రఘునాథునిచేతనే నిర్మితము.

11. హేమాబ్జనాయికా స్వయంవర నాటకము; మన్నారుదేవకృతము:

ఈమన్నారుదేవుడు నాల్గవ నాయకరాజుయొక్క కుమారుడు. ఇందలిపీఠికయు మన కుపకారకము.

12. మధురావిజయమను కంపరాయచరితము;[1] గంగాదేవీకృతము:

ఇయ్యది బుక్కరాయలపుత్రుడగు కుమారకంపన యొక్క దక్షిణదిగ్విజయయాత్రాచరిత్రమును తెలుపు నొకయుత్తమకావ్యము. కంపరాయలభార్యయగు గంగాదేవిచే వ్రాయబడియున్నందున మిక్కిలి యాదరణీయము. శ్రీరామయ్యపంతులుగారీమె కంపరాయల యుంపుడుకత్తె యని వ్రాసినారు.[2] విజయనగరసామ్రాజ్యమును గూర్చి యత్యంతపరిశోధన మొనర్చి విమర్శకాగ్రస్థానము నలంకరించుచున్న శ్రీయుత యస్. కృష్ణస్వామయ్యంగారు తమగ్రంథమున గంగాదేవి కంపరాయలభార్యయని

1. ఇటీవల ముద్రింపబడినను ఎక్కువప్రచారములో లేనందున నిచ్చట ఇయ్యబడినది.

2. Journal of the Andhra Historical Reseach Society, Vol. 2, Parts 3 & 4, page 170.




పాండ్య చోళ చేరరాజ్యములు

[పుటలు ౨౧, ౨౨.

స్పష్టముగా వ్రాయుచుండ[1] శ్రీపంతులువారంపుడు కత్తెయని వ్రాయుట సాహసమని మనవిచేయుచున్నాను. "దేవి" యనునామమే శ్రీపంతులవారివాదమునకు ప్రతిబంధక మగుచున్నది. వారు తమయూహకు కారణజాతము నిచ్చువరకు దానిని తప్పని చెప్పక తప్పదు. చూపకపోయిన పశ్చాత్తప్తులై "గంగాదేవీ" క్షమాపణమును వేడుకొందురుగాక!

13. వరదాంబికాపరిణయము;[2] తిరుమలాంబాకృతము:

ప్రథమనాయకరాజగు చినచెవ్వనృపతిని నియమించినట్టియు, నాయనకు తోడియల్లుడైనట్టియు నచ్యుతదేవరాయలపట్టాభిషేకాదులను, తరువాతిచర్యను తెలుపు గ్రంథము. అచ్యుతరాయలయాస్థానకవయిత్రిచే వ్రాయబడినది.

3. శాసనములు

చరిత్రమార్గమందు చారిత్రకునిదృష్టి నాకర్షించు మైలురాళ్లవంటివి శాసనములు. తానెచ్చట

1. Sources of Vijianagar History, p. 2.

2. ఇయ్యది యచ్యుతరాయల వివాహముమొదలు వర్ణింగుచున్నది.

నున్నది పరీక్షించుకొని తప్పొప్పులను దిద్దుకొనుట కివి మిక్కిలి యుపకరించు నిశ్చలములైన సాక్ష్యసాధనములు. అట్టివి సందర్భానుసారముగ విమర్శింపబడుచుండును.

పై ముద్రితాముద్రితగ్రంథములే గాక యింకను అనేకగ్రంథము లుపకారకములయ్యెను. సమగ్రమైన గ్రంథములపట్టికను తుద కీర్తును. పై వానినన్నిటిని పరిశీలించి నాకు తోచిన ట్లీచరిత్రము నల్లితిని. ఏతచ్చరిత్రము నందు నాది తుదిమాట కానేరదు. తప్పొప్పులను తజ్ఞుల రగు తమకు వదలివేయుచున్నాను.

ఏతదుపన్యాసములను ఆంగ్లభాషయం దియ్యవల యునని మొదట అభిప్రాయపడితిని గాని వక్తృ శ్రోత లిరువాగులవారును నాంధ్రులై యున్నందునను, అనేక సంస్కృతాంధ్రగ్రంథములనుండి యనువాదము లున్నందునను, భాషాసేవారతివలనను నాంధ్రమునే గ్రహించితిని. పరిశోధనగ్రంథము నాంధ్రభాషలో వ్రాయుట యందు శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు నాకు మార్గదర్శకులు. ఇక విషయమునకు గడంగుదును.

---

## ౨. చోళమండలము-తంజాపురము

తుంగభద్రానదికి దక్షిణముననుండు హిందూదేశము అనాదినుండియు పాండ్యచోళచేరమండలములని మూడుభాగములుగా నుండి ప్రత్యేకము వేర్వేరు రాజులచే పరిపాలింపబడుచుండెను. ఆర్యులదక్షిణదేశయాత్రనాటికే యీదేశవిభాగ మున్నట్లు రామాయణమువలన తెలియనగును.[1] పాండ్య-చోళమండలములు రెండును కలిసి ద్రమిడదేశమనికూడ వాడుకలో నున్నట్లు భారతమువలన తెలియుచున్నది.[2] వీనిలో చోళమండలము మనకు ప్రస్తుతము.

ఈదేశనామమునందలి 'చోళ'శబ్దమునకు, 'చోర' శబ్దమునకు సంబంధము సన్నిహితము, స్పష్టము నయి

1. "తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ
చోళాన్ పాండ్యాన్ సకేరళాన్."

(కిష్కింధకాండము, 41 స.)

Ancient India, S. K. Iyengar, p. 90.

2. "పౌండ్రాంశ్చ ద్రమిడాం శ్చైవ సహితా నోఢ్రకేరళైః,
ఆంధ్రాం స్తాళవనాంశ్చైవ కళింగా నుష్ట్రికర్ణికాన్."

(మహాభారతము.)

యున్నది. ప్రాచీనద్రవిడగ్రంథముల నీశబ్దము "శోరక్" అని వాడబడినది.[1] ఈదేశభాగ మనాదినుండియు చోరావృతమై యుండెను. ఉత్తరదేశమునుండి శ్రీరంగమునకు, రామేశ్వరమునకు పోవుయాత్రికుల నీచోరులు బాధించుచుండిరి. కంపరాయలదండయాత్ర తరువాతకూడ ఈ ప్రాంతమున చోరబాధ యెక్కువగా నుండినట్లు చరిత్రాధారములు కలవు.[2] మండలాధికారులుకూడ ఈవృత్తిలోనే యున్నట్లు తెలియుచున్నది. వీ రవాంతరనాయకులు. వీరిమహానాయకుడే చోళరాజు. తరువాత నీదేశము ఇతరజనాకీర్ణమైనందున నాదోపిడులు కొంచెము వెనుకకు పట్టి యప్పుడప్పుడు తప్ప వెనుకటివలె విచ్చలవిడిగ జరుగుచుండెడివి కావు. క్రమముగా రాజ్యాంగము ప్రబలెను.[3] కాని, యీగుంపులనాయకు లట్లె నిలిచిపోయిరి.

1. Taylors Oriental Historical Mss.

2. "At this period it was customary for robbers of the Bisnaga Country and for the headmen of the districts to assault and plunder the pilgrims who came from the North in order to visit Srirangam and Ramesvaram." (క్రింద గీటుంచిన శబ్దమునకు విజయనగరరాజ్యమని యర్థము.)

Taylors' O. H. Mss. Vol. II, p. 190.

3. Early History of India, V. A. Smith, pp. 458, 493.

వా రిప్పుడు గొప్పభూస్వాములై యున్నారు. చోళులై, వారిపూర్వులు దొంగలగుంపులనాయకులగు జమీందారు లిప్పటికిని కలరు. నివాస మేర్పరుచుకున్న జాతినిబట్టి యీ దేశమునకు పేరు వచ్చినట్లు చరిత్రకారులయభిప్రాయమై యున్నది. ఇప్పుడు కళ్లారు (Kallars) లని చెప్పబడు జాతివా రీచోళులసంతతివారని చాలమంది యభిప్రాయ మైయున్నది.[1]

"హిందూదేశమునకు దక్షిణమున నీమూడు రాజ్యములు బహుపురాతనకాలమునుండియు ప్రఖ్యాతి చెందియున్నవి. ఈరాజ్యములలోనిప్రజలు ముఖ్యముగా నరవభాస మాటలాడుచుండిరి. చేరరాజ్యాంతర్గతమైన కేరళదేశములోమాత్రము మళయాళము మాటలాడు చుండిరి. పాండ్యదేశ మన్నిటికంటె దక్షిణమున నుండెను. ప్రస్తుతము తిరునల్వేలి, మధురజిల్లాలు అందులోనివి. పాండ్యదేశమున కుత్తరమునను తూర్పుసముద్రము నంటియు చోళరాజ్య ముండెను. కావేరీనదీప్రాంతమును అందుకు నుత్తర దేశంబును నీరాజ్యములోనివి. * * * చేరదేశము పశ్చిమసముద్రము నంటియుండెను. ఈ

1. Ancient India, S. K. Iyengar, Ch. 6. కాని శ్రీ పి. టి. శ్రీనివాసయ్యంగారు వీరు పల్లవులసంతతివారని చెప్పుచున్నారు.

మూడు దేశములసీమలు అనేక కాలములయందు అనేక విధములుగ మారెను."

"ఉత్తరమున పెన్నేరును, దక్షిణమున పాండ్యదేశమును, తూర్పుసముద్రమును, పశ్చిమమున చేరచాళుక్య రాజ్యములును కలది చోళదేశము."[1] వెనుకటి చోళదేశమును ప్రస్తుతపుతంజావూరు మండలము చాలభాగ మాక్రమించుకొనుచున్నది. ఉత్తరదక్షిణముల కొంచెము పెంచినయెడల వెనుకటిచోళమండలముతో సరిపోవును. పెన్నేరునదిని దక్షిణపినాకిని యందురు. అది కడలూరు ప్రాంతమున సాగరమున చేరుచున్నది.[2]

ఈచోళమండలమునకు ప్రత్యేకాదృష్టము కావేరీ ప్రవాహము. కావేరీనది సహ్యాపర్వతములలో[3] జన్మించి మైసూరురాజ్యముగుండా ప్రవహించి తనతరువాతి సౌభాగ్యమునంతయును చోళమండలమున కొసంగెను. సహ్యాపర్వతములు మిక్కిలిమెత్తయినవి యగుటచే రెండువర్షకాలముల[4] యందలివర్షములో నుత్తమభాగ

1. హిందూదేశ కథాసంగ్రహము, పుటలు 216, 221. (పటము చూడుడు)

2. Tanjore Dt. Gazetteer, p. 15.

3. పడమటి కనుమలు.

4. Monsoons.

మును గ్రహించి తన్నీరమును సహ్యజ యనిపేరొందిన యీనదీపుత్రికకు వశమొనర్ప సహ్యజ దానిని చోళమండలమునకు గొంపోయి తన్మండలమును మిక్కిలి ఫలవంత మొనర్చుచుండును.[1] కావేరీనది గంగాగోదావరులవలె నిరంతర జలప్రవాహసహితమై తనతీరములయం దసంఖ్యాకములగు పట్టణములకును, పల్లెలకును తావిచ్చెను. మరియు గంగ యనంతశాఖల బంగాళమును, గోదావరి యసంఖ్యాకములగుపాయలై తన్మండలమును, నెంతఫలవంతముల నొనర్చెనో, యీకావేరి చోళమండలమునకు తన వారిధారాసారము నొసంగి యంత ఫలవంత మొనర్చెను.

చోళదేశమంతయు దాదాపు కొండలు మెండుగా లేక చతురశ్రమై కొంతభాగము వర్షాధారమువలనను కొంత నద్యాధారమువలనను అనాదినుండియు సమస్త సస్యాఢ్యమై యుండెను.[2]

1. "నదీషు వారీ ణ్యపరాణి పీత్వా
నభస్వతా పశ్చిమదిగ్భవేన,
మరుద్వృధాయా స్త్యజ తాధిపూరం
అహేతుయత్నా దనుగృహ్యతే యః."

(సాహిత్యరత్నాకరము. 1, 3.)

2. "There are no hills whatever in this district. * * * * The absence of hills is doubtless a draw-

ఈనదీదేశసంయోగమును పురాతనకవులు బహు రసవంతముగా చిత్రించియున్నారు.[1]

back in any landscape, but it is however difficult for any visitor who brings with him a vivid recollection of the cruelly arid and barren tracts which are so common in many other districts, to withhold his admiration from the green fertility of the delta (Cauvery). Luxurient crops stretch as far as the eye can reach, the view being only interrupted by rich groves of coconuts and other fine trees while numerous rivers, full from bank to bank, pass onward to the sea at frequent intervals."

(Tanjore Dt. Gazetteer, pp. 3 & 5.)

1. "అస్తి ప్రభావై రతిమానసీయా
చోళావనీ శాలివనీ నిచోళా,
సహ్యాత్మజాపూరసరస్సమీర
సంపర్కపుణ్యా జనతాశరణ్యా.

రంగాధిభూ భూమిరమానునీతి
శృంగారవీక్షామృతపూరితాయాః,
సహ్యాత్మజాయా స్సలిలం సదైవ,
సహ్యాద్రుతో దీవ్యతి చోళదేశః.

సహ్యాత్మజాభ్యాగమనం ప్రయాణు
సరస్వతే వక్తుమి వాశు ధావన్,

ఈచోళదేశ మనాదినుండియు ఫలవంతమగుటచే బహుజనాకీర్ణంబును, జనాకులమగుటచే నాగరకతాయుత మును, నాగరకతాయుతమగుటచే సంగీతసాహిత్యనిల యంబును నైయుండెను. ఆర్యుల వలసకు పూర్వమే యిచ్చట ప్రత్యేకమగు నాగరకత ప్రబలి మతములు కూడ వ్యాప్తమైయుండెనని ద్రవిడచరిత్రకారులయభి ప్రాయము. ప్రజలందరును సంతృప్తులై యెవరివృత్తుల వా రవలంబించుచు సుఖజీవనము చేయుచుండిరి. మరియు కావేరీతీరము ఉత్తరమున ప్రథమార్యులకు పంచనదీతీరము, గంగాతీరాదులు, నెట్లో యట్లే దక్షిణదేశమునకు వచ్చిన ప్రథమార్యులకు నివాసస్థాన మయ్యెను. అందువలన తత్తటంబుల ననేకగ్రామములును, అగ్రహారములును వెలసి వేదశాస్త్రపఠనము నిరంతరాయముగ సాగుటకు

ప్రభంజనో యత్ర కృషీవలానాం
ప్రపంచ ముత్సాహిన మాతనోతి."

(సాహిత్యరత్నాకరము, I, 11; II, 1 & 2.)

"సుత్రామలోకప్రత్యాదేశాత్ అత్యాదర
ణీయరామణీయకనివేశాత్ చోళదేశాత్."

"త్రైలోక్యసారసముదాయసహోపమేయా
నాలోక్య చోళవిషయా నవనీమహేంద్రః."

(వరదాంబికాపరిణయము.)

వీలయ్యెను. ఇప్పటికిని ఏతదగ్రహారముల వేదగానమును, శాస్త్రచర్చలును, వినబడుచునేయుండును. ఉత్తరదేశమందువలె సనాతనమత మిచ్చట నెక్కువగా శిథిలము కాలేదు. బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్య యిచ్చట నుద్భవించుట కిదియే మూలకారణము. అస్పృశ్యత యిచ్చట మిక్కిలి కఠినము. పెద్దపెద్ద దేవాలయాదులుండుటకుకూడ నిదియే కారణము. వేయేల? మంచికి, చెడ్డకుకూడ నీ బ్రాహ్మణనాగరకతయే కారణమని చెప్పిన సమంజసముగ నుండును. సనాతనమతము సంపూర్ణప్రాముఖ్యముతో నున్న పదునేడవశతాబ్దమున నీదేశము ప్రతిగృహపండితాకీర్ణమై యున్నదన్న నాశ్చర్య మేమి?[1]

1. "త్రేతాగ్నిధూమాకులవీథికాంగణే
గృహే గృహే యత్ర వసంతి సూరయః,
అధీతసర్వశ్రుతయః కథాంతరే
వినిర్జితప్రత్యనుమానవేదినః."

(ధర్మరాజాధ్వరికృత తత్త్వచూడామణి ప్రకాశవివృతి.)

"The Cauvery delta has been the seat of a glorious civilisation from the dim past. Blessed by nature with a fertile soil the people cultivated arts and letters to a high degree of excellence. Having been far from the Mohammadan zone for long they preserved their old culture and arts."

(The Mahratta Rajas of Tanjore, p, 7.)

ఈ దేశము ననేకకాలములయం దనేక రాజులు పరిపాలించిరి. వీరిలో కొందరు చోళులై యనేకకుటుంబములవారై సందర్భానుసారముగా యుద్ధములు సలిపి, యితరభూముల నాక్రమించి భూపరిపాలనమును నెరపిరి. మనకథకు పూర్వమువరకు నెవరో యొక-చోళరాజీ దేశమును పరిపాలించుచునేయుండెను. వారివారి భుజపరాక్రమముకొలది నధికారమును చలాయించుచుండిరి. వీరిలో కులోత్తుంగ-చోళు డనునొకచక్రవర్తికాలంబున-అనగా క్రీ. ౧౧ వ శతాబ్దమున (౧౦౭౦-౧౧౧౨), నీ రాజ్యము ఒరిస్సావరకు వ్యాపించినట్లు చరిత్రవలన తెలియుచున్నది.[1] ఇదిగాక ౧౩-వ శతాబ్దమువరకు, అనగా మహమ్మదీయులు దక్షిణమునకు వారిదృష్టిని త్రిప్పనంతవరకు నీపాండ్య-చోళరాజ్యములు రెండును కలిమిలేముల కావటికుండలై వరలెను.[2] వీనియెల్లలు మారుచు వచ్చెను. కాలక్రమమున పాండ్యులు -చోళదేశము నేలిరి. -చోళులు పాండ్యము నాక్రమించుకొనిరి.[3] ఇట్లు రాను

1. Tanjore Dt. Gazetter, p. 22 ;
హిందూమహాయుగము, పు. 222.

2. Early History of India, p, 480.

3. "It is not at all clear what were the boundaries of these three kingdoms and it is not unlikely that they varied in constant wars on the raged."

(Tanjore Dt. Gazetteer, p. 15.)

రాను తుదకు కొంచెము హెచ్చుతగ్గుగా నిప్పటితంజా
వూరుమండలమే చోళమండలమై నిలిచియుండెను.

ఈమండలమున కనేకకాలములయందు, అనేక
పట్టణములు రాజధానులుగా నుండియుండెను. కొంత
కాలము కావేరీతీరమున తిరుచునాపల్లివద్ద నుండు వొర
యూరను పట్టణమును, కొంతకాలము కావేరీసాగరసంగ
మమునొద్ద నుండెడికావేరీపట్టణమును, చోళరాజధానిగా
నున్నట్లు చరిత్రకారులు తెల్పుచున్నారు.[1] ఏడవశతా
బ్దమునందు కుంభకోణము రాజధానిగా నుండెనని డాక్టరు
బర్నెలు తెల్పుచున్నాడు.[2] మరికొంతకాలము గంగయ్యా
కొండచోళపురము ముఖ్యపట్టణముగా నుండెను. తంజా
వూరుమాత్రము 10, 11 శతాబ్దముల నప్పుడప్పుడు
తాత్కాలికరాజనివాసముగా నుండెను. రాజు లప్పు
డప్పుడు తమసభల నిచ్చట జరుపుచుండిరి. అందుచే
తగుపరిమితిగల చిన్నకోట నొకదానిని నిర్మించిరి. ఇవి
గాక, యింకను కొన్నికట్టడములు కట్టినట్లు కన్పట్టును.
వానియొక్క శిథిలము లిప్పటికిని కానవగును. మనకథకు

1. Tanjore Dt. Gazetteer, p. 14.
 ,, Dt. Manual. p. 734.
 Ancient India, S. K. Iyengar, p. 93.
2. Introduction to South Indian Palaeography.

సాహిత్యాపూర్వము తంజాపూరే రాజధానిగా నున్నట్లు తెలియుచున్నది. చోళరాజులకాలమున నీమండలము మిక్కిలి తేజోవంతమై యుండెను. వారిలో వీరచోళుని కుమారుడగు కులోత్తుంగచోళుని కాలమున కావేరీనది కొకయానకట్ట కట్టబడెను. తద్ద్వారమున నీమండలము నందలి చాలభాగము ఫలవంతము కావింపబడెను. సహజవార్యాధారమును, ఏతన్నిర్మాణమును నీమండల మును "శాలివనీనిచోళము" నొనరించెను. ఈకట్టడ మిప్పుడు "Grand Anicut" అని పిలువబడుచున్నది.[1] ఈవీరచోళుడే తంజాపూరునందలి "పెరియకోయిల్" అని పిలువబడు బృహదీశ్వరాలయమును నిర్మించి యందు సుప్రసిద్ధమగు నేకశిలానందిని స్థాపించెను.[2] తదాలయ మువొక్క గోపురమును, తచ్ఛిలానందియు నిప్పటికిని దేశదేశములనుండియు ద్రష్టల నాకర్షించుచున్నవి.

1. కర్నల్ బైర్డుస్మిత్తను నొకయింజనీయరు దీనిని పరిశీలించి యిద్యాది కనీసము 1600 సంవత్సరములక్రిందట నిర్మింపబడియుండ వలెనని యభిప్రాయము నిచ్చియున్నాడు.

(Tanjore Dt. Manual, p. 328.)

2. దత్తమండలములందలి లేపాక్షినందికంటె నిది చిన్నదియట!

(పటమును చూడుడు.)

తంజాపురము కావేరీనదియొక్క పాయయగు మణిముక్తయను నామాంతరముగల వడవారనునదికి సుమా రొకమైలుదూరములో నున్నది. తంజాపురమని దీనికి నామ మెందులకు వచ్చెనో మొదలగు విషయములు ఇటీవల వ్రాయబడి పురాణాంతర్గతములని చెప్పబడు "తంజాపురమాహాత్మ్య" మనుగ్రంథము మొదలగువాని వలన తెలియును.[1] ఇప్పటిపట్టణమును చూచిన పట్టణ మొకప్పుడు సౌభాగ్యము ననుభవించినట్లును, నొకరాజ ధానిగా నున్నట్లును సూచనలు కాననగును. పట్టణ నిర్మాణము, బహుభాషాప్రయోగము మొదలగునవి వీనికి తార్కాణములు. అరవము, కన్నడము, తెనుగు, మహా రాష్ట్రము, గుజరాతి, మొదలగుభాషలు మాటలాడు నవేకజాతు లీపట్టణమున నివాసము చేసికొనియున్నారు. కొన్ని వేలమైళ్లదూరమున మాటలాడబడు భాషలవా రిచ్చట నుండుటకంటె నీపట్టణ మొకకాలమున నంతర్జా తీయప్రాముఖ్యము కలదని వేరేసాక్ష్య మనావశ్యకము. చోళరాజులకాలమునాడు పట్టణ మిప్పుడున్నట్లు లేదనుట

1. తంజాయనురాక్షసుని శివుడు సంహరించినస్థానమని యీ మాహాత్మ్యములు తెల్పుచున్నవి, ఇప్పుడును తంజేశ్వరుడను నొక స్వామిదేవాలయము కలదు.

నిక్కము. ఇప్పటిపట్టణము ఇటీవల నిర్మింపబడినట్లు చెప్పక చెప్పుచున్నది. ఇయ్యది మనకథానాయకరాజుల కాలమున నిర్మింపబడియుండనోపు. తరువాత మహారాష్ట్రరాజులకాలమున నభివృద్ధిచేయబడియుండవచ్చును. ఇప్పటిపట్టణము కోటచుట్టును చతురశ్రముగా నుండుటయు, నీకోట నాయకరాజులచే నిర్మింపబడుటయు కలిపి చదివిన పైయూహ బలమగుచున్నది. "అయ్యన్" అను నామముతో పిలువబడుచుండు గోవిందదీక్షితుని పేర బరగు "అయ్యంకొళము", "అయ్యంకడై" దీనిలో నంతర్భూతములైయుండుట దీని కింకను బలకరము. మరియు నాయకరాజులలో తుదివాడగు విజయరాఘవునిచే నిర్మితమగు పెద్దకోట యీపట్టణముచుట్టు నుండుట యీయూహను స్పష్టపరుచుచున్నది. బృహదీశ్వరాలయము, తత్పార్శ్వము నందలికోటయు, నందలిశివగంగయనుకొలను, చోళరాజనిర్మితము లనుటలో సందియమే లేదు. ఇప్పటిరైలుస్టేషనుకును పట్టణమునకును మధ్యలో నాసుపత్రికి నెదురుగా శిథిలములగు కట్టడములచిహ్నములు కానగును. ఇయ్యవి వెనుక చోళరాజులకొన్నిభవనము లుండుస్థలములని చెప్పుదురు. శివగంగకోటయు, నాయకులు నిర్మించినకోటయు, రామలక్ష్మణులవలె కన్పట్టుచున్నవి. దేవాలయముల

సంఖ్య లెక్కకు మిక్కుటము. కాని యన్నిటికిని వసతులు కల్పింపబడియుండలేదు. రాజధానియందలి దేవాలయములు గాన నిరంతరము సామ్రాజ్యాదరణములో నుండు ననునూహ దీనికి కారణమని చెప్పెదరు. పాపము! రాజులకే యన్నములేనికాలమును వా రూహించియుండలేదు! ఈపట్టణము పూర్వము రాజులకాలములో రాజులకాకరమై యుండుటచే కవీశ్వరులు దీనిని మిక్కిలిగ కొనియాడిరి. రెండనువాదములతో నీయుపన్యాసమును ముగింతును.

"తత్తాదృశే కాచన చోళదేశే
రమానటీ నర్తనరంగశాలా;
తంజాపురీ నామ దరీ హారిణాం
ధరాభుజాం రాజతి రాజధానీ."

(సాహిత్యరత్నాకరము, 2. 49.)

"వసతి ర్వనజాతవల్లభాయాః
వసుధోదంచితవైభవప్రపంచః;
తరుణీమణిజన్మధామ తంజా
నగరీ తత్ర గరీయసీ నమేధే."

(రఘునాథాభ్యుదయకావ్యము, 2. 1.)



బృహదీశ్వరాలయము–తంజావూరు

(ముఖమంటపముసహ)

౭౯ పుట.

కావున ౧౬-వ శతాబ్దమునాటికి సారవంతమగు రాజ్యమును, వ్యవసాయపారీణమై నాగరకతాయుతమగు ప్రజాసమూహమును, చక్కనికట్టడములు కలిగి యందమైన రాజధానియు, సిద్ధాన్నమై చేతికందుచుండెను. అందువలననే దోపిడి ముఖ్యవృత్తిగ గల్గినట్టి మహామ్మదీయులదృష్టి నాకర్షించెను.[1]

---

1. "This Country was one of the most remarkable in India by the fertility of its land and the wealth of its production."

(A missionary letter written in 1676 A. D.)

# ౧. మహమ్మదీయ దండయాత్రలు

హిందూదేశమతచరిత్రమును పరిశీలించిన దాదాపు మతకర్తలందరును దక్షిణహిందూస్థానమునకు చెందినవారైనట్లు తెలియనగును. ప్రథమమున వైదికమతములకుపూర్వ మీప్రాంతమున నాగమమతములు ప్రచారములో నుండెను. తరువాత వైదికమతము వ్యాపించినకొలది ఉపనిషన్మతములు వ్యాప్తములు కాజొచ్చెను. ఈమతములలో వైరుధ్య ముండుటచేతను, ప్రతిమతమును ననుయాయులకొరకు ప్రయత్నించుటచేతను వీనిలో పరస్పరము వైషమ్యములు ప్రారంభమయ్యెను. తత్త్వజిజ్ఞాస పెచ్చుపెరుగుటచే మతసామరస్యము వచ్చుటకు మారుగ నీవైషమ్యములు హెచ్చసాగెను. అందును నీవైషమ్యములు రామానుజమధ్వమతముల స్థాపనమునకు వెనుక నపారముగా పెచ్చుపెరిగెను. వీనికి రాజావలంబనము సహకారి యగుచుండెను. అందువలన రాజులమధ్య నంతశ్శైత్యములు కలుగ మొదలిడెను. ఎవరిమతమును వా రవలంబించుకొనుచు సామరస్యమున నుండుటను నేర్చుకొనవలసియుండెను. ఇందులకు సామాన్య

శత్రు వొక డవశ్యమయ్యెను. అప్పుడుగాని యట్టియావ శ్యకత కలుగనేరదు. మతమను పేరున నీచాచారములును ప్రబలెను. రాజులు సుఖలోలురైరి. తమరాజ్యములను స్థాపించిన పూర్వులశౌర్యపరాక్రమము లడుగంటెను. ఈ యైకమత్యరాహిత్యమును, దేశభాగ్యమును మహమ్మ దీయులదృష్టి నాకర్షించెను. వారు దక్షిణభారత దేశమును తమ కృత్యములకు రంగస్థలము కావించుకొనుటకు కడంగిరి.

ప్రథమమున దక్షిణమునకు వచ్చినవాడు కిల్జీవంశీ యుడైన అల్లాయుద్దీను. తన కుత్తరముననుండి వచ్చు నితరమహమ్మదీయదండయాత్రల నాపుటకు పెద్దసైన్య మును కూర్చి దాని నెల్లప్పుడు యుద్ధసన్నద్ధముగ నుంచ వలసివచ్చెను.[1] అందులకు లెక్కలేనంతధనము కావలసి వచ్చెను. అందుచే దోపిడియు, ద్రవ్యార్జనమును ప్రథమో ద్దేశములుగా దక్షిణదండయాత్రకు వచ్చెను. ఇది క్రీ. శ. ౧౩-వ శతాబ్ద్యంత్యసంవత్సరములలో నని చెప్పనగును. తరువాత ఆయన ఢిల్లీచక్రవర్తి యయ్యెను. అప్పుడు

1. Some contributions of South India, S. K. Iyengar, p. 292.

దక్షిణభారతమును తనరాజ్యమునందలి యొకపరగణాగా చేసికొనుట కాయన యుద్దేశించి తనసేనానియగు మాలికాఫరును పెద్దసేనతో దక్షిణమునకు దండయాత్ర పంపెను. ఈయనకు దక్షిణమును జయించుట బహుసులభమయ్యెను. దక్షిణమంతయును మహమ్మదీయరాజ్యము క్రిందకు తెచ్చి, మధుర ముఖ్యపట్టణముగా చేసి, యచ్చట కొంతకాల మీయన నివసించి యేలెను.[1] అప్పటినుండి దక్షిణమునందలి ప్రతిభాగమును మహమ్మదీయుల దోపిడులకును, దుండగములకును గురియై యొకపెద్దశ్మశానమైపోయెను. దక్షిణదేశపురాజు లీమహమ్మదీయసేనా సముద్రము నరికట్టలేకపోయిరి. హొయిసలవీరబల్లాళుడంతటి వీరుడు వీరికి లంచమిచ్చి సంధిచేసుకొనవలసివచ్చెను. ఈమహమ్మదీయులు దేశమును పరిపాలించుటకంటె పీడించుట హెచ్చయ్యెను.[2] ఒక్కొకచో పంటలు నాశనముచేయబడ పచ్చనిభూములు వెచ్చ నయ్యెను. "తోటలును, వనములును ఖండింపబడెను. అధ్వరాదికర్మలడుగంటెను. ఎచ్చటచూచినను మాంసగంధములు ప్రబ

1. Early History of India, p. 233; Aravidu, Heras, p. 100.
2. Early History of India, p. 233.

లెను. మానవులపుర్రెలు తోరణములు కట్టబడెను. ప్రజలకు విశ్రాంతి లేదయ్యె. నిరంతరము భయకంపితులై యుండిరి. ఎవ్వరిముఖములును కాంతుల దొరగుటయె గాక నేత్రముల నశ్రుధారలు కురియుచుండెను. వేదములు మూలబడెను. నీతియనునది మృగ్యమయ్యెను. ధర్మాధర్మములే లేకపోయెను. జనులప్రవర్తనములు విపరీతములుగ కన్పట్టెను. పుణ్యపాపములే లేకుండెను. చతుర్వర్ణవిభాగము రూపుమాసెను. కలిపురుషుడొక్కడే యేలుచుండెను. పురముల నెచ్చటచూచినను బూజుబట్టియుండెను. బ్రాహ్మణులు నిర్బంధితులై యేడ్వసాగిరి." ఇది యది యననేల వీరుచేయవలసినది చేసినది లేదు; చేయకూడనిది మానినది లేదు.[1] వీరికృత్యములు ప్రజలను

1. సతతాధ్వరధూమసారభైః ప్రాక్
నియమోద్ఘోషణవద్భి రగ్రహారైః,
అధునాజని విస్రమాంసగంధై
రధికక్షీబకులుష్కసింహనాదైః.

మధురోపవనం నిరీక్ష్య దూయే
పరితః ఖండితనాళికేరఖండమ్,
పరితో నృకరోటికోటిహార
ప్రచలచ్ఛాలపరంపరాపరీతమ్.

విముఖుల జేసెను. పరమేశ్వరుడు వీనిని భరింపనట్టిసూచ నలు పొడమెను. హిందూదేశచరిత్రమును చూచిన నీజాతికి ఐతమనునది మూలాధారమని మనము కనుగొనగలము. పరమేశ్వరుడు కన్నులుతెరచునవసరము కల్గెను. సనాతన

శ్వసితానిలశోషితాధరాణి
శ్లథజీర్ణాయితచూర్ణకుంతలాని,
బహుబాష్పపరిప్లుతేక్షణాని
ద్రవిడానాం వదనాని వీక్ష్య దూయే.

శ్రుతి రస్తమితా, నయః ప్రలీనః,
విరతాధర్మకథా, చ్యుతం చరిత్రమ్;
సుకృతం కృత, మాభిజాత్య మస్తం,
కిమివాన్యత్ ? కవి శేకఏవ ధన్యః.

పరిత స్తతతంతువాయతంతు
వ్యతిషంగా జ్జనితాని జాలకాని,
పురగోపురసాలభంజికానాం
దధతే చీనపటావకుంఠనత్వమ్.

హిమచందనవారిసేకశీతా
న్యభివన్ యాని గృహాంగణాని రాజ్ఞామ్,
హృదయం మమ వేదయంతి తాని
ద్విజబందీనయనాంబుమాషితాని."

(మధురావిజయము. సర్గ 8.)

మతము నిల్చునా నిలువదా యనుకాలము వచ్చెను. దేవాలయములయందు పూజ లాగిపోయెను.[1] "యత్క-టాక్షేణ తద్రూపం దధ ద్బుక్క-మహీపతిః" అని విద్యారణ్యుడు చెప్పినట్లు పరమేశ్వరుడు సనాతనమతము నుద్ధరింప ని ట్లవతరించెనో నా హిందూజాతికిని, మతమునకును, నిరంతరస్మరణీయుడుగా సంగమవంశీయు డగు బుక్క-రాయలు తనపరాక్రమముతో ముందునకురాదొడంగెను. పదునాలుగవశతాబ్దమధ్యకాలమునకు కొంచెముగ నాయనకు రెక్క-లు వచ్చెను.[2] వారు అయిదుగురుసోదరులు. అందరు నప్రతిమానశూరులు. వైదికమార్గప్రవర్తకులు. సనాతనాచారపరాయణులు. నల్గురు నలుమొగముల వెలువడి వీరిలో బుద్ధినిబృహస్పతితుల్యుడగు బుక్క-రాయలను మధ్యనుంచి రాజ్యము విశాలమొనర్చి కాలక్రమమున విజయనగరసామ్రాజ్యమును స్థాపించిరి.[3] బుక్క-రాయలకు మంత్రి వేదవేదాంగవేత్తయగు మాధవవిద్యా

1. Aravidu, Heras, p. 104.
2. క్రీ. శ. 1354—1379.
3. క్రీ. శ. 1340, Aravidu, Hèras, p. 103.

రణ్యుడు.[1] ఇక సనాతనమతమునకు కొదువ యేమి? ధైర్యసాహసములకును, పరాక్రమమునకును, రాజనీతికిని, కొదువ లేకుండెను. ఈబుక్కరాయలుతనకుమారులలో నొకడగు కంపరాయలను మహమ్మదీయుల నోడించి మధురనుండి వెడలగొట్టున ట్లాజ్ఞాపించి దక్షిణదేశముపయి దండయాత్ర కంపెను. తుంగభద్రానదియొద్దు కేంద్రముగా జరుగుచున్న విజయనగరసామ్రాజ్యవ్యాపననాటకమున నొకరంగముగా దక్షిణదిగ్విజయయాత్రకు కంపరాయలు బయల్వెడలెను. ఈయన జింజియందు దండనాయకుడు గానున్న గోపనార్యునియొక్కయు, సాళువమంగి[2]యొక్కయు, సాయమును గ్రహించి, ససైన్యుడై వెడలి, పశ్చిమమున తిరువాన్కూరునుండి తూర్పున శ్రీరామసేతువు

1. "ఇంద్ర స్యాంగిరసో, నలస్య సుమతిః, శైబ్యస్య మేధాతిథిః,
ధౌమ్యో ధర్మసుతస్య, వైన్యనృపతేః స్వౌజా,నిమే ర్గౌతమః,
ప్రత్యగ్దృష్టి రరుంధతీసహచరో రామస్య పుణ్యాత్మనః,
యద్వ త్తస్య విభో రభూ త్కులగురు ర్మంత్రీ తథామాధవః."
(జైమినీయన్యాయమాల. 4.)

2. "మధురాసురత్రాణు (సుల్తాను) మడియించి పరపతు
సాళువబిరుదంబు జగతి నెరపె."
(జైమినిభారతము. 1. 12.)

వరకు జయించి, మధురయందలి సుల్తానును యుద్ధమునందు తెగటార్చి, మహమ్మదీయుల నటనుండి తరిమివేసి, దక్షిణభారతమును నిర్యవనము గావించి, యీదేశభాగమునంతను విజయనగరసామ్రాజ్యముయొక్క పరగణాగా నొనర్చెను.[1] కంపరాయలు కొంతకాల మిచ్చట నుండి దేశమును పరిపాలించినట్లు శాసనములవలన తెలియనగును.[2] ఈయనసంతతివారుకూడ కొంద రిచ్చట నేలినట్లుకూడ తెలియుచున్నది. అంతట మహమ్మదీయులదాడి కోడి మూలల దాగియున్న పండితబృందము మరలతమ మొగములజూపుట కవకాశము జనించెను. ఇంతయైనపిదప నన్నిమతములవారును సామాన్యశత్రువును జ్ఞప్తియం దుంచుకొని మతవైషమ్యముల మాని 'కూడి యుండినబలమ'నునార్యోక్తి ననుసరించిరి. ఇప్పటినుండి మరికొన్నిశతాబ్దములవరకు దక్షిణదేశము నిష్కంటకమగుటచే నిచ్చట నన్నిశాస్త్రములు నపారముగ పెరిగిపోయెను. వానికి వెనుకటికంటె నిది ఫలకాలము.

1. Early History of India, p. 490; క్రీ. శ. 1377; Aravidu, Heras, pp. 105, 106.

2. 18 of 1899; 250 of 1901; 617 of 1902; 282 of 1903.

మాటువడియున్న విద్యాభానుడు రెట్టింపుకాంతితో వెలిగెను. ఈమాటువడియున్న కాలము షుమారు డెబ్బదియైదుసంవత్సరములుగా గ్రహింపవచ్చును.[1] ఈకాలమున దక్షిణహిందూస్థానప్రజలు దినైకగండముగా కాలమును గడపిరి. శ్రీరంగమునందలి రంగనాథుడు పట్టణము మహమ్మదీయులచే ముట్టడింపబడినందున, నచ్చటినుండి పిళ్లలోకాచార్య వేదాంతదేశికులచే గొంపోబడి, కొంతకాలము తిరుపతియందును, మరికొంతకాలము జింజివద్ద సింగవరగ్రామమునను కాపురము చేసి తుదకు గోపనార్యుని పరాక్రమమున స్వస్థానమునకు చేరెను.[2] దక్షిణదేశ

1. Hultzsch in J. R. A. S. 1919, p. 682.
(1329—1378).
Aravidu, Heras, p. 101.

2. "ఆనీయానీలశృంగద్యుతిరచిత
జగద్రంజనా దంజనాద్రేః,
చెంచ్యా మారాధ్య కంచి త్సమయ, మథ నిహ
త్యోద్ధనుష్కాం స్తులుష్కాన్;
లక్ష్మీక్ష్మాభ్యా ముభాభ్యాం సహనిజనగరే
స్థాపయన్ రంగనాథం

మప్పుడు పడినయిక్కట్టులన్నియు కంపరాయలభార్య రచియించిన మధురావిజయకావ్యమున సకరుణముగను, సమగ్రముగను, సరసముగను వర్ణింపబడినవి. కంపరాయల విజయమునకు తరువాత దేశ మెట్లుండెనో చెప్ప నీ క్రిందిశ్లోకమునుమాత్ర మిచ్చట ఇచ్చుచున్నాను:

"ప్రశాంతదావేవ వనాంతలక్ష్మీః
గతోపరాగా గగనస్థలీవ,
కళిందజా మర్దితకాళియేవ
దిగ్దక్షిణాఽఽసీ త్త్వత్పారసీకా."

సమ్యక్చర్యాం సపర్యాం పున రకృతయశః
ప్రాపణో గోపణేంద్రః."

(శ్రీరంగప్రాకారమున నీవేదాంతదేశికరచితశ్లోకము చెక్కబడి యున్నది).

"జిత్వా తులుష్కాన్ భువి గోప్పణేంద్రో
రంగాధిపం స్థాపితవాన్ స్వదేశే;
ఇ త్యేవ మాకర్ణ్య గురుః కవీంద్రః
హృష్టో భవ ద్యస్త మహం ప్రపద్యే."

(వేదాంతదేశికవైభవప్రకాశిక, దొడ్డాచార్యకృతము.)

ఈసందర్భమున "నాచార్యసూక్తిముక్తావళి" యందలి తృతీయోల్లాసమునుకూడ చదువనగును.

ఇందలి మొదటిమూడుపాదములలో మొదటిది మహమ్మదీయులుచేసిన దేశనాశనమును స్ఫురింపజేయుచున్నది. రెండవది యాపదనంతరము దేశముయొక్క వికాసమును తెల్పుచున్నది. మూడవది నిష్కంటకత్వము చెప్పక చెప్పుచున్నది. మహమ్మదీయసేనలు దక్షిణమునకు రాలేకపోయెను. తత్సముద్రమునకు తుంగభద్రానదియుత్తరతీరము చెలియలికట్ట యయ్యెను.[1]

---

1. Some Contributions, S. K. Iyengar, p. 298.

# ౨. విజయనగరసామ్రాజ్యము

## చోళమండలము

ఈ దక్షిణపరగణాను విజయనగరచక్రవర్తులు కేంద్రమునుండియే సాక్షాత్తుగా నేలక, మహమ్మదీయులచే పరిభూతులై దాగికొనిన స్వదేశరాజులను రావించి, సామాన్యరాజ్యభారమంతయు వారికే వదలి తాము కప్పముగొనుచు నప్పుడప్పుడు రాజప్రతినిధుల అజమాయిషీనిమిత్తము పంపుచుండిరి.[1] అట్లు చేయుటచే నా రాజకుటుంబములు కృతజ్ఞములై యుండుటయేకాక సమయమువచ్చినప్పుడు సామ్రాజ్యము వారిసాయమును కోరుటకు వీలయ్యెను.[2] సామ్రాజ్యముయొక్క దక్షిణవిజయమునకు తరువాత పాండ్యచోళరాజులప్రశంస యందువలననే యనువృత్తమయ్యెను. ఆకాలమున

1. Aravidu, Heras, p. 106; J. A. H. R. S., Vol 2, p. 170.

2. Some Contributions, S. K. Iyengar, p. 301; Tanjore Dt. Gazettee 36.

దక్షిణ మహమ్మదీయరాజ్యములు




[౫౦ పుట.

ప్రయాణసౌకర్యములు లేనందున నజమాయిషీకి కూడ తరుచు వీలులేకుండెను. కప్ప మిచ్చునంతకాలము యీ దక్షిణపరగణాల కెట్టియలజడి లేకుండెను. కావున కప్పముతప్ప యన్నివిషయముల నీరాజ్యములు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచుండెను. ఒక్కొకప్పుడీరాజ ప్రతినిధులుగా రాజకుటుంబమువారే వచ్చుట వాడుక యయి యుండెను. ఇట్టివారిలో బుక్కరాయలపుత్రుడగు హరిహరునికుమారుడు విరూపాక్షు డొకడు.[1]

ఇట్లు తరువాత దక్షిణమునకు వచ్చినరాజప్రతి నిధులలో లక్కనమాదనలు ముఖ్యులు. వారు రెండవ దేవరాయల కాలములో వచ్చిరి. ఈయనయే ప్రౌఢదేవ రాయ లనబడుచక్రవర్తి. వీ రిద్దరిలో లక్కన "దక్షిణ సముద్రనాయకుడు"గా రాజప్రతినిధిగా నంపబడెను. వీరు కూడా ఇచ్చట కొన్నివత్సరము లున్నతరువాత దేవ

1. "పౌత్రస్తుబుక్కరాయస్య దౌహిత్రో రామభూపతేః,
విద్యతేహి విరూపాక్షో రాజా హరిహరాత్మజః.
* * * *
తస్య రాజ్ఞః కర్ణాటతుండీరచోళపాండ్యమండలా
ధిపతేః సింహళద్వీపజయస్తంభస్య * * * "
(నారాయణవిలాసనాటకము, విరూపాక్షకృతము.)

రాయల తదనంతర ముత్తరమునుండి సామ్రాజ్యమునకు మహమ్మదీయులదాడి[1] కారణముగా వీరు విజయనగరము నకు వెడలవలసివచ్చెను. అగ్నికి వాయుదేవుడు సాయ పడినట్లు మహమ్మదీయులకు గజపతి యొకవైపునుండి సామ్రాజ్యమున కొత్తిడి కలిగించసాగెను. దేవరాయల యనంతరము వచ్చినచక్రవర్తులు నేతిబీరకాయ లైరి. అందుచే నీకాలము సామ్రాజ్యమున కాపత్కాల మయ్యెను. తుది సంగమకులచక్రవర్తియగు విరూపాక్షు డును, నాయనకుమారుడును దుర్మార్గులైనందున రాష్ట్ర మునందలి సరదారులందరును చేరి పరాక్రమశాలియని పేరొందిన సాళువనృసింహుని పిలిచి సమ్మతితో రాజ్య భార మాయనయం దుంచిరి. బలవంతుడైన రాజేలిన గాని సామ్రాజ్యము నిలుచునట్లు కన్పట్టకుండెను. అందు వలన సంగమవంశమునుండి సామ్రాజ్యము చ్యుతమై

1. ఈకాలమునకు డిల్లీ రాజ్యము క్షీణించి దక్షిణమహమ్మదీయ భాగములు స్వతంత్రములై నాల్గుగా చీలెను: (1) బీజపురము, (2) అహమ్మదునగరు, (3) బీదరు, (4) గోల్కొండ. వీనిలో బీజపూరు గోల్కొండలవారు ఉత్తరమున సామ్రాజ్యము సరిహద్దులనుండి యొత్తిడి కలిగింప మొదలిడిరి.

సాళువవంశము నావహించెను. ఈనరసింహుడు పోయిన రాజ్యమర్యాదను కాపాడి, మహమ్మదీయ సేనాసముద్రమును నరికట్టి, గణపతిని పలాయితుని జేసి సామ్రాజ్యమును నిలిపెను. ఇక్కాలమున నొకవీరనరసింహు డనునతడు దక్షిణ దేశమునకు రాజప్రతినిధిగా నుండినట్లు కన్పట్టును గాని యీయననుగూర్చి ముందు విపులముగా ముచ్చటింతును. ఈసాళువనరసింహున కీసామ్రాజ్యనిష్కంటక కరణకార్యమున కృష్ణరాయల పితామహుడగు నరస నాయకుడును, నార్వీటివంశజాతుడగు బుక్కరాయలును దండనాథులుగా నుండిరి.[1] వీరు నరసింహునికి నమ్మకస్థు బంట్లుగా నుండిరి. వీరనరసింహునికుమారుడు పిల్లవా డగుటచే నాయన చనిపోవునప్పుడు వీరికి కుమారుని ఒప్పజెప్పి పోయెను. వీరిద్దరిలో నరసనాయకుడు పెద్ద వాడగుటచే నాయనపైననే రాజ్యభారము పడెను. బాలుడగు వీరనరసింహుని కుమారు డకాలమరణము నొంద నాయనకు సంతతి లేనందున నరసనాయకుడే

1. నరసనాయకుడు దక్షిణదండయాత్రకు వెళ్లినట్లు అచ్యుతరా యాభ్యుదయకావ్యము తెల్పుచున్నది,

Early History of India, V. A. Smith. p. 303.

యావద్రాజ్యభారము వహింపవలసివచ్చెను.[1] వీర నరసింహుడే నూతనుడుగాన నీరెండవనూతనపరివర్తనము సామ్రాజ్యమున నెట్టియభిప్రాయభేదమును కలిగించలేదు. మరియు నీయన పరాక్రమముచే రాజ్యమును నిష్కంటకము చేసి పరిపాలించినందున సామంతులును, ప్రజలును కడుపులో చల్ల కదలకుండ సుఖులై యుండుటచే నీయన యందే రాజ్యము సుప్రతిష్ఠితమై పోయెను. ఈయనది మూడవవిజయనగరరాజ్యకుటుంబము. ఈయన తుళువ వంశోద్భవుడు. ఈపరివర్తనము క్రీ. శ. 16-వ శతాబ్దారంభమున నని చెప్పనగును. ఈయన కిరువురు కుమాళ్లు. పెద్దవాడగు భుజబలనరసింహనాయకుడు తండ్రితరువాత కొలదికాలమేలి గతింప[2] రెండవకుమారుడగు కృష్ణరాయలు గద్దెయెక్కెను. ఈయన యాంధ్రులకు నిరంతర స్మరణీయుడు. ఈయనపావననామము నెరుంగని చరిత్రజ్ఞుడుండడు. ఈయన కటకము మొదలు రామసేతువు వరకు నేకచ్ఛత్రముగ నేలుటయు, హిందూసామ్రాజ్య

1. స్మిత్తుగారు నరసనాయకు డీబాలుని కడ తేర్చి రాజయ్యెనని వ్రాసినారు. కాని దాని కాధారములు కానరావు.

2. Some Contributions p. 305.

మును దిగంతవిశ్రాంతకీర్తిపాత్రము జేయుటయు, అనేక కృతిభర్తమై విద్యాభోజుడగుటయు మొదలగు నన్నివిష యములను దశదిశలందు నాటబడిన జయస్తంభములును, శాసనములును, మనుచరిత్రాద్యుత్తమప్రబంధములును వేనోళ్ల చాటుచున్నవి. విజయనగరసామ్రాజ్యమునకును, హిందూమతమునకును, ఆంధ్రకర్ణాటభాషలకును నీయన కాల మత్యుచ్చకాలము. ఈయన యస్తమయముతో సామ్రాజ్యసూర్యు డంబరవీథిని దిగుట కారంభించెను. ఈయన కిద్దరుకుమార్తెలుమాత్ర ముండిరి. మొగపిల్లలు లేరు. అందుచే రాజ్యము తమ్ముడగు నచ్యుతదేవరాయ లకు సంక్రమించెను. ఈయచ్యుతదేవరాయల కాల ములో తంజావూరు నాయకరాజ్యస్థాపన మొనర్పబడెను. కృష్ణరాయలకుమార్తెలలో తిరుమలాంబయనునామెను, ఆరవీటిబుక్కని మున్మనుమ డగు నళియరామరాయల కిచ్చి వివాహము జరిగెను. ఈ రామరాజునుగూర్చి ముందు మనము తెలుసుకొనగలము.

---

# ౩. మధురనాయక రాజ్యస్థాపనము[1]

మధురలో తంజావూరునందుకంటె పూర్వము నాయకరాజ్యస్థాపన మయ్యెను. దానినికూడ మనకు తెలిసికొనుట యవసరము. మధుర పాండ్యమండలమునకు రాజధాని. కృష్ణరాయలకాలమున అనగా క్రీ. శ. 1528 ప్రాంతమున విజయనగరసామ్రాజ్యసామంతులగు పాండ్య చోళరాజుల కిద్దరకును వైరము సంభవించెను. అప్పుడు మధురను చంద్రశేఖరపాండ్యుడును, తంజావూరును వీర శేఖరచోళుడును నేలుచుండిరని వదంతి. వీరిలో చోళ రాజు పాండ్యు నోడించి రెండురాజ్యములును పాలింప సాగెను. అంతట పాండ్యుడు విజయనగరము వెళ్లి తన్ను చోళుడు పదభ్రష్టుని గావించినయుదంతము కృష్ణరాయ లకు విన్నవించి తన్ను పునఃప్రతిష్ఠితుని జేయుభారము కేంద్రముపై నున్నందున నట్లు జేయవలసినది యని రాయలను వేడుకొనెను. రాయలును తనదండనాయ

1. ఇచ్చట మనకు తంజావూరాంధ్రరాజులచరిత్రమును, టైల రుగ్రంథమును ముఖ్యాధారములు.

కులలో రాజభక్తిపూరితుడై నట్టియు, వీరనరసింహుని కాలమునుండియు సామ్రాజ్యము నెడల కృతజ్ఞత చూపు నట్టియు, ప్రతాపశాలియు, వృద్ధుడును నగు నాగమ నాయకుని యందులకు నియమించెను. ఆయన చోళుని జయించి రెండురాజ్యములను తానే యేలసాగెను. "ఆదిలో కృష్ణరాయలవారు కటకం మొదలుకొని కన్యా కుమారిదాకా దేశం లోపరచుకొని సుఖసత్కథావినో దంతో విజయనగరంలో రాజ్యం యేలుతూవుండగ్గా మధురలో చంద్రశేఖరపాండ్యుడున్నూ తంజావూరులో వీరశేఖరచోళుడున్ను రాయలవారికి వశవర్తులై రాజ్యం యేలుతూవుండిరి. ఆలో తంజావూరువీరశేఖరచోళరాజు బలాత్కారంగా మధురలో చంద్రశేఖరపాండ్యుణ్ణి జయించి ఆరాజ్యముమావత్తు కట్టుకుని యేలసాగెను. అందువల్ల చంద్రశేఖరపాండ్యుడు యెత్తుపడి విజయ నగరం రాయలసముఖానకు వచ్చి జరిగినవర్తమానము విన్నవించుకుంటూ 'మాదగ్గిర కప్పంపుచ్చుకుని మమ్ము ఆజ్ఞలో నడిపించుకొని వస్తూవున్నారు. లోకంలో "దుర్బ లస్య బలంరాజా" అనే న్యాయము వున్నది. మాకు గతి యేమి ఆజ్ఞాపిస్తారో మేము ఆలా నడుచుకుంటున్నాము. మాకు దిక్కు మీరేకాని మరియెవ్వరు లేరు' అంటే

అప్పుడు రాయలవారు ఆమాటలు విని అగ్రహాపడి తమ తోశేఖానా[1] అధికారియగు నాగమనాయని పిలిపించిరి. 'దక్షిణరాజ్యం యావత్తు మీ తోశేఖానాకు ఆదుమానం వున్నదికదా! ఇట్లావుండగా పాండ్యుడిరాజ్యం చోళుడు బలాత్కారముచేసి కట్టుకోవడం యేమిటి? మీరే సైన్యసమేతంగా పోయి ఆదుష్టుడైన వీరశేఖర చోళరాజును శిక్ష చేయండి. ఈపాండ్యరాజుకు యథాప్రకారం రాజ్యం యిప్పించండి. చోళరాజ్యం జప్తిచేసి సర్కారుయిలాకాలో మనుష్యులను వుంచి మీజమాబంది అర్థంమాత్రం మీరు తీసుకొని తిరిగి రండి' అని ఆజ్ఞాపించిరి. (తంజావూ రాంధ్రరాజులచరిత్రము) పైగ్రంథమును టైలరుగ్రంథమును[2] నీవిషయమున నేకీ

1. ధనాగారము.

2. "At this time the King of Tanjore was Virasekhara-Soren and the King of Madura was Chandrasekhara-Pandian. The former being ambitious of extending his authority invaded the dominions of Chandrasekhara Pandian, against whom he marched with a formidable force and conquered him. The King of Madura together with his son affected his escape and fled to the Rayar (King of Vizianagar) for protection to whom he preferred his complaint saying 'Vira-

భవించుచున్నవి. కాని యాకాలమునందు చంద్రశేఖర పాండ్యుడు మధురయందును, వీరశేఖరచోళుడు తంజాపూరునందును రాజ్యము చేసినట్లు శాసనాధారములెవ్వియు గానరావు. అట్లు వారు రాజ్యము చేయలేదనుటకును వలనుపడదు. మెకంజీరికార్డులుకూడా యిట్టికథనే చెప్పుచున్నవి. వెనుక వీరనగసింహుడను నొకని పేర్కొనియుంటిని. కాని యీచరిత్రగ్రంథమునందలి విషయమును, నీవీరనరసింహునియుదంతమును పరస్పరము కొంచెము భిన్నములుగా నున్నవి. వీరనరసింహునే వీరశేఖరచోళు డనుట కెట్టియాధారములను కానము. కాని

Sekhara- Soren has forcibly taken possession of our Kingdom'. The Rayar there-upon called upon Nagama Naicker the father of Visvanatha and said to him "The Southern Country is under your authority; Is it not? Therefore employing the means at your command assemble an army and go, chastise Virasekhara-Soren, and reinstate Chandrasekhara-Pandian on the throne.' According to this order he came to Madura and in a suitable manner punished Virasekhara Soren. But then instead of restoring the Kingdom to Chandra Sekhara Pandian he usurped it as his own."

(Taylor's O. H. M. ss. pp. 9 & 11).

య ట్లీహాహకు తావు కలదు. మొత్తముమీాద సాళువ నృసింహుని కాలమునుండి యచ్యుత దేవరాయల కాలము వరకు నొకవీరనరసింహుడు తంజాపూరుననో మరియొక తావుననో విజయనగరసామ్రాజ్యప్రతినిధిగా నుండుట సిద్ధము. ఈయనయే వరదాంబికాపరిణయమున చెల్లప్ప యని పిలువబడినాడు. అచ్యుతరాయాభ్యుదయ మీాయ నను వీరనరసింహరాయ లని పేర్కొనుచు నీయన కృష్ణరాయలకాలమునుండి సామ్రాజ్యముక్రింద దండ నాయకుడుగా నున్నట్లు తెల్పుచున్నది. కాని యీాయన రాజ్యాంత కాలమున రాజున కెదురుతిరిగి యోడింప బడగా తిరువాన్కూరు పారిపోయినట్లును, అచ్యు తుడు రాజ్యమునకు వచ్చినవెంటనే యీాయనను, ఈయనకు తావిచ్చిన తిరువాన్కూరు రాజును శిక్షిం చుటకై దక్షిణదండయాత్రకు వెడలి వారిద్దరిపైన తన బావమరిదియగు పెదతిరుమలరాజును పంపగా నాయన వారిద్దరిని బందీకృతులనొనర్చి తీసుకునివచ్చినట్లును నీ యచ్యుతరాయాభ్యుదయమువలన తెలియుచున్నది.[1] హీరాసుగారుకూడ ఈ చరిత్రమునకు భిన్నాభిప్రాయ

1. అచ్యుతరాయాభ్యుదయము, సర్గలు. 4, 5, 6.)

మును చూపుట లేదు.[1] కాని యీయననుగూర్చి యను మానమును వెలిబుచ్చుచున్నారు.

వీరనరసింహునికి సంబంధించినశాసనములు క్రీ. శ. 1510 నుండి 1528 సంవత్సరములమధ్య దక్షిణదేశమున కన్పట్టుచున్నవి.[2] కాలమునుబట్టి చూచిన వీరనరసింహుని యుదంతము విశ్వనాథునికి పూర్వమని తోచును. కాని యదియు స్పష్టము కాజాలదు. విశ్వనాథుని నియమించిన కృష్ణరాయలకు పూర్వపువీరనరసింహుని కృష్ణరాయల తరువాత రాజ్యమునకువచ్చిన యచ్యుతరాయలు శిక్షించుట యెట్లు పొసంగును? ఒకదానికొకటి పరస్పరము భిన్నముగా తోచును. వీరనరసింహుడు చోళమండల రాజప్రతినిధి యనుటకు కూడా పూర్తియవకాశము లేదు. అప్పుడు నాగమ రెండురాజ్యములను కలిపి యేలుట యబద్ధమగును. కాని యశ్లేలినట్లు తంజావూరురాజులచరిత్రమును, మైలరుగ్రంథమును, మెకంజీరికార్డులును నేకీభవించుచున్నవి. హీరాసు, సత్యనాథయ్యరు, కృష్ణస్వామి అయ్యంగారు మొదలగుచరిత్రకారులు దానిని స్వీకరించి

1. Aravidu, Heras. pp. 113, 115, & 116.
2. Sources of Vijianagar, p. 12.

యున్నారు. వీరనరసింహుడు కృష్ణరాయలకాలములోనే తిరుగబాటు చేసినట్లుకదా తెలియుచున్నది. తిరుగుబాటు చేసినచోళరాజుపైన నాగమనాయని బంపినరాయలు వీరనరసింహునిపై నేలపంపడాయె? సంగతిసందర్భములన్నియు నాలోచించిన శాసనముల నన్నిటిని పరిశీలించిన, నాగమనాయనికిపూర్వము వీరనరసింహుడనువాడు దక్షిణమండలనాయకుడుగా నుండెననియు, నతడు క్రీ. శ. 1528 ప్రాంతమున గతించెననియు, వెంటనే తంజావూరు చోళుడవకాశమును కనిపెట్టి పాండ్యుని నోడించి రాజ్యము లాగికొనెననియు, అందువలన రాయలు నాగమ నంపెననియు, తరువాత నచ్యుతరాయలు పశ్చిమమునకు ఒత్తికొనివచ్చుచున్న తిరువాన్కూరురాజును శిక్షించుటకు విశ్వనాథున కొక్కనికిని సాధ్యము కాకపోగా దక్షిణదండయాత్రకు వచ్చెననియు, చెల్లప్పయు, వీరనరసింహుడును ఒక్కవ్యక్తి కాదనియు, ఒక్కడేనన్న నదపొరపాటగుననియు నిర్ధారణముచేయవలసియున్నట్లు కన్పట్టుచున్నది.[1] కాని యింకను ఈవిషయమున పరిశోధన మవస

1. క్రీ. శ. 15-వ శతాబ్దమున సాళువతిరుమలరాయలు విజయనగరసామ్రాజ్యప్రతినిధిగా కారికాలుపట్టణమువద్ద తిరుమలరాయ పట్ట

రఘుని మనవిచేయుచున్నాను. ఒకవీరనరసింహుడనురాజు కాంచీపురములోజరిగిన యప్పయ్యదీక్షితులయాగమునకు వచ్చెనని యప్పయ్యదీక్షితచరితము తెల్పుచున్నది.[1] దీని నాధారముచేసికొని శ్రీమహాలింగశాస్త్రిగారు వ్రాసి నారు.[2] వారు అప్పయ్యదీక్షితజననకాలము క్రీ. శ. 1520 సంవత్సరమని తెల్పుచున్నారు. ఆయన జ్యోతిష్టోమము చేయుటకు గృహస్థయియుండవలెను. "అర్థీ సమర్థో విద్వాన్ జాతపుత్రః కృష్ణకేశ్యగ్నీ నాదధీత" యనువిధి ననుసరించి యధమ మిరువదియైదుసంవత్సరములవయస్సైన నుండియుండవలెనుకదా ? అట్టియెడ నాయజ్ఞము క్రీ. శ. 1545-వ సంవత్సరప్రాంతమున నగును. క్రీ. శ. 1542 లోనే చనిపోయిన యచ్యుతరాయలు క్రీ. శ. 1545-వ సంవత్సరమున జీవించియున్న వీరనృసింహుని నోడించుట యసంభవము. ఒక్కటియైయుండవచ్చును. అచ్యుత

ణమను స్థలమున నేలుచున్నట్లున్నది. ఈయన సోదరుడగు తిప్పరాయలు సంగీతమున తాళదీపికయను గ్రంథమునుకూడా వ్రాసెను. ఒకవేళ నీవీరనరసింహుడు వారికి సంబంధించినవాడేమో !

1. అప్పయ్యదీక్షితచరిత్రము, శివానందకృతము.

2. Journal of Oriental Research, Madras, 1928, p. 229.

రాయలచే పరాభూతుడైన వీరనరసింహుడు చిన్నసామం తుడై యుండియుండవలెను. కాని క్రీ. శ. 1528 తరువాతశాసనముల నీయననామము వినబడకపోవుటచే నీవీర నరసింహు డాయన కాదని చెప్పవలసియున్నది.

నాగమనాయడు తనను పునఃప్రతిష్ఠితునిచేయక రెండురాజ్యములును తానే యేలుట చూచి పాండ్యుడు మరల కృష్ణరాయలవద్దకు వెడలి మొరపెట్టుకొనెను. రాయ లంతట క్రోధావేశపరవశుడై తనసభాంతరాళ మున నాగమను శిక్షించువా రెవ్వరును లేరా? యని తన దండనాథుల నడిగెను. నాగమయన్న నందరకును భయము గావున నెవ్వరును మారుమాటాడక యూరకుండగా నాగమనాయని కుమారుడగు విశ్వనాథనాయకుడు లేచి 'యాజ్ఞయైన నేను వెళ్లి శిక్షింతు'నని మనవిచేసెను. రాయ లంతట కొంతతడ వనుమానించెను గాని తరువాత నొప్పుకొని యాయనను నాగమపై నంపెను. విశ్వనాథ నాయకుడు ససైన్యుడై మధురకుపోయి రాయలయాజ్ఞను తండ్రికి తెల్పి తత్క్షణము రాజ్యము పాండ్యునియధీనము గావించి రమ్మనికోరెను. నాగమ యందుల కియ్యకొనసం ధున నిరువురకును సంగ్రామమై యందు నాగమ కుమారు నకు చిక్కెను. అంతట విశ్వనాథుడు పాండ్యునికి పాండ్య

మిచ్చి నాగమను తెచ్చి రాయల కొప్పగించెను. రాయలును విశ్వనాథుని స్వామిభక్తికి తండ్రిని క్షమించెను. చంద్ర శేఖరపాండ్యుని తదనంతరము సంతతిలేకపోగా రాయలు దక్షిణనాయకునిగా విశ్వనాథుని నియమించెను. అంతట విశ్వనాథుడు మధురకు పోయి యచ్చట రాజ్యము చేసెను. తదనంతర మాయనవంశమువారును నచ్చట చాలకాలము రాజ్యము చేసిరి. పైవిషయమున విశేషములను తంజావూ రాంధ్రరాజులచరిత్రమువలనను, కైఫియతుగ్రంథమువలనను తెలియనగును.[1]

ఈ రెండును కొలదిభేదముతో నేకీభవించుచున్నవి. కైఫియతుగ్రంథము పాండ్యుని రాజ్యము పాండ్యుని కిచ్చిన వెనుక నాయనసుతుడు కూడ స్వల్పకాలము రాజ్యము చేసిన తరువాత విశ్వనాథుని నియామకము జరిగినట్లు తెల్పు చున్నది. ఆంధ్రానువాదము పాండ్యునిసమ్మతిని, కోరిక ప్రకారమే రాయలు విశ్వనాథుని నియమించెనని చెప్పుచు పాండ్యునకు సంతతియున్నట్లు చెప్పక పై పెచ్చున్నవా రంతయు నక్రమసంతానమనికూడ చెప్పుచున్నది. తప్పి తెట్లున్నను రాయలు విశ్వనాథుని నియమించుటయు,

1. అనుబంధములు క, ఖ, చూడుడు.

నాయనచని ప్రథమనాయకరాజుగా మధురలో నేలుటయు సిద్ధము.[1]

ఒక్క విషయముమాత్రము ముఖ్యము. రెండుగ్రంథములు విశ్వనాథుని రాయలు మధురలో నియమించెనని చెప్పుచు తుదనుమాత్రము విశ్వనాథుడు పాండ్యచోళరాజ్యములు రెండును కలసి యేల సాగె నని వచింపుచున్నవి. ఇవి రెండును పరస్పరము భిన్నములుగా నున్నవి. నాగమనాయనికి పూర్వమువరకు తంజాపురమున నొకచోళరా జేలుచున్నట్లు మనము కనుగొనియున్నాము. తరువాతకూడా విశ్వనాథుడు తండ్రిని జయించి పాండ్యము పాండ్యున కిచ్చివచ్చెనని యాంగ్లానువాదము తెల్పుచున్నది. పాండ్యునికి పాండ్యమిచ్చిన చోళదేశమేమయ్యెను? చోళము చోళున కిచ్చెనన్నమాట. మరియు రాయలయాజ్ఞ పాండ్యమున కొక్క

1. విశ్వనాథు డింతకు పూర్వము విజయనగరమున తాంబూలకరంకవాహిగా నుండెనని యందురు. కాని యది నమ్ముటకు వీలులేదు. విశ్వనాథుడు రెండుమార్లు దక్షిణరాజ్యమునకు పోయినట్లు కూడా చెప్పుచున్నారు. కాని యీయవాంతరవిషయములు మన కనవసరములు.

Aravidu, Heras, p. 122.



బృహదీశ్వరాలయము (మరియొక దృశ్యము) ౩౮ పుట.



తిరుచినాపల్లి కొండ కోట
(విశ్వనాథనిర్మితము)

౯౩ పుట.

దానికే వర్తించినట్లు కన్పట్టుచున్నది. చోళముకూడా విశ్వనాధనాయకు డేలవలయుననుట రాయలయభిప్రాయు మైన రాయలల్లే చెప్పియుండును. ఎక్కడనైన నొక్కతప్పుకు రెండుశిక్షలుండునా? చోళుడు పాండ్యము నాక్రమించుకున్నందులకు పాండ్యమును పునర్జయించి పాండ్యునికి నొప్పచెప్పుట సమంజసముకాని చోళుని రాజ్యము లాగికొనుట సమంజసమా? రాయ లట్టియాజ్ఞ నొసంగునా? పైయాంధ్రానువాదంబున నీమాట లున్న వి: "చోళరాజ్యం జప్తీచేసి సర్కారుయిలాకాలో మను ష్యులను వుంచి మిాజమాబందీఅర్థం మిారుతీసుకుని తిరిగి రండి అని ఆజ్ఞాపించిరి." ఇది రాయలయాజ్ఞ. ఇందు చోళరాజ్యం జప్తిచేయమని యున్నది. నాగమ యట్లు చేయక తానే రెండురాజ్యముల నేలెను. విశ్వనాధుడు పాండ్యమును పాండ్యున కిచ్చివేసెను. విశ్వనాధునకు చోళ రాజ్యం జప్తీచేయునాజ్ఞ రాయ లియ్యలేదు. కాబట్టి విశ్వనాధుడు చోళము నేమిచేసెను? హీరాసుగారుకూడ విశ్వనాధుడు మొదట కొంతకాలము మధురలోనుండి తండ్రిని జయించిన తరువాత కొంతకాలము పాండ్యుడు రాజ్యమేలిన వెనుక విశ్వనాధుడు సమగ్రముగా రెండు రాజ్యములకును నిర్ణయింపబడినట్లు చెప్పుచున్నారు. ఈమధ్యకాలమున పాండ్యమును పాండ్యు డేలు

చుండగా చోళము నెవ్వ రేలిరి? ఇచ్చట వీరనరసింహుని నన్వయించుట కొందరియూహ; కాని యదియు నసమంజసముగానే కన్పట్టును. మున్ముందు విశ్వనాథుని కాలమున చోళమును తంజావూరున నొకరా జేలుచున్నట్లు మనము చూడగలము.[1] ఈయన యెవరు? ఇట్టియెడ వీరనరసింహుడుగాక మరియొకరాజు చోళము నేలుచుండెననుట స్పష్టము. రెండురాజ్యములును విశ్వనాథు డేలుచుండెనని పైయనువాదములు చెప్పు కథమాత్రము విశ్వసనీయము కాదు. విశ్వనాథుడు తంజావూరురాజుతో సంధిచేసుకొనెనని ముందు మనము చదువబోవు కంఠోక్తిగాచెప్పు ననువాదము నమ్మక వలనుపడదు. ఈమధురనాయకరాజ్యస్థాపన మెప్పుడు జరిగెనని చెప్పువాదమునకు నే నెక్కువగా దిగను. కాని తంజావూరునాయకరాజ్యస్థాపనమునకు పూర్వము కొన్ని వత్సరములక్రింద ననిమాత్రము స్పష్టము. ఈస్థాపన మెవ్వరికాలమున నను ప్రశ్నమునకు వెనుకటి రెండనువాదములును కృష్ణరాయలకాలమున నని నొక్కి చెప్పుచున్నవి. కాని హీరాసుపాదరీ గారు దీని నంగీకరించుట లేదు.[2]

1. Taylors O, H. Mss. p. 190.
2. Aravidu, Heras, Ch. VI.

అచ్యుతరాయలకాలముననే యని వారియూహ. అనగా క్రీ. శ. 1530 కి తరువాతనని. ఈవిషయములకాలమును దాదాపే చెప్పనగునుగాని యిదమిత్థమని చెప్పుటకు వలనుపడదు. కాని వారు రెండుకారణముల నిచ్చుచున్నారు:

1. గోపీనాథరావు మొదలగు చరిత్రపరిశోధకు లచ్యుతుని మొదటితిరువాన్కూరుదండయాత్రలో విశ్వనాథుడు లేడని యభిప్రాయపడుచున్నారట!

2. విశ్వనాథునిపాండ్యరాజ్యముపై చోళులు దండెత్తినట్లు తెలియుచున్నదట!

అచ్యుతునిదండయాత్రనాటికి విశ్వనాథు డింకను తనస్థానమును ధట్టించుకొని యుండలేదు.[1] అట్టియెడ చోళులలో మిగిలినవా రెవ్వరో యేమూలనుండియో విశ్వనాథుని రాజ్యముపై దండెత్తుటలో వింత యేమున్నది? మరియు నీవిషయము కాలము నెట్లు నిర్ణయింప

1. తెంకాశి(దక్షిణకాశి)మొదలగుస్థలముల పాండ్యు లున్నట్లును, వారినిజయించుట కష్టమని పాండ్యుడు చెప్పినట్లును పైయనువాదముల జూడగలము. అట్టియెడ జయింపబడనిచోళులుండుట యొకవింత కాదు.

గలదు? విశ్వనాథునికాలమున తంజాపూరున నొకచోళు డేలుచుండవలెనని మనము కనుగొనగలము! వారు చెప్పుచున్నట్లు విశ్వనాథునిరాజ్యస్థాపన మచ్యుతరాయలకాలములో నైన యప్పటివరకు చోళమును చోళులే యేలుచుండవలెనుగదా! అందుచేత నేకాబోలు నాగమనాయనింగూడ నీయన యచ్యుతరాయలకాలమునకే దింపినాడు[1]. కావున రెండవకారణ మంత తృప్తికరము కాదు. మొదటిదానిని విచారింతము. క్రీ. శ. 1505 ప్రాంతమునకు నాగమనాయడు సాళువనృసింహుని నమ్మకమైనదండనాయకులలో నొకడని చెప్పుచున్నాడు.[2] అట్లగుటచే నాగమకు నలువదికిమించి వయ సుండవలెను. మరల క్రీ. శ. 1535 ప్రాంతమున జరిగినయచ్యుతుని దక్షిణదండయాత్రలో నాగమ యున్నట్లు వ్రాయుచున్నాడు.[3] నాగమ కప్పటికి 70 సంవత్సరములకు మించినవయ స్సుండవలయును.[4] 70 ఏండ్ల వయస్సునకు తరువాత రాయలతో దక్షిణదండయాత్రలో పాల్గొనెనని చెప్పుట కొంచె

1. Taylor's O. H. Mss. p. 190.
2. Aravidu, Heras, pp. 113, 115, 116; No. 318 of 1909.
3. Ibid, pp. 121.
4. Sources of Vizianagar History, p. 14.

మవిశ్వసనీయముగా నున్నది. బహుధా యీదండయాత్రలో పాల్గొనినది విశ్వనాథుడై యుండు ననియు, విశ్వనాథుడనుటకుమారుగా నాగమయని చెప్పిరనియు నా యనుమానము. విశ్వనాథు డప్పటికి-అనగా క్రీ. శ. 1535 నాటికి 40 సంవత్సరములవాడై యుండును. వయోవృద్ధుడగు నాగమ రాయలతో వెళ్లెనని చెప్పుటకంటె విశ్వనాథుడే వెళ్లెనని చెప్పుట సమంజసము. గోపీనాథరావు మొదలగువారివ్రాతల కేమియాధారము? పేరు చెప్పకపోవుట యొకకారణము కాదు. లేరనిచెప్పుటకీయాధారము చాలదు. నాగమయు, విశ్వనాథుడును నిద్దరును వెళ్లియుందురు. ఇది మిక్కిలి సంభవము. నూతనముగా-అనగా కొలదిసంవత్సరముల క్రిందటనే నియమింపబడిన విశ్వనాథుడు తిరువాన్కూరుదాడి నాపుకొనకపోవుటయు, రాయ లందులకు దక్షిణమునకు వచ్చుటయు నెట్లసంభవములో యూహింపజాలకున్నాను. అళియ రామరాయలకాలములోకూడ నిట్టిపరిస్థితులే తటస్థింపనాయన రామరాయవిఠ్ఠలుని దక్షిణమునకు దండయాత్రనంపెనని తెలుసుకొనగలము. అట్టియెడ నిప్పు డట్టి పరిస్థితులు కల్గుటలో నెట్టియాశ్చర్యమును లేదు.[1] కావున నింతకంటె నెక్కువసహేతుకముగా నిర్ణయింపబడు

1. Sources of Vijianagar History, p. 18.

నంతవరకు నాగమవిశ్వనాథులయుదంతము కృష్ణరాయల యంత్యదశలో ననియే నమ్మవలసివచ్చుచున్నది. ఎట్లయిన క్రీ. శ. 1530 సంవత్సరమునకు లోపున కావలయును. ఛోళు డురితీయబడినట్లు హీరాసుగారు చెప్పుచున్నారు. కాని యట్లుచేయబడుట కెట్టిప్రబలాధారములు కానరా వు.మధురనాయకచరిత్రకారులగు సత్యనాథయ్యరుగారును మధురరాజ్యస్థాపనము క్రీ. శ. 1529 వ సంవత్సరములో నని నిర్ధారణము చేయుచున్నారు. దానికి శ్రీకృష్ణస్వామయ్యంగారు బలము నొసంగుచున్నారు.[1] హీరాసుగారు కూడ క్రీ. శ. 1539 వ సంవత్సర మనుచున్నారు గాని క్రీ. శ. 1535-వ సంవత్సరమునాటికే నాగమకుమారుడు విశ్వనాథు డని పేర్కొనుశాసనము కలదు.[2] ఈవిషయము వారివాదమును దుర్బలము చేసి విశ్వనాథనియామకమును వెనుకకు నెట్టుచున్నది.

మధురలో నాయకరాజ్యస్థాపనమైనది. విశ్వనాథబీజము నాటుకొనిపోయి తద్వంశవృక్షము పెరిగినది. ఇకతంజాపురాన నాయకరాజ్యబీజము నాటవలసియున్నది. దోహదము సమీపించినది.

---

1. Sources of Vijianagar History, pp. 17, 18.
2. 113 of 1908, Sewells list of antiquities, V.I, p. 209

# ౧. తంజావూరునాయక రాజ్యస్థాపనము

కృష్ణరాయసూర్యు డస్తమించెను. ఇది విజయనగరసామ్రాజ్యమునకును సకలాంధ్రప్రపంచమునకును తీరనివిపత్తు. ఆయనతమ్ముఁడగు నచ్యుతదేవరాయలు చక్రవర్తి యయ్యెను. కృష్ణరాయలరాజ్యకాలమునందుకూడ కృష్ణరాయలకు జబ్బుగానున్నకాలమున నొకమారచ్యుతుఁడు రాజ్యభారము వహించినట్లు దెలియచేయు క్రీ. శ. 1525-వ సంవత్సరమునకు సంబంధించిన యొక శాసనము కలదు.[1] అట్టియెడ "కవిత్వవేది" యాంధ్రవాఙ్మయసంగ్రహమున వ్రాసినట్లు రాజ్యమునకు వచ్చుటకు పూర్వ మచ్యుతదేవరాయలు కారాగారమున నున్నట్లు చెప్పుట కాధారములను కానము.[2] వరదాంబికాపరిణయముగాని, యచ్యుతరాయాభ్యుదయముగాని యట్టి

1. History, Nayaks of Madura. Introduction p. 8.

2. న్యూనిజు నట్లే చెప్పినట్లున్నది కాని నాకు వరదాంబికాపరిణయాచ్యుతరాయాభ్యుదయగ్రంథములపై నెక్కుడు ప్రత్యయము కలదు. అవ్వియు సమకాలీనములే! ఈస్థలముల న్యూనిజుచెప్పినది విశ్వసనీయము కాదని చరిత్రకారుల యాశయము.

(Sources of Vijianagar History, Introduction, p. 12)

యూహ కెట్టితావు నొసంగుట లేదు. రాజ్యమునకువచ్చిన వెంటనే యుత్తరమున తురకలపైకి వెడలవలసి వచ్చెను.[1] ఆవంక రాజ్యమును సుప్రతిష్ఠితము గావించి తరువాత చెల్లప్పను, తిరువాన్కూరు రాజును, దండించుటకు దక్షిణమునకు పోయినట్లు మనకు తెలియును. దక్షిణమునకు పోయి దిగ్విజయము గావించి మరలెను. ఈయన దక్షిణదండయాత్ర క్రీ. శ. 1535 ప్రాంతమని చెప్పుచున్నారు.[2] విశ్వనాథుడు తిరువాన్కూరుదాడి నాపుకొనలేకపోయినను పరాక్రమశాలియని చెప్పుట కెట్టియభ్యంతరము లేదు. మరియు రాజ్యముపై నొకమారు తిరుగబడిన నాగమనాయనికి పుత్రుడు. అందుచే మధురకు సమానముగా నొకస్థలమున విశ్వనాథున కుద్దగానుండి సమయము వచ్చినయెడల తనకు సాయమొనర్పగల తనవాని నొకని నియమించుట మంచిదని యాయనకు తోచెను. అదియు నవసరమయియేయుండెను. తంజావూరున రాజులేనిసమయము తటస్థించెను. హీరాసుగారు చోళరాజును రాయ లురితీసె

1. No. 47 of 1900.

2. Aravidu, Heras, p. 117.

నని వ్రాసిరి.[1] కాని యెట్టియాధారమును కానము. కావున విశ్వనాథుని మధురయందు నియమించునప్పటి పరిస్థితులే తంజాపూరున కల్గెనని యనుకొనవలెను. అచ్యుత దేవరాయలు కొంచెము భార్యాప్రియుడగుటచే రాజ్యాంగమునకూడ నామెకు జోక్య ముండెడిది. ఇది యూతగా ఆయన బావమరదులుకూడ రాజ్యమున నప్పుడప్పుడు పాల్గొనిరి. క్రమముగా వారిమాట సాగజొచ్చెను.[2] వారికి మూర్తైమ్మ యను మరియొక సోదరి యుండెను. ఆయమ పెనిమిటి రాజ్యమున నొకసామాన్యదండనాయకుడుగా నుండెను. ఆయన కెచ్చటనైన పదవి నొకదానిని కల్పింప వలసివచ్చెను. కావున నీమూడు కారణములు కలసి తంజాపూరునాయకరాజ్యస్థాపనమునకు కారణజాత మయ్యెను. దక్షిణదేశ దండయాత్ర క్రీ. శ. 1535-వ సంవత్సరమున నగుటచే నీపరిస్థితులుకూడ అంత కవ్యవహితముగానే తటస్థించెననుట సమంజసము. అంతట వెంటనే తన తోడియల్లుడగు చినచెవ్వప్పనాయకుని తంజాపురము రాజధానిగా చోళమండలమునకు రాజును చేసి యం

1. Aravidu, Heras, p. 125
2. అళియరామరాయలు, పు. 60.

పెను.[1] చినచెవ్వప్ప రాజ్యమునకు వచ్చినయుదంతమును

1. "భార్యాఽభవ త్తస్య ధరాబలారేః (చినచెవ్వప్ప)
మూర్త్యంబికా మూర్తిమతీవ కీర్తిః,
ఆఢ్యా గుణై రచ్యుతరాయదేవ్యా
స్సహోదరా శ్లాఘ్యగుణప్రభావా."
(రఘునాథాభ్యుదయము, 6. 11.)

"సుగుణసంతతికి నచ్యుతరాయసతికి
తగినసోదరి కృశోదరి మూర్తమాంబ
యతనికి భార్యయై యఖిలభూపాల
సతులలో నార్యయై సన్నుతిగాంచె."
(రఘునాథాభ్యుదయనాటకము.)

"ఆమె (వరదాంబిక) చెల్లెలు మూర్తెమ్మను వివాహమాడిన చెవ్వప్పనాయనివారికి అచ్యుతదేవరాయలనారు స్త్రీధనంగా చోళ రాజ్యము దయచేసి పట్టాభిషిక్తుణ్ణిచేసి కావలసినవస్తువాహన సామగ్రిన్నియిచ్చి అక్కడికిపంపిరి."
(తంజావూరాంధ్రరాజులచరిత్రము.)

విజయవిలాసమున నీయమ పేరు తిరుమలాంబయని చెప్పబడినది.
(ఆ. ౧. ౧౧.)

ఈవరదాంబికకు తిరుమలులనుపేరుగల యిద్దరు సోదరు లుండిరి. వారే సలకముతిమ్మయ్యాకుమాళ్లగు పెద్దతిరుమల చిన్నతిరుమలసోదరులు.

శ్రీయుతులు య౯. కే. వెంకటేశ౯గారు మరియొకవిధ ముగా వ్రాయుచున్నారు.[1] అది పుక్కిటిపురాణ మగు టచే నెంతమాత్రమును విశ్వసనీయము కాదు. అందు వారు తాము గోవిందదీక్షితవంశీయులై మైసూరుసం స్థానమున నుద్యోగిగా నున్న యొక సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చెప్పిన విషయములపైనను, నింకా స్థలపురాణ గాథలపైనను నాధారపడినట్లు వ్యాసములో చెప్పియు న్నారు. వా రందు చెవ్వప్ప గోవిందదీక్షితుని పశు పాలకుడుగా నుండెనని చెప్పుటయు, చెవ్వప్ప రాజ్యము నకు వచ్చుటకు గోవిందుడే కారణభూతుడగుటయు మొదలగు విషయములు సత్యదూరములు. మిగిలిన

" సతతవిరచితానేకదానయోః, అఖిలలోకకృతబహుమానయోః, తిరుమలరాజాభిధానయోః ఉభయోః ప్రధానయోః అవరజా వరదాం బికాభిధానా వరవర్ణినీ."

(వరదాంబికాపరిణయము.)

తిరుమలులతో బుట్టువుగా నుండుటచేత నీమెను తిరుమలాం బిక యనికూడ పిల్చుచున్నట్లు కన్పట్టును. అచ్యుతరాయాభ్యుదయ మునకూడ వరదాంబికయే పేర్కొనబడినది. కావున వరదాంబికయు తిరుమలాంబయు నొక్క వ్యక్తియేయని నాయభిప్రాయము.

1. Journal of Andhra Historical Research Society Vol II, 3 & 4, pp. 222, 223.

సంగతులుకూడ పురాణగాథల ననుకరించుచున్నవి గాని చారిత్రకపరీక్ష. కాగుటలేదు. అందు కొన్ని యసూనుపవిషయములుకూడ కలవు.[1]

చెవ్వప్ప నియామక మైన కొన్ని సంవత్సరముల కచ్యుతరాయలు మరణించెను.[2] ఆయన కుమారుడు డగుచిన వెంకటాద్రిరాయలు సింహాసనము నెక్కెను.[3] పేరునకుమాత్ర మీయన చక్రవర్తియేగాని యధికారమంతయు నీయనతల్లియొక్కయు, నచ్యుతునికాలములోనే కొంతయధికారమును చలాయించుచుండిన, నీయన మేనమామలు సలకము సోదరులయొక్కయు చేతులలో నుండెను. వీరు రాజ్యముచేయుట కృష్ణరాయల యల్లుడగు నళియరామరాయలకును, తమ్ములకును నిష్టము లేకుండెను. అప్పటికి కృష్ణరాయలభార్య

1. భారతిలోని నావ్యాసములను చూడుడు.

2. క్రీ. శ. 1542; Aravidu, Heras, p. 2.

3. ఈయనను కుమారవెంకటాద్రియనియు, చిక్కవుడయారనియు పిలచుచుండిరి. Aravidu, Heras, p. 3; అళియరామరాయలు, పు. 63.

లింకను జీవించియుండిరి. వారందరు కూడి యొక జట్టుగా పెనుగొండచేరి కార్యాలోచనములు చేయసాగిరి. రాజ్యములోనిసరదార్లు కొంద రిటుప్రక్కను, మరికొంద రటుప్రక్కను చేరగా రెండుపక్షము లైయుండెను. రామరాయ సోదరులును తగినసమయమునకై వేచియుండిరి. ఇంతలో వెంకటాద్రి నిహతుడయ్యెను. పెద్దమేనమామయే చంపించెనని వదంతి కలదు.[1] ఆమరణము సరదార్లలో చాలమందికి నసంతృప్తి కలుగచేసెను. రామరాయలకు సమయము వచ్చెను. తరువాత రాజ్యమునకు రావలసినవా డచ్యుతుని తమ్మునికుమారు డగు సదాశివరాయలు. ఈయన రామరాయల పోషణములో నుండెను. రామరాయలు సమయమును గుర్తించి వెంటనే సదాశివరాయలను పట్టాభిషిక్తుని గావించి పెనుగొండలో రాజ్యమునేల ప్రారంభించెను. సదాశివరాయలు పిల్లవాడు. అందుచే రాజ్యభారమంతయు రామరాయలే నిర్వహింపవలసివచ్చెను. సలకముసోదరులు చేయునది లేక మహమ్మదీయులసాయము కోరిరి. ఎప్పుడవకాశము వచ్చునాయని కాచియుండుటచే వెంటనే

1. Aravidu, Heras, p. 7.

వా రందుల కియ్యకొనిరి. ఇంతలో సలకము సోదరులలో పెద్దవాడు చనిపోయెను.[1] రామరాయసోదరులు హండే హనుమప్పనాయని సహాయమున బీజపురము గోల్కొండ అహమ్మదునగరముసుల్తానుల నోడించిరి.[2] అంతటితో రామరాయల యధికారము సుప్రతిష్ఠితమయ్యెను.[3]

రామరాయలు మిక్కిలిపరాక్రమశాలి.[4] ఈయన బాలుడగు సదాశివరాయలపేర రాజ్యముచేసి సామ్రాజ్యమును నిష్కంటకముచేసి సర్వతోముఖముగా కొన్ని సంవత్సరములు రాజ్యమేలెను. సదాశివరాయలను కారాగృహమున నుంచి తాను పట్టాభిషిక్తుడయ్యెనని

1. ఆత్మహత్యచేసుకొనెనని హీరాసుగారి యభిప్రాయము.
Aavidu, Heras, p. 9.
రామరాయలు చంపించెనని యొకవాదముకలదు.

2. Aravidu, Heras, pp. 10, 11.

3. Sources of Vijianagar History, pp. 180, 181.

4. హీరాసుగారీయననుగూర్చి వ్రాసినవిషయములను శ్రీ. చి. వీరభద్రరావుగారు "అళియరామరాయలు" అనుగ్రంథమున సమగ్రముగా విమర్శించియున్నారు.

కృష్ణానది
కొండవీడు
బెజవాడ
కొండవీడు
గుంటూరు
తుంగభద్ర
కందవవోలు
నంద్యాల
ఉ.పెన్న
పెనుగొండ
కడప
చంద్రగిరి
శ్రీరంగపట్టణము
వేలూరు
జింజి
మైసూరు
కావేరి
ద.పెన్న
కడలూరు
తంజావూరు మండలము
దేవికోట
నాగపట్టణము
శ్రీరంగము
తంజావూరు
(Pt. Calimere)
కోడియక్కరె
మధుర
తిరువాన్కూరు
జాఫ్నా
రామేశ్వరము
తిరువనంతపురము
పశ్చిమసముద్రము
పూర్వసముద్రము
దక్షిణ మహా సముద్రము
సింహళము

నాయకరాజులకాలము నాటి దక్షిణ తీర హిందూదేశము.

హీరాసుగారు వ్రాయుచున్నారు.[1] కాని యట్టివిప్పీళ్లు మన కిచ్చట ననవసరములు. ఈరామరాయల కాలమున దక్షిణమునకు తనపితృవ్యపుత్రులగు రామరాయ విఠ్ఠలచినతిమ్మనాయకుల నంపి సామ్రాజ్యాధికారమును చలాయింపజేసెను. వీరిద్దరను దక్షిణమునకు వెడలి మధురను కేంద్రముగా చేసికొని పశ్చిమమున తిరువాన్కూరునుండి తూర్పున రామసేతువువరకు విజయనగర రాజ్యమును సుస్థిరమొనర్చిరి. సింహళమునకు కూడా పోయినట్లు సూచనలు కానవచ్చును. వీరు దక్షిణ దేశమున కొన్ని సంవత్సరము లున్నట్లు దృష్టాంతముగా క్రీ. శ. 1544—1555 వ వత్సరములమధ్యకాలమున వీరిని పేర్కొను ననేకశాసనములు కలవు.[2] వీరువచ్చుటకు ముఖ్యకారణములు రెండు: తిరువాన్కూరురాజు తూర్పునకు నొరసుకుని వచ్చుచుండెను. ఆయన నాపుటకు విశ్వానాధునిబలము చాలకపోయెను. ఇది మొదటిది. అప్పటికి

1. Aravidu, Heras, pp. 31, 32, 35.

2. 191 of 1914; 140 of 1895; 273 of 1901.

వీరిలో చినతిమ్మనాయకు డప్పయ్యదీక్షితులప్రథమపోషకుడు. యాదవాభ్యుదయవ్యాఖ్య యాయనప్రేరణముననే వ్రాయబడెను.

"తేషు మహీతేషు జయతి త్రిదివాధీశేషు పద్మబంధురివ,
శ్రీచిన్నతిమ్మరాజః ప్రతాపనీరాజితక్షమావలయః."

(యాదవాభ్యుదయవ్యాఖ్య.)

కొలదిసంవత్సరముల క్రిందట మతవ్యాపనమని సాకు పెట్టుకొని వచ్చినపోర్చుగీసువారు సముద్రతీరముల నుండు జాతులను తమమతములోనికి చేర్చుకొని వారిని ప్రక్క దేశములపైకి దోపిడుల కంపసాగిరి. వారిని శిక్షింపవలసి యుండెను. ఇది రెండవది.[1] ఈరెండు పనులను విఠ్ఠల తిమ్మలు నిర్వర్తించిరి.[2]

ఈమధ్యకాలమున రామరాయలచేతిలో నోడిపోయిన మహమ్మదీయరాజులు తమపరాభవమును మాపుకొనుటకై ప్రబలప్రయత్నములు చేయసాగిరి. రామరాయలు, మహమ్మదీయులయెడ కొంచెము క్రౌర్యము చూపెననియు, నదికూడ వారికి నూతయొసగినదనియు చెప్పుదురు. మహమ్మదీయులయలజడి హెచ్చినందున రాజ్యమునందలి దండనాయకులందరును కేంద్రమునకు పిలువబడిరి. అందువలన రామరాయవిఠ్ఠలతిమ్మనాయ

1. Sources of Vijianagar History, p. 17; Aravidu, Heras, p. 140. అళియరామరాయలు, 5 ప్రకరణము.

2. క్రీ. శ. 1546 సంవత్సరమున విఠ్ఠలునిప్రతాపమున కోడి పోర్చుగీసువారు సంధిచేసుకొనవలసివచ్చెను.

అళియరామరాయలు, 156.

కులు విజయనగరమునకు వెడలిరి. వీరు వెడలినకొలది దినములకే క్రీ. శ. 1565 సంవత్సరమున చరిత్ర సుప్రసిద్ధమై "రాక్షసతగ్డీ" యనిపేరుగల తాళికోటయుద్ధము జరిగెను.[1] తద్యుద్ధానంతరము మహమ్మదీయులు విజయనగర పట్టణమున చేసిన దుండగములన్నియు చరిత్రప్రసిద్ధములు. హిందూసామ్రాజ్యము భిన్నమయ్యెను. తరువాతకూడ సామ్రాజ్యముండెనే గాని వెనుకటి ప్రతిష్ఠ తగ్గెను. తిరుమలునికి కన్నొకటి పోయెను:[2] రామరాయలు యుద్ధమున మరణించెను.

తిరుమలరాయలు మిగిలిన రాజ్యభాగములను సమకూర్చి, విద్యానగరమునుండి పెనుగొండకు రాజధానిని మార్చి, సదాశివరాయలపేరుననే రాజ్యము చేయ

1. ఈయుద్ధమున చినచెవ్వప్ప ససైన్యుడై వెళ్లి కేంద్రమునకు సాయమొనర్చెననియు మధుర నిరాకరించెననియు కొందరు చెప్పచున్నారు.

2. "అన్నాతిగూడ హరుడవు
అన్నాతింగూడకున్న నసురగురుం డీ
వన్నా తిరుమలరాయా
కన్నొక్కటి లేదుగాని కంతుడగాదే."

(చాటుధార.)

ఈతిరుమలుని తిమ్మరాయలనికూడ పిలుచుచుండిరి.

నారంభించెను. తిరుమలుడు సంగ్రామానంతరము విద్యానగరమునకు బోయి యచ్చటనుండి బాలుని తీసుకొని పెనుగొండకు పారిపోయె నని తెలియుచున్నది:[1] బాలుని తరపున తిరుమలుడే సమస్తరాజ్యకార్యములు నిర్వర్తించుచుండెను. ఇంతలో సదాశివరాయలు నిస్సంతుగా మరణించెను.[2] కారణము తెలియకున్నది. అంతటితో తుళువవంశ మంతరించెను. తిరుమలునియందు రాజ్యరమ ప్రతిష్ఠిత మైపోయెను. రాజ్యమునందలి సరదారులు కూడ అందు కంగీకరించిరి. అంతట వేరు చేయునది లేక యాయనయే పట్టాభిషిక్తుడై చక్రవర్తిపద మధిష్ఠించెను. సామ్రాజ్యము చేతులమారుట కిది నాల్గవ పర్యాయము. ఇంతటితో సామ్రాజ్యరమ ఆర్వీటివంశమునకు వచ్చి చేరెను. తిరుమలునివంశము మొదటినుండియు వీరపురుషుల కాకరమై యిదివరలో సామ్రాజ్యమునకు మిక్కిలి సాయపడియుండెను. కృష్ణరాయలతండ్రి యగు నరస

1. Aravidu, Heras, pp. 37, 38, 39, 221.

2. తిరుమలునికుమాళ్లలో నొకరు చంపినట్లు చెప్పుదురు; Aravidu, Heras, p. 246.

3. అందుచే నళియరామరాయలకు సంతానమున్నను రాజ్యము వారికిరాలేదు.

నాయకునితోపాటు సాళువనరసింహునికి నమ్మకమైన దండనాయకులలో ముఖ్యుడగు నార్వీటిబుక్కరాయలు తిరుమలునిముత్తాత. సులభగ్రాహ్యముగా నుండుట కీయన వంశానుక్రమణిక నీక్రింద యిచ్చుచున్నాను.




తాలికోటయుద్ధమునుండి సామ్రాజ్యముయొక్క పరమాపత్తు ప్రారంభమయ్యెను. ఉత్తరపుసరిహద్దు నెల్లప్పుడును చూచుకొనుచుండవలసివచ్చెను. రాష్ట్రము లందుచే స్వతంత్రము లయ్యెను. రాష్ట్రములను తన సంపూర్ణవశమున నుంచుకొనుబలము కేంద్రమునకు లేకపోయెను. తంజావూరు యెల్లప్పుడును కేంద్రము నెడల కృతజ్ఞమై యవసరము వచ్చినపుడెల్ల సహాయముచేయుచు తనరాజబంధుత్వమును సార్థకపరచుకొనుచుండెను. విశ్వనాథునితదనంతరము మధురయొక్కదృక్పథము మారెను.

మధుర యెప్పుడు తాను స్వతంత్రమగుదునా యని సమయమునకై వేచియున్నట్లు మన మికముందు తెలుసుకొనగలము. ఎట్లో కప్పముమాత్రము కట్టుచునే యుండెను. తంజావూరుమాత్ర మన్నివిధముల సామ్రాజ్యభాగముగనే యుండెను. తాలికోటయుద్ధానంతరము విజయనగరసామ్రాజ్యచరిత్రముతో మన కంతపని లేదు. చినచెవ్వనృపతి తంజావూరున నాటుకొనిపోయెను. కప్పము చెల్లించుటతప్ప మిగిలినయన్నివిషయములందును తంజావూరు పెనుగొండలకు సోదరభావము ప్రారంభమయ్యెను.

ఈయనరాజ్యప్రారంభకాల మెప్పుడని కొంచెము చర్చింపవలసియున్నది. జిల్లాగెజెటున నిది క్రీ. శ. 1549-వ సంవత్సరమని వ్రాయబడినది. దీనికి కుప్పుస్వామిశాస్త్రిగారిగ్రంథము ప్రమాణము.[1] తంజావూరునందలి మసీదునం దున్న క్రీ. శ. 1549-న సంవత్సరమునకు సంబంధించినశాసనమున చెవ్వప్ప ప్రథమమున పేర్కొనబడినందున నిది యీయనరాజ్యప్రారంభ సంవత్సరమని వారు తెల్పుచున్నారు.[2] అంతమాత్రమున నది యీయన

1. History of Tanjore Nayak Princes, T. S. K.

2. ఈశాసనమున చెవ్వప్ప "సిన్నప్ప" నాయకుడని వ్రాయబడియున్నది.

రాజ్యవత్సరమని మాత్రమే చెప్పనగునుగాని ప్రథమ వత్సరమని చెప్పవలనుపడదు. రాజ్యప్రథమసంవత్సర మన్న రెండర్థములు స్ఫురించుచున్నవి. మొదటినియా మకసంవత్సరమా? లేక స్వాతంత్రుడైనతరువాత మొద టివత్సరమా? క్రీ. శ. 1549 సంవత్సరము దేనికిని సరి పోవుట లేదు. మొదటిది వెనుక క్రీ. శ. 1535-వ సంవ త్సరమని తెలుసుకున్నాము. హీరాసుఫాదరిగారి యభి ప్రాయప్రకారముకూడ క్రీ. శ. 1541-వ సంవత్సరము గాన, నెటుచూచిన క్రీ. శ. 1549-వ సంవత్సరము కాదని స్పష్టము. అళియరామరాయలకాలమున జరిగిన తాలి కోటయుద్ధసంవత్సరము—అనగా క్రీ. శ. 1565 వరకు కేంద్రము రాష్ట్రములపై యధికారము చలాయించుచునే యుండెను. క్రీ. శ. 1544-వ సంవత్సరమున దక్షిణము నకు రామరాయవిఠ్ఠలుడు రాజప్రతినిధిగా వెళ్లినట్లు చూచియున్నాము. ఆయన యచ్చట దాదాపు తాలి కోటయుద్ధమునకు కొన్నిమాసములకు పూర్వమువరకు నుండెనని కూడ తెలిసికొనియున్నాము. కావున రెండవది కూడ క్రీ. శ. 1549-వ సంవత్సరమునకు సరిపోవుటలేదు. ఈ చరిత్రమునందు చెవ్వప్ప నియామక సంవత్సరమే యాయనయొక్క రాజ్యప్రథమవత్సరముగా గ్రహిం

తము. ఇది క్రీ. శ. 1535-వ సంవత్సరము. ఈ యూహకు గొప్పసాక్ష్యమొకటి కలదు. మధ్యార్జున మనబడు తిరు వడమరుదూరు దేవాలయంబున మంటపముయొక్క పడ మటిగోడలో నచ్యుత దేవరాయల రాజ్యకాలమునకు సం బంధించిన శాసనమొకటియున్నది.[1] అందు "శాలివాహన శకము 1456 వెళ్లినతరువాత[2] ...న్నాయకు"నివలన నొక గ్రామము దానమొసంగబడినట్లు వ్రాయబడియున్నది. ఈస్థలము తంజావూరుమండలములోనిది. ఆస్వామికైంక ర్యము చెవ్వప్ప చేసినట్లు స్పష్టము. అరవభాషలో నీయనపే రనేకవిధముల వ్రాయబడియున్నది.[3] ఈ శాస నమునందలి యక్షరములు స్పష్టముగా లేవు. ఒక చరిత్రకారుడు "వసనన్నాయకు"డని చదివినాడు.[4] నా కవి సెవ్వన్నాయకు డని కనపడుచున్నవి. అట్లయిన నీ శాస నము చెవ్వప్పను పేర్కొనుచున్నందున నాసంవత్సర

1. 271 of 1907.

2. క్రీ. శ. 1535.

3. సెవ్వప్ప, సివ్వప్ప, సిన్నప్ప మొదలగునవి.
Journal of the Andhra Historical Research Society, Vol. II. p. 224.

4. Inscriptions in Madras Pcy, p. 1272.

మాయన రాజ్య ప్రథమసంవత్సర మని స్పష్టము. మరి యొక బసవనాయకుడనునాయన రామరాయవిఠ్ఠలుని దండయాత్రకు పూర్వము దక్షిణదేశమున నుండెనని తెలియునుగాని యాయనకును, చోళమండలమునకును నెట్టిసంబంధమును లేనందునను, దేశకాలపాత్రములను బట్టియు నిది చెవ్వప్పశాసనమని నానిశ్చితాభిప్రాయము. అచ్యుతరాయల దక్షిణదండయాత్రాకాలము దీనికి సంపూర్ణ సహకారిగా నున్నది.

చెవ్వప్పకు రాజ్యము లభించినవిధమును, జిల్లా గెజెటీరున మరియొకవిధముగా తెల్పబడియున్నది. ఈ కథనే జిల్లామ్యాన్యూలుకారు డనుసరించుచున్నాడు. ఈ యభిప్రాయముకూడా కుప్పుస్వామిశాస్త్రిగారి గ్రంథ ముపై నాధారపడియున్నది.[1] ఈయభిప్రాయమునకు ప్రాతిపదికము సాహిత్యరత్నాకరమునందలి యీక్రింది శ్లోకము:

శ్లో. పురీ మథాఽసాద్య భుజేన తాదృశీం
భుజంగమేంద్రప్రతిమేన మేదినీమ్,

1. Tanjore Dt. gazetteer, p. 38: History of Tanjore Nayak princes, T. S. K.

అసారకేయూరసమం మహాయశాః
బభార చెవ్వక్షితిపాలశేఖరః. (3. 1)

ఇందలి "భుజేన" "ఆసాద్య" యను రెండుపదముల నాధారముచేసుకొని రాజ్యమును చెవ్వప్ప తన శౌర్యపరాక్రమములచే సంపాదించినట్లు వీరు గ్రహించుచున్నారు. చెవ్వప్పదక్షిణరాజ్యము నెవ్వరిని గెల్చి సంపాదించినది తెలియము. చరిత్ర మిచ్చట సమాధాన మిచ్చుటలేదు. కవి యలంకారముకొరకును, తాను తృతీయపాదములో చెప్పబోవు "కేయూరోపమానము" నకు సమన్వయించుటకును, నుపయోగించిన పై రెండుశబ్దములపై నాధారపడి తంజావూరాంధ్ర రాజులచరిత్రాదిగ్రంథముల నమ్మకపోవుట సమంజసము కాదు. తచ్ఛ్లోకములోని పదములకు "రాజ్యమునుపొంది" యనియే సామాన్యార్థము చెప్పవలయును. దీనికి వారు కారణముగా వెనుకటి క్రీ. శ. 1549-వ సంవత్సరపు శాసనమును, క్రీ. శ. 1544-వ సంవత్సరమునందలి రామరాయవిఠ్ఠలదండయాత్రను ఉదాహరణములుగా నిచ్చుచున్నారు. ఆవిషయములు వారి కెట్లు సహకారులగుచున్నవియో తెలియకున్నది. చెవ్వప్ప నియామక మచ్యుతరాయలచే జేయబడినందులకు చరిత్రకారులందరును నేకీభవించుచున్నారు. క్రీ. శ. 1549-వ

సంవత్సరము చెవ్వప్పరాజ్యప్రథమసంవత్సరము కాదని వెనుక మనము నిర్ధారణము చేసియున్నాము. చెవ్వప్పకు స్వాతంత్ర్య మలవడనందున రామరాయవిఠ్ఠలున కాయన లోబడియుండుటలో నెట్టియసంభవమును లేదు.[1] రామరాయవిఠ్ఠలుడు రాజప్రతినిధిగదా? తంజావూరున నప్పుడెవ్వరు రాజ్యముచేయుచుండిరి? దీనికి వారు ప్రత్యుత్తర మిచ్చుట లేదు. ఇచ్చట హీరాసుఫాదిరిగారివచనములు సమంజసములు.[2] చెవ్వప్ప తనపరాక్రమప్రదర్శనముచే రాజదృష్టి నాకర్షించెననియు, తత్ఫలముగా రాజుచెల్లెలిని వివాహమాడెననియు, తన్మూలముగా తంజావూరురాజ్యమును సంపాదించెననియు చెప్పిన నన్ని సాక్ష్యములును సమన్వయ మగుచున్నవి. అప్పుడు సాక్షాత్తుగా కాకపోయినను పరంపరగానైనను చెవ్వప్ప రాజ్యమును శౌర్యముచే సంపాదించినవాడగును. "భుజేన" "ఆసాద్య" పదములు సార్థకము లగును.

1. మధురకూడ అట్లే లోబడియుండెను. విశ్వనాథుని నియామకముకూడా తరువాతనేయనియా వీరియభిప్రాయము?

2. Aravidu, Heras. p. 173.

మధురలో విశ్వనాథనాయకు డేలుసమయమున మధురతంజావూర్ల మధ్యను కొంతభూపరివర్తనము జరిగి నట్లు వెనుక సూచించియుంటిని. అప్పడు తిరుచినాపల్లి తంజావూరు రాజ్యముక్రిందిదనియు, విశ్వనాథుని ప్రజలు కొందరు తత్ప్రాంతమున నిండ్లు కట్టుకొని కాపురము చేయుచుండిరనియు, చోళదేశమునందలిదొంగలచే వీరు పీడింపబడుచు రాగా రెండురాజ్యములకు వివాదములు జరుగుచుండెననియు, నందుపై యుభయరాజ్యములు సమ్మ తించి తిరుచినాపల్లిని మధుర కిచ్చునట్లును, ప్రతిఫలముగా తంజావూరుదగ్గిరనున్న వల్లంకోటజిల్లాను తంజావూరు తీసుకొనునట్లును రెండురాజ్యములమధ్యను సంధిజరిగె నని మైలరుగ్రంథము తెల్పుచున్నది.[1] . ఈపరివర్తనము

1. "A few of his (Visvanatha's) subjects extended their residence a little way into Tanjore Dominions even as far as hill fort of Trichinopoly. * * * * As these things (Robberies by thieves in Chola Country) occured within the Tanjore boundary, there were constant disputes going on, in consequenee of demands of Visvanatha on the Tanjore for the recovery of the plundered property. Induced by such circumstances Visvanatha Naicker and Ariyanatha-Mudaliar proposed to the King of Tanjore to give up

చెవ్వప్పకాలమున జరిగినట్లు జిల్లామ్యాన్యూయలుకారుడు వ్రాసినందున నాకథకు గెజెటీరుకారుడుకూడ సమ్మతించుచున్నాడు. కొంచెము విచారించినయెడల నిది చెవ్వప్పకాలమున కాదనియు, తత్పూర్వమనియు మనకు తెలియగలదు. మైలరు గ్రంథము మధురలో విశ్వనాథుని కంఠోక్తిగా పేర్కొని తంజావూరున చెవ్వప్పను పేర్కొనకుండుట తంజావూరున నప్పటికి చెవ్వప్ప లేనట్లు ప్రబలకారణము. ఉన్నయెడల తప్పక పేర్కొనియుండును. కాని గ్రంథము తంజావూరున నొకరాజేలుచున్నట్లు చెప్పుచుండుటచే నిది చెవ్వప్పకు పూర్వ ముండు చోళరాజుకాలములోనే జరిగియున్నట్లూహింపవలెను. చెవ్వప్పకాలమున జరిగె ననుకొన్న భూపరివర్తనము చేయునంతటి స్వాతంత్ర్య మాయన కింకను లభించలేదు. భూపరి

to him the fort of Vallam and to receive from him Trichinopoly in exchange. To this proposition both parties accorded. The fort at Vallam was given up to Tanjore King and Trichinopoly to the King of Madura. Afterwards the latter expended great sums of money and there - by built a double - walled fort around Trichinopoly and dug an extension fosse or moat in front."

Taylor's O. H. Mss. p. 190

వర్తనమన్న కేంద్రమునకు తెలియకుండా చేయతగిన సామాన్య కార్యము కాదు. దాని పైన కప్పముకట్టుట కూడ ఆధారపడియుండును. కావున కేంద్రమునకు తెలిసియే జరిగియుండును. జిల్లాగెజెటుకారులు స్వాతంత్ర్యము క్రీ. శ. 1623-వ సంవత్సరము వరకు లభించనట్లు తెల్పుచున్నారు.[1] మ్యాన్యూయలుకారు లీపరివర్తనము క్రీ. శ. 1560-వ సంవత్సర ప్రాంతమున జరిగినట్లభిప్రాయ పడుచున్నారు. అది యళియరామరాయలు సదాశివ రాయల పక్షమున రాజ్యము చేయుచున్న కాలము. ఇంకను తాలికోటయుద్ధము జరుగలేదు. రామరాయ విఠ్ఠలుడు దక్షిణదేశమున రాజప్రతినిధిగా నుండెను. కావున మధుర తంజావూరులు స్వతంత్రించి సంధి చేసుకొనె నని చెప్పుట కెంతమాత్రమును వలనుపడదు. ఇచ్చట రెండువిధములుగా నూహింప నగును. చెవ్వప్ప నియామక కాలమున నుభయరాజ్యముల మధ్య నున్న కష్టసుఖములను విచారించి తద్వ్యాపరివర్తనము గావించి

1. "Independence seems to have first been actually assumed by Madura at the beginning of Tirumala (1623—1659 A. D.) and probably Ginjee followed suit." Tanjore Dt. Gazetter p. 39

యచ్యుతరాయలు చెవ్వప్పను తంజావూరు పంపియుండు ను. మధురనాయకరాజచరిత్రమున శ్రీసత్యనాథయ్యరుగా రిట్లభిప్రాయపడుచున్నారు.[1] లేదా చెవ్వప్పకు పూర్వమే చోళరాజకాలమున జరిగియుండవచ్చును. నాకీరెండవ యూహ బలవత్తరముగా నున్నది.[2] చెవ్వప్పకాలము లోనే జరిగియున్న రామరాయవిఠ్ఠలునిచే చేయబడియుం డును. కాని యీయూహ కెట్టిసహకారమును కాన రాదు. హీరాసుఫాదరిగారియూహప్రకారమైన నీవిష యము క్రీ. శ. 1539-వ సంవత్సరముతరువాత నైయుండ వలెను. అదియు నాయూహకు సహకారి. ఏలన హీరా సుఫాదరిగారు చెవ్వప్పరాజ్యప్రారంభకాలము క్రీ. శ. 1541ప్రాంతమని చెప్పుచున్నందున నీపరివర్తనము చెవ్వప్ప నియామకమునకు పూర్వము జరిగి యుండవలెను. అదియు

1. History of Nayaks of Madura, p. 52

2. క్రీ. శ. 1530-వ సంవత్సరమునకు తరువాత చోళరాజుల శాసనములు కానరావు గాన విశ్వనాథుని ప్రథమవత్సరములో కేంద్రముయొక్క సమ్మతితో నిది జరిగియుండవచ్చును.

చోళరాజో, మరియొకరాజో తంజాపురుస రాజ్యమేలు చున్న కాలమై యుండును.[1]

ఈపరివర్తనము నాధారముచేసుకొని జిల్లామ్యాన్యూలుకారు లిట్లుచెప్పుచున్నారు:

"It does not appear that the Nayaks of Tanjore were as powerful as those of Madura. None of them were, at any rate, as the two foremost of the latter Visvanatha and Tirumala. Apparently they were not enough to maintain their dominions against the constant incursions of Maravars. It was towards the early period of the dynasty, about 1560 A. D.[2] that Trichinopoly was given up to Madura in exchange for Vallam fort and district comparatively of small value"

(Tanjore Dt. Manual, p. 751)

పైయనువాదము కేవలము గ్రంథకర్తయూహాలతో నిండియున్నది. వెనుక నేతత్పరివర్తనము క్రీ. శ.

1. ఈవిషయము విశ్వనాధుడు రెండురాజ్యముల నేలెనని చెప్పువాదమును ఖండించుచున్నది.

2. "If it is correct that Sevvappa Naick ruled between A. D. 1549—1572 he must have been the King who gave Trichnopoly to Visvanatha Naick of Madura in exchange for Vallam."

Tanjore Dt. Gazetteer, p. 38.



శివగంగ కోనేరు

(చెవ్వప్ప బాగుచేసినది) ౧౨౪ పుట.



శివ్వప్పనాయని కుంట (సెవ్వప్పనేరి)
(చెవ్వప్ప నిర్మితము)

౧౩౪ పుట.

1560 సంవత్సరప్రాంతము కాజాలదని సహేతుకముగా చర్చించియున్నాను. కాబట్టి వారు చెప్పినట్లు తత్పరివర్త నము తంజావూరాంధ్రనాయకరాజకుటుంబము యొక్క బలహీనతకు తార్కాణము కానేరదు. మరియు నీభూప రివర్తనమునుగూర్చి వారుచేసినప్రసంగము యిప్పటి తిరుచినాపల్లి యొక్క విలువపై నాధారపడియుండెనని యు చెప్పనగును. వెనుక తిరుచినాపల్లికోట విశ్వనాథుడు పరి వర్తనానంతరము నిర్మించినట్లు చూచియున్నాము. అనగా పరివర్తనమునాటికి ఇప్పటియంతగట్టికోట తిరుచినాపల్లి యందు లేదని స్పష్టము. 16-వ శతాబ్దమున వల్లంకోట యెట్లుండెనో యొక మిషనరీయుత్తరమువలన తెలియ నగును. అచ్చట రాతికట్టడముగల గొప్పబలమైనకోట యుండెడిదట! ఒకకాలమున నాయకరాజు తన సొత్తును, జనానాను కాపాడుటకు వల్లంకోట నుప యోగించెనట! వల్లంకోట తంజావూరురాజ్యమున ముఖ్యమైన మూడవ పట్టణముగా నుండెనట![1] మరియు

1. "The third town in the Country was Vallam-Kottai three leagues South-east of Tanjore on a steep rock within which ramparts are erected with incredible labour and expense. By its natural position and

తంజావూరునకు మిక్కిలి దగ్గర నుండుటచే నీ పరివర్త నము తంజావూరునకు లాభదాయకమని తప్పక చెప్ప నగును. ఇప్పటికిని దుర్భేద్యమగు స్థలమును చెప్పవలసి వచ్చినపుడు "ఏమి వల్లంకోటయా" యను సామెత ఈ ప్రాంతమున వాడుకలో నున్నది. "రెండు కోటలకు ఖరీదు కట్టిన తిరుచునాపల్లి యెక్కువ విలువగలిగె నన్న" ట్లున్న యీ గ్రంథకర్త వాక్యముల కెట్టియాధారమును లేదు. ఎటు చూచిన నీ పరివర్తనము తంజావూరునకు నష్టదాయక మెన్నటికిని కాజాలదు.

తంజావూరు నాయకరాజులనుగూర్చి యీ గ్రంథ కర్తగారికి సామగ్రి యెక్కువ లభింపలేదు. వీరికందరికిని శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారి గ్రంథము శరణ్యము. అది బహుసంగ్రహము. కావున నీ నాయకరాజుల చరిత్ర అసమగ్రముగా పరీక్షించి వారిట్లు వ్రాయుటకు కారణ మయ్యెను. వారిపుస్తకమును ఇట్టి స్థితిలోనే యున్నది. మహారాష్ట్ర రాజ్యమునుగూర్చి వందలపుటలు వ్రాసిన

fortifications which art has added to it the fortress was considered impregnable * * *."

History of Nayaks of Madura, p. 270.

శ్రీ వెంకాస్వామిరావుగారు[1] నాయకరాజులను పది పుటలలో ముగించిరి. గెజటీరుకారుడు[2] మూడు పుటలలోనే ముగించెను. ఇంత స్వల్పావకాశమే వారికి సామగ్రి లేమిని వెల్లడించుచున్నది. రఘునాధునిపరాక్రమము వారికి విశదము కాలేదు. ఒక్క విషయము చెప్పిన చాలును. తుదినాయకరాజు అనగా విజయరాఘవునికాలమున తప్ప నెల్లపుడును మధురతంజావూరులకు యుద్ధము తటస్థించినపుడు మధురయే యోడిపోవుచుండెను. తిరుమలనాయకుడు తనయన్న[3] తంజావూరు రఘునాధునిచే పరిభవింపబడినను తంజావూరువంక కన్నెత్తి చూడలేకపోయెను. విశ్వనాధునికాలమున చెవ్వప్పవిశ్వనాధులు మైత్రితోనే యుండుటచే యొండొరులపరాక్రమప్రదర్శనమునకు తావేలేదు. కాబట్టి గ్రంథకర్తగారివ్రాతలు కేవలము నిరాధారములని మనవిచేయుచున్నాను.

చెవ్వనృపతికి రాజ్యమునకువచ్చునప్పటికి షుమారు ముప్పదివత్సరము లుండియుండును. బహుశః అప్పటి

1. మాన్యూలుగ్రంథకర్త.

2. హెమింగువేగారు.

3. ముత్తువీరప్పనాయకుడు (1609 – 1623.)

త్రాయనపుత్త్రివంతుడై కూడ నుండవచ్చును. ఈయన నియా
షుకము మొదలు కేంద్రము నెడల విశ్వాసమును చూపుచుం
డుటచేతనే అళియరామరాయ్ లీయననియామకమును
కదల్పలేదు. రామరాయవిఠ్ఠలుడుకూడా దక్షిణదేశము
నకు వచ్చినపు డీయనవిశ్వాసమునుగూర్చి తృప్తుడయియే
యుండవలెను. అందుచేతనే యాయనయు నీచెవ్వప్పను
కదల్పనమకట్టలేదు. మరియు నచ్యుతరాయలు విశ్వనాథు
నకు పోటీగ చెవ్వప్పను తంజావూరులో నియమించి
నపుడు ముక్కుపచ్చలారని పసివాని నియమించునా? ఈ
నియామక మెట్టిది? కప్పముండెనా? కప్పముకట్టు
పద్ధతినే. విశ్వనాథుడుమధురలో నియమింపబడెను. అట్లే
చెవ్వప్పకూడ కప్పము కట్టుచుండెను. బహువిధముల
విశ్వనాథునికంటె చెవ్వప్పకు కప్పము తక్కువయైయుం
డును. క్రీ. శ. 1611-వ సంవత్సరమున వ్రాయబడిన
యొకమిషనరీయుత్తరమున తంజావూరుమధురజింజీలు
కప్పము కట్టుచున్నట్లును, ఒక్కొక్కప్పు డాలస్యము
చేయుచు, మరియొకప్పుడు నిరాకరించుచున్నట్లును,
అట్లయినపుడు కేంద్రమునుండి దాడివచ్చుచున్నట్లును

చెప్పబడియున్నది.[1] కాని యీయుత్తరమునందు చెప్పిన విషయములు మధురజింజీలకు వర్తించునుగాని తంజాపూరునకు కాదు.ఏలన తంజావూరెల్లపుడును కేంద్రము నెడల విశ్వాసపూరితమయిమేయున్నట్లు తెలియగలదు.

చెవ్వప్ప విజయనగర చక్రవర్తులజాతికే చేరియుండెను. వంశవృక్షములను చూచిన కృష్ణరాయలవంశము చంద్రవంశమని కన్పట్టును.[2] మనుచరిత్రాదిగ్రంథపీఠికల

1. The great Nayak of Madura and those of Tanjore and Ginji are themselves tributaries of Bisnagar (Vizianagar) to whom they pay or have to pay each an annual tribute of 6 to 10 million franks, But they are not punctual in paying it, often they postpone payment. Sometimes they would refuse it with insolence. In that case the King of Bisnagar comes or sends one of his generals at the head of 10,000 men to make them pay all the arrears with interest.

—La. Mission du Madure, p. 124.

A forgotton Empire, p. 230.

2. Sources of Vizianagar History, XII.

వలనకూడ నిక్లే వీరివంశము చంద్రునినుండి యుత్పత్తియై నట్లు చెప్పబడియున్నది. క్షత్రియులని గట్టిగాచెప్ప వలను పడదు. అచ్యుతరాయలమామయగు సలకము తిమ్మయ్య తక్కువవంశస్థు (గొల్ల)డనియు, నందుచే నళియరామ రాయలకు పరిహాసపాత్రు డయ్యెననియు, నాకారణమున సైనికు లాయనను విడనాడిరనియు చెప్పెదురు.[1] కృష్ణరా యలవంశము క్షత్రియవంశమనియు, కదంబులబంధువర్గము లోనివారనియు విన్సెంటుస్మిత్తుగారు వ్రాసినారు.[2] మెడ లో జందెము లున్నట్లు కొందర నుచున్నారు. కాని




1. Sources of Vizianagar History pp. 179 & 180.
2. History of India, V. A. Smith, p. 199.

సందర్భములన్నియు నాలోచించిన వీరు శూద్రులనియే తోచును. శ్రీజయంతిరామయ్యపంతులుగారట్లే నిర్ధారణము చేసినారు. వారట్లయిన వారిబంధువులగు చెవ్వప్ప వంశముకూడ నట్లే యనుట కనుమానము లేదు. విజయరాఘవుడు శూద్రులమని కంఠోక్తిగాచెప్పుకొనెను.[2] చెవ్వప్పవంశమువారు రాజబంధువులై దండనాయకులుగా నుండిరి.[3] ఈయనతండ్రియగు తిమ్మప్పనాయకుడు కృష్ణరాయలకు కుడిభుజమై రాయచూరుముట్టడిలో నాయనకు సాయమొనర్చెను.[4] కావున చెవ్వప్పవంశ మెచ్చ

1. Journal of Andhra Historical Research Society, Vol. II, p. 215.

శాసనములలో వీరివంశమువారు "నాయకులని"యు, "నాయనింగార్లని"యు పేర్కొనబడినట్లు వ్రాసినారు.

2. "వనజాక్షుపదముల వరలువాహినికి
నునుజయై మించు నాలవజాతి జగతి
నాజాతిలో చాల నధికులైనట్టి
రాజులు కొందరు ప్రఖ్యాతి గనిరి,"

(రఘునాథాభ్యుదయ నాటకము.)

3. Aravidu, Heras, p. 173.

4. Journal of Andhra Historical Reseaıch Society Vol. II, p. 215.

టను స్వతంత్రముగా నేలిన రాజకుటుంబము కాకపోయి నను, కులగౌరవముల విజయనగర రాజకుటుంబముతో సమాన మైనదై యుండెను. ఆకారణముననే చెవ్వప్ప రాజునకు సజామాతయగుట తటస్థించెను. విజయనగర చక్రవర్తులవలెనే చెవ్వప్పవంశమువారును వైష్ణవు లై యుండిరి. కాని వారి యాస్థానమునందువలెనే తంజా వూరియాస్థానమందును నన్నిమతములకును ప్రవేశము కల్గెను.

ఇక్క నీయనవంశావతారమును చూతము. దీనిని చాలగ్రంథములు పేర్కొనుచున్నవి గాని వానిలో కొన్ని యసమగ్రముగా తెల్పుచున్నవి. రఘునాథాభ్యుదయ నాటకమును, చెంగల్వాలకాళకవికృతవిజయరాఘవవంశా వళియు నొకతరమును వదలి చెప్పుచున్నవి.[1] ప్రథమ

1. "వారిలో కృష్ణభూవరుడు లావణ్య
కారుణ్యగుణముల ఘనకీర్తి గాంచె
అమ్మహామహునకు నాత్మజుడైన
తిమ్మభూపాలుండు ధీరత వెలసె
బయ్యాంబిక వరించి ప్రౌఢి వహించె
నయ్యిరువురుగాంచి రాత్మసంభవుల
పెద్దచెవ్వభూపాలు చినచెవ్వవిభుని
పెదమల్లభూజాని పినమల్లనృపతి

మున నిచ్చిన వంశవృక్షమును చూచిన పై గ్రంథముల యందు తిమ్మభూపాలబయ్యాంబికలు - అనగా - చెవ్వప్ప తల్లిదండ్రులు పేర్కొనబడిరనియు, వారితల్లిదండ్రు లగు తిమ్మగోపమాంబలు పేర్కొనబడలేదనియు కన్పట్టును. కాని రంగాజమ్మ తనమన్నారుదాసవిలాస మున తరములనన్నిటినిచ్చుచు కొందరి భార్యాభర్తల నామములతో నిచ్చి తరువాత నుషాపరిణయమున మొగవారినిమాత్రము పేర్కొనెను.[1] ఈ రెండనువాదము

వారిలో చినచెవ్వవసుధాబలారి
మేరుధీరుండనగ మేదినిఏలెను."

(రఘునాథాభ్యుదయనాటకము.)

1. క. "ఆవంశంబున కృష్ణధ
రావరు డుదయించె నిజకరస్థితచక్ర
శ్రీవత్సలాంఛనుండై
తా వెన్నునిరీతి వారితపరాఘుండై.

క. ఆకృష్ణక్ష్మావరునకు
స్వాకృతిమకరాంకు డసమదళితపరా
నీకుడగు తిమ్మనాయడు
ప్రాకటయశు డుద్భవించె ప్రద్యుమ్నుడనన్.

క. ఆతిమ్మనృపాలునకున్
ఖ్యాతగుణాలంబ గోపమాంబకు తిమ్మ

లను పరికించిన కృష్ణభూపాలునిపుత్రుడు తిమ్మనాయకుడనియు, నాయనకు తిమ్మప్పనాయ డుద్భవించెననియు, చెవ్వప్ప యాతిమ్మప్పకుమారుడనియు తేటపడగలదు. ఇది సరిగా మొదటివంశవృక్షమునకు సరిపోవుచున్నది. చెవ్వనృపతి తరువాతివారు మనచరిత్రమునకు కథానాయకులు గాన వారినామముల నిచ్చుట యనవసరము. కృష్ణభూపాలునినుండి చెవ్వప్ప నాల్గవతరము. చెవ్వప్ప తండ్రిపేరు కేవలతిమ్మానాయకుడుగాక తిమ్మప్పనాయకు

క్ష్మాతలపతి యుదయించెను
........నాహవమున ననిరుద్ధుండై."

(మన్నారుదాసవిలాసము, ఆ. 1.)

సీ. తనరెడుమన్నారుదాసవిలాసంబు
నమర నీ వొనరించునప్పుడేము
విజయరాఘవమహావిభునివంశావళి
వినుపించితిమి కదా విశదముగను
కీర్తులు మీరిన కృష్ణభూపాలుండు
నయశాలియగు తిమ్మనాయకుండు
దివ్యతేజముగల తిమ్మప్పనాయుండు
శ్రీనిధియైనట్టి చెవ్వనృపతి"

(ఉషాపరిణయము, ఆ. 1.)

డని యొకశాసనముకూడా చెప్పుచున్నది.[1] ఈవంశము యొక్కగోత్రము మన్నారు గోత్రమని రంగాజమ్మ తనమన్నారుదాసవిలాసమున తెల్పుచున్నది.[2] అందు వలననే వీరివంశము తంజావూరు వచ్చినతరువాత మన్నారుకోయిల్‌నందలి రాజగోపాలస్వామిని తమకుః దైవతముగా చేసికొనిరి. వీ రిచ్చటకు వచ్చినతరువాతనే తత్ప్రదేశమునకు "మన్నారుకోయిల్" అనునామము పోయి "మన్నారుగుడి" యనిపేరు వచ్చెననియు, నా పేరల్లే యిప్పటికిని నిలచిపోయెననియు తద్వాసులు చెప్పుచున్నారు.[3]

---

1. 497 of 1907.

2. చ. "శ్రీవిజయాయురున్నతులఁ జెన్నలరించెదఁ గొల్చువారలన్
ధీవిభవంబు మీర నని తెల్పుచు హేమవనిం జెలంగు రా
జీవదళాయతాక్షుఁడగు చెంగమలేశుఁడు మన్ననారుగో
త్రావిబుధేంద్రుని న్విజయరాఘవచంద్రునిఁ బ్రోచుఁగావుతన్."
(మన్నారుదాసవిలాసము, ఆ. 1.)

3. ఈ"మన్నారుకోయిల్"ను "రాజమన్నారుకోయిల్" అని పిలుచుచుండిరట. మరియొక "కాటుమన్నారు కోయిల్" ఉండుట యందులకు కారణమట!

# ౨. చెవ్వప్ప నాయకుడు

## క్రీ. శ. 1535—1561

ఈయనయంత్యసంవత్సరమును క్రీ. శ. 1572-వ సంవత్సరమని శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారిపై నాధారపడి గెజెటీరు మొదలగుగ్రంథములు తెల్పుచున్నవి.[1] అంత్యసంవత్సరమన్న మరణసంవత్సరమా లేక రాజ్యాంత్యసంవత్సరమా ? ఎట్లయినను వీరిచ్చిన కాలము సరిపోవుట లేదు. వీరికి అరుణాచలమునందలి క్రీ. శ. 1572-వ సంవత్సరమునకు సరియైన శాసన మొకటి మిక్కిలి యాధారము. రెండుపక్షములను చర్చింతును. శా. శ. 1495 అనగా క్రీ. శ. 1573-వ సంవత్సరమునకు సంబంధించిన చెవ్వప్పశాసన మొకటి కలదు.[2] క్రీ. శ. 1576-వ సంవత్సరమున చెవ్వప్ప విజయాంధ్రభిక్షువను పేరుగల యొకమధ్వస్వామికి దానమిచ్చిన ట్లొకశాసనము కలదు.[3] మరియు

1. Tanjore Dt. Gazetter p. 38.
2. 497 of 1907;
3. Journal of Oriental Research, Madras, Vol. III, p. 154

1577-వ సంవత్సరమునకు సరిపోయి చెవ్వప్పను, కుమారుడగు నచ్యుతుని పేర్కొను నొకశాసనము కలదు.[1] ఇట్టియెడ క్రీ. శ. 1572-వ సంవత్సర మీయనమురణసంవత్సరమని యెట్లు చెప్పనగును? చెవ్వప్ప తనమనుమడగు రఘునాథుని బాల్యము నెరింగినట్లు ప్రబలసాక్ష్యము కలదు.[2] ఈచెప్పినది గోవిందదీక్షితుడుగాన నిది మన కవశ్యాదరణీయము. ఒకవేళ తద్గ్రంథము రఘునాథకృతమైనను మనకు సమానాదరణీయము. ఈరఘునాథుడు క్రీ. శ. 1614-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినట్లు

1. Journal of Andhra Historical Research Society. Vol. II.

2. "పూర్వం సమేతా వయః మత్ర యుష్మ
త్పితామహం చెవ్వమహీమహేంద్రమ్,
ఆశీర్భి రానందయితుం తదగ్రే
త్వయ్యావదానే ఖురలీషు ఖేలీమ్.
తదా భవంతం స విలోక్య హర్షా
దస్మా న్ముదా వాచ మిమా మవోచత్,
అస్మాక మేతేన భవే త్ప్రతిష్ఠా
భర్తుం సమర్థశ్చ స ఏవ రాజ్యమ్."
(సంగీతసుధా, ఉపోద్ఘాతము).

శ్రీకుప్పస్వామిఅయ్యరుగారే తెల్పుచున్నారు.[1] ఈరఘునాథుడు శా. శ. 1522 అనగా క్రీ. శ. 1600-వ సంవత్సరమున దానమిచ్చిన శ్లోకశాసనము కలదు.[2] కావున క్రీ. శ. 1600-వ సంవత్సరమునాటికి దానమిచ్చునర్హతయున్నదన్న తప్పక యిరువదివర్షముల వయసుకు మించియుండవలెను. అనగా క్రీ.శ. 1580వ సంవత్సరమున నీయన బాలుడై యుండి తాతయగు చెవ్వప్పకు ముదము గొల్పుచుండవలెను. రఘునాథు డింకను పెద్దవాడన్న నింకను వెనుకకు పోవలసియుండును. కావున క్రీ. శ. 1572-వ సంవత్సర మీయనమరణసంవత్సరమని చెప్పుట కెంతమాత్రము వలనుపడదు. ఇక రెండవపక్షము. శాలివాహనశకము 1482 అనగా క్రీ. శ. 1561-వ సంవత్సరమున నచ్యుతుడు దానమిచ్చినశాసన మొకటికలదు.[3] అందులకు వెంటనే సదాశివరాయలను అచ్యుతనాయకుని కలసి పేర్కొనుచున్న శాసనములు చాల కలవు.[4] అనగా నచ్యుతనాయకుడు సదాశివరాయలకాలముననే అనగా తాలికోటయుద్ధ

1. History of Tanjore Princes, T. S. K.
2. 77 of 1911.
3. 536 of 1904.
4. 567 of 1902; 25 of 1913.

మునకు వెనుకనో ముందో రాజ్యమునకు వచ్చియుండ వలెను. కావున క్రీ. శ. 1572-వ సంవత్సరము చెవ్వప్ప రాజ్యాంత్యసంవత్సరముకూడ కానేరదు. రెండుపక్షము లను సమన్వయించిన సమంజసమని తోచును. అనగా క్రీ. శ. 1561-వ సంవత్సరప్రాంతమున చెవ్వప్ప తనకుమా రుడగు నచ్యుతనాయకునిపై రాజ్యభారముంచి తాను "సుఖసత్కథావినోదంతో" కాలము గడుపుచుండియుం డును. అప్పటికి నచ్యుతునకు షుమారు ముప్పదిసంవత్స రము లుండియుండును. పెద్దవాడగు చెవ్వప్ప 1561-వ సంవత్సరమునకు తర్వాత దానమిచ్చిన ట్లున్న శాసనము లిందులకు వైరుధ్యము చూపనేరవు. ఈపక్షము సమంజస మని తరువాతియచ్యుతునిచర్యవలనకూడా తార్కా ణము చూపనగును. అచ్యుతుడును తాను పెద్దవాడైన వెనుక రాజ్యభారము తనకుమారుడగు రఘునాథునిపై నుంచి తాను శ్రీరంగమున భగవత్కైంకర్యము చేయుచు కాలము గడపినట్లు తెలియును.[1] కావున

1. "సర్వం ధైర్యవిధూతమేరువిభవే సర్వంసహాయా భరం
ప్రౌఢేఽస్మిన్ రఘునాథనామ్ని నిదధ త్పుత్రే ఽచ్యుతక్ష్మాపతిః,

చెవ్వప్ప రాజ్యారంభకాలము క్రీ. శ. 1535-వ సంవత్సర మనియు, నంత్యకాలము క్రీ. శ. 1561-వ సంవత్సరమనియు నిర్ధారణము. ఆయన షుమారు క్రీ. శ. 1580 ప్రాంతమున చనిపోయియుండును. హీరాసుఫాదరిగారును నట్లే యభిప్రాయపడుచున్నారు.[1] క్రీ. శ. 1572-వ సం॥ మునకు సంబంధించిన శాసన మిందులకు ప్రతిబంధకము కానేరదు. క్రీ. శ. 1561-వ సంవత్సరమునాటికి కుమారుడగు నచ్యుతునకు షుమారు ముప్పదివత్సరము లుండియుండును.

చెవ్వనృపతికి పూర్వము రెండుశతాబ్దములక్రిందటనే అనగా కంపరాయలకాలముననే యుత్తరమునుండి దక్షిణమునకు తెనుగువారియొక్కయు, కర్ణాటకులయొక్కయు వలన ప్రారంభమయ్యెను. అప్పటినుండి దక్షిణమునకు దండయాత్రవచ్చినపు డెల్ల వారితో కొన్ని తెలుగువారి కుటుంబములు వచ్చుట తటస్థించి తుదకు చెవ్వప్ప విశ్వనాథులకాలముననను, తరువాతను మిక్కిలిగా వచ్చిరి.

శ్రీరంగస్థలసంగతో బుధకులం శీతాంశు రుర్వీమిమ
ప్రాప్త స్సైవ పుపోష శేషశయనే భక్తః పరే ధామని.
(సాహిత్యరత్నాకరము, 12.94).

1. Aravidu, Heras, p. 287.

వీరు బహుసంఖ్యాకులు సకుటుంబులుగనే వచ్చి యిచ్చట నిలచిపోయిరి. ఆంధ్రులకును నరవలకును నొకపెద్ద భేదము కలదు. అరవ లుద్యోగముకొరకు పరదేశము వచ్చినను తదవసరము గడచినవెనుక కూర్చుకొనిన విత్తమును గొని స్వదేశమునకు వెడలుట వారి సహజగుణము. ఇందు వా రాంగ్లేయుల బోలియున్నారు.[1] వారికి స్వదేశాభిమాన మెందు. ఆంధ్రు లట్లుగాక పాలకదేశమును స్వదేశముగా గొని నిలచిపోయిరి. అందుల కిప్పుడు హిందూదేశమున మధ్యపరగణాలు, బంగాళము, బొంబాయి రాజధానులలోనున్న యసంఖ్యాకులగు నాంధ్రులే తార్కాణము. అట్లే దక్షిణదేశమునకూడ తెలుగువారు నిలచిపోయిరి.

ఇట్లు వచ్చినవారియం దన్నిజాతులవారు, వృత్తులవారు నున్నట్లు తెలియుచున్నది. పందొమ్మిదవ శతాబ్ది మధ్యమున తంజావూరుజిల్లాయందలి యాంధ్రులు సుమా రొకటిన్నరలక్షసంఖ్య యుండునని జిల్లామ్యాన్యువలు కారుడు వ్రాసినాడు.[2] అప్పటికే యంతమంది యున్నప్పు

1. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము, పు. 10.
2. Tanjore Dt. Manual, pp.176, 177,183,184,186.

డిప్పటికి నాసంఖ్య రెట్టింపయియుండవచ్చును. వీరిలో రాచవారు, కోమట్లు, వడుగార్లు, జెట్టీలు, తెనుగు వ్యాపారిశెట్లు, సాతానులు, కంసాలులు, మంగళ్లు మొదలగు నన్నిజాతులవా రున్నట్లు కన్పట్టును. బ్రాహ్మణులు కూడ ననేకకుటుంబము లున్నవి. వారిలో వైదికులు, నియోగులు, మురికినాడు, కాసలనాడు మొదలగుభేదములవారు కలరు.[1] వీరిలో చాలమంది కొంచెమో గొప్పయో భూవసతులుకూడ సంపాదించిరి. వివాహాది సంబంధములందును, గృహభాష మాటలాడుటయందును మాత్రము వీరు పార్థక్యమును నిలుపుకొనియున్నారుగాని మిగిలిన యన్నివిషయములయందును నరవలలో కలసియే పోయిరి. మాతృభాష ననేకకుటుంబములు వాడుకభాషగా తప్ప చదువుటకు వ్రాయుటకు నుపయుక్తముచేసియుండలేదు. కాని వీరందరు నాంధ్రులగౌరవమునుకాపాడి నమ్మకమునందును సౌజన్యమునందును మన్ననలను బడసియున్నారు.[2] తంజావూరుపట్టణమున నరవలతరువాత

1 "Among the foreign Brahmans ** the Telugus are the most numerous." Tanjore Dt. Manual, p. 166.

2. "On the whole the Telugu Brahmans are a quiet and respectable class." Ibid p. 170.

తెనుగువారే యధికసంఖ్యాకులు. ఈప్రాముఖ్యమే యి చ్చటిసరస్వతీమహాలునందలి పుస్తకములవిషయమున కలదు. సంస్కృతముతరువాత తెనుగుభాషయందే యధికసంఖ్యాకములగు గ్రంథములు కలవు.[1] అరవదేశ మునందలి భాండాగారమున నిట్లుండుట యొకవింతగా తోచును.

ఇట్లు వలసవచ్చినవారిని పరిశీలించిన నుత్తరమున గుంటూరుమండలమునుండికూడ వచ్చినట్లు కన్పట్టును. వీరిలో కొందరు రాజులకడ గొప్పయుద్యోగముల నుండిరి.[2] "గుంటూరి యయ్యపరుసునారప్ప" యను నాయన రఘునాథునివద్ద కార్యదర్శిగా నుండెను.[1] ఇట్లే "రాయసము" యింటిపేరుగాగల యొక కుటుంబము

1. Paper read by Prof. P. P. S. Sastri, before the Oriental Conference. p. 3.

2. "శ్రీమన్మహా చోళసింహాసనేంది
రామనోహరులైన రఘునాథరాయ
లయ్యవారికి యుత్తరాదిగుంటూరి
యయ్యపరుసు నారప్ప విన్నపము
లంచిత........................"

(రఘునాథాభ్యుదయ నాటకము.)

గొప్ప యుద్యోగములో నుండెను. ఈకుటుంబములోని వెంకన్న తరువాత నాయకరాజ్యనిర్మూలనమునకు సూత్రధారిత్వమును వహించినట్లు తెలుసుకొనగలము.[1]

చినచెవ్వప్ప విద్యానగరరాజబంధువు డగుటచే తదాస్థానమర్యాదల నన్నిటిని తంజావూరాస్థానమున నెలకొల్పెను. ఇందు మతసామరస్యమును, కవిపండితపోషణమును ముఖ్యములు. చెవ్వప్పవంశమువారును విద్యానగరచక్రవర్తులవలెనే యభినివేశమున వైష్ణవులు. కాని వారియాస్థానమున నన్ని మతములవారికిని గౌరవ ముండెడిది. ఈచెవ్వప్ప మహమ్మదీయఫకీరుల పోషణార్థమై కొంతభూమిని దాన మొసంగినట్లు శాసనము కలదు.[2]

1. తంజావూరాంధ్రరాజుల చరిత్ర.

"రాయసము" అను పదము పౌరుషనామధేయమనియు నొక యుద్యోగము (Secretary) నకు పేరనియు చెప్పుదురు.

(History of Nayaks of Madura p. 237)

కాని యట్టి యింటిపేరు కలవా రాంధ్రదేశమున ననేకులు కలరు. ఒక సుప్రసిద్ధకుటుంబము దక్షిణదేశమున నున్నట్టు కొన్ని యముద్రితగ్రంథములవలన తెలియుచున్నది. రాయసము వెంకటాద్రి యను పండితప్రకాండుడు స్మృతికౌస్తుభ మను నొక ధర్మశాస్త్రగ్రంథమును రచియించెను. కృష్ణరాయలవద్ద రాయస ము కొండయ్య యను కొండమరుసు సేనాపతియైయుండెను.

(రాయవాచకము)

2. History of Nayak Princes, T. S. K.

విజయీంద్రభిక్షువను నొకమధ్వాచార్యు డీయనచే గౌర
వింపబడి యాయనవద్దనుండి యరివిలిమంగల మను నొక
గ్రామమును దానముగా బడసెను.[1] ఈయన తుదిదిన
ములలో సంస్థానమున గోవిందదీక్షితుడను నొక
యద్వైతవిద్యాచార్యుని మంత్రిగా నియమించెను.
చెవ్వప్ప హైందవమతములకే కాక క్రైస్తవమతమునకు
కూడ సంస్థానమున తావిచ్చినట్లు కన్పట్టును. ఈయన
కాలమునాటికి పోర్చుగీసువా రీయత్యంతదక్షిణప్రాంత
మున మతవ్యాపనమునకు వచ్చినట్లును, వారిని శిక్షించుట
యొకయుద్దేశ్యముగా రామరాయవిఠ్ఠలుడు వచ్చినట్లును
వెనుక తెలిసికొనియున్నాము. వీరు చేయు సంస్థానవిరోధ
కార్యములకు వీరు దండింపబడిరి. కాని చెవ్వప్ప వారి
సామాన్యమతవ్యాపనమున కెట్టియభ్యంతరమును కలిగిం
చియుండలేదు. క్రీ.శ. 1550 ప్రాంతమున మధుర మొదలగు
స్థలముల తమమతవ్యాపనమునకై వచ్చిన జేవియ[2]రను
మిషనరీని నాగపట్టణముతరువాత నాకర్షించెను. అప్పటి

1. Ep. Indica., XII, p. 357.
Aravidu, Heras, p. 521; Journal of Oriental Research, Madras. Vol. III, p. 154.

2. Xavier.

కింకను పోర్చుగీసువారికి రాజ్యసంపాదనకాంక్ష పూర్తిగా పొడమియుండలేదు. అందుచేత స్వదేశరాజులకు వీరియం దాగ్రహము కలుగకుండెను. ఎప్పు డట్టివాంఛ కలిగి వీరు ప్రవర్తింప మొదలిడిరో యప్పుడు వీరు శిక్షింపబడు చుండుట తటస్థించెను. చెవ్వప్పకాలమున అనగా క్రీ. శ. 1560 ప్రాంతమున తంజాపూరుపట్టణమున క్రైస్తవులకు సౌకర్యములు చేయబడినందున వీరు ఇండ్లు కట్టుకొని కాపురము చేయుచుండిరని తెలియుచున్నది.[1] చర్చిలు కట్టుకొనుటయు మొదలగుపనులు రాజాదరణము లేక పోయిన సాధ్యములగునా? ఇంతకంటె ఆయన మతసహిష్ణుత్వమునకు తార్కాణ మేల?

చెవ్వప్పజీవితకాలమున జరిగినయంశములలో గొప్పది గోవిందదీక్షితుని మంత్రిత్వనియామకము. ఇచ్చట శ్రీయుత. కే. వెంకటేశ్వరగారి వ్రాతను కొం

1. "This citie (Tanjore) belongeth to a nobleman of the Kingdom of Biznagar being a gentile: nevertheless the Portugals and other christians are well in treated here and have churches there with a monastery of St. Francis, order with great devotion, and very well accomodated with houses round about.' (Tanjore Dt. Gazetter p. 56.); Aravidu, Heras p. 174'.

చెము విమర్శింతును. వారు గోవిందదీక్షితుడు చెవ్వప్ప కంటె పెద్దవాడనియు, నాయనవద్ద చెవ్వప్ప పశుపాలకుడుగా నుండెననియు, గోవిందునివలననే చెవ్వప్ప రాజబంధువుడై తుదకు తంజావూరున నియమింపబడెననియు మొదలగువిషయములను వ్రాసియున్నారు.[1] ఈగోవిందదీక్షితుడు హోశనికర్ణాటబ్రాహ్మణుడు.[2] విద్యారణ్యులు గూడ నీశాఖకు సంబంధించినవాడే. గోవిందుడు విద్యానగరమునుండి వచ్చినమాట నిజము. కాని వారు చెప్పు మిగిలిన యంశములకు చరిత్రాధారము లేకపోవుటయె కాక యవి చరిత్రవిరుద్ధములుగా నున్నవి. ఆవిషయములు నిజములైనయెడల గోవిందుడు చెవ్వప్పకంటె పెద్దవాడై యుండవలెను. చెవ్వప్ప క్రీ. శ. 1580-వ సంవత్సరప్రాంతమున చనిపోయియుండునని వెనుక విన్నవించియుంటిని. చెవ్వప్పకు రాజ్యమునకు వచ్చునప్పటికి షుమారు 30 సంవత్సరములకు మించి యుండవలె ననికూడా చెప్పితిని.

1. Journal of Andhra Historical Rescarch Society, Vol. II, pp. 220—241.

2. Bhattachintamani by Vanchesvarayajvan, 1ntroduction.

హోశని, లేక హోసల యని రెండు పాఠములు.

రాజ్యప్రారంభకాలము క్రీ. శ. 1535-వ సంవత్సరమునకైన చనిపోవునాటికీయన సుమారెనుబది వత్సరములవాడై యుండును. పౌత్రుడగు రఘునాథుని బాల్యమునుకూడ చూచినట్లు ప్రబల సాక్ష్యమును కలదు.[1] అప్పుడీయన కంటె గోవిందుడు పెద్దవాడుగా నుండునెడ నాయన చెవ్వప్ప చనిపోవునాటికే శతాయువై యుండును. ఏలన చెవ్వప్పబాల్యమునాటికే గోవిందుడు దీక్షితుడై యగ్నిహోత్రముల నాచరించినట్లు శ్రీవెంకటేశ్వర్లుగారు చెప్పుచున్నారు. గోవిందుడు చెవ్వప్ప చనిపోయినతరువాత రఘునాథుని రాజ్యాంతము వరకు జీవించియుండెననికూడా చెప్పుచున్నారు. వీరు చెప్పుటయెకాక గోవిందుడు క్రీ. శ. 1616 ప్రాంతమున జరిగిన తోపూరుయుద్ధమువరకు జీవించినట్లు చరిత్ర ప్రసిద్ధము. రఘునాథుడు తద్యుద్ధమునకై వెడలునపుడు యావద్రాజ్యభారమును గోవిందుని భుజములపై నునిచి వెడలెనని యజ్ఞనారాయణదీక్షితుడు చెప్పుచున్నాడు.[2]

1. వెనుక చూడుడు.

2. సాహిత్యరత్నాకరము, 13-84.

ఈవాక్య మవశ్యాదరణీయము. అట్లయిన క్రీ. శ. 1616-వ సంవత్సరమునాటికి గోవిందుడు యావచ్చోళమండలమును నేలగల శరీరమనోదార్ఢ్యములు కలిగియుండవలెను. అనగా చెవ్వప్పకంటె దాదాపు 40 వత్సరములు గోవిందు డెక్కువజీవించుటయెకాక, యప్పుడు రాజ్యభారము వహించుసామర్థ్యవంతుడై యుండవలెను. గోవిందుడు 135 సంవత్సరములు జీవించెనని చెప్పుట కెట్టియాధారములు లేవు. మరియు నియ్యది విరుద్ధమై యున్నది.[1] కావున చెవ్వప్ప జీవించియుండగా కుమారుడు రాజ్యభారమును వహించుకాలమున గోవిందుని మంత్రిత్వనియామకము జరిగినట్లు చెప్పుట సమంజసమని తోచును. అట్టియెడ నన్నివిషయములు సరిగా సరిపోవుటయెకాక గోవిందుడు మూడుతరములనాయకరాజులకాలమున కంటియుండును. ఇయ్యది చారిత్రకసిద్ధము. దీనికి శాసనాధారముకూడ కలదు.[2] తంజావూరునాయకరాజ్యముయొక్క యత్యుచ్ఛ

1. 'భారతి' యందలి ముద్రచితవ్యాసములను చూడుడు.

2. క్రీ. శ. 1577 సంవత్సరమునకు సంబంధించిన శాసనములో నీయనయు చెవ్వాచ్యుతులును నొక్కచోట పేర్కొనబడినారు.

స్థితి రఘునాథుని రాజ్యకాలమును గోవిందుని మంత్రిత్వ కాలము నైయున్నది.

ఈయన వేదవేదాంగపారంగతుడును, నధీతసకల శాస్త్రుడును, కృతసమస్తయాగుడును, రాజనీతిధురీణు డును, బహుగ్రంథనిర్మాతయు నగు స్మార్తబ్రాహ్మణుడు.[1] కొన్ని శాసనముల నీయన "అయ్యన్" అనుపేరుతో వాడబడుచున్నాడు. ఆకారణముచేత నీతంజావూరునం

విజయరాఘవుని (నాల్గవనాయకరాజు) యభివృద్ధికిగానుగోవింద దాసుడను నాయన దానమిచ్చినట్లు శా. శ. 1566 అనగా క్రీ. శ. 1644 సంవత్సరమునకు సంబంధించిన యొకశాసనము కలదు.

(614 of 1909).

ఈ గోవిందుడే మన గోవిందమంత్రియనినయెడల నాయన 150 సంవత్సరములు జీవించియుండును. మరియు నీయన గోవింద దాసుడని యెచ్చటను పేర్కొనబడి యుండలేదు. కాన నాగోవింద దాసుడు మరియొకడని నిర్ధారణము.

1. "అద్వైతవిద్యావిభవావలంబాన్
గోవిందయజ్వేంద్ర సురాసుపాసే,
నిర్మత్స్య మద్దర్శన నీరధీన్ యే
ధియైవసారాన్ దదతే బుధేభ్యః."

(సాహిత్య రత్నాకరము 1. 13)

దును తత్ప్రాంతమునందును గల "అయ్యర్ పేట", "అయ్యర్ కడై", "అయ్యర్ కొళము" అనునవియన్నియు నీయనతో సంబంధము కలవని చెప్పుచున్నారు.[1] ఈయన "అయ్యర్" అనిపిలువబడుచుండుట నిజమేగాని తత్పదము గౌరవపదముగా గొప్పవిద్వాంసుల కనేకుల కుపయోగ పడుచున్నట్లు కన్పట్టును.[2] ఆకారణముచేత తన్నామము గలయన్నిటితో నీయనకు సంబంధము కల్పించుట పూర్తిగా సమంజసము కాదని తోచుచున్నది. తంజావూరు పట్టణమునందలి రెండుసంస్థలనుమాత్ర మీయన పేరుతో కలుపవచ్చునని నాయభిప్రాయము. ఈయనమంత్రిత్వ కాలమున తంజావూరురాజ్య మెదిరీలకు దుర్నిరీక్ష్యమై తత్కీర్తిచంద్రికలు దిగంతవిశ్రాంతము లయ్యెను. ఈయననుగూర్చి సంపూర్ణవివరము లిచ్చుట కిచ్చుట తావుచాలదు.

చెవ్వప్పకు రాజ్యము భార్యద్వారమున వచ్చినందున యంబేద యనుకొనుటకు వలనుపడదు. ఈయన

1. Journal of Andhra Historical Research Society, Vol. II, pp. 224, 236.

2. Taylor's O. H. Mss. Vol II. p. 149.
"అప్పాదీక్షిత అయ్యర్, అయ్యాదీక్షితఅయ్యర్."

రామరాయవిఠ్ఠలునితో సింహాళమునకు వెడలినట్లును నచ్చట తనపరాక్రమప్రదర్శనము గావించినట్లును తెలియుచున్నది.[1] ఈయనకాలమున తంజావూరునకును, మధురజింజీలకును నెట్టి యుద్ధములును జరుగలేదు. యుద్ధములచే దేశమంతయు విసిగి వేసారియుండుట చేతను, దక్షిణమునందలి రాజులందరును విజయనగర మండలపాలకులై యుండుటచేతను పరస్పరము వీరికి యుద్ధ మనవసరమయ్యెను. తాలికోటయుద్ధానంతరము మాత్రము మధురజింజీలకు కేంద్రముతో సంబంధమును త్రెంచుకొని స్వతంత్రులమగుద మనునుద్దేశ్యము పొడమి నట్లు కన్పట్టును. కాని చెవ్వప్పయు నాయనసంతతి వారును నట్టియూహ నెన్నడును తలపెట్టలేదు. తుది నాయకరాజుమాత్ర మీకృతజ్ఞతనుండి కొంచెము చ్యుతుడయ్యెను. అప్పుడే రాజ్యనాశనబీజములు నాటబడెను.

1. "చినచెవ్వయభూప శేఖరేణ
ప్రథితే నాచ్యుతభూమిపాలకేన;
మకుటాభరణం మమైవ వంశాః
రఘునాథక్షితిపాల రక్షితా 'స్తే."

(రఘునాథాభ్యుదయకావ్యము 8. 16)

చెవ్వప్పకాలమున దేశము సుభిక్షమై యెట్టియీతిబాధలు లేకుండెను. ప్రజలు చల్లగ కడుపులోనిచల్ల కదలకుండ కాలము గడపిరి.

చెవ్వప్ప నాగపట్టణమున నున్న పోర్చుగీసుమిషనరీలను బాధపెట్టినట్లు గలదు.[1] వెనుక మనము తెలిసికొన్నదాని కిది విరుద్ధముగా నున్నది. మిషనరీలకు సాయమొనర్చినట్లును, స్థలములు మొదలగువానిని గూడ నిచ్చినట్లును చూచియున్నాము. పోర్చుగీసువారికి క్రమముగా ధనార్జన మెచ్చుకాజొచ్చి, వీరు తమగృహాములను బలపరచుకొని కోటలవలె నిర్మింపసాగిరి. ఇది రాజునకు సరిపడకపోయెను. వీరు క్రీ. శ. 1565 ప్రాంతమున నరేబియానుండి గుఱ్ఱములనుకొన్నింటిని దిగుమతిచేయగా చెవ్వప్ప వానిని తమ కియ్యుమని కబురంప వారందులకు నిరాకరింప నాయనకు కోపమువచ్చి వారిపైన దండువెడలి వానిని బలవంతముగా గొనెను. ఈస్వల్పవిషయము చెవ్వప్ప మిషనరీలను బాధపెట్టె నని చెప్పుటకు చాలదు.

చోళదేశము దొంగలకు ప్రసిద్ధమని వెనుక మనవి చేసియుంటిని. ఇట్టిప్రాంతములలో కొంతదేశభాగము

1. Tanjore Dt. Gazetter, p. 244.

వెనుకటి భూపరివర్తనమున మధుర క్రిందకు బోయెను. కాని యింకను కొంత యుండెను. దొంగలను ప్రత్యేకము రాజు శిక్షించుటకు వీలులేక చెవ్వప్ప యొక తెలివిగల పని నొనర్చెను. "వజ్రం వజ్రేణ భిద్యతే" యను నార్యోక్తి ననుసరించి యాయన వారిలో పలుకుబడికలవారిని విడదీసి వారికి జాగీర్లిచ్చి వారిని దేశశాంతికి బాధ్యతగల వారిగా నొనర్చెను. వారు దొంగలనాయకు లగుటచే దొంగలకు దుండగముల సాగించుటకు వీలులేకపోయెను. ఈపద్ధతి సఫలమయి దేశమంతయు దాదాపు చోరుల బారినుండి యుద్ధరింపబడెను. ఇప్పటికి నిట్టిభూస్వాములు కలరు. తంజాపూరునకు దక్షిణమున పుదుక్కోట సరిహద్దున నున్న గంధర్వకోట (Gandaravakkottai)యను జమీ నిట్టిదే.[1] ఇట్లు చోరు లణచివేయబడిరి.

ఈయన వదాన్యత్వమున మిక్కిలి ప్రసిద్ధి వడసెను. దేవాలయములను గోపురములను నిర్మించెను. తటాకములను త్రవ్వించెను. అనేక బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నిచ్చెను. పన్నులు వసూలుపరచుటలో జాగరూకతగలవాడై బీదవారలను పీల్చి పిప్పిచేయక న్యాయపథ

1. Tanjore Dt. Gazetter, p: 262.

మున నడచెను. తంజావూరునందలి శివగంగకోటను బలపరచి యందలికోనేటికి సర్వదా నీటిని సప్లయిచేయుటకుగాను తనపేరుతో తంజావూరుపట్టణమునకు బయట నొకపెద్దచెరువును త్రవ్వించెను. దాని నిప్పటికిని సెవ్వప్పనాయనికుంటయని పిలుచుచున్నారు (Sappaneri-resorvoir) [1]. ఇది యిప్పుడు వాడుకలో లేదు. ఈశివగంగకోట యనునది చోళనిర్మితము. అందు వెనుకటిచోళరాజుల కట్టడములశిథిలభాగము లిప్పటికిని కలవు. ఈశివగంగకోట బృహదీశ్వరాలయమునకు ప్రక్కన నున్నది. ఆలయమునుండి కోటలోగుండా శివగంగలోని నీరు గొంపోవుట కుపయుక్తమైనద్వారము కలదుగాని యది కొన్నివందల వత్సరములనుండి యనుపయుక్తమై యుండనోపు. ఈకోటయందలి కోనేటినుండియే యనాదినుండియు పట్టణమువా రందరును మంచినీటిని గ్రహించుచుండిరి. కొళాయిలు పెట్టబడియున్న యిక్కాలంబునగూడ నిందుండి త్రాగునీళ్లను గ్రహించుజనులు గలరు. చెవ్వ

1. Tanjore Dt. Gazetter, p. 38.
Sources of Vizianagar History, p. 335.

ప్పవియని చెప్పువిగ్రహములు మూడు దేవాలయముల నున్నవి. కాని యవి యీయనవి యని చెప్పనాధార ములు చాలవు. వీనిలో ముఖమున నున్న నామధారణ మును శిరోవేష్టనము నీయూహకు కారణములు. ఈయన చేసిన దేవాలయాదినిర్మాణములను తెలియజేయు గ్రంథ భాగముల ననువదించి యీయన నింతటితో వదలుదును.

శ్లో. కర్ణాటసింహాసనకార్యధుర్యః
పరాక్రమాక్రాంతపరావనీకః,
[1]శోణాద్రినాథస్య చ చెవ్వభూపో
నిర్మాయ చత్వార్యపి గోపురాణి.

ప్రాకారపంక్తీ ర్నవమంటపాని
తటాకదివ్యోపవనాని భూయః,
గ్రామా ననేకా నుపకంఠసీమ్ని
దత్త్వా విచిత్రాణిచ భూషణాని.

రథా ననేకా న్విరచయ్య రమ్యాన్
చక్రే మహారాజవిభూతి మస్య,
న కేవలం శోణగిరీశ్వరస్య
కైంకర్య మేవం కృతవాన్ స భూపః.

1. అరుణాచలమని పేరుచే సుప్రసిద్ధమగు తిరువణ్ణామల.



శివగంగకోటలోని శిథిలములు ౧౨౮ పుట,

ష్పవియని చెప్పువిగ్రహములు మూడు దేవాలయముల నున్నవి. కాని యవి యాయనవి యని చెప్పనాధార ములు చాలవు. వీనిలో ముఖమున నున్న నామధారణ మును శిరోవేష్టనము నీయూహకు కారణములు. ఈయన చేసిన దేవాలయాదినిర్మాణములను తెలియజేయు గ్రంథ భాగముల ననువదించి యీయన నింతటితో వదలుదును.

శ్లో. కర్ణాటసింహాసనకార్యధుర్యః
పరాక్రమాక్రాంతపరావనీకః,
[1]శోణాద్రినాథస్య చ చెవ్వభూపో
నిర్మాయ చత్వార్యపి గోపురాణి.

ప్రాకారపంక్తీ ర్నవమంటపాని
తటాకదివ్యోపవనాని భూయః,
గ్రామా ననేకా నుపకంఠసీమ్ని
దత్త్వా విచిత్రాణిచ భూషణాని.

రథా ననేకా న్విరచయ్య రమ్యాన్
చక్రే మహారాజవిభూతి మస్య,
న కేవలం శోణగిరీశ్వరస్య
కైంకర్య మేవం కృతవాన్ స భూపః.

1. అరుణాచలమని పేరుచే సుప్రసిద్ధమగు తిరువణ్ణామల.



పంచనద క్షేత్రము–కావేరినది

౧౧౯ పు.

ఏకామ్రనాథస్యచ[1] దీర్ఘశైల[2]
నివాసిన శ్చాపి రఘూద్వహస్య,
వృద్ధాచలేశస్య[3] సమస్త మేతత్
ప్రాకారముఖ్యా న్వ్యతనో ద్విశేషాత్.
శ్రీశైలనాథస్య[4]చ వేంకటాద్రి[5]
నివాసినః పద్మవిలోచనస్య,
హైమం విమానం విరచయ్య హార్దా
దన్యచ్చ కైంకర్య మసా వతానీత్.
చోళే ష్వయం కిం బహునా నరేంద్రః
స్థానేషు సర్వేషు హరే ర్హరస్య,
ప్రాకారసౌధప్రముఖా ననేకాన్
నిర్మాయ ధర్మా న్ముముదే నరేంద్రః.[6] "

1. కంచి ఏకామ్రేశ్వరుడు.
2. తిరుప్పేణుపెరుందురై.
3. వృద్ధాచలము. ఇప్పు డిది విల్లుపురమునుండి తిరుచినాపల్లి పోవు కార్డ్ రైల్వేదారిలో నున్నది.
4. కర్నూలుజిల్లాలో నున్నది.
5. తిరుపతి.
6. సంగీతసుధా (28-33).

"శోణాద్రినాథం సుపదా స్సమేత్య
పురా సమస్తా స్సుకరం భజంతామ్,
ఇత్యేవ యో హేమమయం మహేంద్ర
పురాతిగం గోపుర మాతతాన.

వియత్తలే యో విబుధాగసీమ్ని
నిత్యం నటంత్యాం నిజకీర్తినట్యామ్,
స్తంభం యథా వృద్ధగిరా చకార
స్ఫురన్మణీగోపుర మిందు మౌళేః.

శ్రీశైలనాథస్య సితాంశు మౌళేః
ప్రాకారసోపానపరంపరాఢ్యః,
స్వనామచిహ్నై స్సకలోపచారై
శ్చక్రే స్థిరం యో నృపసార్వభౌమః.

మహాంతి దానాని మరుద్వృధాయాః
తటాంతికే దైవతమందిరాణి,
మహాగ్రహారాంశ్చ మహీమహేంద్ర
శ్చకార య శ్శాశ్వతధర్మకేతుః."[1]

1. రఘునాధాభ్యుదయకావ్యము. స. 6, 7–10.

"సీ. శ్రీశైలమందున చిరతరంబుగఁ గూర్చె
ప్రాకారసోపానపాళి వెలయ
వృద్ధాచలంబున విశ్రుతస్థితి నిల్పె
ప్రాసాదమంటపగ్రామసమితి
నరుణాచలంబున నలవరించెను మించ
గోపురసంఘర్షి గోపురములు
గోపర్వతమున[1] నెక్కుడుగాగ నవరించె
పూజావిశేష మపూర్వముగను
నతులమ్మష్టాన్నదానకన్యాప్రదాన
బహుతటాకసదారామపంక్తి వెలయ
ధరణి వెలయించె తనమహౌదార్యమహిమ
తిమ్మభూపాలు చెన్వధాత్రీవిభుండు."[2]

"ఆయన (చెవ్వప్ప) అరుణాచలంలోను వృద్ధాచలంలోను అనేకగోపురప్రాకారమంటపాదులు నిర్మించి, తంజావూరులో శివగంగకోట కట్టించి, తన పేర 'సెవ్వప్పనాయని కుంట' అని తటాకం తవ్వించి, దేవాలయబ్రహ్మాలయాలకెంతో స్థితులు కలుగజేసి బహుదినములు రాజ్యమేలెను.[3]"

1. వృషభాచలమా ?
2. విజయరాఘవవంశావళి ; రాజగోపాలవిలాసము.
3. తంజావూరాంధ్రరాజుల చరిత్రము.

క. "ఆచెవ్వనృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచి[1] యరుణాచలవృ
ద్ధాచలములఁ గట్టించె మ
హాచతురసమీరగోపురావరణంబుల్."[2]

ఈయనయొక్క ప్రతిమ యొకటి తంజావూరునందలి పెద్దదేవాలయమున నున్నదందురు. నేను దానిని చూడ నదియేదియో సామాన్యపువిగ్రహమువలె నున్నదిగాని మరి కాదు. కాని యది చెవ్వప్పవిగ్రహమని వాడుకమాత్ర మున్నది. తలపై నుష్ణీషము నున్నది. నామము కలదు. ఇట్టిప్రతిమయే దక్షిణవీథియందలి విఘ్నేశ్వరాలయమున నున్న దనగా దానినికూడ పోయి చూచితిని. అది మొదటి దానికంటె భిన్నముగా నున్నది. అదియు నొకవైష్ణవభక్తుని ప్రతిమయేకాని యచ్చటి శాసనము మిక్కిలి తరువాతది యగుటచే దానితో చెవ్వప్ప కెట్టిసంబంధమును లేదని స్పష్టము. ఈనాయకులరాజ్యము మంచిసూచనలతో ప్రారంభమయ్యెను.

---

1. కంచి.
2. విజయవిలాసము 1, 10.

# 3. అచ్యుతనాయకుడు

## క్రీ. శ. 1561—1614 (?) (రాజ్యకాలము)

తనకు రాజ్యమిచ్చి యభివృద్ధికి తెచ్చిన తనతోడి యల్లుడగు నచ్యుతదేవరాయలపేరును తనకుమారునకు పెట్టియుంచెను. కావున నీయన చెవ్వప్ప తంజావూరు వచ్చినతరువాత జన్మించియుండవలెను.[1] అచ్యుతుడు క్రీ.శ. 1561-వ సంవత్సరముననే రాజ్యమునకు వచ్చియుండునని సూచించియుంటిని.[2] ఆయన కప్పటికి వయస్సు దాదాపు 25 సంవత్సరములకు మించియుండదు. ఇందసంభవ మెప్పటికిని లేదు. ఈయన క్రీ. శ. 1577-వ సంవత్సరము నాటికి పూర్ణముగా రాజ్యభారమంతయు నిర్వహించు

1. "అపత్యభావేన తపోభిరవన్యా
మజాయత తాంభోజదళాక్షసేవ,
అనేకజన్మార్జితభాగ్యరాశిః
రాకారవా నచ్యుతభూమిపాలః."

(రఘునాథాభ్యుదయకావ్యము స. 6. 12)

2. 536 of 1904.

చున్నట్లు శా. శ. 1499-వ సంవత్సరమునకు సంబంధించిన కమసాలులకు పన్నులను రాహితీచేసినట్లు చెప్పు శాసనమువలన స్పష్టము[1]. ఇయ్యది తంజావూరు దేవాలయమున నున్నది. క్రీ. శ. 1577 నాటి కీయనకూడ పుత్రవంతుడై యుండనోపుననని ముందు తెలిసికొనగలము. అచ్యుతనాయకుడు చిన్నతనమునుండి మిక్కిలి దైవభక్తి కలిగియుండెను.[2] అదియునుగాక ఈయన చిన్నతనముననే రాజ్యమునకు వచ్చినట్లు తెలియును. ఈరెండు విషయములను తెల్పు శ్లోకము గోవిందదీక్షితునిదై యున్నందున మన కత్యంతాదరణీయము. ఈయన చాలవృద్ధు డైనంత వరకు జీవించియుండి, వార్ధక్యమున రాజ్యభారము

1. 22 of 1897.
2. " ఆరభ్య బాల్యా దతిభక్తిశాలీ
ముదా సదాఽఽసేవత రంగనాథమ్;
అవాప్య తంజాపుర మ్మపతీపః
కౌమార ఏ వాహృతరాజ్యభారః.

(సంగీతసుధా, 46.)

కౌమారశబ్దమునకు చిన్నతనమున నని యర్థము చెప్పవలెనని తోచును.

కుమారునకు వదలి తాను శ్రీరంగమున దైవసన్నిధిని కాలము గడపెను.[1]

ఈయన రాజ్యమునకు వచ్చునప్పటికి రాజ్యము నిష్కంటకమై సుభిక్షముగా నుండెను. విజయనగర సామ్రాజ్యమునకు కప్పము కట్టుట తప్ప నితరసమస్త విధముల స్వాతంత్రముగనేయుండెను. మరియు సామ్రాజ్యమునకును, తంజావూరునకును మైత్రిచే సోదరభావము పెంపొంద సాగెను. దీనికి మరియొక కారణము కేంద్రము బలహీనమై యాత్మరక్షణమున నన్యులసాయముగోరునవస్థ వాటిల్లుట. రామరాజవిఠ్ఠలునితరువాత మరల కేంద్రమునుండి యెవ్వరును సామ్రాజ్యప్రతినిధిగా వచ్చియుండలేదు. తంజావూరు

1 "సర్వం ధైర్యనిధూత మేరువిభవే
సర్వంసహాయా భరం
ప్రౌఢేఽస్మిన్ రఘునాధనామ్ని విదధ
త్పుత్రేఽచ్యుతక్ష్మాపతిః,
శ్రీరంగస్థలసంగతో బుధకులం
శీతాంశు రుర్వీమివ
ప్రాప్తస్సైన్యమ పుపోష శేషశయనే
భక్తః పరే ధామని."
(సాహిత్యరత్నాకరము, 12-94.)

మధురలకు వెనుకటిభూపరివర్తనముతో కూడిన సంధి జరిగినతరువాత మరల విరోధభావ ముత్పన్నమగుట కెట్టియవసరము వాటిల్లలేదు. ఈయనను తండ్రియగు చెవ్వప్ప చిన్నతనమునుండి రాజున కుచితమగు విద్యాబుద్ధులు గరపి తయారుచేసెను. హెచ్చుతగ్గులు లేనట్టియు, శాంతమైనట్టియు స్వభావము కలిగియుండుటచే ప్రజానురంజకముగనే రాజ్యమేలెను. దక్షిణదేశము యుద్ధములపాల్గొని విసిగి యుండెను. సమయమువచ్చినప్పుడు మెడపైన నున్నకాడిని తప్పించుకొందమను మధురజింజీలయుద్దేశ్యము తప్ప నీదేశభాగమునం దలజడియే లేదు. ఇందులకు సహకారిగా నీయన రాజ్యమునకు వచ్చినవెంటనే యింకను తండ్రి జీవించియుండగనే గోవిందదీక్షితుని మంత్రిగా నియమించెను.[1] ఈనాయకరాజ్యకాలమున నీ నియామక మొకగొప్పవిషయము. గోవిందునిరాజనీతియు రాజ్యసౌష్ఠవమునకు ప్రధాన

1. "అటుతరువాత ఆయన (చెవ్వప్ప) కుమారుడు అచ్యుతప్పనాయడు గోవిందదీక్షితునకు దళకర్త ప్రధానిక మిచ్చి బహుకీర్తి చంద్రుడుగా చోళదేశమందు అనేకఅగ్రహారాలు దేవాలయబ్రహ్మలయాదులైన అనేకధర్మాలు కలగజేసి చాలాకాలము రాజ్యమేలెను."

(తంజావూరాంధ్రరాజుల చరిత్రము.)

కారణ మయ్యెను. ఇట్లు దాదాపు ముప్పదిసంవత్సరములు గడచెను.

తమద్దృష్టిని కొంచెము విజయనగరసామ్రాజ్యము వైపునకు త్రిప్పవలసియున్నది. 16-వ శతాబ్దాంతమున అనగా 1590-వ సంవత్సరప్రాంతమున వెంకటపతిరాయల క్రింద సామ్రాజ్యము తనకోల్పోయినప్రతిష్ఠనుపునరార్జింప వలెనని ప్రయత్నింపసాగెను. తిరుమలరాయలమరణానంతర మాయనకుమారులలో పెద్దవాడగు శ్రీరంగరాయలతరువాత రెండవవాడగు వెంకటపతిరాయలు రాజ్యమునకు వచ్చెను.[1] ఈయన రాజ్యమునకు రాకపూర్వము చంద్రగిరిలో దక్షిణసామ్రాజ్య ప్రతినిధిగా నుండెను. ఈయనను వెంకటాద్రియనికూడ పిలుచుచుండిరి. నామమాత్రమున ప్రతినిధియేకాని దక్షిణమునకీయన యెన్నడును వెడలిపోవలేదు. కాని యచ్చటిపరిస్థితులనుమాత్ర మెరింగి యుండెను. దక్షిణరాజ్యములలో తంజావూరు కేంద్రమునెడల కృతజ్ఞత కలిగియున్నదనియు, మధురజింజీలుమాత్రము తమ శృంఖలముల నెప్పుడు తెగకొట్టుకొందమా యని కాల

1. క్రీ. శ. 1585–1614.
Aravidu, Heras, p. 256.

మునకై వేచియున్నవనియు నీయనకు తెలియును. ఒక్కొక్కప్పుడవి కప్పమిచ్చుటకుకూడ వెనుదీయుచుండెను. దక్షిణమునకు పోయి యీరాజ్యములయొక్క సామ్రాజ్యసంబంధమును బలపరచిన, నుత్తరమున మహమ్మదీయులవలన భయము లేకపోవుటయేగాక సమయము వచ్చినపుడు వారిపైన విజయమునకు కూడ సాయపడునని యీయనయూహ. ఏనాటికైనను సామ్రాజ్యసంబంధమే క్షేమకరమనియు, హిందూసామ్రాజ్యమునకు లాభకరమనియు, నీమధురజింజీలకు తట్టలేదు. వారు స్వలాభమనుకొనునది హిందూజాతిమతములకు ప్రతికూలమని వారికి తెలియలేదు. వెంకటపతిరాయలు దక్షిణదండయాత్రకు వచ్చినప్పుడు తంజావూ రాయనకు మధురజింజీలపై సాయమొనర్చి చెవ్వప్పనియామకమును సార్థకపరచెను. వల్లంకోటవద్ద మధురవీరప్పనాయకునకును,[1] వెంకటపతిరాయలకును యుద్ధము జరుగ, మధుర పూర్తిగా నోడిపోయి కప్పము కట్టుట కొప్పుకొని సామ్రాజ్యముతో సంధిచేసుకొనెను. శ్రీవల్లభశాసనములో పేర్కొనబడిన యుద్ధ మిదియేయనియు, నందిచ్చినసంవత్స

1. క్రీ. శ. 1572–1595.

రము (క్రీ. శ. 1583) పోరబాటనియు మధురనాయక చరిత్రమును వ్రాసిన శ్రీసత్యనాధయ్యరుగారి యభిప్రాయము.[1] ఈయుద్ధము మధురతంజావూరు రాజ్యములకు విరోధబీజమును నాటెను. అంతియెగాక మధురజింజీల యొక్క స్వాతంత్ర్యేచ్ఛను పెంపొందజేసి సామ్రాజ్యము తమశత్రువని వారిమనంబున దృఢీకరించెను. ఈసంకుచితదృష్టియే తరువాతిసర్వనాశనమునకు మూలకారణమని మనము తెలిసికొనగలము. ఈ నాటబడిన విరోధ బీజము క్రమముగా నిక వృద్ధికాజొచ్చెను. ఈయుద్ధము ననే రఘునాధుడు పాల్గొనిన ట్లూహింపవలెను. అచ్యుత రఘునాధులు పరాక్రమవంతులుగాన మధుర తగ్గి యూర కుండుట తటస్థించెను.

1. History of Nayaks of Madura, pp. 100, 101.

హీరాసుగా రీయుద్ధమును శాసనమునందలి సంవత్సరమును గొని వెంకటపతి రాజప్రతినిధిగానున్న కాలముననే జరిగినట్లు చెప్పుచున్నారు. Aravidu, Heras, pp. 285, 286.

కాని కృష్ణస్వామయ్యంగారు సత్యనాధయ్యరుగారివాదము నంగీకరించుచున్నారు. దానిని నేనుగ్రహించినాను.

ఇప్పటికి కొలది సంవత్సరముల క్రిందటనే వచ్చి ప్రాక్పశ్చిమముల నిమ్నజాతు లనబడువారిని తమమత ములోనికి చేర్చుకొనుట యనుమిషచే తమబలమును పెంచుకొనుచున్న పోర్చుగీసువారికి క్రమముగా నీవంక రాజ్యసంపాదనకాంక్ష పొడమెను.[1] వారు పాశ్చాత్య జాతుల సహజగుణమగు నొండొరులకు కలహము కలుగ జేయుట ప్రారంభించిరి. ఇట్లు చేసి వారిలో నొకరికి సాయమొనర్చి రెండవవారిని తుదముట్టించి, తుదకు తమ మిత్రులతలపై చేయిడుట వీరియూహ. వారినివాసము లకు దగ్గరనుండు చిన్నరాజ్యములు వీరిమంత్రాంగము లకు లోబడెను. వీరు సముద్రయానమున ప్రవీణులగు టచే[2] వీరిసాయమున్న తాము రాజ్యము పెంచుకొన వచ్చునని యాచిన్నరాజులు తలంచిరి. ఈ పోర్చుగీసు వారే తుపాకుల నుపయోగించుటను హిందూదేశమునకు తెచ్చినవారు. వానియుపయోగమునందలి ప్రావీణ్యము

1. గోవాపట్టణమున వీ రిదివరకే రాజ్యముచేయుచుండిరి. క్రీ. శ. 1510.

2. "నిశ్శంకం సలిలనిధౌ చరంతి నిత్యం."

(రఘునాథాభ్యుదయకావ్యము, 8. 19.)

కూడ వీరిమైత్రికి మరియొక కారణము : అచ్యుతనాయకుని కాలమున వీరు కొంచెము తమ యాటల సాగించి తమకులోబడియున్న జాతులను తంజావూరుమండలముపై పురిగొల్పిరి. అంతట నచ్యుతునకు కోపమువచ్చి తన కుమారుని బంప నాయనయు వారినివాసమగు నాగపట్టణమునుండి వారిని తరిమివేసినట్లు కన్పట్టును.[1] హీరాసుగారు, వీరు డచ్చివారని చెప్పుచున్నారు.[2] ఇది పొరబాటని నామనవి. ఇప్పటి కింకను డచ్చివారి ప్రభ పెరుగలేదు.

క్రీ. శ. 1611-వ సంవత్సర ప్రాంతమున మరల తంజావూరు మధురలకు చిన్న సంగ్రామము జరిగినట్టి సూచనములు గలవు.[3] మధురలో నప్పుడు I ముత్తు వీరప్పనాయకుడు డేలుచుండెను. ఆసంగ్రామమునకూడ విజయము తంజావూరునకే చేకూరెను. దానివలన తంజావూరుగౌరవము హెచ్చెను కాని యుభయరాజ్యముల వైరముకూడ హెచ్చెనని చెప్పనగును.

1. "తే నాగపట్టణగతేతు మయా నిరస్తాః"

(సాహిత్యరత్నాకరము.)

2. Aravidu, Heras, p. 397, Tanjore Dt. Gazetteer, p. 39.

3. History of Nayaks of Madura, p. 100; Aravidu, Heras, pp. 361, 362

ఇప్పటికే కుమారుడగు రఘునాథుని శౌర్యపరాక్రమములకు తండ్రి మెచ్చి యాయనను యౌవరాజ్యమున నభిషిక్తుని జేసినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1600-వ సంవత్సరమునాటి కీయనకు దాదా పిరువదిసంవత్సరముల పైన వయస్సుండును. అప్పటికే దానమిచ్చిన శ్లోకశాసనము కలదు.[1] కావున క్రీ. శ. 1600-వ సంవత్సరమునాటికే దానమిచ్చుటకు తగినవయ స్సుండవలెను. అందుచే నంతకు పూర్వమే యువరాజయ్యెనని చెప్పుటలో నెట్టి వైరుధ్యమును లేదు.[2] యౌవరాజ్యపద మీయనకు లభించునప్పటికే యీయనకు వివాహమైనట్లు కావ్యము

1. 77 of 1911.

2. "అనంతరం శ్లాఘ్యగుణాతిరేకం
లక్ష్యం ప్రజారక్షణలక్షణాఢ్యమ్,
ఐచ్ఛ ద్విధాతుం విభు రశ్య · రం
యువాన మేనం యువరాజసంజ్ఞమ్.
ఊఢం ప్రయత్నా చ్చిర మర్వరాయాః
భరం తనూజాయ భరం వితీర్య,
అవాప తస్మా దవనీసుధాంశుః
అమంద మానందభరం స్వయంచ."
(రఘునాథాభ్యుదయకావ్యము, 7, 35 & 42.)

తెల్పుచున్నది. ఇది మిక్కిలి సమంజసము. పరాక్రమ ప్రదర్శనము, వివాహము, తరువాత యౌవరాజ్యాభిషేకము, సరియైనవరుస. అప్పటినుండి ప్రతిరాజకార్యమునను రఘునాధునకుకూడ పాలుండెను.

ఇచ్చట నిల్లుండ, సామ్రాజ్యమున కీప్రాంతమున నుత్తరమునుండి మహమ్మదీయులదాడి వచ్చు సూచనలు కలిగెను. గోలకొండ సేనలుఁకూడి సామ్రాజ్యముపైకి వచ్చుచున్నట్లు వెంకటపతిరాయలకు తెలిసెను. ఆయనయు తనకు సాయ మెవ్వ రొనర్తురా యని చూడ తంజావూ రొక్కటితక్క కనపడకపోయెను. మధురను కోరినను సాయ మొనర్పదను నుద్దేశ్యమున కోర నేలేదు. మైసూరును కోరుటకుకూడ మన సొప్పలేదు. అందుచేత వెంకటపతి యచ్యుతునకు సాయమునకు కబురంపెను. అంతట నచ్యుతుడు గోవిందదీక్షితుని సలహాఁగొని యదివరలో యుద్ధముల పాల్గొని శౌర్యవంతుడని పేరుగొన్న తన కుమారుని ససైన్యునిగా నంపెను. ఆయనయు యౌవరాజ్యము లభించె నను నుత్సాహమున ససైన్యుడై వెడలి వెంకటపతిరాయలకు సాయ మొనర్చి పెనుగొండకు దగ్గర నున్న మహమ్మదీయసైన్యమును దునుమాడి తరిమివైచె

ను.[1] వెంకటపతిరాయలును సుప్రతిష్ఠితుడై, పిన్నవాడై పరాక్రమశాలియగు రఘునాథుని సాయమునకు మెచ్చుకొని, యాయనకు యథోచితబహుమానముల నర్పించి, తంజావూరురాజునకు కొన్నిబిరుదములనుకూడ నొసంగెను.[2] ఈభాగమును రామభద్రాంబ రఘునాథాభ్యుదయమున మిక్కిలి రసవంతముగా వర్ణించెను. చెవ్వప్పనియామకము సార్థకమగుట కిది రెండవతరుణము.

"అతిప్రగల్భై రథ పారసీకైః
సమం ప్రవృత్తేసతి సాంపరాయే,
కర్ణాటరక్షాకరణే నితాంతం
విచారవాన్ వేంకటదేవరాయః.

గంధాంధభూమీధవగంధనాగ
కంఠీరవం శౌర్యకథానిదానమ్,
రణే సహాయం రఘునాథదేవ
మయాచ తోర్జస్వల మచ్యుతేంద్రమ్.

1. History of Nayaks of Madura, p. 102.

2. ఈబిరుదములను సభాంతరాళమున దినమును చదివించు చున్నట్లు పుస్తకదృష్టాంతములు కలవు.

గురో[1] ర్నిదేశా ద్గురురాజ్యకార్య
నిర్వాహకో నీతిపరాయణేనః,
సామంతభూపాలశతానుయాతో
జయప్రయాణాయ సముద్యతోఽ భూత్.

గంధార్పణోద్యన్మృదుగంధవాహై
రధ్వశ్రమం సైన్యభరం హరంతీమ్,
సమాసద చ్చంద్రగిరి[2] ప్రతీతాం
పురీం నృపాలః పురుహూతకల్పః.

కటాక్షయం స్తా మథ కైశ్చిదేవ
ప్రభుః ప్రయాణైః పెనుగొండ[3] నామ్నీమ్,
కర్ణాటనేతుః కులరాజధానీ
మాలోచనాసేచనకా మయాసీత్.

వీరాగ్రణీ ర్వేంకటదేవరాయ
వినిర్మితై ర్నైకవిధోపచారైః,
ఉదూఢవేషై స్స నవోపకార్యా
మధ్యాస్త తస్యా మవనీశ సూనుః.

1. గోవిందదీక్షితుడు.
2. చంద్రగిరిపట్టణము.
3. పెనుగొండ.

కర్ణాటరక్షాకరణాయ తూర్ణం
సమాగతం తం సహ సైన్యసంఘైః,
ఆకర్ణ్య చారై రభజన్ సదారా
వనాని కేచి ద్యవనా[1] నిగూఢాః.

ఆరక్తనేత్రాంచలభీషణాస్యై
రాముక్తగర్వోన్మిషితాట్టహాసైః,
ఆరూఢకాంభోజహయై ర్భటౌఘై
రభిక్తసత్కేతుతదా తమస్యే.

నారాచపాతై ర్నరనాథసూనోః
పలాయమానాశ్చ రణే పతంతః,
అత్యాకులత్వా దభయార్తిన స్తే
రామాస్త్రతో రాత్రిచరా ఇవాసన్.

* * * *

విజిత్య యుద్ధే విమతా నశేషాన్
కర్ణాటభూమీకమితు స్తదానీమ్,
స్థలాని దుర్గాణి జగత్ప్రసిద్ధం
వశంవదా న్యన్య విభు ర్వ్యధాసీత్.

1. మహమ్మదీయులకు యవనులనియు, పారసీకులనియుకూడ వాడబడినది.

అభ్యాగమా త్తస్య నిజారివర్గ
విసంస్థులే వేంకటదేవరాయః,
ప్రమోదమాన స్సహ బంధువర్గై
రమన్యత స్వం స్థిర మాత్మరాజ్యమ్.

రాజ్ఞాం సమక్షం రఘునాథభూపం
ప్రశంస్య భూమీపతి రేవ మూచే,
అభ్యాగమాదేవ త వాజనిష్ట
నిష్కంటకం రాజ్య మిదం న్నపాల.

ఇతి బ్రువ న్నాదరమేవ యోగ్యాన్
భూమీభుజే వాహనభూషణాదీన్,
వితీర్య తం వేంకటదేవరాయో
బలాఢ్య మేనం బహుమన్యతే స్మ.

అత్రాంతరే భూపకులావతంసః
తుండీర[1]నాథం పరిదూయమానమ్,
కారాశ్రితం తత్ప్రియదాకదంబా
దాకర్ణ్యయ ద్దీన జనావలంబః.

1. జింజిని తుండీరమని మన యన్నిసామగ్రీ గంథములయం దును వాడబడినది.

*    *    *    *

రక్షైకతానో రఘునాథభూపః,
కారాశ్రితం కృష్ణపనాయకం తం[1]
వ్యామోచయ ద్వేంకటదేవరాయాత్.[2]

తుండీరనాథ స్సవధూ రనాథః
ప్రణమ్య భక్త్యా పదయో రముష్య,
కరం స్వసు గ్గ్రాహయతి స్మ సద్యో[3]
రక్షాధురీణం రఘునాథ మేనమ్.

కర్ణాటసింహాసనకార్యభారం
నిర్వ్యర్త్యసర్వం వినివర్తమానమ్,
అథాచ్యుతక్ష్మాపతి రాత్మసూనుం
ప్రత్యుజ్జగామ ప్రమదాతిరేకాత్."[4]

పైన చెప్పబడిన వెంకటపతిరాయసుప్రతిష్ఠాకార్యము క్రీ. శ. 1600 నాటికే జరిగియుండునని తోచుచున్నది. క్రీ. శ. 1596-97-వసంవత్సరమునకు సంబంధించి పైయంశ

1. జింజిరాజు కృష్ణప్పనాయకుడు.
2. Aravidu, Heras, p. 404.
3. ఇది మిక్కిలి యనుమానాస్పదము.
4. రఘునాథాభ్యుదయకావ్యము, 7, 43-76.

ములను పేర్కొను నొకశాసనము కలదు.[1] అందు గోవిందునియొక్కయు, నచ్యుతనాయకునియొక్కయు పేర్లుకూడ చేర్పబడియున్నవి. హీరాసుగారుకూడ నీ విషయము క్రీ. శ. 1602-వ సంవత్సరమునకు వెనుకనే జరిగియుండవలెనని యభిప్రాయపడుచున్నారు.[2] పైయనువాదముయొక్క తుదిభాగమున జింజినాయకుడగు కృష్ణప్పను వెంకటపతిరాయలు రఘునాథుని కోరికపై కారాగారవిముక్తుని గావించినట్లు చెప్పబడినది. ఈకృష్ణప్పనాయకుడు వెనుకజరిగిన వల్లంప్రాకారయుద్ధమున మధురకు సాయముచేసినందున కాబోలు వెంకటపతి బందీగా గొనియుండునా యని యనుమానము. అప్పుడు రఘునాథు డున్నట్లు వెనుక చెప్పినాను. అట్లున్నయెడల నీబందీగాగొనుట రఘునాథు డెరిగియుండును. ఎరిగియున్నదాని ననువాదములో చెప్పినట్లు కృష్ణప్ప భార్యలవలన తెలియుటయేమి?

1. 710 of 1904.
కృష్ణప్పనాయకుడు కంచియందు వరదరాజస్వామియాలయమునకు క్రీ.శ.1599-వ సంవత్సరమున మరమ్మతు చేయించినట్లు కలదు. అప్పటికి చెరనుండి విముక్తుడయ్యెననుట స్పష్టము. కావున నది యొక సాక్ష్యము. (Sources of Vizianagar History, p. 272.)

2. Aravidu, Heras, pp. 310, 311, 312 & 327.

బహుశః వారలకోరికపై రఘునాథుడు వెంకటపతిని కోరి యుండనోపు. కవయిత్రి చమత్కారముగా వర్ణించి వ్రాసినట్లు కన్పట్టును. ఈకృష్ణప్ప ప్రవర్తనము బహువింతమైనది. ఈయన జింజిరాజ్యమునకు వచ్చినవిధము కడునీచము. పినతండ్రిని గ్రుడ్లు పీకించి తాను రాజ్యమునకు వచ్చెను.[1] ముం దీయన యెల్లప్పుడును మధురతో సహవాసముగా నుండి తంజావూరునకు ప్రతికూలుడుగ నుండుటను చూడఁగలము. రఘునాథుని సాయమున కెట్టి కృతజ్ఞతను చూపెను!! దుర్మార్గుల కుపకృతికూడ కృతఘ్నతకు కారణమగును. ఈయన కుమార్తెను రఘునాథున కిచ్చినట్లు పైయనువాదమున నున్నది కాని వీరిభావిప్రవర్తనము మామలల్లుండ్లదిగా నున్నట్లు కన్పట్టదు. కావున నమ్మఁటకు శక్యముగాకున్నది. పర్చాసుపుస్తకము వెంకటపతిరాయలవలన నీయన బందీకృతుడగుటను మాత్ర మొప్పుకొనుచున్నది గాని యీయనను కారాగారమునుండి రఘునాథుడు విముక్తుని చేసెననిమాత్రము చెప్పుటలేదు. స్వయముగానే విముక్తు

1. సూరప్పనాయకుడే యీయనపినతండ్రియైయుండును.

డైనట్లు చెప్పుచున్నది.[1] కంఠోక్తిగా పైకావ్యములోని యనువాదము చెప్పుచున్నందున నమ్మవలయుననియే నా యభిప్రాయము. రఘునాధుడు క్రీ.శ.1597-98-వ సంవత్సర ప్రాంతమున పెనుగొండయందుండుటయు కృష్ణప్ప కారాగృహావిముక్తియు దాదా పప్పుడేయగుట పైయను వాదమును దృఢీకరించుచున్నది.

అచ్యుతుని తుదిరాజ్యవత్సరములు వెనుకటివలె నెమ్మదిగా నుండలేదు. రాజ్యముచుట్టును విపన్మేఘము లావరింప మొదలిడెను. వెనుక దేశమునందలి దొంగలగుంపులను చాలవరకు లోబరచుకున్నట్లు చెప్పినాను. అది నిజమే కాని యొకదుండగీడుమాత్ర మప్పటి నుండియు చెలరేగుచు నప్పుడప్పుడు దేశమును పీడించుచున్నట్లు కాననగును. అచ్యుతునికాలమున వీనిదుండగములు హెచ్చయ్యెను. వీడిప్పటికి చాలావృద్ధుడై యుండవలెను. దక్షిణమున రామరాయవిత్థలు డుండుకాలముననే వీని దుండగములు ప్రారంభమయ్యెను.[2] వీనిపేరు చోళ

1. Purchas, His Piligrimes, Vol. X. Ch. VII.
2. “భూమీశ్వరై ర్జగతి విత్థలరాయపూర్వై
రన్యై రమేయబలశాలిభి రప్యజేయః,

గుడు. అట్లైన వీని కిప్పటికి 70 సంవత్సరములకు మించి వయ సుండవలెను.[1] వార్ధక్యమువచ్చుకొలది వీనిదుండగములు హెచ్చుచుండెను. వీ డత్యంతక్రూరుడు. వీడు చేయు చేష్టలనిచెప్పునవి చదివిన నోడలు జలదరించును. తంజాపూరురాజ్యముపైన ప్రత్యక్షముగా దండెత్తివచ్చుట కెవ్వరికిని ధైర్యములేదు. అట్లువచ్చినమధుర తలవంచుకొనవలసెను. అచ్యుతుడు నాగపట్టణమునుండి పోర్చుగీసువారిని వెడలగొట్టిన దాదిగ నెట్లైన కసితీర్చుకొనవలెనని వారు ప్రయత్నించుచుండిరి. కాని దండెత్తుటకు ధైర్యము లేకపోయెను. అందుచే పరోక్షముగా తంజాపూరురాజ్యమునకు ప్రతికూలముగా ప్రవర్తింపజొచ్చిరి. అట్టిప్రవర్తనములో రాజ్యమునకు కంటకముగానున్న యీచోళగునికి సాయమొనర్చుట యొకటి. తంజాపూరురాజ్యమిత్రులను బాధించుట రెండవది. రెండవదానినిగూర్చి తరువాత ముచ్చటింతును. ప్రస్తుతము చోళగునికి చేయుచున్న సాయమునుగూర్చి ముచ్చటింతును. వీడు కావేరీ

ఆరాధ్య భైరవ మహాప్య వరం దురాపం
శూరాగ్రణీ శ్చరతి చోళగనామధేయః."
(రఘునాథాభ్యుదయకావ్యము. 8-7.)

1. Aravidu, Heras, p. 155.

సాగరసంగమమువద్దనుండు దేవికోటయను చిన్నిద్వీపము[1] నాధారముగాచేసికొని యప్పుడప్పుడు రాజ్యముపై బడి దుండగముల సాగించుచు వచ్చెను. పోర్చుగీసువారు సముద్రయానమున ప్రవీణు లగుటచే సముద్రమునుండి వీనికి సాయముచేయుచుండిరి. అచ్యుతున కీసంగతి చారుల వలన తెలిసెను. తుద కీతులువ స్త్రీలనుకూడ చెరఁబట్ట జొచ్చెను.

"నృపచంద్రనృశంసవృత్తి రాస్తే
స తథా సంప్రతి చోళకో ధరాయామ్,
ప్రవదంతి జనా యథా మునీనామ్
ప్రపదం హంత దశాననం చరిత్రైః.

పథికా న్మిళతః పథి ప్వజస్రం
బత ఘోణీకృతభస్త్రికాసు బద్ధ్వా,
ముసలై స్సవిభో ముహుః ప్రహార్య
క్షిపతి గ్రామముఖేషు నిర్నిమిత్తమ్.

వనదంష్ట్రిభి రాహతా న్త్వసీయాన్
కళమాళి[2] త్యభిధాయినాం జనానాం,

1. ఈద్వీప మిప్పుడు లేదు. సముద్ర మిసుకతిన్నె వేసినదని చెప్పుదురు.

2. కళ్లారులని కృష్ణస్వామయ్యంగారి యుద్దేశ్యము.

అధిరోపయతేఽధిరోమకూపం
శితసూచీ రివా పాయయ త్యజ్ఞ సమ్.

ఇయతా వచసా య దేకదేశోఽ
ప్యధునా నాభిహిత స్తదస్య సర్వమ్,
చరితం హాతకస్య శక్యతే త
న్న మయాఽఽకర్ణయితుం ననుశ్శివాయ."[1]

"అధిపయోధి దశాస్యఇ వాపరః
ప్రబలబాహుబలః పరదుస్పహః,
జగ దశేష మిదం జగతీపతే
క్షుభితమేవ కరోతి స-చోళకః.

కథ మిదం కథయామి కృపానిధే
శృణు నృపాల స -చోళకరావణః,
ప్రతిదినం హారతే(?) పతిదేవతాః
పరవధూ రనివార్య పరాక్రమః"[2]

రఘునాథున కిది తెలిసినను వీనిని శిక్షించుటకు తొందరపడి వెడలుటకు వీలు లేకపోయెను. ఏలన వీనికి

1. సాహిత్యరత్నాకరము, 10, 16-22.
2. రఘునాథాభ్యుదయకావ్యము. 8, 8-9.

నొక్కపోర్చుగీసువారేకాక పాండ్యతుండీరపతులు[1] కూడా సాయ మొనర్చుచుండిరి. ఇట్టి దుండగీనికి సాయ మొనర్చుటచే వారిదుష్టత్వముకూడ వెల్లడియగుచున్నది. కృష్ణప్ప నాయకునకు రఘునాధునెడల కృతజ్ఞుడగుట కర్తవ్య మయ్యు నాయన చోళకునికి సాయముచేయుట యాయన యొక్క సంపూర్ణదుష్టత్వమున కుదాహరణము. పామును పాలుపోసి పెంచినట్లయ్యెను. చోళకుడును తాను పరాక్రమవంతుడయ్యు రఘునాధునకు భయపడి వీరిసాయము కోరిన ట్లగపడును. ఒకవేళ వాడు కోరినను వీరికి సాయముచేయుట తగనిపని.[2] రఘునాధున కిది

1. మనసామగ్రీగ్రంథములయందు పాండ్యమని మధురయు, తుండీరమని జింజియు వాడబడుచుండును.

2. "ప్రబలం బత శాత్రవం స పాండ్యః
ప్రభుచంద్ర త్వయి శీలయ త్యహేతుః,
అధునాతు స చోళకస్య తస్మి
న్నపి తుండీరవిభోః ప్రవర్తనేన."
(సాహిత్యరత్నాకరము. 10-27.)

"అవార్య శౌర్యా దవనీబలారేః
శూరోఽపి భీతో హృది చోళకో ఽస్మాత్,
అయాచ తాప్తై రథ కృష్ణభూపం
బలై స్సమేతం ప్రథనే సహాయమ్."
(రఘునాథాభ్యుదయకావ్యము. 7.)

యొకచిన్నదొంగ నణచుట కాదు. ఒకదారిదోపిడిగానిని శిక్షించుట కాదు. శత్రుగణముసంఖ్య మిక్కుటమగు టచే త్వరపడి యేమిచేయుటకును వీలులేదయ్యెను. వాని నివాస మందును సముద్రమధ్యము. సముద్రయానమున దిట్టలైన పోర్చుగీసువారు వానికి సాయము. కావున నిది యొక మహాత్కార్య మనియే తలంపవలయును.

పోర్చుగీసువారు తమకసితీర్చుకొనుటకు చోళకు నికి సాయమొనర్చుటతో నాగక రఘునాథునకు తరముల నుండి స్నేహితుడగు జాఫ్నా[1] రాజును వెడలగొట్టి వాని రాజ్యమునాక్రమించుకొనిరి. ఆరాజు భార్యాసహితుడై సముద్రమును దాటి సరాసరి తంజాపూరువచ్చి రఘు నాథుని పాదములబడి తనవిపత్తును తెల్పుకొనెను. తండ్రి పెద్దవా డగుటచే రఘునాథునియొక్క బాధ్యత మెక్కువ యయ్యెను. పోర్చుగీసువారిని శిక్షించుట యత్యవసర మయ్యెను. ఈపని చోళకశిక్షణముచేత నేగాక జాఫ్నా రాజరక్షణముచేతను పూర్తిచేయవలసియుండెను. నేపాళ రాజు తనయాపత్తును చెప్పుకొనువిషయము కవులు

1. సింహళమునందలి జాఫ్నాకు నేపాళమని మనగ్రంథముల వాడబడినది. కొన్ని స్థలముల సింహళమే నేపాళమని పిలువబడినట్లు కనబట్టుచున్నది.

బహురసవంతముగా వర్ణించినారు.[1] రాజు వనసంచార మునకు పోయినసమయముగా చూచి నేసలను కనుమె ఃగున ర్లొనర్చి పోర్చుగీసువా రకస్మాత్తుగా మోసముచేసి

1. "భో రక్షరక్ష సహసా భువనైకవీర
విద్రావితా న్నిజపదా ద్వమతై స్త్వ మస్మాన్,
నేపాళనేతు రవరోధనితంబవత్యః
పత్యా వయం పదమితా శ్శరణం తవేతి."
(సాహిత్యరత్నాకరము. 5, 66.)

"మహీపతే మమ కులజై ర్మహాభుజైః
పరాజితా స్సమితి ఫరంగివంశజాః,
తదాది తే మనసి దృఢం విరోధితాం
ప్రవర్ధయం త్యవమతిపంకరూషితాః.

మ య్యారామాలోకనే మగ్నచిత్తే
వేలాం సర్వే తే|.విచార్యేవ తూర్ణమ్,
వప్రై ర్దీప్రాం వార్ధిఖేయాం పురీం మే
సంఘీభూయా చ్ఛద్మకృత్యై రగృహ్ణన్.

నరపతే సకలం నగరా ద్బహిః
విరచితం విమతై ర్వివమం తదా,
పరముఖా దవకర్ణ్య సరోత్పలం
పరివిలంఘ్య భవంత మశిశ్రియమ్."
(రఘునాథాభ్యుదయకావ్యము. 8 18, 20, & 21.)

పట్టణమును గ్రహించినట్లును, రాజు బయటనుండి సంగ తిని విని యచ్చటివా డచ్చటనే వెనుకకు మరలి తంజా వూరువచ్చినట్లును చెప్పబడినది. ఎట్లున్నను పోర్చుగీసు వారు జాఫ్నా నాక్రమించుకొనిరి. రఘునాథుడు వారిని శిక్షించి రాజును పునఃప్రతిష్ఠితుని చేయవలసియుండెను. రఘునాథుడు చేయవలసినపనులలో నిది రెండవది. దీనికిని సముద్రము లంఘింపవలసివచ్చను. కావున నిదియు తొందరపడి చేయవలసినది కాదు. రఘునాథుడు దీను డగు నేపాళరాజును తగినట్లు గౌరవించి యాయనను తనకోటలోనే యొకభాగమున విడియించి యాయనను తగురీతిని సమ్మానించెను.[1]

ఇచ్చట నీవిషద్వయ మిట్లుండ పులిమీది పుట్ర వలె మరియొకవిషయము తటస్థించెను. క్రీ. శ. 1614-వ

1. "ఏవంవదంతే మము మేవ మహీమహేంద్రః
నేపాళభూప మబలాసహితం నినాయ,
స్వావాసగేహసవృశం సహ సోపకార్య
ప్రవ్యాణిచ స్వకృతరత్నవిభూషణాని."
(సాహిత్యరత్నాకరము. 5. 72.)

సంవత్సరమున వెంకటపతిరాయలు మరణించెను.[1] ఆయ నకు పుత్రసంతతి లేనందున తన యన్న రామ రాయల కుమారుడగు శ్రీరంగరాయలను తానున్న ప్పుడే యభిమానపుత్రునిగా పెంచుచుండెను. చనిపోవు నపుడు తనతరువాత నీయనను పట్టాభిషిక్తుని గావింపుమని మంత్ర్యాదుల కాదేశించిపోయెను. వారును తదాజ్ఞాను సారముగా వెంటనే శ్రీరంగరాయలను పట్టాభిషిక్తుని గావించిరి. చనిపోయిన వెంకటపతిరాయల భార్యలలో వెంకటమ్మ[2] యను నొకగొబ్బూరివంశజాత యుండెను.

1. వెంకటపతిరాయల మరణమునకుపూర్వ మప్పుడప్పుడు తంజావూరు కప్పము కట్టలేదనియు, నందువలన నుభయరాజ్యములకు నప్పుడప్పుడు విరోధ మండెడిది యనియు హీరాసుగారు చెప్పు చున్నారు. 1604 లో చెల్లించిరట! 1606 లో లేదట! మరల 1608 లో చెల్లించిరట! 1614-వ సంవత్సరమునకు సంబంధించిన యొక మిషనరీయుత్తరమును బట్టి 1610 లో మరల విరోధమని తెల్పుచున్నారు. గట్టిగా విరోధమని చెప్పక వారును ననుమానము గానే చెప్పుచున్నారు. ఇంతకంటె ప్రబలసాక్ష్య మండువరకు నీ విషయమును నమ్ముటకు వలనుపడదు.

(Aravidu, Heras, p. 40?)

2. ఈమెకు బాయమ్మ యనునామాంతర మున్నట్లు కన్పట్టును.

Aravidu, Heras, pp. 494, 495, 496.

ఆమె యదివరకే తన కొకకుమారు డున్నట్లు నటించుచు[1] భర్త చనిపోయినతరువాత తనకుమారునకు రాజ్యము రావలెనని వాదుకచేయ నారంభించెను. ఈకారణమున రాజ స్థానమున రెండుకక్షు లుద్భవిలెను. పుత్రబ్రువుని పక్షమునకు వెంకటమ్మ తండ్రియగు జగ్గరాయలు నాయకుడు. ఈయన పరమదుర్మార్గుడు, క్రూరుడు, స్వార్థపరాయణుడు. తాత్కాలికముగ నీయనపక్షమే బలవత్తరముగా గన్పట్టెను.[2] శ్రీరంగరాయలకును కక్షి యున్నను మొత్తముమీద బలహీనమైయుండెను. జగ్గరాజున కిది స్వార్థము. పుత్రబ్రువుని తెగటార్చిన తానే రాజగును. ఇట్టియెడ నెట్టిఘోరకృత్యము నొనర్చుటకును వెనుదీయునా? ప్రత్యక్షముగా శ్రీరంగరాయల నేమైన చేయుట కాయనకును పక్షము కలదే? అందుచేత కాలము కొరకై వేచి తుద కొకదినమున నర్ధరాత్రమున నంతఃపురమును ప్రచ్ఛన్నముగా కతిపయసహాయుడై చొచ్చి సుఖనిద్రనున్న శ్రీరంగరాయలను సపుత్రబాంధవముగా హత్యగావించెను. ఇట్టిఘోరకృత్యముచేసి సంపాదించియా

1. Aravidu, Heras, pp, 502, 503.
2. Ibid, p. 512.



శ్రీరామసౌధము
(రఘునాథనిర్మితము)

౨౮3 పుట.



ప్రాసాదము-కేళీసరస్సు

("ప్రాసాదకేళీ సరసీ సమేతాః।") ౨౮౮ పుట

రాజ్యమేలగలవు! జగ్గరాయా! శ్రీరంగరాయరక్త సిక్తయగు రాజ్యరమ నిన్ను చిరకాలము కూడియుండునా! ఈహత్యాకలకలంబున నొకనమ్మకమైన చాకలివాని సహాయముతో యాచమనాయకుడు[1] రామదేవరాయ లనునొక శ్రీరంగరాయపుత్రుని బయటకు నెవ్వరికంట బడకుండ నంపెను. జగ్గరాయల కీసంగతి వెంటనే తెలి యకపోయెను. పట్టణమంతయు హత్యసంగతి విని యట్టు డికిపోయెను. కాని జగ్గరాయరాక్షసునకు జడిసి యెవ్వ రును నోరెత్తరైరి. జగ్గరాజునకు రక్షింపబడిన బాలుని వృత్తాంతము తెలిసిన తరువాత నలుదెసల వెదకుటకు బంట్ల నంపెనుగాని యాచభూపతి బుద్ధిబలమునను, భగ వంతునియాశీర్బలమునను తెలిసికొన లేకపోయెను. యాచభూపతియు నీబాలు నెచ్చట కంపుదునా యని యాలోచించెను మైసూరున నీ బాలుని పితృవ్య పుత్రు డున్నను నీయన యిదివరకే కేంద్రమునెపల సదుద్దేశ్యముతో లేడు. అందువలన నచ్చటికి పంపు టకు వీలు లేకపోయెను. నిజముగా నంపిన నచ్చటి

1. ఇప్పటి వెంకటగిరివంశమునందలి పూర్వుడు.

తిరుమలుడు తనపొట్టన బెట్టుకొనువాడే.[1] మధుర జింజీల సంగతి మన కిదివరకే తెలియును. ఇక మిగిలినది తంజావూరు. యాచమనాయకునికి తంజావూరు వెంకటపతి రాయలయెడల రాజభక్తిపూరితమై యున్నట్లు తెలియును. అందుచే నాయనయొక్క యభ్యర్థనమునకు తంజావూరు సాయపడునని సరిగా నూహించెను. మరియు రఘునాథుడు మిక్కిలి శూరుడని యిప్పటికే పేరు వడసెను. అందుచే జగ్గరాయల పొగరణచవచ్చు ననునాశ కలదు. కావున నితరులు పోవు సామాన్యమార్గమున గాకుండ, మధురజింజీలకు తెలియకుండ, ప్రచ్ఛన్నముగా తూర్పుసముద్రతీరము వెంబడి యాపిల్లవానితో తంజావూరునకు బయలుదేరి ముందు తాను వచ్చుకార్యమును తెలియుటకై రఘునాథునొద్దకు చారుని బంపెను. రఘునాథుడును నిది తెలిసి మిక్కిలివిచారపడి యాచమనాయకుని తెలివికిని, దూరదృష్టికిని సంతసించుచు వెంటనే చారుండ్వారమున నభయవార్త నంపెను. జగ్గరాజును సంగతులు తెలిసి పిల్లవానికై యెంత వెదకినను కనపడక పోవుటచే నిక తప్పక రఘునాథునితో యుద్ధముసేయ నిశ్చ

1. Aravidu, Heras, p. 360.

యించుకొనెను. ఇందులకు మధురజింజీల సాయముకొరకు కబురంప వారును తంజావూరుపైకి వెడలుట కువ్విళ్లూరు చున్నందునను, నదివరకే పోర్చుగీసువారితోను చోళ కునితోను రఘునాథునిపై కుట్రలు పన్నుచున్నందునను, వెంటనే వల్లెయని తిరుగుజబా బంపిరి. జగ్గరాజునకు యాచమనాయకుడు పిల్లవానితో తంజావూరు చేరినట్లు సరియైనవార్త తెలియకపోవుటచేతను, నాకాలము నదుల నీరుండుకాలమగుటచేతను, నప్పుడు నదులదాటుటకు సరి యైనసాధనములు లేమిని కావేరిని వారు దాటకుండ చేయుటకై తన్నదికడ్డముగా కట్టినయానకట్టను తన సైన్యభాగము నంపి బ్రద్దలుకొట్టించెను. తద్వృత్తాం తము రఘునాథునకు తెలిసి కోపానలదంద్యమానుడై కన్నులెఱ్ఱచేసి బహుభీష్మశపథము నొనర్చెను. దానిని నామాటలతో చెప్పుటకంటె కవివాక్యములలో నిత్తును:

"ఛిన్నైశ్చ జ్జగ్గనృపాది బాహుజనుషాం
సేతుం శిరఃకర్పరైః
కావేర్యాం యుధి బంధయామి సుదృఢం
కామం తదాహం భవైః,
స్పష్టం తైర్విధృతాభిరేవ లిపిభిః
స్వాయంభువాభి ర్యథా

కర్తవ్యం జయరేఖికావిరచనం
కల్పేత కల్పావధి." 1

నిజముగా నిట్లే కావేరీతరమున జగ్గరాయల నోడించి చంపెను! రఘునాథా! సిద్ధప్రతిజ్ఞుడవు! ఈసందర్భమున పెనుగొండయందలి జగ్గరాయఘోరకృత్యమును, యాచమనాయకుని రాజభక్తియు మొదలగునవి కవులు మిక్కిలిరసవంతములుగా వర్ణించియున్నారు. కొన్నిశ్లోకముల నిట ననువదింతును:

"విష్ణోః పదం శ్రయతి వేంకటదేవరాయే
సర్వే తదీయ సచివా యువరాజసూనుమ్,
భద్రాసనే తదను భూభరణాయ తూర్ణం
శ్రీరంగరాయనృపశేఖర మభ్యషించన్.

తస్మిన్మహీం శాసతి తం సమస్తాః
పురాతనా భూపతయో భజంతః,
ద్రోహం విధాతుం ద్రుతమేవ తస్మై
జనాధినాథాయ స జగ్గరాజః.

1. సాహిత్యరత్నాకరము, 13-83.

సానుజో నిశి స జగ్గమహీశః
పార్థివస్య భవనం పరివేష్ట్య,
భూపతిం తదను పుత్రకళత్రైః
నిర్ఘృణో నిహత మాతనుతే స్మ.

తనయేషు తస్య నృపాలకస్య కంచిత్
శిశు మాప్తా రజక స్సమేత్య శీఘ్రమ్,
అనయ న్నగరా ద్బహి ర్నిశాయా
మతిచౌర్యా ద్ద్విషతా సునక్షి లక్ష్యమ్.

కేచి దేన ముపగమ్య కృతజ్ఞాః
పార్థివా స్తదహితా త్ప్రితికారమ్,
నేతు మక్షమతయా నృపతేఽస్మా
త్ప్రాపయ న్పరిసరం భవనీయమ్.

ఆపదాం పద మనన్యశరణ్యాం
రాజపుత్ర మవనీరమణ స్త్వమ్,
సింహపీఠ మధిరోసయ శీఘ్రం
జగ్గరాజమపి సంహర యుద్ధే.

బాల్యేఽపి సింహాసనకార్యభారః
కృత స్స్వయం కీర్తినిధే పునశ్చ,

సఏవ కార్యం స్వకలప్రయత్నాత్
భుజాబలాఢ్యో భువనే త్వ మేవ "[1]

"స్వామిద్రోహీ జగ్గరాజ స్సమిత్రైః
కైశ్చి ద్భూపైః ప్రాప్య కర్ణాటభూపమ్,
సేవావ్యాజే నాసు సేనాసనాథః
సుప్తం రాత్రౌ సోవధీ ద్బంధుమిత్రైః.

సమిత్రసుత బాంధవై స్సహనిహత్య కర్ణాటక
ప్రభుం స్వకులపోషకం ప్రబలపాపదుష్యన్మతిః,
తతోను సహితోన్నృపైః ద్రమిడచేరపాండ్యాదిభిః
భ్రమ త్యనుచితక్రియః పరవశోఽధి రంగస్థలమ్.

హ త్యేఽపి కర్ణాటనృపే సహాత్మజైః
తతోఽవశిష్టం పృథుకం తదాత్మజమ్,
కమప్యుపాయా దపహృత్య యత్నతః
కథంచి దాయాతి స యాచభూపతిః.

ఆలంబ్య మంక్షు ధరణీంద్రమహానుభావ
మాగంతుకైకశరణం ప్రబలం బలేన,

1. రఘునాథాభ్యుదయకావ్యము. 8. 26—32.

యాచతుమాపతి రసా విహ యాచతి త్వాం
సఖ్యాంచితో రిపున్నృపై స్వవిభుత్వహేతుః.[1]

ఈతుదికార్య మన్నిటికంటె మహాత్తమమైనది. రఘునాధుడు బాలుడగు రామదేవరాయలతో యాచమనాయకుడు వచ్చుచున్నట్లు వినినవెంటనే తాను సపరివారుడై బయలువెడలి వారిని కుంభకోణమున నెదుర్కొని వారి కభయదానము నొసంగి వారిని సబహుమానముగా నచ్చటినుంచి తనకోటలో ప్రవేశపెట్టెను.[2]

తంజావూరులో పదభ్రష్టులై రఘునాధునిచే పునః ప్రతిష్ఠితుల జేయబడుటకు వేచియున్నరాజు లిద్ద రుండిరి. వారిలో నొకరు చక్రవర్తి. ఆహా! రఘునాధా! నీద్వార ముకః చక్రవర్తులను కావలియుంచితివి!

1. సాహిత్యరత్నాకరము. 13. 74—77.

2. "గత్వా సంప్రతి కుంభఘోణ ముచితం కర్ణాటనేతు స్సుతం
శాలం తం శరణాగతం విరచయే పట్టాభిషేకం బలాత్.
(సాహిత్యరత్నాకరము, 13. 80.)

"అధిసహ్యజాతట మతీవపావనీ
మక్ష కుంభఘోణనగరీ మగా న్నృపః.
(రఘునాధాభ్యుదయకావ్యము, 8. 72.)

పరిస్థితులు బహువిషమముగాగనుపట్టెను. రఘునాధుడు శత్రుమధ్యమున నుండెను. ఉన్నవారలు చాలనట్లు సామ్రాజ్యసైన్యముతో జగ్గరాయలు సన్నిహిత శత్రువులకు సాయము. ఇక రఘునాధునకు సాయమెవ్వరు? ఇప్పటికి యాచమనాయకు డొక్కడుతప్ప నితరులెవ్వరును గానరారు. నిస్సహాయుడై కార్యమును నెరవేర్చుటకు సాధ్యముకాదని భావించి రఘునాధుడు పితృమంత్రులవద్దకు వెడలి సంహారమునకు నడుగవలసివచ్చెను. శత్రుబృందము మిక్కిలి బలవంతముగా కన్పట్టెను. ఒక్కశత్రుబృందమునే ముమ్మారు జయింపవలసివచ్చెను. శత్రుసైన్యములలో పోర్చుగీసువారు మూడుభాగములుగా తమసేనలను చీల్చి దేవికోట జాఫ్నాలయందు రెండుభాగముల నునిచి మూడవభాగమును జగ్గరాజునకు సాయమంపినట్లు కన్పట్టుచున్నది ఏలన జగ్గరాయలతో జరిగినయుద్ధమున జగ్గరాజసైన్యములో పోర్చుగీసువారున్నట్లు సాహిత్యరత్నాకరకారుడు చెప్పియున్నాడు.[1] తత్సైన్యమును వర్ణించుటలో వారి జాతిమతాదులను బహురసవంతములుగా చెప్పినాడు. "తోమిన రాగి

1. వీరిని ఫరంగీలనియు, పారసీకులనియు వాడియున్నారు.

మొక్క రంగును మీసము లనుకరించుచు పొడవుగా నున్నవట! మొగములు సానలవలె నిస్తిలకములై యున్నవట! చెవులకు కుట్లులేవట! లోహితవర్ణము లగు తలపాగలను ధరించినారట! తలపాగలపైన యీకలను ధరించిరట! శరీరముల కవచములు ధరించిరట! తాంబూలము వేసుకొను నాచారము వారలకు లేదట! త్రాగుడు మెక్కువగా వాడుకయట! నడుమునకు పటకాయుండి యందు కత్తి వ్రేలాడుచున్నదియట!"[1] పోర్చుగీసువారు వీరికి సాయముచేయవచ్చినారేగాని పాండ్యతుండీరనాయకులు పోర్చుగీసువారికి సాయముచేయుటకు జాఫ్నాకు

1. "సద్యోమృష్ట స్వచ్ఛతామ్రోపమానైః
దీర్ఘశ్మశ్రుశ్రేణిదీప్తై ర్మహద్భిః,
శూన్యాలీకై రక్షత శ్రోత్రయుగ్మైః
వక్త్రైః క్రూరాన్ వక్రితభ్రూకుటీకైః.

ఉద్భ్రాంతాంశాన్ లోహితోష్ణీషబంధాన్
తామ్రచ్ఛాయై స్స్నావకంసా న్గరుద్భిః,
వజ్రప్రాయై ర్వర్మితాన్ వారబాణైః
నిస్తాంబూలాన్ నిత్య మద్యావలిప్తాన్.

కట్యాలంబి ప్రౌఢకౌక్షేయసక్తం
తూణీభారం బిభ్రతో దుర్విదగ్ధాన్,

వెళ్లినట్లు కన్పట్టదు. కాబట్టి కార్యత్రయము చేయు టలో పౌర్వాపర్యము విచారింపవలసియుండెను. అప్పుడు మంత్రాలోచనసభ కోటలోని లక్ష్మీవిలాసభవనరాజ మున కూడెను.[1] ముఖ్యముగ సభ్యులు ముగ్గురు.[2] వృద్ధుడై కుమారుని జయమును చూడవలెనని యువ్విళ్లూరుచున్న రాజును, రాజ్యమునెడలమిక్కిలి భక్తి కలిగి రాజమంత్ర ప్రవీణుడగు మంత్రియు, యౌవనమున నుండి బాహు కండూతిని శత్రుజయము చేచల్లార్పవలెనని తలంచుచున్న రఘునాథుడును గాక నిక వేరెవ్వరుండుట యవసరము? గోవిందమంత్రి యాలోచనము మిక్కిలి యభ్యర్థనీయము. ఏలన వెనుక నాయన యిచ్చినసలహాలన్నియు సఫలము లయ్యెను. తత్సభయందు జరిగిన మంత్రాలోచనములు

సవ్యే నోచ్చైః పాణినా శార్ఙ్గచాపం
ద్విత్రా నస్యేనాపి తీక్ష్ణాన్ పృషత్కాన్.

1. "భూపః ప్రాపద్యతాథో సచివసుతయుతో
జాతు లక్ష్మీవిలాసం. (సాహిత్యరత్నాకరము, 9. 75.)

2. "ససుతో వసుధాసుధాకరోఽసౌ
సహగోవిందమణీందునా సభాయామ్,
సమగా దథ తత్రగోత్రభేదీ
సజయంతో గురుణా యథామరాణామ్."

(Ibid, 10. 1.)

యజ్ఞనారాయణునిచే సాహిత్యరత్నాకర కావ్యము 10-వ సర్గయందు బహువిపులముగా వర్ణింపబడినవి. ఈసభలో గోవిందమంత్రి శత్రువులు కలుసుకొనుటకు కాల మియ్యక ప్రత్యేకముగ నొక్కొక్కరిచో పోవ్వన తాకవల యునని సలహానిచ్చెను.[1] యజ్ఞనారాయణుడు రఘునాథు నికి శిష్యుడని మనము వెనుక తెలిసికొనియున్నాము. గోవిందునికి జ్యేష్ఠపుత్రుడు. రాజకార్యములు సమగ్ర ముగా నీయనకు తెలిసియుండవలెను. ఇచ్చట నొకయభి ప్రాయభేదము కలదు. రఘునాథాభ్యుదయకావ్యమున రఘునాథుని సింహాసనారూఢుని జేసి తరువాత చోళకాది ప్రవర్తనమును గ్రంథకర్త్రి చెప ప్రారంభించెను. అందు వలన నీకార్యత్రయము చేయవలసిననాటికే రఘునాథునకు పట్టాభిషేకము జరిగిన ట్లూహ పొడముచున్నది. సాహిత్య రత్నాకరమునందలి కథనుబట్టి వెంకటపతిరాయల మర ణమునకు తరువాతకూడా నచ్యుతనాయకుడు జీవించి

1. "నిహతే యుధి చోళకే నృశంసే
నిహతా ఏవ భవంతి పారసీకాః,
నరనాథ నిజాశ్రయస్య బాధే
నయసిద్ధో నకి మాశ్రితస్య బాధః."
(సాహిత్యరత్నాకరము, 10. 24)

నట్లును, కార్యత్రయమును రఘునాథునకు పట్టాభిషేకము కావించిన నాయనయత్యుత్సాహముతో నిర్వర్తింపగల డని యచ్యుతునకు మంత్రివర్యుడు సలహానీయ నాయన యందుల కంగీకరించి, వెంటనే పట్టాభిషేకము చేసి తాను శ్రీరంగక్షేత్రమున దైవచింతనమున కాలము గడపె ననియు తెలియును.[1]

1. "నృపధూర్వహతాం నిజే తనూజే
వసుధా భర్తస్తటినీవరావృతాయాః,
వితనుష్వ రణే ష్వసౌ విశంకో
విమతా నాశు వినాశయ త్యయత్నమ్."

అని గోవిందుడు సలహానియ్య,—

"విజితా బహవో దిశా మధీశాః
బహుధా భోజి వసుంధరా ప్యశేషా,
విదుషా మపి సంభృతం వ్యతారి
ద్రవిణం కిం పర మస్తి మే విధేయమ్.

పర మేత దిహావశిష్యతే
పర మేఽస్మిన్ రఘునాథనామ్ని పుత్రే,
అవనీభర మాకలయ్య శశ్వ
దవనీతా నమునా విజాపయిష్యే."

అని యచ్యుతుడు బదులుచెప్పి వెంటనే కుమారుని పట్టాభిషేక మొనర్చుమని మంత్రివరున కాజ్ఞాపించెను.

ఈ రెండు కథలయొక్క తారతమ్యమును విచారింతము. రఘునాథాభ్యుదయకావ్యము వ్రాసిన రామభద్రాంబ యంతఃపురస్త్రీయని నాయభిప్రాయము. ఆయమకు రాచకార్యముల నంతప్రావీణ్య ముండకపోవచ్చును. అయినను పట్టాభిషేకమువంటి ముఖ్యాంశమున పొరపాటుగా వ్రాసినట్లు భావింపరాదు. కాని సంగతిసందర్భములబట్టి యీ పట్టాభిషేక మెట్టిపరిస్థితులలో జరిగెనాయని చర్చించువిషయ మామె యానుషంగికముగా దలంచినట్లును, దానినిగూర్చి పూర్వాంగమును చర్చించనట్లును చెప్పవచ్చును. ఏలన మిక్కిలి సంగ్రహముగా రఘునాథుడు సింహాసనముపై నధిష్ఠించెననిమాత్రము రెండుమూడు శ్లోకముల చెప్పి వదలినది. కావున పట్టాభిషేకము ఫలానిసమయమున జరిగెనని చెప్పుట కామె చెప్పిన శ్లోకములు చాలవు. మరియు పౌర్వాపర్యము లంతటితో నిర్ధారణముచేయుటకు

" సౌమ్యే భావిని వాసరే శుభదినే శౌండీర్యముఖ్యై ర్గుణైః
ప్రఖ్యాతం రఘునాథనాయక మముం ప్రౌఢాపదానం సుతమ్,
క్షిప్రం త్వం చతురర్ణవీపరివృతక్షోణీతలప్రాభవే
కుర్యాః కౌతుకతోఽభిషిక్త మఖిలై ర్గోవిందయజ్వాగ్రణీః. "
(సాహిత్యరత్నాకరము 10, 61, 62, 63, 102)

చాలదు. కాని యజ్ఞనారాయణుడు చెప్పిన కథ మిక్కిలి విపులముగాను స్వభావసిద్ధముగా నుండి కండ్లతో చూచిన సాక్ష్యము చెప్పినట్లు కన్పట్టును. అచ్యుతుడు వృద్ధుడనుట నిశ్చయము. కార్యత్రయ మాయన నిర్వ ర్తింపజాలడనుటలో సందియము లేదు. అవి రఘు నాధుడే చేయవలసియుండెను. దానికి పట్టాభిషేక ముజ్జీ వకము. ఉత్సాహముతో రఘునాధునకు ద్విగుణమగు బలము వచ్చెను. తనయెదుట తనకంటె మిన్నయగు కుమారుడు మహాత్కార్యముల నిర్వర్తించునంతటి పరాక్రమవంతు డగుటకంటె తండ్రికి గర్వకారణ ముండునా? "పుత్రా దిచ్ఛే త్పరాజయం" అనికదా ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. కావుననే గోవిందుని సలహా యచ్యుతునకు వెంటనే నాటెను. తత్క్షణమే పట్టాభిషేక మొనర్చున ట్లాజ్ఞాపించెను. రఘునాధుని యర్హత వేర చెప్ప ననావశ్యకము. కాబట్టి యీ రెండి టిలో సాహిత్యరత్నాకరమునందలి కథ మిక్కిలి విశ్వసనీయముగా నున్నది.

మరియొక యంశము. పై కథను విశ్వసించిన నచ్యు తుడు వెంగటపతిరాయల మరణానంతరము జీవించియుం డవలెను. రఘునాధుని పట్టాభిషేకముకూడా తదనంత

రమే యైయుండవలెను. వెంకటపతిరాయలు క్రీ. శ. 1614-వ సంవత్సరమున మరణించెను. అనగా పైయన్ని విషయములును క్రీ. శ. 1614-వ సంవత్సరమునకు తరువాత నని యర్థము. రఘునాథునికిని జగ్గరాయాదులకును జరిగిన తుదియుద్ధము తోపూరను[1] స్థలమున క్రీ. శ. 1616_1617-వ సంవత్సరమున జరిగినట్లు చరిత్రకారులు తెల్పుచున్నారు.[2] ఈవిషయము విపులముగా ముందు తెలుసుకొనగలము. రఘునాథాభ్యుదయనాటకమునందలి కాలమున కిది సరిపోవుచున్నది.[3] వెంకటపతిరాయలు క్రీ. శ. 1614-వ సంవత్సరములో మృతినొందినందున నప్పటినుండి వెనుకటిసందర్భములన్నియు కలుపుటకు దాదాపు రెండుసంవత్సరములుపట్టియుండును.జగ్గరాయలు వెంకటపతిరాయల మరణమునకు వెంటనే హత్య కావించినను పాండ్యతుండీరములతో సంధి చేసుకొని యుద్ధమునకు సన్నద్ధుడగుటకును, దక్షిణమునకు ససైన్యుడై వచ్చుటకును తప్పక నంతకాలము పట్టియుండును.

1. ఇప్పుడు తోపూరు. (పటమును చూడుడు).

2. History of Nayaks of Madura, p, 103, note by Mr. S. K. Iyengar,

3. నళసంవత్స రాషాఢ శుద్ధపంచమి.

రఘునాథునకును సందర్భములు తెలసినవెంటనే మంత్రి తో నాలోచించి, మొదట చోళకుని దునుమాడుటయు, తరువాత జాఫ్నాకు వెడలి పోర్చుగీసువారిని శిక్షించుటయు, తదుపరి యంతయు కూర్చుకొని వచ్చిన జగ్గరాయలను తాకుటయు మొదలగు కార్యత్రయము దాదాపు రెండుసంవత్సరములు పట్టియుండును. ఇయ్యదియు సమంజసమే! అన్నివిషయము లాలోచించిన తోపూరుయుద్ధమునకు పూర్వము కొలదికాలముక్రిందటనే మిగిలిన రెండుకార్యములు జరిగినట్లు తేలుచున్నది. రఘునాథాభ్యుదయకావ్యమునందలి కథయు కార్యత్రయము అవ్యవహితముగానే జరిగినట్లు తెల్పుచున్నది. మన కిచ్చట కొలగ్రయగు వెంకటపతిరాయల మరణము నాలోచించిన నద్దానికి కొలదిమాసముల తరువాతనే రఘునాథుని పట్టాభిషేకమని యూహకు తావు కలదు. కార్యత్రయము పట్టాభిషేకమునకు తరువాతయని యన్ని సాక్ష్యము లేకీభవించుచున్నవి. ఈపట్టాభిషేక మెప్పుడా యనునదియే యభిప్రాయభేదముగా నున్నది. పట్టాభిషేకమునాటి కచ్యుతుడు జీవించియుండుటయేగాక తరువాతకూడా శ్రీరంగక్షేత్రమున కాలక్షేపము చేసెననుటలోకూడ భిన్నాభిప్రాయము లేదు. పట్టాభిషేకమున

కవ్యవహితముగనే చోళకాదిసంహారమనికూడా రఘునాథాభ్యుదయకావ్యము చదివిన తెలియును.[1] పరిస్థితు లెరుకమైనతరువాత నా పట్టాభిషేకము, లేక పట్టాభిషేకముతరువాతనా పరిస్థితులు తెలిసినది? తుద కీవిషయ మీ ప్రశ్నక్రిందకు తేలినది. ఇప్పుడు సమాధాన మంత కష్టసాధ్యము కాదు. పట్టాభిషేకమున కవసర ముండవలదా? పరిస్థితు లట్టియవసరమును కల్పించుచున్నవి. కావున సాహిత్యరత్నాకరమునందలి కథ మిక్కిలి సందేహానివృత్తికరము. ఈ సందర్భమున హీరాసు గారి యభిప్రాయము మరియొకవిధముగా నున్నది.[2] ఈయన రఘునాథాభ్యుదయకావ్యము నాధారముగా గొని తన యితరసాధనములచే నచ్యుతుడు క్రీ. శ. 1600-వ సంవత్సరములోనే చనిపోయెనని తేల్చి పట్టాభిషేక మంతకుపూర్వము అనగా క్రీ. శ. 1597 ప్రాంతముననే నని చెప్పుచున్నాడు. వెనుక మనకు తెలిసిన విషయములనుబట్టి క్రీ. శ. 1597-వ సంవత్సరమునాటికి రఘునాథునకు నిరువదికి మించిన

1. సర్గ 10.
2. Aravidu, Heras, pp. 399, 400.

వయ సుండును. అప్పటికి వెంకటపతిరాయలకు సాయ మొనర్చినట్లు శాసనాధారమును వెనుక తెలిసికొని యున్నాము.[1] హీరాసుగారుకూడ నీవిషయమును క్రీ. శ. 1602-వ సంవత్సరమునకు పూర్వము జరిగి యుండవలెనని చెప్పినట్లుకూడ మనవిచేసియున్నాను. ఇయ్యది క్రీ. శ. 1597-వ సంవత్సరమున జరిగిన నప్పటి కచ్యుతుడే రాజ్యముచేయుట స్పష్టము. వెంకటపతి రాయలు రఘునాథుని సాయము పంపమని యచ్యుతుని కోరెను.[2] తిరిగివచ్చినతరువాత మరల కుమారుని కచ్యుతుడే స్వాగత మొనర్చినట్లుకూడ చెప్పబడినది.[3] ఈసంగతి క్రీ. శ. 1611, 1612-వ సంవత్సరప్రాంతమున జరిగియుండుననని శ్రీకృష్ణస్వామయ్యంగారు చెప్పుచున్నారు.[4]. ఇదియే నిజమైన నప్పటి కచ్యుతనాయకుడు

1. 710 of 1904.

2. "రణే సహాయం రఘునాథదేవ

మయాచ తోర్జస్వల మచ్యుతేంద్రమ్"

(రఘునాథాభ్యుదయకావ్యము.)

3. "అథాచ్యుతక్ష్మాపతి రాత్మసూనుం

ప్రత్యుజ్జగామ ప్రమదాతిరేకాత్."

(Ibid.)

4. History of Nayaks of Madura, note, page, 102

జీవించియున్నాడన్న హీరాసుగారి వాదము పూర్వపక్ష మగును. కాని యిది క్రీ. శ. 1596-97 ప్రాంతమున నని వెనుకటిశాసనము స్పష్టముచేయుచున్నది. క్రీ. శ. 1611 ప్రాంతమున మధురతంజావూర్లకు యుద్ధము సంభ వించినట్లు వెనుక మనవిచేసియున్నాను. అప్పటి కచ్యు తుడే రాజ్యము చేయుచున్నట్లు తెలియుచున్నది.[1] కాని యప్పుడు సామ్రాజ్యము పాల్గొనలేదు. దీనివలన క్రీ. శ. 1611-వ సంవత్సరమునాటి కచ్యుతుడు జీవించియున్నట్లు స్పష్టపడుచున్నది. హీరాసుగారి వాద మింతటితో పూర్వపక్షమైపోయినదని తలంపవచ్చును. ఆయన క్రీ. శ. 1600-వ సంవత్సరముననే యచ్యుతుడు చనిపోయినట్లు చెప్పుట నిజమేయైన క్రీ. శ. 1611-వ సంవత్సరమునాటికి తంజావూరున నచ్యుతుడు రాజ్యముచేయుట యెట్లు పొసగును? కాబట్టి రఘునాథుని పట్టాభిషేకము క్రీ. శ. 1614 ప్రాంతమేనని నాయభిప్రాయము.[2] పట్టాభిషిక్తుడై

1. Bertrand, p. 108.

2. తంజావూరుజిల్లా గెజెటీరును, జిల్లామ్యాన్యువలును, కుప్పు స్వామిశాస్త్రిగారును, కృష్ణస్వామయ్యంగారును, సత్యనాథయ్యరుగా రును, మొదలగు నిప్పటికి వ్రాసిన చరిత్రకారులు బహుసంఖ్యాకు లీ కాలమునే యంగీకరించియున్నారు.

రఘునాథుడు క్రమ్ముకొనియున్న విపన్మేఘముల నెట్లు చెదరగొట్టి తంజాపురకీర్తిసూర్యున కెట్టి మధ్యాహ్నము గొల్పెనో కనుగొందము.

అచ్యుతనాయకుడు మంచి సమయమున రాజ్యమునకు వచ్చెను. మంచి విషమసమయమున రాజ్యమును వదలుట తటస్థించెను. బహుశః నిట్టూర్పులో విడచియుండునోపు. ఏలన వృద్ధుడుగావున పడుచువారలు కార్యనిర్వహణ మొనర్చుకొందురుగాక యని యుండ వచ్చును. ఈయన చాలసంవత్సరములు రాజ్యము చేసెను. తండ్రివలెనే హరిహర భేదము లేకుండ శివ విష్ణ్వాలయములకు సమానముగానే వసతుల కల్పించెను. కాని శ్రీరంగస్థలమన్నను, రంగనాథుడన్నను నీయన కభినివేశ మెక్కువ. శ్రీరంగమునందలి యెనిమిదియవ ప్రాకారము నీయన నిర్మించెను. గోపురాదులను, కావేరీస్నానఘట్టమున సోపానపంక్తిని నిర్మించెను. రంగనాథునకు రత్నకిరీటకవచాదులను చేయించియిచ్చెను. ఇప్పటికిని ఉత్సవాదులయందు తత్కవచాదులనుస్వామికి తొడుగుదురు. ముఖ్యముగా వైకుంఠైకాదశి వెల్లిన మరునా డచ్యుతుని కవచకిరీటములచే స్వామి నలంకరింతురు. స్వామిపూజార్థ మొక పూలతోటను నాటెను.

ఇవియేగాక మాయూరమధ్యార్జునకుంభకోణములయందు దేవతాకైంకర్యముల నొనర్చెను. ప్రతిసంవత్సరమును తులాభారముతూగి తద్ధనమును బీదలకు దాన మిచ్చుచుండెను. రామేశ్వర క్షేత్రమునందలి తీర్థముల సన్నిటిని మరమ్మతు చేయించెను. ప్రతిసంవత్సరమును రామసేతుసందర్శన మొనర్చుచుండెను. ఎంతమంది గోసాయీలు వచ్చినను సదావర్తు లిచ్చుచుండెను. తిరుపతి, కాళహస్తి మొదలగు దేవాలయముల కన్నిటికిని దానము లొసంగినట్లు గ్రంథములవలన తెలియనగును.[1]

1. "రంగేశితు ర్దివ్య మహా విమానం
హిరణ్మయం రత్నమయం కిరీటన్,
మణీమయం వర్మచ నిర్మమీతే
సింహాసనం స్మ క్షితిపాల ఏషః.
తస్యైవ పూర్వోత్తరపశ్చిమాని
స గోపురాణ్యప్రతిమప్రభాని,
ప్రాకార మప్యష్టను మాతనిష్ట
మహానసం చాపి మహీమహేంద్రః.
లక్ష్మ్యాశ్చ సర్వాణ్యపి మంటపాని
దివ్యాంశ్చ రత్నాభరణా న్వ్యతానీత్,
ఆరోహమార్గంచ మరున్వృధానా గా
మలంక్రియాభావ ముపేయివాంసమ్.

ఆరామ సీమామపి రంగభర్తుః
గ్రామా ననేకానపి సంవ్యతానీత్,
దానం తులాపూరుష మచ్యుతేంద్రో
హిరణ్యగర్భం ప్రతివర్ష మేవ.

హేమాద్రికల్పే కథితాని సమ్యక్
సర్వాణి దానాని మహూ ర్వ్యతానీత్,
రామేశ్వరస్యాపిచ గోపురాణి
తీర్థాణి సర్వాణి నవీచకార.

సందర్శనం కించ స రామసేతో
రసా వకార్షీ దనువర్ష మేవ,
దినేదినేఽభోజయ దేవ లక్షా౯
గోసాయికా నచ్యుతభూమిపాలః.

మాయూర మధ్యార్జున కుంభకోణ
శ్రీచంపకారణ్య ముఖస్థలేషు,
మహత్తరం మంటప మాతతాన
భిక్త్యా మహత్యా పర మచ్యుతేంద్రః."

(సంగీతసుధా, 38-44.)

"మాయూర మధ్యార్జున కుంభకోణ
శ్రీ దక్షిణావర్త ముఖస్థలేషు,
వృద్ధాచలే పంచనదేచ సేతౌ
సోపానసౌధా న్వ్యతనిష్ట సోవా.

ఈయన తండ్రిచేసిన యన్ని దానములను పరిపాలించెను.

ఈయన తన ధర్మపత్నియు, రఘునాథుని తల్లియు నగు మూర్తిమాంబ పేరిట నొక గ్రామమును నిర్మించి దానిని బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చెను.[1] ఈయన కావేరి నదికి రాజరాజచోళుడు కట్టిన యానకట్టను మరమ్మతు చేసెను.[2] ఈయన యప్పయ్యదీక్షితుడను పండితప్రకాండుని పూజించినట్లు తెలియుచున్నది.[3] అప్పయ్యదీక్షితుడు చెవ్వప్పనద్దకూడా సన్మానము నొందినట్లు హీరాసుగారు వ్రాసినారు.[4] అయియుండును. గోవిందదీక్షితునకును, నప్ప

చిదంబరే చిత్పరిణామ భేదే
వైకుంఠవీప్సాజుషి వేంకటాద్రౌ,
శ్రీ కాళహస్త్యాదిషు చాతనో ద్యో
వృషాకపాయీవరయో స్సపర్యామ్.
(రుక్మిణీపరిణయము, రాజచూడామణి కృతము.)
చంపకారణ్యము = మన్నారుగుడి.
దక్షిణావర్తము = తిరువలంజుళి.
పంచనదము = తిరువాడి.

1. Tanjore Dt. Gazetteer.
2. E. P. Indica, XII. 343; రుక్మిణీపరిణయము.
3. 710 of 1904.
4. Aravidu, Heras, p. 523.

య్యదీక్షితునకును మైత్రి యున్నట్లు విదితము. కావున నచ్యుతు డప్పయ్యను సన్మానించుటలో నెట్టి యనుమానము నుండదు. గోవిందదీక్షితుని నామధేయమును, నచ్యుతుని నామధేయమును పరస్పరము నెడతెగని సంబంధము కలవియైయున్నవి. తుద కీక్రిందిశ్లోకమును చూడుడు:

"త్రినామాద్యంతనామానౌ మహీక్షిద్దీక్షితౌ ప్రభూ,
శస్త్రే శాస్త్రేచ కుశలా వాహవేషు హవేషుచ."[1]

వీరిద్దరి నామధేయముల కిట్టి సంబంధ ముండుట గోవిందుని నియామకమును, మంత్రిత్వకాలము నచ్యుత నాయకునితో నెక్కువసంబంధ మున్నట్లు చెప్పకచెప్పుచున్నది. మొత్తమున నీరాజమంత్రిసంయోగము తంజాపూరుభాగ్యమని చెప్పవలెను.

అచ్యుతుని కాలమున జరిగినట్లు చెప్పు మరియొక విషయము నిచ్చట చర్చించుట యవసరము. క్రీ. శ.

1. మూడునామములు = అచ్యుత, అనంత, గోవింద.
వీనిలో మొదటిది రాజనామము, మూడవది మంత్రినామము.
ఒకరు శస్త్రమందును, యుద్ధమందును కుశలులు. రెండవవారు శాస్త్రములందును క్రతువులయందును ప్రజ్ఞ కలవారు. గోవిందుడు వాజపేయాంతక్రతువుల నొసర్చెను.

1610-వ సంవత్సర ప్రాంతమున నొక పాండ్యరాజునకును తంజావూరు రాజ్యమునకును యుద్ధము తటస్థించినట్లును నందు తంజావూరు ఓడిపోయినట్లును తద్విషయసూచకముగా నదివర కుండు గ్రామనామమును తొలగించి జయించిన పాండ్యుని నామ మతివీర రాముడుగావున నాయన పేర నాగ్రామమున కతివీరరామపట్టణమని నామకరణము చేసినట్లును, నిప్పు డధిరాంపట్న మని పిలువబడు గ్రామ మదియే యనియు, నీ యధిరాంపట్న మనుపద మతివీరరామపట్న మనుపదముయొక్క కురుచ పేరనియు, కొందరు చరిత్రకారులు చెప్పుచున్నారు.[1] ఇందుల కెట్టి యాధారమును కానరాదు. కేవలపట్టణనామమును గొని దాని చుట్టును గాథను పెంచినట్లు కన్పట్టును. ఈ యతివీరరామపాండ్యుడు క్రీ. శ. 1565 మొదలు 1610-వ సంవత్సరమువరకు తెంగాశియందు రాజ్యము చేసెను, అనగా చెవ్వప్పకాలమున నీయన రాజ్యము ప్రారంభించి యచ్యుతుని కాలమున నంతమొందెను. ఈ మధ్యకాలమున తంజావూరునకును ఎట్టి పాండ్యరాజునకును యుద్ధము తటస్థించిన ట్లెట్టి యాధారములును కానరావు.

1. Tanjore Dt. Gazetteer, p. 39.

తెంగాశి మధురకు లోబడియుండు సామంతరాజ్యము. వెంకటపతిరాయల కాలమున నాయనకు లోబడియున్నట్లు కన్పట్టుచున్నది.[1] ఇట్లు మధురకు లోబడియుండు నొక సామంతరాజు మధురను రెండుమారు లోడించిన తంజాపూరును యుద్ధమున గెల్చెనని చెప్పుట చరిత్రకును, లోకానుభవమునకును విరుద్ధము, హాస్యాస్పదము. తన సామంతరాజునకును, తంజాపూరునకును యుద్ధము జరుగు నప్పుడు మధుర తా నేల యట్టియుద్ధమున పాల్గొనలేదు? వల్లంప్రాకారమువద్ద క్రీ. శ. 1590-వ సంవత్సరప్రాంత మున జరిగినట్టిగాని, మరల క్రీ. శ. 1610 లో జరిగినట్టి గాని యుద్ధములం దీ యతివీరరాముడు పాల్గొనినట్లు కానరాదు. అట్టి యతివీరరాము డిందుల కెట్లు వచ్చెనో చెప్పజాలము. అందును తంజాపూరు నోడిం చుట మరియు వింత! ఈయుద్ధపర్యవసానముగా తంజా పూరురాజునకు పాండ్యరాజకుమార్తె నిచ్చి పరిణయము జరిగెనట! అట్టి పరిణయ మచ్యుతునకు కాదని సిద్ధము. ఆయన యీచెప్పుకాలమునాటికి మూడుకాళ్ల ముదుసలి యై యుండెను. ఇక నట్టి వివాహము రఘునాథునకై

1. Aravidu, Heras, p. 348; 615 of 1915.

యుండవలెను. రఘునాథున కొక పాండ్యకన్యకను పరిణయ మొనర్చినట్లు రామభద్రాంబ తెలియజేయుచున్నది.[1] ఇదిగాక తుదిసర్గలో రామభద్రాంబ రఘునాథున కొక పాండ్యరాజతనయ భార్యగా నుండెనని కూడ చెప్పినది. ఈవిషయము పైయూహకు ప్రతిబంధకము. ఏలన నెచ్చటనైనను నోడిపోయినవారు పిల్లనిత్తురా ? చేసుకొందురా ? ఇచ్చట గెలిచిన పాండ్యుని పుత్రికను పరిభవింపబడిన రఘునాథుడు వివాహము చేసుకొనుట విపరీతముగా నున్నది. దీనివలన నొకవేళ రఘునాథునిచేతిలో నీపాండ్యుడు పరిభవము నొందెనా యనుప్రత్యూహకు తావు కలుగుచున్నది. అట్లైనను యట్టిబాంధవ్యచిహ్నముగా నాస్థలమున కానామ మిడి యుండవచ్చును. లేదా తన్నామము మరియొకవిధముగా వచ్చియుండవచ్చును. 12-వ శతాబ్దారంభమున చోళదేశము నేలిన యధిరాజేంద్రచోళునిపేర నీపట్టణ మేల యుండకూడదు ? ఈయధిరాంపట్టణము చాల పురాతన

1. "ఏవంశుభాకారసమేత మేనంహర్షోదయాదచ్యుతభూమహేంద్రః,
అగ్రాహయత్పాణిమథాత్మజాతంపాండ్యాదిభూపాలకకన్యకానామ్."
(రఘునాథాభ్యుదయము. 7-34.)

మగు నొకరేవుగా తెలియుచున్నది. అట్లయిన నిది వీరు చెప్పినట్టి చరిత్రకలది కాదని చెప్పవలెను. ఏలన నీనామము క్రీ. శ. 1610-వ సంవత్సరమునకు పూర్వమే యీపట్టణమున కుండియుండును? కాబట్టి యిప్పుడు చెప్పుదానికంటె ప్రబలతరమగు సాక్ష్య మున్నగాని యీకథను నమ్మజాలము. విశ్వనాథుడు తెంగాశి, శిరెపల్లి పుత్తూరు మొదలగు నైరుస్థలములనుండు పంచపాండవు లనబడు పాండ్యపంచకమును లోబరచుకొనినతరువాత తెంగాసియందలిగాని, మరియెచ్చటిగాని పాండ్యులు తంజావూరు నెదుర్కొనుటకు శక్తిమంతులైనట్లు కానరాదు. నాయకరాజ్యస్థాపన మైనతరువాత రఘునాథుని రాజ్యాంతమువరకును తంజావూ రెవ్వరిచేతులలోను పరాజయము నొందలేదు.

అచ్యుతుని రాజ్యాంత్యకాలమున మాత్రము తంజావూరుచుట్టును చీకటులు గ్రమ్మియుండెను. రఘునాథసూర్యుడు వానిని పటాపంచలు చేయవలసియున్నది. అట్లొనర్చునో, వానిచాటున మాటువడునో చూతము.

———

# ౧. రఘునాధనాయకుడు

## (1614 – 1633)

హీరాసుగారు క్రీ. శ. 1600-వ సంవత్సరము ప్రాంతమున మలబారునందలి మిషనరీ లెవరిమ న్యానో జరిగిన రెండుత్తరములపై నాధారపడి రఘునాధుని కొక యన్న యుండెడివాడనియు, అచ్యుతుడే రఘునాధుని యందలి ప్రేమచే తన పెద్దకుమారుని కారాగృహామునం దుంచి రఘునాధుని యువరాజునుగా చేసెననియు, తరువాత రఘునాధుడు రాజైన వెనుక నాయనను చంపించెననియు, మొదలగు సంగతులను వ్రాసినారు.[1] ఈయుత్తరము లేతద్దేశసంబద్ధములు కాకపోవుట వీనిగూర్చి యప్రత్యయమునకు మొదటి కారణము. వెనుక రఘునాధుని పట్టాభిషేకము క్రీ. శ. 1614-వ సంవత్సర మునవని సహేతుకముగా మనవిచేసియున్నాను. వంశ వృక్షమువలనను, తదాధారములగు గ్రంథభాగములవల నను నచ్యుతునకు రఘునాథు డేకపుత్రుడనియే తెలి

1. Aravidu, Heras, pp. 401, 402.

యును. ఎవ్వ రెట్లున్నను యజ్ఞనారాయణగోవిందుల సాక్ష్యము మిక్కిలి బలవత్తమము. విజయవిలాసగ్రంథ కర్తకూడా అచ్యుతునకు రఘునాథు డొక్కడే కుమారు డని చెప్పినాడు. రఘునాథుడు చెవ్వప్ప జీవించియుండ గానే ముందు కులగౌరవము కాపాడు సూచనలు కలిగిన బాలుడని చెవ్వప్పచే ప్రశంసింపబడెనని వెనుక తెలిసి కొనియున్నాము[1] ఒకవేళ నింతకంటె పెద్దవాడున్న చెవ్వప్పమొదలుగా తరువాతిరాజులును, మంత్రులును కూడ రఘునాథుని రాజును చేయవలెనను కుట్ర నేల పన్నవలెనో తెలియకున్నది. వేదవేదాంగవేత్తనై, యపరదేవతయగు గోవిందమఖి యట్టి ద్రోహామునకు తావిచ్చునా? ప్రతికృత్యమును ధర్మదేవత కనిపెట్టు చుండెను. ఎప్పుడు మానవుడు ధర్మచ్యుతుడగుటకు ప్రారంభించునో యప్పుడే వాని నాశమునకు పునాది వేయబడిన ట్లనుకొనవలెను. రఘునాథునితరువాత కొన్ని వత్సరములవరకు తంజావూరుయొక్క యౌన్నత్యము

1. "అస్మాక మేకేన భవే త్ప్రతిష్ఠా
ధర్తుం సమర్థశ్చ సఏవ రాజ్యమ్."

(సంగీతసుధా.)


ద. ఆర్కాటు
జిల్లా
దేవికోట
కావేరీనది
తిరుచినాపల్లి
జిల్లా
కొల్లడము
కుంభకోణము
అయ్యంపేట
నాగూరు
పట్టణము
తోపూరు
తంజావూరు
అధిరాంపట్టణము
Calimere
జాఫ్నా
పుదుకోట
మధుర
జిల్లా
తంజావూరు మండలము.
----రఘునాధుని మార్గము.
*....తోపూరు యుద్ధభూమి.
*అయ్యంపేట—ఏకోజీకి నిఅళగిరికి ని
యుద్ధము జరిగిన స్థలము.

౨౯౧ పుట.

నిలచియుండెనన్న రఘునాథుడు ధర్మబద్ధుడుగ నుండె నని వేర చెప్ప ననావశ్యకము. రఘునాథుని కుమారు డెప్పుడు మతములను పీడింప మొదలిడెనో యప్పుడే నాశనాంకురములు నాటబడెను. అందును అన్నను చంపి రాజ్యము చేయుచున్న రాజు ప్రజలకు రంజకు డగునా? అట్టివానిని ప్రజలు గౌరవింతురా? రఘు నాథునియెడ ప్రజలకు ప్రేమయేతప్ప నితరభావ మెచ్చుటను గానమే? చెవ్వప్ప మొద లందరును కుట్రపన్ని దుర్మారు లయిరని చెప్పుట కెవ్వరికి నోరాడును? రెండు మిషనరీ యుత్తరములను విశ్వ సించి యింతమందని దుర్మార్గుల చేసి యన్నిగ్రంథము లబద్ధము లనుటకంటె నాయుత్తరములు సరియైనవి కావనుట సమంజసమని నాకు తోచుచున్నది. మరియు నవి స్థలాంతరమునందలి వ్యక్తులు మెచ్చుటనో జరిగిన యంశమునుగూర్చి వ్రాయు వ్రాతలగుటచే ననుమానా స్పదములు. మిషనరీలైనను పొరబాటేల పడియుండ కూడదు. ఇంతకంటె ప్రబలమై వెనుకటి యంశముల నన్ని టిని అసత్యములను చేయగలిగిన సాక్ష్య ముండువరకు హీరాసుగారి వాదమును నమ్మ వలనుపడదు. అచ్యుతుని

మరణమును రఘునాథుని పట్టాభిషేకమును చర్చించు నప్పుడుకూడా హీరాసుగారీయుత్తరముల నుపయోగించిరి.

ఈచరిత్రమునకు రఘునాథుడు నాయకమణి. ఈయనను కృష్ణరాయలతో నన్నివిషయములలో బోల్ప వచ్చును. లక్ష్మీసరస్వతు లిర్వురును తంజానగరము తమకు రాజధానిగా చేసికొని నిరంతరనృత్యము గావించిరి.[1] ఆంధ్రభాషామతల్లికి ముద్దుకుమారుడై, యాంధ్రకవితా వధూటికి ప్రేమాస్పదుడైన నాయకుడై యీయన వర లెను. విద్యానగరమున కృష్ణరాయభోజుని కాలమున నాంధ్రకవితావధూటి యెట్లు పల్లకిలో నూరేగింపబడెనో యట్లె రఘునాథుని కాలమున శారద ధ్వజాదిరాజ చిహ్నములతో వరలెను.

పూవు పుట్టగనే పరిమళించును. ఈయన బాల్య ముననే గొప్పవాడగు లక్షణము లున్నట్లు గుర్తించి నాము. తాతగారికి ముదముగొల్పెను. తరువాత తండ్రి కెంతటి సంతసము గూర్చెనో పట్టాభిషేకసమయమున దిలకించినాము. గోవిందున కెట్లు ప్రేమపాత్రమయ్యెనో

1. "రమానటీన ర్తన రంగశాలా."
(సాహిత్యరత్నాకరము.)

కొంతవరకు తెలిసికొన్నాము. వెంకటపతి కెట్లు స్నేహ పాత్రుడయ్యెనో కనుగొన్నాము. పాండ్యాదు లందరును నొకగుంపై చేరి యీయనపై రా ప్రయత్నములు సల్పుటయే యీయనశౌర్యమున కుదాహరణము. ఒక్కొక్కరు నచ్చిన నీయన శౌర్యాగ్నికి శలభాయమాను లగుదురనియేకదా సంఘముగా చేరినది! దుర్మార్గుడైనను శూరుడగు గొబ్బూరి జగ్గరాయ రావణుడుకూడా రఘునాథునకు భయపడుచుండెను. రామరాయ నేపాళరాజులిద్ద రీయనదయకు వేచియుండిరి.

ఈయనను తండ్రితాతలు మొదటినుండియు సుఖాసక్తుని జేయక భావికాలమున రాజ్యనిర్వహణమున కెట్టి విద్యాదు లావశ్యకములో యవి యన్నియు గరపి గరిడీ మొదలగు వ్యాయామముల నేర్పి సకలవిద్యాపారంగతుని జేసిరి. రఘునాథుడును కుశాగ్రబుద్ధిచే నితరులు దినములో నేర్చికొనునది గంటలో నేర్చుకొనుచు పదునారు వత్సరముల వయసువా డగునాటికే సంగీతసాహిత్యము లందును, ఆన్వీక్షక్యాదులయందును మిన్నయై వరలెను. విలువిద్యయం దెంత దిట్టయో గ్రంథరచనయం దంత నేర్పరి. బాల్యమునందే యీయన గ్రంథరచన చేయుట యందలి తన చాకచక్యమును యామద్వయమున పారిజా

తాపహరణప్రబంధమును రచియించి వ్యక్తీకరింప, వ్రాయువారలు బహుకష్టముతో వ్రాయగల్గిరట![1] ఈ విషయమున రాజచూడామణికూడా సాక్ష్యమొసంగుచున్నాడు.[2] ఆంధ్రదేశదౌర్భాగ్యమున నీప్రబంధ మిప్పుడు కనపడుటలేదు. ఎవరివద్దనైన నున్నయెడల ప్రచురించి యాంధ్రప్రపంచముయొక్క వందనములకు పాత్రులగుదురు గాకయని ప్రార్థించుచున్నాను. ప్రబంధ మనుటచేతనే యియ్యది యాంధ్రభాషయందు వ్రాయబడినట్లు స్పష్టము. లేకపోయిన కావ్యమనియో, మరియేదియో యనిపించుకొనియుండును.[3] ఈయన కవితాధోరణి యెట్టి

1. "యామద్వయేన యదునేతరి పారిజాత
మాజీహర త్సరస మచ్యుతభూపసూనుః,
కావ్యం తదత్ర విబుధైస్తు కథంకథంచి
దాలేఖి చిత్ర మవధాయ ఫణీంద్రకల్పైః."

(సాహిత్యరత్నాకరము, 5. 30.)

2. "శ్రీపారిజాతాపహరణాభిధానో
యే నైకరాత్రేణ కృతః ప్రబంధః"

(రుక్మిణీపరిణయము, 1.)

3. తంజావూరునందలి పుస్తకాలయమున నీకాలపు గ్రంథము లన్నియు నుండకపోవుట యాశ్చర్యము. తుదకు రఘునాథుడు రచియించెనని చెప్పునవి యన్నిగ్రంథములైనను లేవు.

దన్న యజ్ఞనారాయణరాజచూడామణుల మెప్పు వడయుటయేగాక[1] యాయనరచనకు మెచ్చి తండ్రి యాయనకు కనకాభిషేక మొనర్చెనట ![2]

తండ్రి కెంత ముదావహము ! ఇంతకంటె తండ్రికి గర్వకారణ ముండునా ? ఇంతయేల ! అలంకారరత్నాకరమువంటి లక్షణగ్రంథమును, సాహిత్యరత్నాకరమువంటి యుత్తమకావ్యమును, రఘునాథభూపాలీయాదులగు నుత్తమనాటకములను రచియించి తన విద్వన్మంత్రియగు గోవిందుని జ్యేష్ఠకుమారుడగు యజ్ఞనారాయణదీక్షితు డీయనవద్ద విద్య నభ్యసించెనన్న నీయనపాండిత్య శేముషీ విశేషములను వేరుగా విన్నవింపవలయునా ? ఆహా, గోవిందదీక్షితుని యాశీర్వాదబలము ! తన కుమారునకు

1. "మాకంద కందళదమందమరందబంధు
త్వం పారిజాతహరణం త్వరయా నిబద్ధుమ్"
(సాహిత్యరత్నాకరము.)

2. "ఏవం వదం స్తనయ మేవ కృపారసార్ద్రైః
జాతాభిషేక మపి తం జగతీబిడౌజాః,
తత్రాభ్యషించత మణీభి రసౌ సభాయా
మాసీ త్స ఏవ వసుధేశపటాభిషేకః."
(సాహిత్యరత్నాకరము. 5-35)

గురువగునంతటివానిగా కూలంకషముగ నీయన నభ్యస్త సమస్తవిద్యుని గావించెను.

ఈయన కళ్వగజవిద్యాదులుకూడా తెలియును. చోళకుని శిక్షించుటకు వెళ్లి సముద్రమును దాటవలసి వచ్చినపు డీయన తన గజాధిరాజము నెక్కి సముద్రమును లంఘించెనని గ్రంథస్థమైయున్నది.[1] గజము లీత యందు మిక్కిలి సమర్థములని పురాణాదిగ్రంథములవలన తెలిసిన విషయమును రఘునాథు డనుభవముచే వ్యక్తీకరించి చూపి యీ చెప్పిన పలుకులను సార్థకపరచెను. కాబట్టి యీయన రాజ్యమునకు వచ్చునప్పటికి మిక్కిలి పరాక్రమశాలియై, సకలవిద్యాపారంగతుడై, సమస్త కల్యాణగుణోపేతుడైయుండెననుట నిజము. తంజావూరు రాజ్యముయొక్క భాగ్యము!

యాచమనాయకుడు రఘునాథునివద్దనుండి యభయ దానమును గొని యుత్తరదేశమునకు జని యెట్లు జగ్గ

1. అథావనీపతి రథిరుహ్య వారణం
విలంఘ్య తం సలిలనిధిం విరోధినః,
పురీం రయా దధిగతవీరపుంగవాం
న్యరుద్ధతాం నిరుపమ విక్రమక్రమః."
(రఘునాథాభ్యుదయకావ్యము, 8-87.)

రాయలు దక్షిణమునకు వచ్చి బలముకూర్చుచుండెనో యల్లె యాపట్ల సామ్రాజ్యసామంతులను రామరాయలకు సాయముచేయుడని ప్రచారము చేయసాగెను. అనేక సామంతరాజులు జగ్గరాయలు నెదుర్కొనుటకు నాయకుడు లేడని వేచియుండిరి. రఘునాధుడు నాయకుడుగ నుండుట కంగీకరించినట్లు వినినంతనే వారును నుత్సాహమును చూపి సాయముచేయుటకు తమ యంగీకారమును తెల్పిరి. రఘునాధునిపట్ల ధర్మము కలదు. ధర్మమే జయించునుకదా! అందర కేమిగాని కృష్ణప్పనాయకుడు[1] తన మంత్రివర్గము రఘునాధునితో పోరుట కృతఘ్నమని యెంత చెప్పినను వినకపోవుట చూడ నీయనయొక్క నీచత్వమునకు మేర లేనట్లు తోచును.[2] రఘునాధుడు చేసిన ప్రతిజ్ఞను చూతుడు.

1. జింజినాయకుడు.

2. బలవత్పరిపంథిభి ర్గృహీతః
బహుధా త్వం పరిమోచితోఽసి తేన,
ప్రభుణా రఘునాధపార్థివేన
ప్రథనం భూమిపతే న తే ప్రశస్తమ్."
(రఘునాథాభ్యుదయకావ్యము. 8-80.)

"సింధ్వంతరీపగత-చోళగళిశుణంచ
నేపాళదేశనృపశాత్రవనిగ్రహాశ్చ,
కర్ణాటభూపతినవీకరణంచ సర్వ
మాపాద్యతే తు మమ దిగ్విజయాపదేశాత్."[1]

ఇట్లు ప్రతిజ్ఞగావించి దిగ్విజయయాత్రకై రఘునాధుడు పురమువెడలుచు యావద్రాజ్యభారము నాప్తమంత్రివర్యుడగు గోవిందయజ్వాపై నుంచెను.[2] గోవిందయజ్వాయు తద్భారమును రాజభక్తితో వహించి రఘునాధునకు మారుగా రాజ్యము సేయసాగెను.

1. రఘునాధాభ్యుదయము. 8.34.
2. "ఇతీరయన్ వచన మిలాబలాహితో
ధరాధురం నిజసచివే నివేశ్యచ,
సరోహితా త్సదసి సరోష మీక్షణా
దనీకినీ మథ సమనీనహత్ క్షణాత్."
(సాహిత్యరత్నాకరము. 13, 84.)

ఇచ్చటివరకు మన కత్యంతోపకారియైన సాహిత్యరత్నాకరమింతటితో నాగుచున్నది. ఏలొకో కవి తరువాతి చరిత్రమును వ్రాయలేదు. 16-వ సర్గతో రఘునాథ దండయాత్రారంభముతో గ్రంథము ముగియుచున్నది. ఇది నాకు మిక్కిలి విషాదకరమగు నంశము. ఇకముందీ గ్రంథమునకు రఘునాథాభ్యుదయ కావ్యనాటకములు ముఖ్యాధారములు.

ప్రథమకర్తవ్యము చోళకసంహారము. ఎండకాలము వచ్చినంతనే పట్టణమును వెడలి ససైన్యుడై కావేరీ నదియొడ్డుననే చని క్రమక్రమముగా సాగరసంగమము చేరెను. చోళకుడును తన ద్వీపమున మిత్రసహితుడై సిద్ధముగా నుండెను. రఘునాథుడు తన వారణరాజముపై తానబ్ధి దాటనిశ్చయించెనుగాని సైన్యము దాటుటెట్లు? మరియొక యుపాయము తోచక సముద్రమున పడవలతో వంతెన కట్ట నానతిచ్చెను. అట్లాసముద్రమును లంఘించి దేవికోటచేరగా కోటగోడలపైనుంచి చోళకుని సైన్యమును పోర్చుగీసువారును రఘునాథుని సైన్యముపై గుండ్ల వర్షమును కురిపింపసాగిరి. రఘునాథునకు కోపమువచ్చి తన సైన్యము 'నెట్లయినను కోటలోనికి ప్రవేశింపు'డని యాజ్ఞాపించెను. సైనికులును నొకరి భుజములపై నొకరిచొప్పున నెక్కి నిచ్చెనల గావించి ప్రాకారము నెగబ్రాకి కోటలో ప్రవేశించిరి. ఎప్పుడు రఘునాథుని బలవత్తైన్య మంతయు కోటలో ప్రవేశించెనో యప్పుడు చేయునదిలేక తలుపులు తెరచుకొని చోళకుని సైన్యము చెల్లాచెదరై పారిపోయెను. చోళకుడు పారిపోవుచుండగా పట్టుకొనబడెను. సిగ్గులేక కృష్ణప్పనాయకుడు పిరికిపందవలె పారెను. అంతట ప్రజలందరును చోళకునివిడువవలదని రఘునాథుని వేడగా

వారి వేడికోలుప్రకారము వానిని కారాగృహబద్ధుని గావింప నాజ్ఞనొసంగెను.[1] రఘునాథుడు కోటను స్వాధీన

1. "మధ్యేసముద్ర మతిమానుషవిక్రమం త
మాలోక్య భూపతి రుపాయశతై రసాధ్యమ్,
ప్రాగ్జన్మదాశరథి రేవ. బలాని దృష్ట్వా
బంధుం న్యయుఙ్క్త సహసా పతి మాపగానామ్.

ప్రాకారచారి భటముక్తశిలాకలాప
వృష్ట్యా సధూమవిసరో వియతి వ్యలోకి,
పాషాణవర్ష పరిపూరితదిగ్విభాగా
కల్పాంతదుస్సహఘనాఘనమండలీవ.

అథాదిశ ద్విభు రతిరోషభీషణః
చమూం నిజాం వరణసమీపచారిణీమ్,
పురఃస్థితం వికలయితుం పురం స్యాత్
విరోధినో వివిధబలై రధిష్ఠితమ్.

నిశ్రేణికాభి ర్నృపసైన్యసంఘైః
ప్రాకార మాక్రామతి తద్భటౌఘః,
ప్రణామపూర్వం ప్రణిపత్య సాంత్వ
ముదుద్రువ త్తూర్ణ మవాప్తశస్త్రః.

అవివశం గతవ త్యథ చోళకే
గళితధీ.........కృష్ణపనాయకః,
అధికభీరథ...పవనవేగే......
.............మతీవ పలాయితః.

పరచుకొని యచ్చట తన సైనికుల కొందర నునిచి తాను ద్వితీయకార్యనిర్వహణమునకై బయలువెడలెను. మొదటిపని సుముఖమగుటచే నుత్సాహకరముగ నుండెను. ఇయ్యది భావిసూచకము.

ఇచ్చటపోర్చుగీసువారికి పరాభవమైనను రెండవ పనిగాని వారిని పూర్తిగా నోడింపజాలదు. జాఫ్నాను వారు తమ కేంద్రమును చేసుకొని యచ్చటనుండి తమ దుండగములను సాగించవలెనను నూహతో నుండిరి. రఘునాథుడు దేవికోటనుండి తిరిగి తంజావూరు రాకుండ గనే సరాసరి సముద్రతీరముననే బయలువెడలెను. ఇదియే సరియైన మార్గము. ఏలన రఘునాథునివంటి దీర్ఘదర్శి యనవసరముగా మరల రాజధానికి వచ్చి బయలుదేరి కాలయాపనము చేయునా? జగ్గరాయలు శత్రు బృందమునంతను కలియకపూర్వముకదా కార్యద్వయము సమకూర్చుకుని యంత్యకార్యమునకు సిద్ధముగ

కరుణా తవ చోళకే నకార్యా
నృప కారానిలయే నిధేహి శీఘ్రమ్,
ఇతి విప్రవరై రుదీరిత స్తం
ధరణీపాలమణి స్తథా వ్యతానీత్."

(రఘునాథాభ్యుదయకావ్యము. 8, 95–100.)

నుండవలెనని రఘునాథుని యూహ. కావ్యముకూడా యట్లే చెప్పుచున్నది.[1] పటమెక్కమాడు తిలకించిన సింహళమున కుత్తరభాగమున నున్న జాఫ్నాకు తంజాపురమండలమునందిప్పుడు పాయంటుకాలిమరని[2] పిలువబడు ప్రదేశము మిక్కిలి దగ్గర యని తెలియ గలదు. రఘునాథు డచ్చటనే సముద్రమును దాట నుద్దే శించెనని నేనూహించుచున్నాను. అట్లయిన నచ్చటకు తప్పక సముద్రతీరమార్గముననే వెళ్లియుండును. శ్రీకృష్ణ స్వామయ్యంగారుకూడా యిట్లే తలంచుచున్నారు.[3] పాయంటుకాలిమర్ వద్దగాక రామేశ్వరమువద్ద సము ద్రము దాటెనన్న నిక రెట్టింపుదూర మనవసరముగా వెళ్లవలసియుండును. రఘునాథుని నంబేదయని యను

1. " వేలాపథే తస్య విభో ర్గజానాం
కర్ణానిలైః కేతకగర్భరేణుః,
ప్రసారిత స్తత్ర పయఃపయోధి
మాకల్పయ ద్ధాతం లవణాంబురాశిమ్. "
(రఘునాథాభ్యుదయకావ్యము, 9.3)

2. Point Calimere (కోడియక్కరై): ఇచ్చట సింహళము నకును తంజావూరు మండలమునకును నిరువదిమైళ్లకంటె నెక్కువ దూర ముండదు.

3. Sources of Vijianagar, p. 289.

కొనుట కెంతమాత్రమును వీలులేదు. తప్పక దూరదృష్టితో పైనచెప్పబడిన స్థలముననే సముద్రమును లంఘించినట్లు చెప్పవలెను.

ఇట్లు తత్ స్థలము చేరి సముద్రమును దాటుటకు వెనుక దేవికోటవద్ద చేసినట్టే పడవల వంతెనను కట్టి సేనలదాటించెను. ఈపడవలనుకూడా దేవికోటనుండి సముద్రపుటొడ్డుననే తరలించికొనిపోయియుండును. పడవలును సేనయు నొకమారే చేరవలసియుండెకదా.[1] ఇట్టి యసామాన్యకృత్యములు చేయుటచేతనే యీాయన దేవాంశసంభూతుడని ప్రజలచే నమ్మబడుచుండెను. ఈయన జన్మకాలముననే యట్టి నమ్మక ముండెననియు, నచ్యుతు డీయనను వరప్రసాదమున జన్మించినవాడుగా తలచెననియు, సాహిత్యరత్నాకరకర్త చెప్పుచున్నాడు.[2]

1. "వినా ప్రగల్భం విమతాన్ జిగీషుః
మహీపతి స్తత్ర మహాంబురాశౌ,
తరీభి రేత త్తరణాయ తూర్ణ
మాకల్పయ త్సేతు మనన్యసాధ్యమ్."
(రఘునాథాభ్యుదయకావ్యము 9. 12.)

2. "అమ మద్భుతాకృతిసమం విలోకయన్
అశరీరవాక్యమపి చానుచింతయన్,

ఇట్టివిషయము లన్నియు పిచ్చినమ్మకములగు నీ కాలమున చెప్పదొరకొనుట పొరబాటు! ఒక్కటిమాత్రము సత్యము. రఘునాథుడు సామాన్యపురుషుని కంటె సృష్టికర్తయంశ మెక్కుడుకలవాడని చెప్పక తప్పదు.

ఇట్లు సముద్రమును దాటుచుండగా శత్రువులు శతఘ్నివర్షమును గురిపించిరి. ఈయనపోరాటము పోర్చుగీసువారితో నన్న నన్నివిషయములను వారికి యుజ్జీగా నున్నట్లే భావింపవలెను. నావికాయుద్ధమునందు వారు ప్రవీణులు కాని యిచ్చట నావికాయుద్ధమునకు ప్రసక్తి లేదు. ఇక శతఘ్నికోపయోగమున వారి కున్నప్రజ్ఞ రఘునాథసేనల కున్నట్లు స్పష్టము. ఈయన పోర్చుగీసువారితో విరోధము తటస్థించినదాదిగా తన సభయందు డచ్చివారికి తావిచ్చినట్లు కన్పట్టును. సేనలను యుద్ధమున తరిఫీయతుచేయుటలోకూడా డచ్చివారిచేతనే చేయించినట్లు కన్పట్టుచున్నది. యుద్ధమునమాత్రము

ఉచితం తయో రథ తనూజ ముర్వరా
రమణ శ్చకార రఘునాథభూపకమ్."

(సాహిత్యరత్నాకరము. 4-54.)

తాను స్వయముగా సేనలను నడపెను. అయ్యది నిజమైన శూరలక్షణము. సేనల కత్యుత్సాహకరము. పందొమ్మిది యవ శతాబ్దమున ప్రపంచమునందెల్ల శూరుడని పేరు వహించిన నెపోలియ నను సేనాని శతఘ్నులు ప్రేలుచుండగా లెక్కసేయక సేనాముఖమున నిలచి ప్రోత్సాహ వాక్యముల పల్కుచుండెడివాడని చరిత్రకారులు చెప్పుచున్నారు. రఘునాథుడు నట్లే చేసెనని గ్రంథములవలన తెలియనగును. పోర్చుగీసువారు గుండ్లవర్షముల గురియించుచుండగా లెక్కసేయక తాను స్వయముగా గుండ్లదెబ్బలను తాళుకొనుచు సేనను సముద్రమును దాటించెను.[1]

ఎప్పుడు రఘునాథసేనలు సముద్రమును దాటెనో యప్పుడు పోర్చుగీసువారికి భయము కలిగెను. ద్వంద్వ యుద్ధమున కవకాశము పొడమెను. తుపాకులు మొద

1. "అయోమయాభి ర్గలికావళీభి
రపాంగకోణై రపి రోషశోణైః,
అవాకిరం స్త్వగ్నికణా న్విపక్షాః
భూపాలసై న్యేషు పురఃస్థితేషు."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 9, 18.)

లగునవి శత్రువులు దూరముననున్న పనికివచ్చునే కాని దగ్గరకువచ్చి తాకిన వానివలన నెట్టి ప్రయోజనమును లేదు. వాని యుపయోగమునకు నుపయోగించు వ్యక్తుల నడుమను కొంత యభ్యంతర ముండవలెను. ద్వంద్వయుద్ధమున తప్పక రఘునాథసేనలకు పోర్చుగీసువారు తీసిపోవుదురు. తుములమైన సంగ్రామము జరిగి పూర్తిగా జననష్టము కాకమునుపే, పోర్చుగీసువారు తాళజాలక తమ నౌకల నధిష్ఠించి సముద్రమున పారిరి. ప్రేమాస్పదములుగ నార్జించిన భార్యలను, ద్రవ్యమును, నాయుధములతో కూడా వదలి ప్రాణములను దక్కించుకొని పారిపోయిరి.[1] రఘునాథుడు పడవలలో వారిని

1. "ఉదస్తనానాయుధ ముత్పతాక
మభిద్రవంతీ మవనీశసేనామ్,
ఆలోకితుం స్థాతు మశక్నువంతః
భయాత్పలాయంత ఫరంగివంశ్యాః.

ధనాని దారైస్సమ మార్జితాని
శస్త్రాణి శౌర్యేణ సమం ధృతాని,
విహాయ సర్వే భయవిహ్వలాస్తే
నిధౌ జలానాం న్యపత న్సవేగమ్."

రఘునాథాభ్యుదయకావ్యము, 9-21, 22.

దీనివలన వీ రిచ్చటికి వచ్చి కొందరు స్త్రీలను భార్యలుగా గ్రహించినట్లు కన్పట్టును.

వెన్నంట నిశ్చయింపలేదు. వారి ఛద్మకృత్యములు రఘునాథునివద్ద సాగవయ్యె! రఘునాథు డంతట పట్టణము ప్రవేశించి, తనతో వచ్చిన నేపాళభూపతిని పునారాజ్యప్రతిష్ఠితుని జేసి వెనుకకు మరలెను. ఉత్సవాదులకు తావెక్కడిది? తృతీయమగు మహాత్కార్యము ముందున్నందున రఘునాథున కెట్టి విశ్రాంతిని గొనుటకు వీలులేకుండెను. చారులు వచ్చి జగ్గరాయాదుల చేష్టలనుకూడా విన్నవింప వెంటనే పయనమై దగ్గరత్రోవను వచ్చి కావేరీతీరముననే వెనుకకు రాదొడగెను.

ఇంతలో యాచమనాయకుని ప్రేరణమున వెనుకనుదాసీనులగు చిన్న రాజు లందరును జగ్గరాయలను వదలుట పాడిగాదని రఘునాథునకు సాయముచేయ నిశ్చయించి ససైన్యులై దక్షిణమునకు వచ్చిరి. జగ్గరాయలకును తుండీరనాయకునివంటి కొంద రల్పసంఖ్యాకులగు దుష్టులు సాయముచేసిరి. రఘునాథుడు మొదటిరెండు కార్యములను నిర్వర్తించి మరలివచ్చి పరిస్థితులు కనుగొనునప్పటికి వాతావరణము వెనుకటికంటె సుముఖముగా నుండెను. రఘునాథునకు ద్విగుణబలము వచ్చెను. మొదట మిక్కిలి బలవత్తరమని యనుకొన్న జగ్గరాయపక్షమే బలహీనముగా తోచెను. పోర్చుగీసువారు జగ్గ

రాయల పక్షమున పోరాడ వచ్చినవారు రఘునాథుని పక్షమున పోరాడినట్లు కొందరు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు.[1] ఇది నిజమే యైయుండును. ఏలన, నిక్కాలమున యూరపుఖండమున నీ రిరువురకును యుద్ధము జరుగుచుండెను. తద్యుద్ధము హిందుదేశమునకును వ్యాపించియుండును. రఘునాథాభ్యుదయనాటక మిచ్చట మనకు మిక్కిలి యుపయుక్తము. అందలి భాగమును చూచిన నీ యుద్ధ ముత్తరమున కొండపల్లివద్దనుండి దక్షిణమున తంజావూరువరకును, పశ్చిమమున మెట్టపాలెము వరకును కలంచినట్లు కనుగొనగలము. రఘునాథుడు కావేరియొడ్డుననే వెడలి మొదట పళవానేరి[2] గ్రామమున విడిసెను. ఆదినము నళనామసంవత్సరాషాఢశుద్ధపంచమి. ఆపళవానేరిగ్రామమున పురాణశ్రవణము, శ్రీరామపూజ మొదలగు నర్చనము లొనర్చి సాలగ్రామదానాదిదానముల గావించి, వైష్ణవుల దీవనాక్షతల[3] శిరమున దాల్చి,

1. History of Nayaks of Madura, p. 124.

2. పళమారనేరియని యిప్పుడు పిలువబడుచున్నది. ఇయ్యది సర్. పి. యస్. శివస్వామి అయ్యరుగారి స్వగ్రామము.

3. ఇది విజయరాఘవుని ప్రత్యేకకవనమని తోచును.

యాదిత్యహృదయమును జపించి, వైదారుగడియలప్రా ద్దెక్కసరికి భోజనాదికముల నిర్వర్తించి యెదుటి సేనకు తాను బయలుదేరుచున్నట్లు కబురంపెను.[1] అంతట ముస్తీబుచేసుకొని తన పట్టపుటేనుగుపై నంబారిలో గూర్చని బయలుదేరెను. తన పెద్దకుమారుడగు రామ భద్రుడు వెంటనే వచ్చుచుండెను. పురుషోత్తమ, నరసప్ప లనునిద్దరు నొకగజముపైనను, అస్తెప్పయళగప్పలు మరి యొక యేనుగుపై నెక్కియు నాయన కిరుపార్శ్వమున రక్షకులుగా నుండిరి. దగ్గర నొకయేనుగుపై నీ యుద్ధ

1. " అంచితనళవత్సరాషాఢశుద్ధ
పంచమీపుష్యార్కపరిఘుయోగమున
స్వామివారాపళవానేరినగర
నామతీర్థము పురాణశ్రవణంబు
రామవిగ్రహపూజ రామజపంబు
శ్రీమూర్తిదానాద్యశేషదానములు
గావించి విజయంబు గలుగ నక్షతలు
శ్రీవైష్ణవు లొసంగ శిరమున దాల్చి
ఆదిత్యహృదయజపానంతరమున
నై దారుఘుడియలపు డారగించి.
*    *    *    *    *
(రఘునాథాభ్యుదయనాటకము.)

మునకు కారకుడై దానిలో జయమొందిన లాభము నొందు రామదేవరాయలుకూడా రణరంగమునకు వెడలెను. క్రమముగా తరువాత దొరలును, రాజులును వారి మర్యాదవరుసను వెన్నంటిరి. ఇచ్చట పేర్కొన్నవారినిబట్టి దక్షిణదేశమున నొక్క మైసూరును, నంతకు పశ్చిమమున నుండు రాజులును, తిరువాది (తిరువాన్కూరు) రాజును తప్ప మిగిలిన చిన్నిపెద్దరాజు లందరును నేదోయొకవైపున నీయుద్ధమున పాల్గొనినట్లు కన్పట్టుచున్నది. జగ్గరాజకార్య మెంతవరకు ప్రాకెనో యెందరను మూలలనుండి లాగెనో చూడుడు! తద్గ్రంథభాగంబు నిట ననువదింతును:

" * * * *

భేరులు మ్రోయించి పెండ్లికి బోవు
తీరున తగిన ముస్తీబు గావించి,
ఎదుటిసాళెంబున[1] కెరుకసేయించి
కదలివచ్చి విజయగరుడాద్రి[2] నెక్కి

1. సైన్యము, దండు.
2. అంబారీ పేరు.

రామభద్రగజాధిరాజంబు[1] నెక్కి
రామభద్రకుమారరత్నంబు[2] గొలువ,
మతిశాలి పురుషోత్తమయనరసప్ప
జతగూడి నగరిమదాలశీల్ గొల్వ
ఎదురెచ్చరించుచు నేకపార్శ్వమున
మదగజం బెక్కి సమ్మదమున నడువ,
యస్తెప్ప, యళగప్ప యాప్తులై యెక్క
మస్తేన్గుపై నెక్కి మక్కువ నడువ,
రాజులు మన్నీలు రౌతులు దొరలు
తేజీలపై నెక్కి ధీరులై కొలువ,
చేరువ నొక గంధసింధురం బెక్కి
ఆరామదేవరాయలు[3] చనుదేర,
తరతరమ్ములకును తగువైన కతన
నెరనమ్మదగిన కోనేటికొండ్రాజు
కట్టరంగపరాజు కస్తురిరాజు
మిట్టపాళెంపు[4] సంపెటనాగరాజు

1. పట్టపుచేనుగు.
2. పెద్దకుమారుడు.
3. విజయనగర చక్రవర్తి.
4. మెట్టపాలెము కోయంబత్తూరు జిల్లాలో నున్నది.

రామరా[1]జలయాకు రఘునాథరాజు
మామవోబుళరాజు[2] మనుబోలు[3]రాజు
శ్రీరంగపతిరాజు శ్రీగిరిరాజు
వీరరాఘవరాజు విఠ్ఠలరాజు
నందేల[4]చిట్రాజు నారపరాజు
కందనవోల్రాజు[5] గడితిమ్మరాజు
కాలువరాజులు కడపరాజులును
పాళెలరాజులు పంటరాజులును
శ్రీపతివారు కైజీతంపుదొరలు
జూపల్లివారు దేసురిరెడ్లతెగలు
మామమూర్తెప్ప[6] కుమారరంగయ్య
పామినాయనివారు బలుమూరివారు

1. ఔకువారి చరిత్రమునకు శ్రీ చి. వీరభద్రరాయలిఖితమను "అళియరామరాయలు" అను గ్రంథమును చూడుడు.

2. వెంకటపతిరాయల మేనమామయగు పోచిరాజు ఓబళరాజని తోచుచున్నది.

3. నెల్లూరుజిల్లాలో నున్నది.

4. నంద్యాల; ఇది కర్నూలుజిల్లాలో నున్నది.

5. కర్నూలురాజు.

6. రఘునాథుని మేనమామ.

మండువవారు కంబము[1] కొండవీటి[2]
కొండపల్లెడ్లు[3] నంకుశరావువారు.

*　*　*　*

మొదలైన గురిదొరల్ ముందర నడువ
కదనరంగమునకు కదలిపోవగను."

(రఘునాథాభ్యుదయ నాటకము.)

ఈ గ్రంథము రఘునాథపుత్రకృత మగుటచేతను, నాయన యిచ్చు తప్సీళ్లనుబట్టియు నిది యీభాగమున మనకు ప్రమాణము. ఇట్లు వెడలి తోపూరుగ్రామమును చేరెను. అదివరకే తోపూరున శత్రువులు శిబిరము నేర్పరచుకొని సిద్ధముగ నున్నట్లు తెలియుచున్నది.[4] ఈయుద్ధ

1. కర్నూలుజిల్లాలో నున్నది.
2. గుంటూరు మండలమున నున్నది. సుప్రసిద్ధరెడ్డిరాజధాని.
3. కృష్ణామండలమున బెజవాడవద్ద నున్నది.
4. "ఆత్మీయసైన్యాహృతచందనాఘం
పాటీరశైలం యశసా ప్రసాద్య,
అధిప్రతీచ్యా మరిరాజధానీం
తోపూరభిఖ్యా మగమత్స తూర్ణమ్."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 9, 27.)

మిప్పటికిని నేసంపూర్ణ చరిత్రగ్రంథములోనికిని నెక్కియుం డలేదు. ఇయ్యది యాకాలమునకు మిక్కిలి ప్రసిద్ధము. దక్షిణమునకు మహమ్మదీయుల రాకను కొంతకాలము వరకు నాపిన దీయుద్ధమే! తోపు రుయుద్ధమున రఘునాథు డోడిపోయిన దక్షిణ దేశమును మహమ్మదీయులు 40 సంవత్సరములు ముందాక్రమించుకొనియుందురు. కొంత కాలమింకను హిందూసామ్రాజ్య ముండవలసియుండెను

ఈ వెడలిన సేన యూరాత్రి యచ్చటవిడిసినట్లును,[2] యుద్ధము మరునాడైనట్లును తెలియుచున్నది. రాత్రి యంతయు వేత్రధరులు శిబిరమును కాపాడుచుండిరి. శత్రు వెక్కడ నాకస్మికముగ పైన బడునోయని రఘునాథుడు నిద్రమానుకొని బహుజాగరూకుడై యుం డెను.[1] తెల్లవారెను. కొలదికాలమునకే యిరుప్రక్కలను

ఇప్పుడీగ్రామము తోపూరని పిలువబడుచున్నది. పళవానేరికి 7 మైళ్లదూరమున కావేరీతీరమున కలదు. మన్య నేమం, అగరప్పేట, సీతమంగలం, పాదరకుడి, యని నాల్గు గ్రామములు దగ్గరదగ్గరగా నున్నవి. ఇయ్యవి యన్నియు కావేరి దక్షిణతీరమున నున్నవి.

1. పరేద్యవి ప్రౌఢరణః పరై ర్నో
బలివ్యతీతి ప్రతియామినాథమ్,

ఫిరంగులు మ్రోయ ప్రారంభించెను. తుపాకు లుపయోగింపబడెను.[1] వానినుండి వచ్చు ధూమ ముభయసేనల నావరించెను. ఈయుద్ధము వెనుక మనము తెలిసికొన్నట్లు నళనామసంవత్సరాషాఢశుద్ధపంచమికి మరునాడు అనగా షష్ఠినాడు జరిగెను. ఆదినము సరిగా క్రీ. శ. 1616-వ సంవత్సరము జూన్ నెల 27-వ తేది యగును. శ్రీకృష్ణస్వామయ్యంగా రాగష్టుసెప్టెంబరు నెలలని వ్రాసినారు. ఎట్లయినను క్రీ. శ. 1616-వ సంవత్సరమున నీయుద్ధము నడచినట్లు స్పష్టము. మరియొక నళనామసంవత్సర మీకాలమున కెంతమాత్రము సరిపోదు. విజయరాఘవు డిచ్చిన దినమును తప్పక గ్రహించితీరవలయునని నాయాశయము. మరియెచ్చటను నీయుద్ధకాల మియ్యబడియుండ లేదు.

న్యవేశయ న్స్వేత్రధరా న్నిశాయాం
నిదేశత స్తత్ర నృపాల మౌళిః."
(రఘునాథాభ్యుదయ కావ్యము. 9-48.)

1. "అన్యోన్యేషా మగ్నియంత్రై రుదీతైః
ధూమై ర్వ్యాధా దుర్నిరీక్ష్యే రణోర్వ్యామ్."
(రఘునాథాభ్యుదయ కావ్యము. 10-2.)

2. History of Nayaks of Madura, p. 103.

రఘునాథుడు వ్యూహరచనమునందుకూడ సామర్థ్యము కల్గియుండెను. తన సైన్యమునందలి యెదుటిభాగమున నగ్నియంత్రముల నుంచి వానివెనుక పాదాతులతో ప్రాకారము కట్టి మధ్య యాశ్వికులను మండలాకారరేఖగా నుంచెను.[1] ఇట్లు రఘునాథుని సేనాప్రాకారము దుర్నిరీక్ష్య మయ్యెను. సామాన్యసైనికునివలె తాను సేనాముఖమున సైనికుల కుత్సాహము కొల్పుచు సైన్యమును యుద్ధమునకు పురికొల్పుచుండెను. పాండ్యరాజు ససైన్యుడై కనపడినప్పుడిక తనకోపము నాపుకొనలేక వానిపై కృపాణహస్తుడై రోషారుణితనేత్రుడై దుమికెను. రఘునాథుని శౌర్యమున కాగలేక పాండ్యుడు పారెను. అంతట తాను మొనగానివలె సబంధుడై జగ్గరాజు రఘునాథుని తాకెను. రఘునాథజగ్గరాయల ద్వంద్వయుద్ధముయొక్క పర్యవసాన మేమగునో సూచించుచు కవయిత్రి యీక్రిందివిధముగ వ్రాసెను.

1. "సంగ్రామాంత స్సాదివర్గేణ క్లృప్తా
కాంభోజానాం మండలాకారరేఖా,
పాదాతానా మచ్యుతక్ష్మాపసూనోః
ప్రాకారోఽభూ ద్దుర్నిరీక్ష్యం విపక్షైః."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 10-14.)

"పాండ్యక్షోణీపాలసైన్యే సదైన్యం
ప్రత్యావృత్తే జగ్గరాజ స్సబంధుః,
బద్ధోత్సాహః ప్రత్యగా త్పార్థివేంద్రం
భాస్వంతం ద్రాక్ పావకం వా పతంగః."

(రఘునాథాభ్యుదయ కావ్యము, 10. 27.)

ఆ జగ్గరాజును 'మేము చంపుదుము, మేము చంపుదు' మని యహమహమికతో నున్న సైన్యబృందము నాయనకు రఘునాథునిచేతిలో మడియు గౌరవ మియ్యకుండ తామే వచ్చి యాయనను తాకి సబాంధవునిగా నిహతుని గావించిరి.

"అగ్రే యోధై రచ్యుతక్ష్మాపసూనోః
క్రోధావేశా ద్గుంభితః కుంతజాతైః,
భ్రశ్యత్ప్రాణో బంధువర్గేణ సాకం
జన్యక్షోణ్యాం జగ్గరాజః పపాత."

(రఘునాథాభ్యుదయ కావ్యము, 10. 28.)

అప్పుడు నడచిన తుములసంగ్రామమును విజయరాఘవుడు మిక్కిలి రసవంతముగా నీక్రిందివిధమున వర్ణించినాడు:—

"భ్రమసిన పడమటి పాళెంబుమీద
దుమికి హుటాహుటి దొక్కొని నడవ
అమ్ములచేత చేయమ్ములచేత
దుమ్ములచేత దోదుమ్ములచేత
బల్లెలచేత తుపాకులచేత
నల్లమూకలచేత నడగొండలైన
మత్తేభములచేత మావులచేత
కత్తులచేత చీకాకుసేయింప,
పోరిలో సమసె గొబ్బురిజగ్గరాజు."

(రఘునాథాభ్యుదయ నాటకము.)

జగ్గరాయా! నీవెంతటి దుర్మార్గుడవైనను రణరంగమున మృతినొందితివి! నీసుకృతలేశము నిన్ను వీరస్వర్గము జేర్చినది!

ఎప్పుడు జగ్గరాజు కూలెనో సైన్యములకు, నాయకులకుకూడా ధైర్యము సడలెను. శత్రుకోటిలోని నాయకు లెవ్వరెవ్వ రెట్లు పరిభూతులైరో కావ్యనాటకములు రెండును బహురసవంతముగా వర్ణించుటయె గాక విషయముల నేకీభవించుచున్నవి. మాకరాజు[1]

1. కార్వేటినగరము నేలుచుండెడి సాల్వమాకరాజు. కృష్ణపనాయకునకు నీయనకు కడుస్నేహము.

మూకలవెంటబడి పారెను. దళవాయిచెంచు సిగవిడిపోవ వెనుకకు తిరిగిచూడకుండ పారిపోయెను. రావిళ్లమాద న్నయు పిక్కబలము చూపెను. కృష్ణప్పనాయకుడు త న్నింతవరకు తెచ్చిన మధురముత్తు వీరప్పనాయకుని తిట్టు కొనుచు నిర్లజ్జుడై పారెను. ముత్తువీరప్ప తనతో నాయ కులై వచ్చిన తిత్తెప్పశెట్టి మొదలైనవారు తనకంటె ముందే పారిపోవ చేయునదిలేక 'అయ్యో! భార్యల విడ నాడి సొమ్మంతయు నాశనముచేసి తుద కిట్లు పార బడితినే' యని పశ్చాత్తప్తు డగుచు చేతిలోని ఖడ్గము విసరి పారవైచి పారిపోవుచుండెను.[1] పారిపోవుచున్న

1. పారె మూకలవెంట బడి మధురరాజు,
తగదొట్టి వగబుట్టి దళవాయిచెంచు
సిగవిడి తెగబార చింతించ కేగె,

* * * * *

విడబడి పారె రావిళ్లమాదన్న,
మధురవారిని గూర్చి మమ్మింత జేసె
విధియంచు తనపాలి విధి దూరుకొనుచు
దొరలెల్ల నవ్వంగ తుండీరవిభుడు
పరువెత్తె తన జింజిపట్టణంబునకు,
తిరువందినాపల్లి తిత్తెప్పశెట్టి

పురము తిమ్మానేండు భుజబలరావు
చినరాతు యెర్రమశెట్టి లోనైన
తనవద్ది దొరలెల్ల తను డించి పార
ఇంతుల నెడబాసి యిలు చూర యిచ్చి
సంతరించిన బొక్కసము వీడబుచ్చి
తురగంబు డిగ్గి కైగువ పారవైచి
విరిగి పార దొరంగె వీరపనేండు."

(రఘునాథాభ్యుదయ నాటకము.)

వీరపనేండు = ముత్తువీరప్పనాయకుడు.

"జన్యే సైన్యే ర్జగ్గరాజాదిమేషు
వ్యాపన్నేషు వ్యాప్తభీః పాండ్యవీరః,
క్షోణీరక్షాక్షోభ్య బాహాబలాఢ్యో
హ్యాత్మప్రాణత్రాణరక్షాకులోఽభూత్.

స్కంధావారే గంధనాగాశ్వ సంఘా౯
యోషారత్నద్రవ్య భూషావిశేషా౯,
పాండ్య స్త్యక్త్వా ప్రాణభీత్యా సమిత్యాం
ధీమా౯ క్రోశం ప్రాద్రవీ ద్దీనదీనః.

తుండీరాణా మీశితా దుర్నయేన
ప్రాపయ్యైనం పాండ్య మత్యంతభంగమ్,
సద్యోఽధావీ త్తేన సాకం రణోర్వ్యా
మగ్రే సైన్యం హాస్యమానోఽ స్తలజ్జమ్.

ముత్తువీరప్పను రఘునాథుని సైనికులు పట్టితెచ్చి రఘునాథుని ముందర బెట్టిరి. రఘునాథుడు శూరుడయినను దీనరక్షాపరుడుగాన తనకు వశంవదుడగు శత్రువును చంపక శూరపురుషోచితముగ ప్రాణదానము నొసంగి యెన్నటికిని ఇట్టిపనుల నొనరింపవలదని మందలించి విడచెను.[1] ఈదానముచే రఘునాథు డిహపరముల రెంటిని

ఘోరే వీరాశంసనే ఘోషపూర్వం
ధైర్యం త్యక్త్వా ధావతాం క్ష్మాపతీనామ్,
సంఘైస్సాకం ప్రస్తహస్తాయుధస్సన్
విగ్రోఽధావ త్తత్ర రావిళ్లనేంకః.

వ్యర్థాన్ వీరో వ్యాహరన్ వీరవాదాన్
యుద్ధక్షోణీం శూరవ ద్యోద్ధు మేత్య,
ప్రాగేవ ద్రాక్ ప్రద్రవ త్పాండ్యభూపాత్
మధ్యేసైన్యం మాకరాజన్య దైన్యమ్.

జన్మారభ్యాఽదృష్టసంగ్రామరంగః
చంచద్గర్వో రాయదళ్లాపిచేంచుః,
రక్తాసిక్తాన్ రాజరాజీకబంధాన్
ద్వారే దృష్ట్వా దుద్రువు ర్ధావమానః."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 10-34—39.)

1. "ధీరోదాత్తో దీనరక్షాధురీణ
స్సద్యో భూప స్సహ్యకన్యాతటాగ్రే,

సాధించెను. తరువాత ముత్తువీరప్ప బ్రతికియున్నంత కాలము రఘునాథుడన్న సింహస్వప్నమై తంజావూరు వైపు కన్నెత్తి చూడ వెఱచెను. మిగిలిన సైన్యము యథా యథలై పారెను. రాజ్యరమ రఘునాథునితో కూడి యాయనజీవిత శేష మంతయు సంగీతసాహిత్యకాలక్షేప మున నాయనకు ముదముగొల్పెను. రఘునాథా, సిద్ధ సంకల్పుడ వైతివి!

ఎప్పుడు రామదేవరాయలను పట్టాభిషిక్తుని గావింతునా యని యిదివరకే రఘునాథు డువ్విళ్లూరు చుండెను. కావున యుద్ధభూమియందే రామరాయల పట్టాభిషేకము కావించెనని యూహింపనగును. రామ రాయలను రణరంగమునకు దీసికొనిపోవుట యీయూ హకు బలమొసంగుచున్నది? లేకపోయిన నాబాలుడు రణరంగమున నేమిచేయునని యచ్చటికి గొంపోబడెను? కావున రామరాయల పట్టాభిషేకము తోపూరురణరంగ మునసే జరిగెను. రఘునాథుడు తోపూరుగ్రామమును

ప్రౌఢాం కీర్తిం ప్రాప్తుకామో వ్యతానీత్
పాండ్యక్షోణీపాలకప్రాణదానమ్."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 10-61)

నాశనము చేసినట్లు కొన్ని యరవ గ్రంథములవలన తెలి యుచున్నది. తద్గ్రామనాశన హేతువులగు శత్రుఘ్ను లెన్ని యో తద్గ్రామమున పడియుండును. కాబట్టి య ట్లాగ్రా మము పాడగుటలో నెట్టి యాశ్చర్యమును లేదు.

రఘునాథాభ్యుదయ కావ్యనాటకములు రెండును రామరాయల బేర్కొని యుద్ధమున యాచమనాయకుని బేర్కొనుచుండలేదు. ఇయ్యది వింతగా నున్నది. బాలుని తంజావూరునకుతీసుకునివచ్చినట్టియు,నుత్తర దేశమునందలి సామ్రాజ్యసామంతుల నందరిని ప్రేరణచేసి యుద్ధమున పాల్గొనున ట్లొనర్చినట్టియు, యాచమనాయకుడు తుదకు యుద్ధమున పాల్గొనలేదని విశ్వసించుట కెట్టి యవకాశ మును లేకున్నది. కాని మన గ్రంథమున నాయనపేరే తగులకుండుట యంతకంటె విచిత్రముగా నున్నది. కాని యుద్ధమున పాల్గొని గ్రంథస్థులైన మాకరాజ రావిళ్ల వెంకలతోబాటు యాచమనాయకుని పేర్కొనుచున్న యీచాటువును చూడుడు:

"ఉ. గొబ్బురి జగ్గరాజు లొక
కోటియు, డెబ్బదికోట్ల మాకరా
జబ్బలు, లక్షమీద పది
యార్గురు రావిళ వెంకలైన, మా

నిబ్బరగండ సూచధర
ణీపతి ముందట నిల్వశక్తులే,
కబ్బులు లేక బెబ్బులి ము
ఖాముఖి మేకలు నిల్వనేర్చునే."

ఈసందర్భమున మన యనుమానమును బహులాశ్వచరిత్రములోని యీక్రిందిపద్యము తీర్చుచున్నది.

"సీ. ఉత్తరమల్లూరియొద్ద దావలుపాప
విభుని గొట్టిననాటి విజయకలన
తిరుమలజేరి ధాత్రిని మన్నె రాజుల
బారద్రోలిననాటి బాహుబలము
చెంగలుపట్టు వీక్షించి లగ్గలువట్టి
యాక్రమించిననాటి విక్రమంబు
పాలెంబుకోటవెల్పట నాజి యతిరాజు
బరగజేసిననాటి శౌర్యపటిమ
గీ. మున్నె తోపూర జగ్గరాణ్ముఖుల నొంచి
మధురదొర జెంచిమన్నీని మద మడంచి
తిరుచినాపలివ ‍ ిం దోలు తేజముగల[1]
మేటి వెలుగోటియాచని సాటి గలరె?[1]"

1. బహులాశ్వచరిత్రము, దామర్ల వెంగళభూపాలకృతము.

ఈకృతికర్తయగు వెంగళభూపాలుడు రామరాజును సమకాలీనుడై యాచమనాయకుని బావమరదియై యుండెను. అందుచే నవశ్యమీయనవాక్యము మన కాదరణీయము. ఇందుతో యాచమనాయకునిగూర్చిన సందియము తీరినది. ఆయన యుద్ధకాలమున నుండుటయె గాక యందు పాల్గొనెను. పట్టాభిషిక్తుడైన రామరాయలతో రఘునాథుడు యాచమను పెనుగొండ కంపెను. అచ్చటనున్న సామంతు లందరును రామరాజెప్పుడు వచ్చునాయని యెదురుచూచుచుండిరి. వెంటనే రామరాయలు గద్దెయెక్కెను. దక్షిణమునుండి మధురాజులీ రామరాయల కాలమున నాయనకు నొత్తిడి కలిగించినట్లు కానరాదు. రఘునాథు నాశీర్వాదబల మియ్యది.

జగ్గరాయపాండ్యుల కిరువురకు నీయుద్ధము స్వార్థప్రేరితమని వెనుక మనవిచేసియున్నాను. అబద్ధపు మేనల్లునికి రాజ్యము తెప్పించి వానిని మెట్టుగా చేసుకొని విద్యానగరసామ్రాజ్యసౌధము నధిష్ఠించవలెనని జగ్గరాయ లూహించెను. జగ్గరాయల సాయముచే ప్రక్కలోనిబల్లెమగు తంజావూరును నాశనమొనర్చి తత్సాయముచేతనే తాను స్వతంత్రుడై వరలగల్గుదు ననుకొనుట ముత్తువీరప్పకు స్వార్థము. కాని కృష్ణప్పనాయకున కేమి

స్వార్థము? స్వార్థము లేకపోవుటయేగాక తనను రక్షిం చిన రఘునాథునిపై కత్తినెత్తిన యపకీర్తికి భాజను డయ్యెను. యుద్ధానంతరము సిగ్గుపడి ముత్తువీరప్ప తన రాజధాని కదలక తలదాచుకొనియుండెను. కాని కృష్ణ ప్పనాయకుడు తన దౌర్మార్గ్యమును తరువాతకూడా సాగించి తన దుష్టత్వమును సార్థకపరచుకొనెను. సహజ కృతఘ్నతను ప్రపంచమున నాచంద్రతారార్కముగా చాటెను. నిజముగా రఘునాథునితో మైత్రిగలిగి మెలగిన తనకు స్వాతంత్ర్యము లభించుటయెగాక నీయపకీర్తి వచ్చెడిది కాదుకదా? మంత్రులు చెప్పిన మంచిసలహాను విననందుల కిది ఫలము. ఇంతటితో నూరుకొనక, నిర్ల జ్జుడై యెవ్వరినోకూర్చుకొని, యింకను రఘునాథున కొత్తిడి కల్గింపవలెనని ప్రయత్నము లొనర్చుచుండెను. రఘునాథున కిది తెలిసి, కృష్ణప్పపరాక్రమము నెరింగినవా డగుటచే నీయనను జయించుటకు తన దళవాయి చాలు నని యొకని నాయనపయి కంపి తాను పంచనదక్షేత్రము[1] వచ్చి స్వామిసేవ యొనరించుచు మరల వార్త వచ్చువరకు వేచియుండెను. సేనానాయకుడును వెడలి కృష్ణప్పను,

1. తిరువాడి.

ఆయనకు సాయముచేసిన మెతిరాజు[1] మొదలగువారిని పాగ రడంచి కృష్ణప్పను పలాయితుని గావించి తమ నేలికకు విజయవార్తను విన్నవించెను.[2] కృష్ణప్పప్రయో

1. వెనుకటి బహుళాశ్వ చరిత్రమునందలి యనువాదమును చూడుము.

2. "ఖడ్గైః పురా తవ సమరే పరాజితః
త్రిపాం వినా ధరణిధరైః స్వసన్నిధైః,
విచార యత్యధిపమణే విరోధితాం
స కృష్ణభూపతి రతిసత్వవానివ.

అవనీపతి రాశయే విధేయం
సకలం హస్తగతం విచార్య సమ్యక్,
అధిపంచనదం శనై రయాసీ
త్తటమార్గేణ మరుద్వృధాలటిన్యాః.

అధివస న్నథ తత్ర సభాంతరే
సముపగమ్య సమాచరితానతీన్,
ఉపగతోత్తర దిగ్విజయోత్సవాన్
ప్రభు రలోకత యూథపతీ న్నిజాన్.

అధిపతి మవద న్నథాగతాన్తే
విమతనరాధరవీరరక్షితాని,
భువనగిరిముఖాని భూపదుర్గా
ణ్యాహృత ససత్వర మస్మదీయయోధైః.

జకత్వ మెప్పుడును పారిపోవుటయేకదా! ఇదియే కడసారి మైసూరుమాత్ర మీబురదలో కాలు పెట్టలేదు. అప్పటికి కొలదిసంవత్సరముల క్రిందటనే యది స్వతంత్రమై శ్రీరంగపట్టణమును తనలోనికి చేర్చుకొనెను. నూతన రాజ్యోన్నతి కెక్కడ హాని కలుగునో యనునూహా చే నూరకుండెను.[1] కాని మైసూరు ముఖ్యముగా రామ దేవరాయలకు సాయ మొనర్పవలసియుండెను. అట్లు చేయకుండుట దాని లోపమని చెప్పకతప్పదు.

తోపూరుయుద్ధమునకు పూర్వము ముత్తువీరప్ప తంజావూరునకు దగ్గరగ నుండి తన విరోధనాటకమును సాగించుటకుగాను మధురనుండి తన రాజధానిని తిరుచినాపల్లికి మార్చెను. జగ్గరాయని త్రాణముగా జేసికొని తన స్వార్థమును సంపాదింపబోయి ముత్తువీరప్ప పరాభూతుడయ్యె. ఎవ్వరిపై తా నాశ పెట్టుకొనియుండెనో యట్టి

అథ కృష్ణజనాధిప స్సమేతో
యతిరాజ ప్రముఖై రతీవ యత్నాత్,
సమరాయ సమాగతోఽస్మదీయైః
భటవర్యై ర్విజితః పలాయితోఽభూత్. "
(రఘునాథాభ్యుదయ కావ్యము, 10, 66-76)

1. History of Nayaks of Madura, p. 103.

జగ్గరాజు నిహతు డయ్యెను. జగ్గరాయని చావుచే ముత్తు వీరప్ప యాకాశహర్మ్యము లంతరించెను. తంజాపుర సూర్యున కింకను మట్టమధ్యాహ్నము దాటి యపరాహ్ణము కాలేదు. అందువలన శత్రువులకు దుర్నిరీక్ష్యుడుగ నుండెను. రఘునాథుని శౌర్యపరాక్రమాగ్నికి జగ్గరాయాదులు శలభాయమానులై పోయిరి. ఒకవేళ ముత్తువీరప్ప మరల తల యెత్తదలచినను పరిస్థితులు మిక్కిలి ప్రతికూలము లయ్యెను. సామ్రాజ్యము పూర్వ వంశవశంవద మయ్యెను. మైసూరిప్పటిలో యుద్ధమునకు దిగునట్లు లేదు. కృష్ణప్ప యెచ్చటికి పోయినను జ్యేష్ఠాదేవి ముం దేగుచుండును. ససహాయుడై యుండగనే ముత్తువీరప్పగతి యింతయగునపుడు, అసహాయుడైన నిక చెప్పుట కేమున్నది? మధుర తంజావూరును జయించు కాల మింకను రాలేదు. తద్గౌరవాగౌరవములు చొక్కనాథునకును, వీరవైష్ణవమునకు దక్కవలసియుండెను.

ఈయుద్ధమువలన తంజావూరున కత్యంతగౌరవము లభించెను. రఘునాథునికీర్తి దిగంతవిశ్రాంత మయ్యెను. రఘునాథు డంత జయధ్వానులతో నిజపురి

చేరెను.[1] పాప మచ్యుతు డిప్పటికిపూర్వమే మరణించిన ట్లున్నది. ఆయనప్రశంసయే యెచ్చటను గానరాదు. ఆయన జీవించియున్న నెంత సంతసించువాడో! ఇప్పటి నుండి కొన్నివత్సరములవరకు తంజాపూరన్న భయము గొల్పుచుండెను. రఘునాథుడన్న గర్భనిర్భేదకమయ్యెను. ముత్తువీరప్పతరువాత రాజ్యమునకు వచ్చి యాయన తమ్ము డును మిక్కిలి పరాక్రమశాలియని ఖ్యాతివహించినట్టి యు తిరుమలనాయకుడు రఘునాథుడు జీవించియున్నంత కాలమేగాక తరువాత కొన్నిసంవత్సరములుకూడా తన యన్నపరాభవమును మరచిపోయెను. తిరుమలుడు రాజ్యమునకు వచ్చిన వెంటనే మరల రాజధానిని మధురకు మార్చెను.[2] రఘునాథుడు తోపూరుయుద్ధజయసూచక ముగా స్తంభమును నాటినట్లుచెప్పుచున్నారుగాని యట్టిది యెచ్చటను గానరాదు. మధురతంజాపూర్లకు మొదటి నుండి లక్ష్యములోనే భేద ముండెను. ఇంటివానికిని, జీత గానికి నెట్టిభేదమో యట్టిభేదముండె ననదగును.

1. ప్రౌఢక్ష్మాపకులావతంసనిలసత్పార్శ్వ ద్వయీాకై ర్భలై
రానందాతిశయా దగా న్నిజపురీం తంజాభిధానాం తదా."
(రఘునాథాభ్యుదయ కావ్యము, 10, 77)

2. History of Nayaks of Madura, p. 113.

పోర్చుగీసువారు క్రమముగా డచ్చివారిచేతులలో నోడిపోవ మొదలిడిరి. అందుచే డచ్చివారు రాజుల యాస్థానములలో ప్రవేశము కల్గించుకొనిరి. రఘునాథునికి యుద్ధములోకూడా డచ్చివారు సాయము చేసినట్లు మనకు తెలియును. రఘునాథుని కీర్తిప్రతిష్ఠలు వ్యాపించి పరరాజ్యములవారు రాయబారులను తంజాపురాస్థానమున కంపి రఘునాథుని మైత్రిని కోరిరి. బీజపురము హానుమోజిపంతు లను పేరుగల రాయబారిచే స్నేహవార్త నంపెను.[1] విజయవిలాసములోకూడ నీ విషయమునకు సాక్ష్యము కలదు.

"సీ. ఏరాజు భుజశౌర్య మేదులఖానాది[2]
వజ్రీలచెలిమికి వశ్యవిద్య."[3]

1. "బలపౌరుషము లెంచి పాచ్ఛాపువారు
సమయోచితోక్తుల చాల లాలించి
తమముద్రచే కాగితము శిఖావేసి
ఘనముగా మీ కుడుగరలు కట్టించి
హనుమోజిపంతుల నంపించినారు."

పాచ్ఛాపువారు=బాదుశహగారు.

(రఘునాథాభ్యుదయ నాటకము)

2. అదిల్ ఖాను=బీజపురము సుల్తాను.
శివభారతమునకూడ "ఏదిలశ" అని యీయన పేర్కొనబడినాడు.
V. A. Smith, History of India, p. 297.
(క్రీ. శ. 1611—1658)

3. విజయవిలాసము, ఆ. 1.

రఘునాథుని కాలమున నిది తుదియుద్ధము. తరువాత రఘునాథున కంతయు సుఖచింతనే కాని మనస్తాపము లేకుండెను. ఇదియే యాంధ్రకర్ణాటసంస్కృత భాషలకు ఫలకాలము. సరియైననాయకుడు కృతిభర్తృత్వమునకు కవులకు దొరకెను. అందును తాను స్వయముగా పండితుడు.

"విద్వానేన విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్"

అన్నట్లు వారి కష్టసుఖముల తెలిసినవా డగుటచే కవులకు పట్టుకొమ్మ యయ్యెను. ఒక్కకవులకుమాత్రమే కాక చిత్రకళాకౌశలముకలవారలకందరకును తంజానగరాస్థానము పోషకమయ్యెను. రామభద్రాంబ తన కావ్యమునందలి 11, 12 సర్గలయందు రఘునాథుని తుదిదినములను సంగీతసాహిత్యగోష్ఠితో గడపినట్లు చెప్పియున్నది.

ఈయనయు తన తండ్రితాతలవలెనే సర్వమతసమత్వముతో వర్తిల్లెను గాని తంజావూరు సంస్థానమున మతములను పీడించు నను నపకీర్తికి పాలుచేయలేదు. క్రైస్తవమతవ్యాపకమునకు కూడ తోడ్పడి యీయన వారికి సౌకర్యములను కలుగజేసెను.[1]

1. "The Danish fort at Tranquebar (The Dansborg) was founded in 1620 A. D. by one Gedde

రఘునాథుని సభయందు సంగీతచక్రవర్తులును, సాహిత్యసామ్రాజ్య ధురంధరులును, కవి శేఖరులును, నసంఖ్యాకు లుండిరి. భోజకృష్ణరాయ లిద్దరును నీయనయందు మూర్తీభవించిరి. కవిపికకంఠము వినబడుటకు సుభిక్షవసంతము రావలదా? తోపూరుయుద్ధానంతర మట్టికాలము సంప్రాప్త మయ్యెను. కవుల కడుపులు నిండి వివిధములైన పల్కు లుద్భవిల్లెను. రాజు కార్యాంతర వ్యాపృతుడై మనస్సునకు స్తిమితము లేనికాలమున కావ్య

on behalf of recently established Danish East India Company. In a former venture in A. D. 1618 the Company's vessel had been recked off the Coramandal coast, and the captain Crape (who had spent some time in youth at Tanjore) had made his way to the court where the Nayak took him under his protection. He obtained from the king a grant of the strip of country five miles long by three miles broad at an annual rent of 3,111 Rupees. On this land the Danish settlement of Tranquebar was built by the co-operation of Crape and Gedde. Four years later the fort became the property of the kings of Denmark (1624) to whom the company owed money, and remaind in his posesssion till A. D. 1845 when it was ceded to the English East-India Company."
(Tanjore Dt. Gazetteer, p. 333.)

రచనకు కాలమెక్కడిది? ఇందులకు "నిరుపహతిస్థలంబు" అను పెద్దనపద్యమే తార్కాణము. "ఊరకకృతుల్ రచియింపుమటన్న శక్యమా?" రఘునాథునికాలమున వ్రాయబడిన గ్రంథము లన్నియు రఘునాథుని జయమును ప్రశంసించుట యీయూహకు ప్రబలమైన యాధారము. అన్నియు కొంచెమో గొప్పయో కంఠోక్తిగానో వ్యంజకముగానో రఘునాథునియొక్క తోపూరువిజయమును పేర్కొనుచున్నవి.[1] ఈయనకాలమునందలి సంస్కృతకవులలో గోవిందకుటుంబమును,—అనగా గోవిందుడును పుత్రద్వయమగు యజ్ఞనారాయణవేంకటమఖులును,—రాజచూడామణిదీక్షితుడును, కృష్ణాధ్వరియు, తాతాచార్యుడును, మధురవాణీరామభద్రాంబలును ముఖ్యులు. ఆంధ్రకవులలో చేమకూరవెంకటకవి ముఖ్యుడు. మధురవాణీరామభద్రాంబలు ఆంధ్రకవయిత్రులనికూడా

1. 'కవిత్వవేది' విజయవిలాసము క్రీ. శ. 1640–వ సంవత్సర ప్రాంతమునందు వ్రాయబడినట్లు చెప్పినాడు. అప్పటికి రఘునాథుడే లేడు. విజయరాఘవు డేలుచుండెను.

—ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము. పు. 162.

ప్రతీతి కలదు.[1] రఘునాథుడు సంస్కృతమున రామాయణమును రచియింప మధురవాణి దానిని తెనుగునకు పరివర్తన మొనర్చినదని చెప్పెదరు. తద్గ్రంథద్వితయమును మృగ్యము.[2] ఈమధురవాణికి శుకవాణియనికూడ పేరున్నట్టు తెలియుచున్నది. ఆమెయు, రామభద్రమ్మయు షడ్భాషాకవిత్వపాటవము కల్గుటయెగాక సమస్యాపూరణమున దిట్టలైనట్లు రఘునాథాభ్యుదయనాటకములో చెప్పబడియున్నది. రఘునాథు నందనమా విజయరాఘవుడు దాజకవి. ఈయనరచియించిన గ్రంథములలో వాల్మీకిచరిత్రమును, భారతరామాయణసంగ్రహములునుమాత్రము కలవు. మిగిలిన పారిజాతాపహరణాదులు లభించుటలేదు.

రఘునాథుడు బ్రాహ్మణానుశాసనమున రాజ్యము చేసెననియు, గోబ్రాహ్మణుల క్షేమమును ముఖ్యముగా నారయుచుండెననియు దృష్టాంతములు కలవు. ఈక్రింది

1. కృష్ణయజ్వ యనునాతడు తెనుగున శృంగారసైంధవపారిజాత మను ద్వ్యర్థి కావ్యమును రచియించెను.

2. పిఠాపురము కాపుగస్తులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలవారు రఘునాథుని రామాయణమని బాలకాండమునందలి పద్యములను కొన్నిటిని ముద్రించినారు. వారిది రఘునాథునిదియని యెట్లు నిర్ధారణముచేసిరో, మిగిలినగ్రంథ మేమయ్యెనో తెలియదు.

సంగీతసుధాభాగము రాజబ్రాహ్మణసంబంధమును స్పష్ట
ముగను, రసవంతముగను తెల్పుచున్నది. ఒకసమయ
మున బ్రాహ్మణబృందము రఘునాథునొద్దకు వచ్చెనట!

"విలోక్య దూరే విబుధాన్ ప్రణమ్య
మంత్రాక్షతా న్మూర్ధ్ని ముదా నిధాయ,
వికీర్యమాణాన్ బహుమానపూర్వ
మాదాయ తేషాం సఫలోపహారాన్.

అభ్యుత్థ్య తీర్థాంబుభి రుత్తమాంగం
న్యవేశయ త్తా నుచితాసనేషు,
యథోచితం స్వాని సమర్పయంతః
అస్తావిషు స్తం విబుధా స్సనుస్తాః."

బ్రాహ్మణు లి ట్లనిరట!

"యథామునీంద్రా న్యమునోపకంఠ
నివాసినో దాశరథిః పురస్తాత్,
అపూజయ త్తద్వదివ త్వ మస్మా
నారాధయ స్సాదరపూర్వమేవ.

అంతట రఘునాథుడు!

ఏవం బ్రువాణాన్ విబుధాగ్రగణ్యాన్
బ్రూతేస్మ మోదా ద్రఘునాథభూపః,

క్షోణీసురా, వః కుశలాని కచ్చిత్
పుత్రేషు దారేషు తపోవనేషు.

అప్యగ్నిహోత్రవ్రతసాధనాని
సుఖాని కిం సంప్రతి గోధనాని,
ప్రవర్తతే వః కిము పంచయజ్ఞ
క్రియాంతరాయం పున రంతరేణ."

అంతట బ్రాహ్మణు లిట్లనిరట!

"అన్నైశ్చ స్సువర్ణై రపి వస్త్రజాలైః
స్తనంధయానాంచ పయఃప్రదానైః,
ఆతన్వతో రక్షణ మాదరేణ
తవైవ రాజ్యే వసతాం చిరం నః."

* * * *

భవత్కటాక్షై రభివర్ధితానాం
క్షేమం సమస్తీతి కిమత్ర చిత్రమ్." [1]

ఇట్టిపరిస్థితు లాధునికరాజులసభాంతరాళమున నెచ్చటనైన కలవా? అప్పటి కింకను బ్రాహ్మణ్యము కలదు. బ్రాహ్మణుడు సంఘముకొరకు జీవించుచుండెను.

1. సంగీతసుధా.

దైవభక్తియు, పాపభీతియు జనులను వదలలేదు. అప్పటి కింకను ధర్మచ్యుతి పూర్తిగా కలుగలేదు. ఇప్పుడన్ననో బ్రాహ్మణాగ్నిహోత్రములు "ముఖేముఖే" యుండుకాలమున దైవమేమి? పాపమేమి? ఎట్లు తపశ్శాలులగు బ్రాహ్మణులు లేరో యట్లే బ్రాహ్మణుడు కావలయునను రాజును లేడు. ఆరాజుల పనియు నట్లే యున్నది. రాజత్వము ఘృతకోశాతకివంటి దైపోయినది. ధర్మమే సడలిపోయెను. ఎపుడు నిషిద్ధమగు శ్వవృత్తి బ్రాహ్మణునకు ముఖ్యవృత్తి యయ్యెనో యపు డిక దేనికి తావు కలదు?

ఈయనయొక్క సభాంతరాళము సంగీతసుధయం దీక్రిందివిధముగా వర్ణింపబడినది.—

"చిరంతనై ర్నైగమవృద్ధవర్గై
రనైశ్చ ధన్యై ర్నవయావనమైః,
షడ్దర్శనీసాగరపారగైశ్చ
మహీసురై ర్వ్యాపితపార్శ్వభాగః.
కవిప్రవేకైరపి కాళిదాస
మయూరసౌమిల్లిమురారి దేశ్యైః,
కర్ణాటకాంధ్రద్రమిడప్రబంధ
నిర్మాణవిద్యానిపుణైశ్చ కైశ్చిత్.



శ్రీరామసౌధమునందలి రామపట్టాభిషేక చిత్రము
(రఘునాథ నిర్మితము)

౨౮౮ పుట.



శ్రీరామసౌధమున శరభోజి శిలావిగ్రహము   ౨౮౫ పుట.

వాగ్గేయకారప్రముఖై రనేకై
ర్విచిత్రగీతాదికళాప్రవీణైః,
తథైవ వీణాదమవాద్యవిద్యా
విచక్షణైః క్వాపి నిషేవ్యమాణః.

నానావిధాశానరపాలవర్గః
సందేశకృద్భి స్సముపాస్యమానః,
ఆస్తేపి భద్రాసన మచ్యుతేంద్ర
తనూభవః శ్రీరఘునాథభూపః."[1]

పైయనువాదమునం దొకశబ్దమైన నబద్ధము లేదు. సభాంతరాళమున గోవిందదీక్షిత వెంకటమఖ్యాదులగువారు వైదికమార్గప్రతిష్ఠాపకులై షడ్దర్శనీపారగులై సభనలంకరించిరి. మధురవాణీరామభద్రాంబాదులు కవిప్రకాండులై షడ్భాషలకు వన్నెవెట్ట చేమకూర వెంకటకవ్యాదులు త్రిలింగభాషామతల్లి కలంకారముల

1. సంగీతసుధా.

"అసౌ రఘునాథః కిల దృగాసేచనకవేష పేశలైః, కుశేశయ రమణశశాంకవంశాలంకారైః, కతిపయై రేవ రాజన్య కుమారైః ఆశ్రితపార్శ్వభాగః, నిరతిశయషడ్దర్శనీకౌశలైః, అపశ్చిమై ర్విపశ్చిద్భి రప్యుపాస్యమానః."
(కుమార తాతాచార్యకృత పారిజాతాపహరణ నాటకము, ప్రస్తావన)

గూర్చుచుండిరి. రఘునాథుడు సంగీతసాహిత్యములయం దపారమైన ప్రజ్ఞకలిగి గ్రంథరచనమునం దెంతదిట్టయో గానమునం దంతప్రవీణుడై తనపేరున ప్రకాశించునట్టి నూత్నమేళాదులను సృజించుసామర్థ్యము కలిగి వరలెను.[1] "రఘునాథమేళ" యను నొకమేళాంతర సృష్టిని వీణావాద్యమందలి రఘునాథపాండిత్యమును వేనోళ్ల చాటుచున్నది.[2]

బీజపురము మొదలైనరాజ్యములనుండి వచ్చిన రాయబారులు సభ నలంకరించిరి. ఇంతకంటె రాజున కేమికావలయును? దేశకాలములతోపాటు ధీరోదాత్తుడైన నాయకుడై కావ్యనాటక నాయకమునకు పాత్రమై దేశకాలపాత్రముల మూటికిని సమ్మేళనము కలిగెను.

1. "జయంతసేనాదిమరాగరామా
నందాదితాళాన్ రచయన్నవీనాన్,
సంగీతవిద్యాం సముపాదిశ స్త్వం
విపంచికా వాద విచక్షణానామ్.
కించ త్వ మంచ ద్భవదీయనామ
మేళాంతరం సంప్రతికల్పయిత్వా,
మేళాంతకే తత్ర సమ స్తరాగాన్
ప్రకాశయోగ్యాన్ సులభాన్ కరోషి."

(సంగీతసుధా)

2. ఈసందర్భమున మద్రచితములైన భారతి యందలి "గోవింద దీక్షితు" లను వ్యాసముల చూడుడు.

అచ్యుతుని కాలమున శివగంగకోటగాక పట్టణము మధ్యమున్న కోట కట్టబడుట ప్రారంభ మయ్యెను. లక్ష్మీవిలాసమను సౌధరాజమున యుద్ధసభ కూడినట్లు కవిప్రసిద్ధము.[1] ఈ లక్ష్మీవిలాసము శివగంగకోటలోని భాగముగాక నూతననిర్మితమైన కోటయొక్క యంత ర్భూత మయినట్లు సంగీతసుధాభాగమునందలి భవనవర్ణ నమువలన తెలియును.—

"తస్యాం నగర్యాం తరుణార్కబింబ
ద్విరుక్తసౌధాగ్ర సువర్ణకుంభమ్,
ఉత్తుంగసాలై రుపశోభమాన
మనేకకక్ష్యాంచిత మస్తి ధామ.

లక్ష్మీవిలాసోఽపిచ భద్రశాలా
శ్రీరామసౌధోఽపిచ హేమకూటః,

1. "జంభారాతి స్సుధర్మా మివ ధిషణజయం
తాన్వితో మంత్రహేతోః
భూపః ప్రాపద్య తాద్యో సచివసుతయుతో
జాతు లక్ష్మీవిలాసమ్."
(సాహిత్య రత్నాకరము, 9 75)

అన్యాశ్చ యత్రాచ్యుతరంగముఖ్యా
స్సభా స్సుధర్మోపమితా జయంతి.

సంభావనీయాదృత శాతకుంభ
సంభావళీసంభృతనూత్నరత్నైః,
రమ్యా విశేషేణ సభా విభాతి
తత్రేందిరామందిరనామధేయా.

యస్యా స్సమీపే శతశో విభాంతి
నృపాంగనారత్ననివాసయోగ్యాః,
గృహా విచిత్రోపవనీవిహార
ప్రాసాదకేళీసరసీసమేతాః" 1

రఘునాథుడు వీలునుబట్టియు,నవసరమునుబట్టియు వేర్వేరుప్రదేశములయందుసభ చేయుచుండెనని వేర్వేరు సభామంటపవర్ణనమువలన కనుగొననగును. వీనిలో నిప్పుడునాయకరాజులదర్బారుహాలని చూపునట్టిభవనము పైయనువాదమునందలి శ్రీరామసౌధమని నాయభిప్రాయము. అందు రామపట్టాభిషేకపటము చిత్రింపబడినది. అందువలన దీనికి శ్రీరామసౌధమని నామ మిడియుండ వచ్చును. ఇందిప్పుడు తరువాతిమహారాష్ట్రరాజగు "శర

1. సంగీతసుధా.

భోజి"యొక్క శిలావిగ్రహము కలదు. తచ్ఛిలావిగ్రహ ముక్రింద పూర్వము నాయకులకాలమున సింహాసనము నకు క్రిందనుండు నొక మిక్కిలివిశాలమగు చలువరాయి యొకటి కలదు. అది యనేకచరిత్రకారులచే ప్రశంసింప బడియున్నది. అత్కాలపుభవననిర్మాణపద్ధతి యీభవన మువలన తేటపడగలదు. కొయ్య యెచ్చటను నుపయో గించియుండలేదు. మహారాష్ట్రరాజు లేతత్సభామందిర మును వదలి ప్రత్యేకముగా వేరుదర్బారుహాలును కట్టు కొనిరి. అది యిప్పటికిని కుడ్యచిత్రకర్మసమేతమై ప్రకా శించుచున్నది. చూపువలననే వెనుకటిదానికంటె యిది యధునాతనమని తెలియగలదు. వెనుకటినాయకులు కట్టిన ట్లుంచక మహారాష్ట్రరాజులు కోటను మార్చినట్లు స్పష్టము. ఇప్పుడు చెప్పబడు "నేడంతస్తులమేడ" మహా రాష్ట్రులచే నిర్మింపబడినది. భవనాంతరాళమున వెనుకటి యనువాదమునందు చెప్పబడిన కేళీసరస్సు ప్రస్తుత మను పయుక్తమై దుర్గంధపూరితమై యున్నది. శివగంగకోనేటి నుండి యిందులకును, యితరసరస్సులకును నీరువచ్చు నందిముఖములు కలవు. ఈకేళీసరస్సున నున్నదియు, "అయ్యంకొళమ"నిచెప్పబడుదానియందున్నదియు నొక్క విధముగా నున్నవి. శివగంగకోటకు "సెవ్వప్పనేరి" నుండి

నీరువచ్చుచుండెను. ఇట్లు పట్టణమునంతకును జలము పంపబడుచుండెను. ఈసరస్సులు కడుగుటకును, ప్రాత నీటిని వెడలగొట్టుటకును మార్గము లుండెడివి. కాని యిప్పు డవి యన్నియు పూడిపోయియున్నవి. ఒక్క శివగంగ కోనేటియందలి యుదకముతప్ప యిప్పు డేసరస్సు నందలిదిని త్రాగుటలేదు. మరియు శౌచాదులన్నియు వానియందే నిర్లజ్జముగా చేయబడుచుండును.

ఈశ్రీరామసౌధోపకంఠసీమయందు రెండు గోపురములు కలవు. వానిలో నొకటి యుత్తుంగతరము. దానిని గూఢగోపుర మందురు. అది నాయకరాజులకాలమునను తరువాతనుకూడ మందుగుండుసామానులు దాచుటకై యుపయోగింపబడుచున్నందున దాని కాపేరు వచ్చెను. ఇప్పటికిని గోడలపయి వెనుక కత్తులు, కత్తళములు తగిలించినగురుతులును, తుపాకులుపెట్టబడు తావులును కలవు. ఇది తప్పక రఘునాథనిర్మితమని నాయభిప్రాయము. రెండవది "మాడమాళిగ" యని పిలువబడుచున్నది. కొందరు దీనిని శ్రీరంగగోపుర మనికూడ పిలుచుచున్నారు.[1] దీనికి కారణముకలదు.

1. సైలరగ్రంథము దీనిని "నామామృత గోపుర"మని పిలుచుచున్నది. దీని ప్రక్కనే పూజాగృహము కలదందురు.

విజయరాఘవుడు మొదటి రాజ్యవత్సరములందు తెల్లి నారుజామున లేచి దగ్గరిమార్గమున యంచబోయీలచే పాలకీలో మోయబడుచు శ్రీరంగమునకుపోయి తిరిగి రెండుజాములు వెళ్లునరికి వచ్చి భుజించుచుండువాడట! తరువాత మధురతో విరోధము వచ్చినందున శత్రు రాజ్యముననున్న శ్రీరంగమునకు పోవుట యపాయకర మని యీగోపురమును నిర్మించి దానినెక్కి శ్రీరంగ గోపురముచూచి ప్రతిదినమును భుజించువాడట! ఇప్పుడు దీనిపైనెక్కిన శ్రీరంగగోపుర మగుపడుచుండ లేదు. కాని దీని కింకను కొన్నియంతస్తు లుండెడి వనియు, నవి పడగొట్టబడెననియు చెప్పుచున్నారు. టైలరుగ్రంథముకూడా గోపుర మందుల కుపయోగింప బడుచుండెననియు, నది తరువాత పడగొట్టబడెననియు తెల్పుచున్నది.[1] ఈక్రొత్తకోట కట్టినతరువాత శివగింగ కోట యనుపయుక్తమై క్రమముగా శిథిలమై యుండును. దానిప్రాకారముమాత్రము మిక్కిలి గట్టిగా నున్నది. క్రొత్తకోటనుగూర్చి యొకగాథ కలదు. రఘునాథుని

1. Taylor's Oriental Historical Mss, pp.197, 198.

కుమార్తెను[1] మధురతిరుమలనాయకునికి వివాహము చేసిరనియు, తిరుమలుడు మధురయందు కోట[2]కట్టి తన భార్యకు చూపగా నామె తనతండ్రికట్టిన కోటతో సరితూగుచుండలే దనగా వెంటనే బాకుతో నామెను తిరుమలుడు పొడిచిచంపెననియు నొకయైతిహ్యము చెప్ప బడుచున్నది. దీని నిజానిజములు తరువాత చర్చింతును. కాని మధురకోటను తిరుమలుడు కట్టినమాట వాస్తవము. తిరుమలుడు క్రీ. శ. 1623-వ సంవత్సరమున రాజ్యము చేయ ప్రారంభించెను. కావున తంజావూరుకోట యంత కంటె పురాతనమని యీకథ సాక్ష్యమిచ్చుచున్నది. దీనివలన నీకోట రఘునాథునికాలమున చాలాభాగము నిర్మింపబడినట్లు చెప్పనగును. "అనేకకక్ష్యాంచిత"మై యున్నది. మొదటికక్ష్యములో నేనుగులు, గుఱ్ఱములు మొదలగువానికొఱకు నిర్మించిన భాగములు కలవు. రెండవకక్ష్యయందు బండ్లువగైరాలు కట్టుటకు తావు లేర్పరుపబడినవి. మూడవకక్ష్యయందు రాజనివాస యోగ్యములగు స్థలము లుండెను.

1. అచ్యుత రఘునాథమ్మయట యామె నామధేయము.

2. ఇప్పటికిని నీ కోట కలదు. దానియందు జిల్లాకోర్టు పెట్ట బడియున్నది.

ఈయనకుమారుడగు విజయరాఘవనాయకుడు శా. శ. 1555 కు సరియైన క్రీ. శ. 1633-వ సంవత్సరమున మన్నారుగుడియందలి కృష్ణతీర్థమందు స్నానమాచరించి హేమాద్రియందు చెప్పబడిన షోడశమహాదానములు చేసెను.[1] ఈసంవత్సరము విజయరాఘవుని రాజ్యప్రారంభసంవత్సరముగా నాయన తన రఘునాథాభ్యుదయనాటకమున చెప్పుకొనియున్నాడు.[2]

1. సీ. "శాలివాహనశక సంవత్సరమ్ములు
వేయు నేనూరు నెంబదియేనువరుస
చనగ శ్రీముఖనామసంవత్సరంబున
శ్రావణశుద్ధపక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణద్వార
కను...కృష్ణతీర్థమందు
స్నానంబు గావించి సంకల్పపూర్వకం
బుగను షోడశమహాదానములను
ఘనత మీర గళావతీగర్భశుక్తి
మౌక్తికఫలంబు రఘునాథమహిపసుతుడు
విజయరాఘవ మేదినీవిభుడొసంగె
వేదవేదాంగవిదులైన విప్రులకును."
(విజయరాఘవ వంశావళి, కాళ కవికృతము)

2. "పట్టాభిషేకవైభవము గైకొన్న
యట్టిసంవత్సరంబున నొకనాట

పై రెండుసాక్ష్యములకు బలకరమగు మరియొక సాక్ష్యము కలదు. రాజచూడామణిదీక్షితుడను పేరుగల విద్వత్కవి తానురచియించిన తంత్రశిఖామణియను గ్రంథమున తద్రచనము తాను శా. శ. 1559-వసంవత్సరమునకు సరియైన క్రీ.శ.1637-వ సంవత్సరమున చేసితినని చెప్పుకొనియున్నాడు.[1] ఈయన గోవిందదీక్షితుని ద్వితీయపుత్రుడగు వెంకటమఖికి శిష్యుడు. తా నీగ్రంథమును గురువగు వెంకటమఖిప్రేరణమున రచియించితినని చెప్పుచు, వెంకటమఖి రచియించిన గ్రంథములను పేర్కొనుచు వెంకటమఖి విజయరాఘవునకు మంత్రిగా నుండెనని సూచించెను.

"అస్తి గోవిందయజ్వేంద్ర
నాగమాంబాతపఃఫలమ్,

నవలీలగా పదియారుదానములు
సవరించి ద్విజుల కొసంగితివీవు."

(రఘునాథాభ్యుదయ నాటకము)

1. "ధీమన్మాన్యే శకస్యాబ్దే హాయనే చేశ్వరాభిదే;
చూడామణిః కలయతే యజ్వా తంత్రశిఖామణిమ్."

గీటుంచినభాగమునకు: ధ=9; మ=5; మ=5; య=1. వెనుకనుండిచదివిన 1559 అని యర్థము.

శ్రీవెంకటేశ్వరమఖీ
సర్వతంత్రస్వతంత్రధీః.
యేనేష్టం సాగ్నిచిత్యాప్త
వాజపేయాదిభిర్మఖైః,
కృతం సాహిత్యసామ్రాజ్యం
నామ కావ్య మనుత్తమమ్.

వ్యతాని శుల్బమీమాంసా
తథాకర్మాంతవార్తికమ్,
టుప్టీకాయాః కృతా టీకా
వార్తికాభరణాభిధా.

ప్రతిష్ఠాపితచోళక్ష్మా
జానేస్తస్య నియోగతః,
చూడామణి ర్వితనుతే యజ్వా
తంత్రశిఖామణిమ్."[1]

క్రింద గీటుంచినభాగము వెంకటమఖి యెవరో యొకచోళరాజును స్థాపించినట్లు తెల్పుచున్నది.[2] ఈప్రతి

1. తంత్రశిఖామణి ప్రస్తావన శ్లోకములు.

2. చోళము నేలునది నాయకరాజైనను వానినికూడమధురనేలు నాయకుని పాండ్యుడన్నట్లే చోళుడనుట పండితసమ్మత మయ్యెను.

ష్ఠించినది యెవ్వరిని? రఘునాథు నీయన ప్రతిష్ఠించుట యసంభవము! కావున విజయరాఘవుననియే మనము నిర్ధారణము చేయవలెను. దీనికి మరియొక సాక్ష్యము కలదు. ఈ వెంకటమఖి 'చతుర్దండిప్రకాశిక' యనుసంగీత గ్రంథము నొకదానిని రచియించుచు దానియందు తా నాగ్రంథమును విజయరాఘవుని ప్రేరణమున వ్రాసితినని చెప్పుకొన్నాడు.[1]

కావున నీయన విజయరాఘవుని సింహాసనాధిష్ఠితుని జేసెననియు, నాయన మొదటిరాజ్యవత్సరములలో మంత్రిపదవియం దుండెననియు స్పష్టము. అందువలన క్రీ. శ. 1637-వ సంవత్సరమున విజరాఘవు డేలుచుండ వలెను. క్రీ. శ. 1633-వ సంవత్సరము విజయరాఘవుని రాజ్యాదిసంవత్సరమని గట్టిగా చెప్పనగును. అప్పటికి గోవిందయజ్వ చనిపోయియుండును. యజ్ఞనారాయణ దీక్షితుని యుదంతముకూడ కానము. ఆయనయు రఘు

1. "ఇతి శ్రీమదద్వైత విద్యాచార్య సాగ్నిచిత్యసర్వతోముఖాతిరాత్ర సాగ్నిచిత్యాప్త వాజపేయయాజి గోవిందదీక్షితవర నాగమాంబావర ద్వితీయనందనస్య సాగ్నిచిత్యసర్వక్రతుయాజి యజ్ఞనారాయణదీక్షితావ్యవహితానుజస్య అచ్యుత విజయరాఘవ భూపాల ప్రేరితస్య వేంకటేశ్వరదీక్షితస్యకృతౌ." (చతుర్దండిప్రకాశిక)

నాథునిరాజ్యాంత్యములోపుననే చనిపోయిన ట్లూహింప వలసియున్నది. ఆయనయే యున్న చిన్నవాడగు వెంకట మఖి కీపదవి లభించునా? రఘునాథుడు తన భుజబలముచే నిష్కంటకముగావించిన రాజ్యమును చాలాకాల మనుభ వింపలేదు. 19 సంవత్సరములుమాత్రము రాజ్యము చేసెను. అందును మొదటినాల్గువర్షంబులు సరిగ్గైన నిద్రాహారములు లేకపోయినను తరువాతిపదునైదువత్సర ములును హాయిగా నేలెను. తంజావూరున కీయన కాల మత్యుచ్ఛకాలము.

వెనుక నీయనమతసహిష్ణుత్వమును తెలిసికొని యుంటిమి. గురువులు వైష్ణవులు. విజయనగరరాజకుటుం బముయొక్క గురువగు తాతాచార్యకుటుంబమువారే.[1] అయినను స్మార్తుడగు గోవిందదీక్షితునకు గౌరవ ముండెను. ఆయనకు రఘునాథు డర్ధాసన మిచ్చినట్లు యజ్ఞనారాయణదీక్షితుడు చెప్పినాడు.[2]

1. "ఆస్థానే రఘునాథభూబలరిపో రాచార్యచూడామణేః
శ్రీమత్తాతయదేశికస్య భణితిః శృంగారవీరోజ్జ్వలా."
(పారిజాతాపహరణము).

2. "అస్య శ్రీ రఘునాథభూబలరిపో రధ్యాసితార్ధాసనః"
(రఘునాథభూపాలీయనాటకము.)

ఇంతియెకాక రఘునాథుడు సురేంద్ర, సుధీంద్రు లనెడి యిద్దరుమధ్వగురువులను గౌరవించినట్లును, అందు సుధీంద్రునకు కనకాభిషేకముగావించెననియు నారాయణకవి చెప్పియున్నాడు.[1] క్రైస్తవులనుకూడ నెట్టియాదరముతోచూచెనో వెనుక తెలిసికొనియున్నాము. రాజ్యక్షేమమునకు మతసహిష్ణుత్వము బలమైన పునాది. హరిహరభేదము లేకుండ దైవకైంకర్యముల నీయన తనవంశమర్యాదప్రకారము నిర్వర్తించెను. కుంభకోణమునందలి చక్రపాణియాలయమున స్వామికి దివ్విటిపట్టుకొనుచున్న లోకవిగ్రహము కలదు. అది యీరఘునాథుని దందురు. కొందరచ్యుతునిది యని యభిప్రాయపడుచున్నారు.[2] వీరిపటములెచ్చటను కానరావు. అందువలన గట్టిగా చెప్ప

1. "అతులవివిధ విద్వన్మండలీలాస్యమానః
ప్రభుమణిరఘునాథప్రౌఢభూపాలకేన,
నిహితనిఖిలవిద్వన్మౌళిపాద స్సుధీంద్రః
పరజనదురవాపం ప్రాప హేమాభిషేకమ్."

(రాఘవేంద్రవిజయము)

Maharatta Rajas of Tanjore, p. 13.

2. Tanjore Dt. Gezetteer, p. 218; Inscription in the Madras Presidency, V. Rangachari, Vol II, 1235.

టకు వీలుకలుగదు. కాని యది యొకవైష్ణవుని ప్రతిమ యనిమాత్రము చెప్పగలము. ఈయనకాలముననే గోవిందదీక్షితుడు సర్వతోముఖమును, వాజపేయమును గావించినట్లు దృష్టాంతములు కలవు.[1] బహుశః ఈసంగతి తోపూరుయుద్ధానంతర మైయుండును. సర్వతోముఖ సత్రము నిర్వర్తించిన వెంటనే నాల్గువైపుల నాల్గుశిలాస్తంభములను నాటినట్లున్నదిగాని యట్టిస్తంభము లెచ్చటను గానరావు.

తంజావూరునందలి పుస్తకాలయమునకు "సరస్వతీమహాల్" అనుపేరు మహారాష్ట్రరాజులు పెట్టినను దానికి పునాది నాయకరాజులకాలములో వేయబడెను.

1. "చత్వాగః కృతసర్వతోముఖ మహాసత్రేణ గాఢంశిలా
యూపా యేన నిఖానితాః ప్రతిదిశం యుక్తాః చిరావస్థితేః,
సారాజ్యం రఘునాథభూమిపతినా సంప్రాపితే శ్మాతలే
పారే సహ్యతటం వృషేణవసతా పాదా ఇవ స్థాపితాః.
రథ్యానాస్తికధైనుకాశ్వగజతాముఖ్యానదా ద్దక్షిణాం
వర్షా దాప్తపదోత్తగం క్రతువరం తం వాజపేయాభిధమ్,
యేనాహార్య కిమ ప్యహార్యవిభవం సామ్రాజ్యలక్ష్మీప్రదం
సంప్రాప్తో రఘునాథభూశతమఖో జేజీయతే సాంప్రతమ్."
(రఘునాథభూపాలీయనాటకము)

ఇప్పటికిని తత్పుస్తకాలయమున నాయకరాజులు స్వోపయోగమునకై వ్రాయించిన గ్రంథములు కలవు. సంగీత, నాట్య, వైద్య, జ్యోతిషశాస్త్రములందలి గ్రంథములన్నియు తెలుగులిపియందు గలవు. ఇవిగాక నాయక రాజులయొక్క సమకాలికులగు కవులును, కవయిత్రులును వ్రాసినగ్రంథములయొక్క ప్రతు లొక్కొక్కటి చొప్పున కలవు. ఇవియన్నియు తత్కాలమునందలివి యని స్పష్టము. పుస్తకాలయమునందలి గ్రంథసంఖ్యను చూచిన సంస్కృతభాషతరువాత తెనుగుభాషలోనే యెక్కుడు సంఖ్యగల గ్రంథములు కలవు. వీనినన్నిటినిబట్టి తత్పుస్తకాలయమునకు బీజ మీనాయకరాజకాలమున పడెనని దృఢముగా చెప్పనగును.[1] ఇది యచ్యుతునితుది కాలమా

1. "The Mss. described here are the results of perhaps 300 years collections firstly by the Nayaks of Tanjore, secondly after about A. D. 1675 by the Maharatta Princes."

Dr. Burnell in the introduction to the classified index of Skt. Mss. in the Library.)

"The earliest beginnings of the library must have been about the end of the 16th century when Tanjore was under the rule of Telugu Nayaks who collected Skt. Mss. written in Telugu character."



గూఢగోపురము-తంజావూరు
(రఘునాథనిర్మితము)

౨౮౬ పుట.

లేకరఘునాథునియారంభకాలమా యని యనుమానము. ఎట్లయినను మనయూహా నిక్కవము.

ఈయననుగూర్చి తెలియజేయు నీక్రింద్రగంథ భాగముల ననువదించి యీవిద్వత్ప్రభువు నింతటితో వదలవలసివచ్చినందులకు చింతిల్లుచున్నాను.

"శ్రీరామ సేతావపి కుంభఘోణే[1]
శ్రీరంగధామన్యపి రామభద్రమ్,
దేవం ప్రతిష్ఠాప్యత రా మతానీః
ప్రాకారసద్గోపురమంటపాని.

రథోత్సవాదిం మహతీం విభూతి
మసా వకార్షీ ద్రఘునాయకస్య,

Prof. P. P. S. Sastri's essay before the III Oriental Conference, Madras.

ఈపుస్తకము లిప్పుడు శిథిలములై పోవుచున్నవి. వానిని కాపాడుకొను భారమాంధ్రలోకముపై నన్నది. ఈగ్రంథములున్నవి యని తెల్పు సరియైన పట్టికయైనను లేదు.

1. కుంభకోణమునందలి రామస్వామియాలయము రఘునాథుడు నిర్మించెను.

బిల్వేశితుః[1] పంచనదేశ్వరస్య
శ్రీధేనునాథస్య [2]మహేశ్వరస్య.

శ్రీశ్రీనివాసస్థలసీమ్ని విష్ణోః
శ్రీరంగనాథస్య వరప్రదాతుః,
మహత్తరం మంటప మాదదా_స్త్వాం
శ్రీకుంభఘోణేశ్వరగోపురాఖ్యమ్."

(సంగీతసుధా.)

"తరువాత అతని (అచ్యుతుని) కుమారుడగు రఘునాథనాయకుడు సకలశాస్త్రములయందును మహాప్రవీణుడై సకలధర్మములు విచారించి కుంభకోణమునందు రామస్వామిగుడి కట్టించి యెన్నో అగ్రహారములు తటాకములు కలుగజేసి విజయవిలాసము మొదలగు గ్రంథముల కృతినందుకొని రామాయణము మొదలైన గ్రంథములురచియించి మహాప్రసిద్ధుడుగా బహుదినాలు రాజ్యమేలెను."[3]

1. తిరుక్కడయూరు.
2. తిరువాలూరు.
3. తంజావూ రాంధ్రరాజుల చరిత్రము.

"ఎందును విద్యలే మెరుగ
రెవ్వరెరింగిన గొంతమాత్రమే
యందును సాహితీరసపు
హత్వ మెరుంగ రెరింగిరేని యా
యంద మెరుంగలే రెరిగి
నప్పటికిఁ విని మెచ్చి యాయ రె
న్నందగు నచ్యుతేంద్రరఘు
నాథవిభుండె ప్రవీణు డన్నిటన్."

*　　*　　*

సీ. సింహాసనము[1]మాట శిథిలపాటలు విని
గట్టిగా నిలుప కంకణము కట్టె
కోటిసంఖ్యలు మీఱ గూర్చినధనరాశి
గొల్చువారల కిచ్చె గొల్చువలెనె
తుండీరపాండ్యాదిమండలేశ్వరులపై
దండెత్తి విడిసె నుద్దండమహిమ
నేల యీనినయట్లు నిలిచినవైరుల
పంచబంగాళిమై పార దరిమె

1. విజయనగర సామ్రాజ్యము.

గర్వితారాతిమస్తకఖండనోత్థ
రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణిక కావేరినీట కడిగె
నిఖిలగుణశాలి రఘునాథనృపతిమౌళి." 1

"కలారత్నం గీతం, గగనతలరత్నం దినమణిః
సభారత్నం విద్వాన్, శ్రవణపుటరత్నం హరికథా,
నిశారత్నం చంద్రః, శయనతలరత్నం శశిముఖీ
మహీరత్నం శ్రీమజ్జయతి రఘునాథో నృపవరః.[2]

---

1. విజయవిలాసము. ఆ. 1.

2. సుభాషితరత్న భాండాగారము. 183.
ఈశ్లోకము రఘునాథునిగూర్చియేనా?

# ౧. విజయరాఘవనాయకుడు

(క్రీ. శ. 1633 — 1673)

తోపూరుయుద్ధాంతమువరకు మనచరిత్రము కాధారము లుండెనుగాని తరువాత మార్గము నిష్కంటకము కాదు. విషయపరంపరను సమగ్రముగా చెప్పనొక్కగ్రంథమైనను గానరాదు. అచ్చటచ్చట నున్న యసంపూర్తివ్రాతలను చేర్చి గుదిగూర్చి చర్చించి విషయములను నిర్ధారణము చేయవలసియున్నది. రఘునాథునకు చెవ్వాచ్యుతులకువలె విజయరాఘవు డేకపుత్రుడు కాడు. వెనుక తోపూరుయుద్ధమునకు పోవునపుడు రఘునాథునితో తన పెద్దకుమారుడగు రామభద్రు డుండెనని మనకు తెలియును.[1] ఇయ్యది నిజమేనని విజయరాఘవ వంశావళియు, రాజచూడామణికృతమైన యానందరాఘవ నాటకమును తెల్పుచున్నవి.[2]

1. "రామభద్రకుమారరత్నంబు గొలువ."
2. చ. "లలితపతివ్రతావ్రత కళావతియైన కళావతీసతీ
కులమణియుఁ మహీరమణకుంజరుఁడా రఘునాథమేదినీ

ఈమూడు గ్రంథభాగములును పెద్దవాఁ డుండెననియు, నాయనపేరు రామభద్రుఁడనియు నేకీభవించుచున్నవి. రాజచూడామణి "యచ్యుతరామభద్రజనకః" అని

తలబలభేదియుం గని యనారుని యచ్యుతరామభద్రదో
ర్బలజయభద్రుని న్విజయరాఘవశౌరిని భాగ్యవైఖరిన్.

క. వారలలో నగ్రజుఁడని
ధారాధారాధరాంబుధారలచేతన్
వారించు వైరిభూవర
వారిజదుర్వారగర్వవారము నెపుడున్.

చ. ఆతని సోదరుండు భువనావనతామరసోదరుండు సం
తతనిజకీర్తిధామసుమదామసువాసితదిక్సువాసినీ
వితతశిరోజచూర్ణగుచివిభ్రమవిభ్రమకృత్ప్రతాపు డ
ప్రతిమజయాఢ్యుఁడౌ విజయరాఘవుడిమ్మహియేలు మేలనన్"

(విజయరాఘవ వంశావళి)

"సారస్యం భజతాం మనస్సుమనసాం సారస్వతే శాశ్వతే
శ్యామాకార్ముకశేఖరే భవతు వః శ్యామారుణీ శేముషీ
జీయా దచ్యుతరామభద్రజనకః శ్రీ చిన్నచెవ్వాచ్యుత
క్ష్మాభృద్భూరఘునాథభూమిపతిర ప్యాచంద్రమాతారకమ్"

(ఆనందరాఘవనాటకము, భరతవాక్యము)

రాజగోపాలవిలాస మను కాళకృతమైన మరియొక ప్రబంధమును నిట్లే చెప్పుచున్నది.

యుపయోగించుటచే నిద్దరుండిరాయనికూడా యూహ యొకటి తట్టుచున్నది.

ఇచ్చట నొకచిత్రము కలదు. విజయరాఘవుని యాస్థానకవయిత్రియగు రంగాజమ్మ పైవిషయమును తెల్పకపోవుటయేగాక రఘునాథునకు విజయరాఘవుని వరప్రసాదమున పుట్టిన పుత్రుని జేసి సత్యదూరమైనను కథను బహురసవంతముగా సమకూర్చినది. అందున తాను వెనుక వ్రాసిన మన్నారుదాసవిలాసమందుకంటె తరువాతి యుషాపరిణయమున నాకథకు కాలుసేతులను కల్పించి పరిష్కరించినది.[1] కవులకు తమ కృతిభర్తలను

1. "సీ. శ్రీరఘునాథధాత్రీతలాధీశ్వరుం
డాసతులను గూడి యనుదినంబు
సకలధర్మంబుల సలుపుచు సురనాడు
నామతీర్థంబు ననంతచమున
భాసురపద్మాసనాసీనుడై హృదయపం
కజమున...కుదురుగాగ
శ్రీరాజగోపాలశౌరి జెంగమలేను
వేడ్కతో భావింపు నెన్నడలర
ఎదుట సన్నిధి సేసె నీకిత్తు వరము
వేడుమన సంతసంబున విజయమహిమ

నీమహీమండలం బెల్ల నేలజాలు
తనయు మాకిమ్ము దేవకీతనయ యనిన.

* * * * * *

చ. హితమతియైన యచ్యుతనరేంద్రుని శ్రీరఘునాననేత క
య్యతివ కళావతీసతికి నాహవవైరిమదాపహారియా
సుతు డుదయించె సర్వగుణశోభితు డాశ్రితపారిజాత మ
ప్రతిమబలాఢ్యుడా విజయరాఘవశౌరి జయానుసారియై."
(మన్నారుదాస విలాసము)

సీ. "తనర నారఘునాథధరణీశ్వరుడు చెంచి
లక్ష్మమ్మయల్ల కళావతెమ్మ
పట్టపురాణులై ప్రబలి సేవయొనర్ప
కులమెల్ల వెలయించు కులమువెలసి
దానధర్మంబుల తపముల సలుపుచు
కస్తూరికృష్ణుని ఘనత వేడ
నల చెంచిలక్ష్మమ్మ కలలోన కస్తూరి
కృష్ణు డిట్లనె పూర్వవృత్త మొకటి
నీవు తొల్తను దేవకీదేవి ఐరయ
సాటిలేని కళావతీసతి యశోద
యల్ల వసుదేవనందుల యాత్మ లిచట
నెగడె నచ్యుతరఘునాథధవునియందు.

సీ. అల వసుదేవున కాత్మసంభవుడనై
మంచలో జెరుగంగ నందునింట

దేవాంశసంభూతుల జేయుటయు, తమను దేవుడు ప్రత్యక్షమై గ్రంథముల వ్రాయుమనుటయు సహజగుణము లైనవి. కావున నీగ్రంథభాగములను కవిసమయముల క్రింద లెక్కింపవలయునే కాని చరిత్రగా గొనుట కెంతమాత్రమును వలనుపడదు.

ఈపెద్దకుమారుడగు రామభద్రుడు యుద్ధమున మడిసిన ట్లిచ్చటను నాధారమును కానము. ఈయన యుండగా విజయరాఘవు డెట్లు రాజయ్యెను? ఈవిషయమునకు ప్రత్యుత్తర మెచ్చటను సాక్షాత్తుగా వచ్చుట లేదు. విజయరాఘవుడు తన రఘునాథాభ్యుదయనాట

దపములు నేసి యే తనయుని గాంచితి
బాలలీల యశోదభాగ్యమయ్యె
ననితలంపుచు నుంటి వటుగాన నిప్పుడే
నోగి కళావత్యంబయను పరమందు
నుదయింతు సంతోష మొదవంగ నీవును
ఘనత బుత్రస్వీకృతి యొనర్చి
విజయరాఘవు డను పేర వెలయజేసి
నన్ను బోషించి యెపుడు నానందమొందు
మనుచు పల్కంగ మేల్కని హర్ష మొంది
చెలువు లక్ష్మమ్మ విభునకు విన్నవించె."

(ఉషాపరిణయము.)

వీరుడౌ సవరము వెంకటపతిని
పారదోలించి నీపంపులచేత
పట్టైనసీమలో పందనెల్లూరు
కట్టించితివి నీవు ఘటికమాత్రమునె
* * * * * *
కడలేని మృష్టాన్నదానసత్రముల
నడుపుచున్నాడవు నానాట హెచ్చ
* * * * * *
నవనవంబుగ రఘునాథపురాది
వివిధాగ్రహారముల్ వెలయజేసితివి
* * * * * *
దైవమే దక్షిణద్వారకావిభుడు
నీకు బ్రసన్నుడై నీవు గావించు
నాకావ్య మందుదునని యానతిచ్చె
మన్నారనుమతి మాయనుమతియు
కన్నావుగనక నాకనకాంబరునకు
తారహారముగ మీతండ్రిచారిత్ర
మారూఢి ద్విపదకావ్యము నేయవయ్య."

(రఘునాథాభ్యుదయ నాటకము.)

క్రీ. శ. 1642-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన శ్రీరంగ రాయల ప్రశంస యీనాటకమున నున్నందున తత్సంవత్సరానంతర మిది రచియింపబడినట్టుకూడ చెప్పక చెప్పుచున్నది.

"శ్రీ రంగరాయలచే పట్టినిల్పి"

(రఘునాథాభ్యుదయ నాటకము.)

జీవితకాలమున నీయన పట్టాభిషేకము కాకపోయిన జ్యేష్ఠు డేమయ్యె? ఈయన యేల రాజు కావలసివచ్చె? మరియొక విషయము. ఈరఘునాథాభ్యుదయనాటకము చరిత్రమున కుపయుక్తమైనను తుదిభాగ మసత్యముగ నున్నది. ఏలన స్వభావవిరుద్ధమగు సందర్భము కలుగజేసి చిలుకచేత రాయబారము చేయించి, రఘునాథునకును నాయనను ప్రేమించిన యొక నాయికకును సంయోగము కూర్చినాడు. ఇయ్యది చదివిన రఘునాథుడు తననుగూర్చి యిట్లు వ్రాసిన నూరకుండునాయని యనిపించును. ఇదియొక వైరుద్ధ్యము. తరచి యాలోచించిన విజయరాఘవుడు రాజగుటలో సరియైన మార్గమున ప్రవర్తింపన ట్లూహ వొడమును. ఏదియో దుర్మార్గము గావించి రాజ్యమునందలి సరదారులను తన పక్షమునకు త్రిప్పుకొని వెంకటమఖి మొదలగువారి సాయమువలన సింహాసన మధిష్ఠించినట్లు కనబడును. నిజముగా తండ్రితరువాత కుమారుడు రాజ్యమునకు వచ్చుటయం దితరులచే "ప్రతిష్ఠాపితు" డేల కావలసివచ్చెను? ఆవాక్యములనే యేదోయొక విపరీతార్థ మిమిడియున్నట్లు స్ఫురించును. ఈ వెంకటేశ్వరమఖికూడా యెక్కువకాలము మంత్రిత్వము చేసినట్లు కానరాదు. మొదటివత్సరములనుతప్ప తరువాత

వీరుడౌ సవరము వెంకటపతిని
పారద్రోలించి నీపంపులచేత
పట్టెనసీమలో పందసెల్లూరు
కట్టించితివి నీవు ఘటికమాత్రమునె
* * * * * *
కడలేని మృష్టాన్నదానసత్రముల
నడుపుచున్నాడవు నానాట హెచ్చ
* * * * * *
నవనవంబుగ రఘునాథపురాది
వివిధాగ్రహారముల్ నెలయజేసితివి
* * * * * *
దైవమే దక్షిణద్వారకావిభుడు
నీకు ప్రసన్నుడై నీవు గావించు
నాకావ్య మందుదునని యానతిచ్చె
మన్నారనుమతి మాయనుమతియు
కన్నావుగనక నాకనకాంబరునకు
తారహారముగ మీతండ్రిచారిత్ర
మారూఢి ద్విపదకావ్యము సేయవయ్య."
(రఘునాథాభ్యుదయనాటకము.)

క్రీ. శ. 1642-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన శ్రీరంగరాయల ప్రశంస యీనాటకమున నున్నందున తత్సంవత్సరానంతర మిది రచియింపబడినట్టుకూడ చెప్పక చెప్పుచున్నది.

"శ్రీ రంగరాయలచే పట్టినిల్పి"
(రఘునాథాభ్యుదయ నాటకము.)

జీవితకాలమున నీయన పట్టాభిషేకము కాకపోయిన జ్యేష్ఠు డేమయ్యె? ఈయన యేల రాజు కావలసివచ్చె? మరియొక విషయము. ఈరఘునాథాభ్యుదయనాటకము చరిత్రమున కుపయుక్తమైనను తుదిభాగ మసత్యముగ నున్నది. ఏలన స్వభావవిరుద్ధమగు సందర్భము కలుగజేసి చిలుకచేత రాయబారము చేయించి, రఘునాథునకును నాయనను ప్రేమించిన యొక నాయికకును సంయోగము కూర్చినాడు. ఇయ్యది చదివిన రఘునాథుడు తననుగూర్చి యిట్లు వ్రాసిన నూరకుండునాయని యనిపించును. ఇదియొక వైరుద్ధ్యము. తరచి యాలోచించిన విజయరాఘవుడు రాజగుటలో సరియైన మార్గమున ప్రవర్తింపన ట్లూహ వొడమును. ఏదియో దుర్మార్గము గావించి రాజ్యమునందలి సరదారులను తన పక్షమునకు త్రిప్పుకొని వెంకటమఖి మొదలగువారి సాయమువలన సింహాసన మధిష్ఠించినట్లు కనబడును. నిజముగా తండ్రితరువాత కుమారుడు రాజ్యమునకు వచ్చుటయం దితరులచే "ప్రతిష్ఠాపితు" డేల కావలసివచ్చెను? ఆవాక్యములనే యేదోయొక విపరీతార్థ మిమిడియున్నట్లు స్ఫురించును. ఈ వెంకటేశ్వరమఖికూడా యెక్కువకాలము మంత్రిత్వము చేసినట్లు కానరాదు. మొదటివత్సరములనుతప్ప తరువాత

నీయన పేరునే యాస్థానమున కానము. ఈయనదియే యననేల? రఘునాథుని యాస్థానమునందలి పేరులలో నొక్క కుమారతాతాచార్యుడుతప్ప విజయరాఘవుని యాస్థానమునందు మరియెవ్వరు నున్నట్లు తోచదు. తుదకు మధురవాణీరామభద్రాంబలకుకూడా తావు లేకపోయె ను! దీని కంతకును కారణమును తరువాత చర్చింతును.

ఈసందర్భమున నొక మిషనరీ యుత్తరము మిక్కిలి ఘోరకృత్యమును తెల్పుచున్నది. క్రీ. శ. 1569 ప్రాంతమున వచ్చిన మహమ్మదీయదండయాత్రలో వారు వల్లంకోటను ముట్టడింపవెళ్లిరి. విజయరాఘవు డచ్చట అంతవరకు దాగికొని వారు వచ్చుచున్నట్లు విని పారి పోయెను. ఆయన పారిపోయి మహమ్మదీయులు వచ్చు లోపున దొంగలగుంపులు కోటలో ప్రవేశించి యందలి ధనరాసులను కొల్లగొట్టిరి. ఆసమయమున నదివరలో విజయరాఘవుడు కోటలో ఖైదీలుగా కారాగృహబద్ధుల గావించినవారి నందరను తలుపులు తెరచి వదలివేసిరట! అట్లు వదలబడినవారిలో గ్రుడ్లు పీకబడిన రాజసోదరు లుండిరట! వీరేకాక ధనాశచేత విజయరాఘవుని చే కారాబద్ధులు గావింపబడిన యితరులుకూడా యుండి



శ్రీరంగగోపుర మను మాడమాళిగ
(రాజగోపాలనిర్మితము)

౨౮౬ పుటం



సరస్వతీ మహలు
పుస్తకాలయములోని యంతర్భాగము. ౨౫౫ పుట.

రట ![1] ఈయుత్తరము క్రీ. శ. 1569-వ సంవత్సరము లోనే వ్రాయబడినందున తాత్కాలిక మగుటచే విశ్వసింపవలసివచ్చుచున్నది. దీనిని చదివిన మిక్కిలి జుగుప్సాకరము. ఎంతఘోరము! ఈయనకు తరువాత రాజ్యమునకు రాకుండుటకై గ్రుడ్లు పీకించె నని యం దున్నది. అది సరియైనట్లు లేదు. ఏలన, నిప్పటికే విజయరాఘవునకు కుమారు డొకడుండెను. నీ సోదరులను రాజ్యకాంతావిముఖుల జేయుటకై యెంత పాతక మొనర్చితివి రఘునాథా!! ఇట్టిపని చేసిన నీయందు రాజ్యము సుస్థిర మగునని యనుకొంటివా? అధర్మము పై రాజ్యము నాధారపరుపబూనుకొంటివా? ఈ యుత్తరమువలన నీయనకు సోదరు డొక్కడుకాడని స్ఫురించుచున్నది. కాని యిందు చెప్పబడిన యితరవిష

"1. In the Confusion of this pillage, the prisons were thrown open and a multitude of state prisoners were set free, the sole crime of most of whom being their fortune or social position. Among the latter were two brothers of the Nayak whom he had shut up in these prisons, after pulling out their eyes to remove all their desires on their side of succeeding him (The Nayak.)"

La Mission Du Madure, III, pp. 53, 54.

యములపై నిశ్చిత సాక్ష్యము దొరకనంతవరకు పర్యవసానమునకు రావీలులేదు. ఇందు చెప్పబడిన సంగతి మాత్రము సందర్భములనుబట్టిచూడ నిజమనియే తోచును. మనప్రశ్నముల కిది ప్రత్యుత్తరము నొసంగుచున్నది.

ఈసందర్భమున కొంతవర కాయన యిట్టిపనిని చేసియుండవచ్చునని నమ్మకము కలుగజేయు నీయన యితరప్రవర్తనమును కొంచెముగా చెప్పెదను. ఈయనకు మన్నారుదేవుడను నేకపుత్రు డుండెను. ఆయన బహుసత్ప్రవర్తనుడని తరువాత కనుగొనగలము. ఏదో కారణాంతరమున కుమారు నీయన కారాగారబద్ధుని గావించెను.[1] కుమారుని కారాగారమున నుంచినవాడు సోదరుల నుంచుటకు వెనుదీయునా? ఈయనకును ప్రజలకును మైత్రి యెక్కువగా నుండెడిది కాదు. ఈయనప్రజల యనురాగమునకై ప్రయత్నించినట్లు కానరాదు. ఏలన సమయము తటస్థించినపు డీయనకు ప్రజలు సాయము చేయకపోవుటయేగాక పైపెచ్చు సేనయే యాయనను డించి పారిపోయిరి.[2]

1. Sources of Vizianagar history, p. 325; History of Nayaks of Madura, p. 163.

2 "When the hour of peril was wrung he had no more faith in his courage than in the fidelity of his

విజయరాఘవుని ప్రయోజకత్వ మిది! ఇట్టి యనుమానాస్పదములగు పద్ధతులతో రాజ్యమునకు వచ్చి తత్పాపశాంతికై దేవుని వేడుకొనవలెనని తలచెననియు, నికముం దీయన జీవితాంతమువరకు నుండు దైవభక్తి కిది మూలాధారమనియు పొడకట్టుచున్నది. క్రమముగా నీదైవభక్తి యీయనను వీరవైష్ణవునిగా దించెను. వెంటనే తాతాచార్యుడు తన బుద్ధిబలముచే నీయనహృదయము నాకర్షించెను. ఆయనసలహాపై నితరమతముల పీడింపసాగెను. వెంకటేశ్వరమఖి యీయనదుష్కృత్యమునకు సాయమొనర్చుట నిజమైనయెడల తంజాపుర రాజ్యమున కాయన ధూమకేతువనియే చెప్పవలెను. ఇప్పటి కింతకంటె చెప్పజాలను.

subjects. He sacrificed the dearest and fled into the forests of Talavarayan his vassal. * * * Besides, actuated only by the feeling of self-preservation without any kind of devotion for a King who deserved so little of them they (his army) believed that they would be safer in the impenetrable forests than behind the ramparts."

(La Mission du Madure, pp. 52, 53.)

ఈయన గద్దెనెక్కిన సమయము తంజాపూరు రాజ్యమున కత్యుచ్ఛకాలము. రఘునాథుని చలువను రాజ్యము బయటనిష్కంటకముగను, లోన సుభిక్షము గను నుండెను. సంగీతసాహిత్యములు చెలరేగి యన్ని వైపుల వినబడుచుండెను. రాజు వాని వినోదముతో కాలము గడపుటదక్క వేరుపని లేకుండెను. ఇట్లు దాదాపు క్రీ. శ. 1645-వ సంవత్సరమువరకు నడచెను. విజయరాఘవుని కాలమున రచియింపబడిన గ్రంథము లన్నియు నీకాలమున వ్రాయబడినవియని నాయభిప్రాయము.[1] ఏలన క్రీ. శ. 1645-వ సంవత్సరముతరువాత విజయరాఘవునకును, రాజ్యమునకును విపత్పరంపరయే తప్ప గ్రంథరచనకు వలయు మనశ్శాంతి యెక్కడిది? ఆసంవత్సరమువరకు రఘునాథుడు కల్గించిన శాంతియే వ్యాపించియుండెను.

క్రీ. శ. 1642-వ సంవత్సరప్రాంతమున మూడవ శ్రీరంగరాయలు సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించెను.

1. ఈయన గొప్పకవి. శారదాధ్వజము నెత్తిమీసను, కాలగండ పెండేరమును ధరించుచుండెను. కాళకవి వీనిని బహు రసవంతముగా వర్ణించినాడు.

కోల్పోయిన సామ్రాజ్యప్రతిష్ఠను పునరార్జింపవలెనని యీయన ప్రయత్నించుటకు తంజావూరు సాయమున తన తాతయగు వెంకటపతి చేసినట్లు సామ్రాజ్యాధికారమునకు దక్షిణమును లోబడునట్లు చేయవలెనని బయలువెడలజూచెను. అప్పుడు మధురయందు తిరుమలనాయకు డేలుచుండెను. ఈయన మేధావియు, రాజకార్యధురంధరుడు నని ప్రఖ్యాతిబడసెను. ఈయన శ్రీరంగరాయల యభిప్రాయమును తెలిసికొని తన స్వార్థముకొరకై తంజాపురమును, జింజిని శ్రీరంగరాయలకు ప్రతికూలముగా తనలో కలుపుకొని ముప్వురు నొకసంఘముగా నేర్పడవలయు నని పన్నెను. మహమ్మదీయుల యుపద్రవమునుండి దక్షిణమును రక్షించుటకు, నడుమను సామ్రాజ్య మొక గోడగా నున్నదిగాన దానికి సాయమొనర్చి గట్టిచేసిన దక్షిణరాజ్యములకు క్షేమమని యీయనకు తోచకపోయెను. అయ్యది హిందూరాజ్యములయొక్క దౌర్భాగ్యము. ముగ్గురు కలసిన శ్రీరంగరాయలను సులభముగా నోడించవచ్చుననిమాత్రమే యూహపోయెను. జింజిమాట నిక్కువమె. దాని చరిత్రము తరములనుండి మధురపరపుననే యుండెను. ఈమారు తంజావూరున విజయరాఘవుడుకూడా తన

యనుశ్రుతమగు సామ్రాజ్యసహవాసమును వదలి మధుర తో శ్రీరంగరాయలపై సంధి చేసుకొనెను. ఇయ్యది తంజావూరుపట్ల యధర్మము. తిమ్మలుని రాజనీతిని విజయరాఘవుడు గ్రహింపలేకపోయెను. ఇట్లు మధురతో సంధిచేసుకొనుట విజయరాఘవుడు చేసిన మొదటితప్పు. ఇదియే ఫలముగా నిక నీయన కంతయు నాపత్పరంపరయే గాని వేరుకాదు. ఈపరిస్థితులు క్రీ. శ. 1642 ప్రాంతమున నని చెప్పనగును.

ఈయన చిన్నతనమునుండి వైష్ణవుల బోధలకు లోనై తుదకు వీరవైష్ణవుడై రాజ్యమునకు వచ్చినతరువాత నన్యమతములను పీడింపసాగెను. ఇందుల కనేక గ్రంథదృష్టాంతములు కలవు.[1] ఇంతకంటె నీయన చేసిన

1. సీ. "శ్రీరాజగోపాలశౌరి కంకితముగా
మంజరీముఖకృతుల్ మహి నొనర్చె
రాయలు సాహిత్యరాయ పెండేరంబు
శారదాధ్వజము నొసంగ నెగడె
నపరిమితముగా నగ్రహారంబులు
చేసి శ్రీవైష్ణవులకు నొసగె
ద్వారకాపురికన్న దక్షిణద్వారక
మిగులవైభవముల నెగడజేసె

మతపీడకు దృష్టాంతరము లేల? ఈపరమతపీడాయాగము నకు వంశగురువగు చతుర్వేదశతక్రతు శ్రీనివాసతాతాచార్య డధ్వర్యుడు.[1] ఈయనప్రేరణమున స్మార్తుల కెప్వ

ధరణిసురులకు ననివారితముగ నన్న
దాన మొనరించు వ్రతము నిత్యముగ బూనె
యితరమతముల నిరసించి యిలను వెలయ
వైష్ణవమతంబు నిలిపె శాశ్వతముగాగ."
(మన్నారుదాస విలాసము, ఆ-1.)

సీ. "శ్రీరాజగోపాలసేవామహిమచేత
నేరాజు ధరయెల్ల నేలుచుండు
పరమతంబుల నెల్ల నిరసించి యేమేటి
వైష్ణవమతము శాశ్వతము చేసె
బాల్యంబునందునే సగరకర విజయించి
యేనేత కీర్తుల నెసగ గాంచె
పదియారుదానముల్ ప్రణుతింప నేదాత
యవనీసురుల కిచ్చె నాదరించి
గీత డచ్యుతభూపవంశాబ్ధిచంద్రు
డధికగాంభీర్యశౌర్యధైర్యాలిసాంద్రు
డవనితంజావురాధీశు డనగబరగు
విజయరాఘవ మేదినీ విభువరుండు."
(ఉషాపరిణయము, ఆ-1.)

1. ఈయనవంశమువా రిప్పటికిని కుంభకోణమున పట్టరాచారి వీధిలో నివసించుచున్నారు. వీరి వంశీయుడను వెంకటాచారియను కవి కోకిలసందేశాది గ్రంథములను రచియించెను.

రికిని నాస్థానమున ప్రవేశమే లేకపోయెను. ఈయన మొదటిరాజ్యవత్సరములలో కొంచె మింకను నయమేకాని తరువాతతరువాత నీ పీడించుట యధిక మయ్యెను. మతపీడయే రాజ్యనాశన హేతువు. ఇట్టిమతపీడకారణముగా సోమకసామ్రాజ్య మడుగంటెను. ఆకారణముచేతనే బ్రిటిషువారు వారి సామ్రాజ్యమునకు మూలాధారముగా మతసహిష్ణుత్వము నాచరణమునం దుంచిరి. మతసహిష్ణుత్వమును విడనాడి యన్యమతములను పీడించిన యౌరంగజేబుకాలమునందలి మొగలాయిరాజ్య మేమయ్యెనో మనకు తెలియనిదికాదు. అట్లే యీమతపీడలోనే యీరాజ్యనాశనాంకురము లున్నవి. వెనుక నీయన ప్రతిదినమును శ్రీరంగమున కంచెనవారీమీాద వెడలి మధ్యాహ్నమునకు తంజావూరునకు మరలివచ్చుచుండెడివాడని మనవిచేసితిని.[1] తరువాత గోపురము

1. "అదిమొదలు ఆస్వామి అమ్మవార్ల సన్నిధికి పోయేటందుకు తంజనగరానికిన్ని శ్రీరంగానికిన్ని ఉన్నదూరము మూడామడకున్ను యాభై జోళ్ల బోయీలను నిరంతరం తపాలాల ఉంచిరి. విజయరాఘవనాయనివారు ప్రతిదినము నాలుగుగడియలముందే లేచి సూర్యోదయ మయ్యేటంతలో స్నానజపపూజలన్నీ తీర్చుకుని ఆతపాలమీాద

నెక్కి శిఖరదర్శనముతోనే తృప్తి నొందుచుండెను. మన్నారుగుడిరాజగోపాలస్వామి నీయన కులదైవముగా చేసుకొనెను.[1] తరువాత కొంతకాలమునకు ప్రతివత్సరము మన్నారుగుడికి పోవుట కష్టమై తంజాపురముననే తత్స్వామిని ప్రతిష్ఠయొనర్చి పూజించుచుండెను. విష్ణువలంకారప్రియుడగు దైవమగుటచే వైష్ణవులుకూడా యలంకారప్రియులైనట్లు మనకు తెలియును. ఈయలంకారప్రియత్వ మీయనను సుఖలోలుని జేసెను. క్రమముగా నీయన స్త్రీలోలుడైనట్లు కన్పట్టును. ఏలన నీయన కాలమునందలి సభావర్ణనముల జూచిన నవి స్త్రీజన పూరితములై యున్నవి. ఒకవేళ రాజాస్థానముల స్త్రీలు పాల్గొను నాచార మున్నను నెల్లపుడును రాజు స్త్రీపరివేష్టితు డైయుండుట రాజుయొక్క బుద్ధి కరగుటకు

శ్రీరంగానికి పోయి స్వామిదర్శనం చేసుకుని పదహారోగడియకు తిరిగివచ్చి భోజనము చేసేవారు."

(తంజావూరాంధ్రరాజులచరిత్రము.)

1. ఈయన మన్నారుగుడిలోని రాజగోపాలాలయమును పునర్నిర్మాణము గావించి గోపురమును నిర్మించెను.

(Tanjore Dt. Gazetteer, p. 226.)

కారణమగును. ఈయన నిరంతరస్త్రీసాహచర్యమున కనేక గ్రంథదృష్టాంతములు కలవు.[1] ఉభయపార్శ్వముల నిద్దరు స్త్రీల నొరుసుకుని మధ్యను తాను కూర్చొనుచుండినట్లు చెప్పబడినది! సభాంతరాళమం దాయజ్ఞనారాయణ కృష్ణాధ్వర్యాదులవంటివారికి తావే లేదు. మధుర వాణీరామభద్రాంబలస్థలములు కస్తూరెమ్మ మొదలగువా రాక్రమించిరి.

1. "* * * యొకపడంతి యడపంబును, నొకపువ్వుబోడి పావడయు, నొకబిత్తరి చెత్తంబును, నొకవాలుకంటి వాలును, నొక యండజయాన గిండియును, బూని పరిసరంబున నె కొలువు సలుప, వామభాగంబున హేమపీఠంబున శతక్రతు శ్రీనివాస తాతయార్య వర్యుండు * * * నా జయలక్ష్మియనందగు నాజమ్మయు, సంపదల సొంపారు చంపకవల్లెమ్మయు, యిరుగడల సరసనొరసుక కూర్చుండ * * * మరియు నాదండ నిస్తులగుణప్రశస్తయగు కస్తూరెమ్మయు, నతి విశాలనయనాంబుజయగు నంబుజవల్లెమ్మయు, విశదగుణరేఖయగు శశి రేఖమ్మయు, ప్రఖ్యాతకీర్తియగు మోహనమూర్తెమ్మయు, సరసగుణ నిష్ణాతయగు కృష్ణాజమ్మయు, నిల మేలనందగు నలమేలమ్మయు, నాట్యచాతుర్య విఖ్యాతయగు సీతమ్మయు, మహనీయతరరూపరేఖ యగు మదనరేఖమ్మయు, మొదలుగాగల కాంతామణులు * * * ".

(మన్నారుదాస విలాసము.)

ఏమిసభ! రఘునాథసభతో పోల్చిన భేదము వెం. టనే జుగుప్సాకరముగా గనబడును. ఒక్క తాతా చార్యుడుదక్క సభాంతరాళమున పురుషుడు గానరాడు. "నాజమ్మచెంపకవల్లెమ్మలు సరస నోరసుకకూర్చుండి"రట! ఎవరు వీ రిద్దరు? భార్యలనుటకు వీలులేకున్నది! ఉత్తమ వంశజాతలైన నిట్లు సభలో సింహాసనము నాక్రమిం తురా? విజయనగరచక్రవర్తుల వంశమునందువలె వారి బంధువులైన వీరి వంశమునకూడా ఘోషాయాచార ము న్నట్లే తెలియుచున్నది. అట్టియెడ వీరు భార్య లనుకొనుట కెంతమాత్రమును వీలులేదు.[1] మరియు పట్టమహిషి యొక్కతె యుండునుగాని యిద్ద రుందురా? ఇచ్చట విషయము మిక్కిలి యనుమానాస్పదము. శతక్రతు వైనను నీ కిట్టి నిరంతరస్త్రీసాహచర్యము తగదనియు, నది శౌర్యము నడుగంటచేయుననియు విజయరాఘవునికి

1. ఈయనకుమారుడగు మన్నారుదేవుడు తన హేమాబ్జనాయి కాస్వయంవర నాటకమున తనతల్లి పేరు రాజగోపాలకాంచికయని తెల్పి, యున్నాడు.

చెప్ప లేదు కాబోలు ![1] ఈస్త్రీలౌల్యమును, సుఖాసక్తియు నీయనను తుదకు పిరికిపందనుగా నొనర్చెను. ఈయన సామాన్యముగా యుద్ధము చేసినట్లు కానరాదు. క్షాత్ర ధర్మమునే మరచెను. ఎప్పుడు బాహుబలము చూప వలసిన యవసరము తటస్థించిన నీయన పిక్కబలము నుపయోగించినట్లు ముందు మనకు తెలియగలదు.

మూడవ శ్రీరంగరాయల యుద్దేశ్యము వెనుక మనవి చేసియున్నాను. ఈకాలమున సామ్రాజ్యమునకు దక్షిణ-ఆర్కాటుజిల్లాలోని వేలూరు ముఖ్యపట్టణముగా నుండెను. పెనుగొండనుండి చంద్రగిరియు, క్రమముగా నదియు విడువబడి వేలూరును రాజధాని యయ్యెను. ఉత్తరమునుండి మహమ్మదీయు లెప్పుడు కన్యాకుమారి వరకు నాక్రమింతమాయని కాలమునకై వేచియుండిరి. ఈలోపున దక్షిణరాజ్యసహాయమున నుత్తరమును

1. మహారాష్ట్ర రాజచరిత్రకారు డీయనకు 700 భార్యలనియు, ౩,౬00 యుంపుడుకత్తెలనియు తెలియుచున్నదియని వ్రాసి తానే దానిని నమ్మవీలులేదని వ్రాసెను. ఇది మిక్కిలి విపరీతము!

(Maharatta Rajas of Tanjore, pp. 9 & 10)

దృఢపరచుకొనవలెనని శ్రీరంగరాయ లూహించెను.[1] కాని దక్షిణమున మధురజింజీలు తమ స్వాతంత్ర మను నొకస్వార్థమేకాని తాము కేంద్రమునకు సాయ పడకపోయిన సామ్రాజ్యమే మహమ్మదీయవ్యాఘ్రమున కాహుతియగు నెడ తా మొకకబళమునకైనను చాలమను దూరదృష్టితో రాజకీయపరిస్థితుల నాలోచించక పోయిరి. వనమునంతను తగులబెట్టుచున్న దావాగ్ని చందనవృక్షమును విడుచునా? ఈమారు విజయరాఘ వుని క్రింద తంజావూరుకూడ నిట్టి సంకుచితదృష్టినే వెల్లడించెను. రఘునాథుడు లేనిలోటు వెంటనే తెలియ వచ్చెను. మొదట తిరుమలునితో చేరినను తరువాత తన తప్పును గ్రహించి సేనను పంపవలెనని మధుర కోరి నప్పుడు నిరాకరించెను. అంతట తిరుమలునికి కోపము వచ్చెనుగాని యప్పుడేమి చేయుటకును వీలులేక యూర కుండెను. విజయరాఘవుడు సమయము వచ్చినపుడు తన మాటను నిలుపుకొనకపోవుట రెండవతప్పు. అయినను

1. మహమ్మదీయ రాజ్యములకును నుత్తరమునుండి మొగలులు ఒత్తిడి కల్గించుచుండిరి. అందుచే నిది సమయమని యాయన తలచెను.

మధురకు సాయముచేయనన్నవాడు శ్రీరంగరాయలకైనను చేసెనా? ఇదియు ననుమానాస్పదము. కాని రఘునాథాభ్యుదయనాటకము శ్రీరంగరాయలకు విజయరాఘవుడు సాయము చేసి పాండ్యతుండీరపతుల నోడించెనని తెల్పుచున్నది.[1] ఇది యంత నమ్మకముగా కన్పట్టుటలేదు. విజయరాఘవు డీకాలప్రాంతమున యుద్ధము చేసినట్లు దృష్టాంతములు కానరావు. శ్రీరంగరాయలకు సాక్షాత్తుగా సాయముచేయకపోవుటయెగాక తిరుమలుని కోపమునకు విజయరాఘవుడు పాత్రమయ్యెను. ఈకోపాగ్నియే తుదకు తంజావూరును దహించెను. తిరుమలుని స్వార్థమే తుదకు మహమ్మదీయునికి మార్గము నొసంగి కంపరాయాదు లొనర్చిన కృషిని భగ్నముగావించెను. ఏనాడు కంపరాయలు స్వహస్తముల మధురలో సామ్రాజ్యధ్వజమును నాటెనో, యేనాడు విశ్వనాథుడు మధురలో దక్షిణసింహాసనాధ్యక్షుడుగా రాజ్య

1. " శ్రీ రంగరాయల చేపట్టి నిల్పి
యారాయకార్యంబులా కాదటంచు
దుండగించిన పాండ్యతుండీరపతుల
ఖండించి వాకిలి గావచేసితివి."

(రఘునాథాభ్యుదయ నాటకము.)

ము చేయ ప్రారంభించెనో, తిరుమలు డానాటికి మహా మ్మదీయవ్యాఘ్రమునకు దక్షిణమునకు రహదారి సమ కూర్చెను. సామ్రాజ్యమును చెరుపుటకు గడంగితివి. పరిణామముగా నీస్వరాజ్యనాశమునకు బీజము నాటితివి! ఏది నీవు రాజనీతియని యెంచితివో, యదియే నీరాజ్య నాశనధూమకేతు వయ్యెను![1]

ఎప్పుడు విజయరాఘవుడు సాయము చేయుటకు నిరాకరించెనో, యప్పుడిక తిరుమలున కేమియు తోచక వేలూరు ముట్టడి యొనర్చిన తాను సేనతో తోడ్పడుదు నని గోలకొండకు కబురంపెను.[2] అప్పటి కింకను గోల కొండకుత్తరమునను౦డి మొగలాయీలయొత్తిడి యంతగా తగులుచుండలేదు. శ్రీరంగరాయలు నెటుతోచక "ఇక్కేరి" శివప్పనాయకుని సాయము కోరెను. గోలకొండ సేన వేలూరును ముట్టడివేయగా తిరుమలుడు

1. మైసూరు రిబ్బరదలో కాలు పెట్టలేదు.

2. "Swayed only by fury and desire for vengeance Tirumala Naick secretly addressed the Subah of Golconda, and requested it to invade the Kingdom of Vellore."

(La Mission Du Madure, p. 43).

పంపుదునన్న సాయము పంపనందున, శివప్పనాయక యుక్తుడైన శ్రీరంగరాయల బల మధికమైనందున గోలకొండసేనలు వెనుకకు మరలవలసివచ్చెను.[1] శ్రీరంగ రాయలు మహమ్మదీయులు మరల బలమును కూర్చు కొనులోపల దక్షిణమును ధట్టించుకొని వారిసాయమున మరియొక ప్రబలప్రయత్నము కావింపవలెనని తలచి సేనతో దక్షిణదండయాత్రకై బయలువెడలెను. ఇప్పుడై నను విజయరాఘవుడు శౌర్యముతెచ్చుకొని శ్రీరంగరాయ నికి సాయ మొనర్చెనా? లేదు. మహమ్మదీయులు వేలూ రును గొనలేకపోతిమను నభిమానముచే మరల గొప్ప సేనతో బయలువెడలి సరాసరి వేలూరును ముట్టడించి గ్రహించిరి.[2] శ్రీరంగరాయలు చాలదూరము దక్షిణము నకు మిగిలివచ్చినందున వెనుకకు మరలుటకు వీలు కలుగలేదు. దక్షిణమును జయించవచ్చు శ్రీరంగ రాయ లుత్తరమునుండి వచ్చు మహమ్మదీయులకును,

1. History of Nayaks of Madura, pp. 127, 128.

2. "The King of Golconda resolved to vindicate his honour raised an army more numerous than before, rasumed the field regaincd his vantage ground, and actively attacked Narasinga(Vizianagar Emperor.) (La Mission du Madure, p. 43)




షాహజీరణదుల్లాఖానులు జయించిన రాజ్యములు I

(శివభారతమునందలి యనువాదమును చూడుడు) [౨౯౬, ౨౯౮ పుటలు.

దక్షిణమున ససైన్యులై సిద్ధముగ నున్న మధురజింజీల కును మధ్య నడకత్తులోని పోకవలె చిక్కిపోయెను.

కాని తత్కాలమునకు శ్రీరంగరాయలు దక్షిణరాజ్యములను తనకు సాయమొనర్చున ట్లొడం బరచెనని కన్పట్టునుకాని వారు బహిరంగముగా మహా మ్మదీయుల నెదుర్కొన గల్గినట్లు కానరాదు.[1] ఇంతలో వారిలో వారికి నంతఃకలహములు తటస్థించెను. దానితో శ్రీరంగరాయలు చేయునదిలేక మంచిసమయముకొరకు వేచియుండి తంజావూరుమండలమున కుత్తరమున నుండు నడవుల దొంగల గుంపులతో కూడి తలదాచుకున్నట్లు తెలియుచున్నది. మైసూరీయనయొక్క స్థితిని చూచి యనుకంపచే తలదాచుకొనుటకు తా విత్తునని కబు రంప నచ్చటికి వెళ్లి తలదాచుకొనెను.[2]

1 La Mission Du Madure, pp. 43, 44.

2. "Rejected again by the Nayaks Narasinga established his Court in the forests of thieves (Kallans) lying to the North of Tanjore, where he spent four months—a prey to all discomforts; his courtiers soon abandoned him, and this grand monarch one of the richest in India, was obliged to beg help of Mysore, once the vassal of his Crown. He recieved from him

రెండుమారులు తనకు సాయముచేతుమని వాగ్దానము చేసిన మధురను శిక్షింపవలెనని గోలకొండ సేనలు తమ దృష్టిని దక్షిణమునకు మరల్చెను. ప్రథమమున జింజి వారి దృష్టికి గురియయ్యెను. వెంటనే జింజి ముట్టడించి కైకొనిరి. తనతోపాటు మంచికిని చెడ్డకును సాయముచేయుచున్న జింజిని తిరుమలుడు రక్షింపలేక పోయెను. జింజిని గోలకొండసేనలు స్వాధీనపరచుకున్న వెనుక తా నొంటరిగా వారిపైకి పోవుటకు భయపడి తిరుమలుడు బీజపురమువారిని తనకు సాయముకోరెను. గోలకొండను కోరుటయైనది. ఈమారు వంతు బీజపూరునకు వచ్చెను. వారును తిరుమలునికి సాయముచేయుటకు కొంత సైన్యమును పంపినట్లు కన్పట్టుచున్నది. విజయరాఘవుడు తరువాత తనవంతు వచ్చునని తెలసి, యిప్పుడే కండ్లు తెరచుట మంచిదని యోచించి, మధుర తన కెన్నటికిని సాయముచేయదని నమ్మెచు, గోలకొండ

the invitation to choose, for his brilliant treatment worthy of his rank; he eagerly accepted the offer so obliging, and found a hospitality, which even surpassed the promises made to his ambassadars."

(La Mission Du Madure, pp. 43, & 44.)

సేనానితో లంచమిచ్చి రాజీపడెను.[1] ఆయనకు శ్రీరంగరాయల మైత్రికంటె గోలకొండదాస్య మెక్కువ లాభకరముగా కన్పట్టెనుకాబోలు !

తిరుమలుడు చేసినదికూడా సరసముగా లేదు. ఏలన నాయనకును సాటిహిందూరాజగు శ్రీరంగ రాయలకంటె బీజపురమునందు నమ్మక మెక్కువగ నుండుట రాజనీతిగా కన్పట్టలేదు. స్వమతస్థు డెప్పటికైనను స్వజనముకాని, పరమతస్థుడు కార్యసిద్ధియైన వెనుక కృతఘ్ను డగునని యీయనకు తట్టలేదు. మతాంతరులైనను క్రైస్తవులకుకూడా తిరుమలుని ప్రవర్తనము విపరీతముగ తోచెను.[2] గోలకొండను పిలుచుటయు

1. "Obliged to take sides he did what one would always do, under the influence of terror. He decided on the most senseless and disastrous step; he delivered himself up to the King of Golconda and concluded with him a treaty by which he surrendered at discretion."

(La Mission Du Madure, p. 45.)

2. "Tirumala Nayaka seeking safety in his unsound policy, committed a second folly which brought about a ruin of all these Kingdoms. His

మొదటి తప్పిదము. ఇప్పుడు బీజపురము నాహ్వానము చేయుట రెండవతప్పు!

ఆకాలమున బీజపురమున నదిల్షాయను రా జేలుచుండెను.[1] ఈయనవద్ద రణదుల్లాఖాను సేనాని యుండెను. ఆయన పరాక్రమశాలి. ఆయన యింతకు పూర్వము క్రీ. శ. 1638-వ సంవత్సరప్రాంతమున బీజ పురముచే దక్షిణమున కర్ణాటకముపై పంపబడెను.

ambassadors went in his name to treat with Idal-khan (Adil Shah) * * * ';

(La Mission Du Madure, p. 46).

తిరుమలుడు గొప్ప రాజనీతికోవిదుడనియు, బీజపురము నాహ్వానముచేయుట తప్పుకాదనియు, శ్రీరంగరాయలు దురుద్దేశ్యముతో దక్షిణమునకు వచ్చెననియు, తిరుమలుడు మధురయొక్క భావ్యభివృద్ధిని కోరినందున నట్లు చేసెననియు నేమేమియో వ్రాయుచు సత్యనాథయ్యరుగారు తిరుమలుని ప్రవర్తనము నిర్దుష్టమని చెప్పబూనిరి కాని యంతయు తృప్తికరముగ లేదు. ఆయనగ్రంథమున కుపోద్ఘాతము వ్రాసిన శ్రీ కృష్ణస్వామయ్యంగారు సత్యనాథయ్యగారితో భిన్నాభిప్రాయ పడుచున్నారు. ఆయన తిరుమలుని రాజనీతి పాటవ పాటని స్పష్టముగా చెప్పుచున్నారు.

(History of Nayaks of Madura, pp. 131 & 132).

1. క్రీ. శ. 1650 ప్రాంతము.

అప్పుడు కర్ణాటకమునకు వెడలి కెంపగౌడు నోడించి బెంగుళూరు మొదలగు ప్రదేశములను జయించెను. ఆయన బీజపురమునకు మరలినతరువాత యీదక్షిణరాజ్యమును పాలించుటకు ఛత్రపతిశివాజితండ్రియగు షాహజీ పంపబడెను. ఈయనయు దక్షిణమున బెంగుళూరు ముఖ్యస్థానముగా నీదక్షిణజిల్లాలను పాలించుచుండెను.[1] కర్ణాటకజిల్లా లన్నియు షాహజీచే సంపూర్ణముగా జయింపబడినట్లు కానరాదు. ఉత్తరమునుండి మొగలుల యొత్తిడి యెక్కువయైనకొలది దక్షిణమునకు దిగ్రాక వలెనని బీజపురము ప్రయత్నించుచుండెను. అందువలన నప్పుడప్పుడు దండయాత్రల నంపుచునేయుండెను. మన వెనుకటి జింజిముట్టడికాలమునకు కొంచెము పూర్వ మిట్టి యొకదండయాత్ర బయలువెడలెను. అందు

1. "In 1638 Ranadullakhan captured Bangalore from Kempagauda.........On Ranadullakhan's return to court (Bijapur) Shahji was appointed to Govern the Districts of Carnatic Bijapur. He fixed his residence at Bangalore and afterwards lived sometimes at Ballpur and sometimes at Kolar"

(Mysore and Coorg Gazetteer, Rice, pp. 21 & 22.)

శాహజీరణదుల్లాఖాను లిద్దరును పాల్గొనిరి.[1] ఎప్పుడు బీజపుర సేనానికి తిరుమలుడు కబురంపెనో, వెంటనే యాయన 17,000 సంఖ్యగల సేనను తిరుమలునికి సాయ మంపెను. ఆసేనయు తిరుమలునిక్రింద మఱియొక 30,000 సేనయు కలిసి జింజిని ముట్టడించిరి. కాని కోట లోపలనున్న గోలకొండసేనలును బయటి బీజపుర సేన లును రహస్యముగా సంధిచేసికొని తుదకు లోని సేనలు కోటతలుపులను తెరచి బీజపురముసేనలకు తావిచ్చి తాము వెడలి స్వదేశమునకు పోయిరి.[2] బీజపురము సేనల దోపిడికి జింజికోట లోనయ్యెను. ప్రజలలోను సేనలలోను నమ్మకము లేక తిరుమలుడు వీరితో సంధిచేసుకొనవలసివచ్చెను. లేకపోయిన వీరు మధు రను ముట్టడిచేయుదుమని ఖండితముగాచెప్పిరి. వీరికి పందయగు విజయరాఘవుడు మధురజింజీల స్థితిని

1. శివభారతము. ఉపోద్ఘాతము. 107 & 108.
మిషనరీయుత్తరములం దీసేనానిపేరు "ఖాణాఇఖాను" (Khani-Khan) అని చెప్పబడినది.

2. History of Nayaks of Madura, p. 129.
ఇచ్చట మిషనరీ యుత్తరములలో పరస్పర విరుద్ధములగు నంశ ములు కలవు. కాని పర్యవసానము గ్రహించుట కష్టసాధ్యముకాదు.

గమనించి తాను మహమ్మదీయకోపాగ్నికి శలభాయమానుడ నగుదునని నమ్ముచు తనలో నమ్మకములేక మధురవలె తానుకూడా సంధిచేసుకొని వారు కోరినంత ధన మిచ్చి వారికి వెనుక విజయనగరసామ్రాజ్యమునకు వలె కప్పమిచ్చున ట్లొప్పుకొని యప్పటికి ప్రాణమును తప్పించుకొనెను. ఈదండయాత్రలో బీజపుర సేనలకు దొరకినద్రవ్యమునకు లెక్కలేదు. జింజికోట మిక్కిలి ధనవంతముగ నుండెను.[1] దీనికి తోడు విజయరాఘవునివద్ద కొన్నధనమును తిరుమలుడు చెల్లించిన ధనమును, నింత యనిచెప్ప వీలులేదు. ఈసమస్తధనముతో బీజపురము సేనలు బీజపురము చేరి సుల్తానుచే మిక్కిలి గౌరవింపబడెను. ఈపరిస్థితులు తప్పక క్రీ. శ. 1650-వ సంవత్సర ప్రాంతమునందని చెప్పవలెను. మిషనరీయుత్తరములు క్రీ. శ. 1659-వ సంవత్సరమునకు చెందినవి గాన తప్పక తత్పూర్వమని సిద్ధము. క్రీ. శ. 1650-వ సంవత్సరమునకు తరువాత బీజపురమున కుత్తరమునుండి మొగలుల

1. "The booty was inestimable consisting of silver, gold, pearls, and precious stones of immense value"

(La Mission Du Madure, p. 46.)

యొత్తిడి యెక్కువనైయెనందున తన దృష్టిని దక్షిణమునకు ప్రసరింపజేయుటకు వీలులేకపోయెను.

శ్రీరంగరాయలకు తలదాచుకొనుటకు తావిచ్చినందులకు బీజపురసేనాని మైసూరుకంఠీరవ నరసరాజుపై నాగ్రహించినందున క్రీ. శ. 1653-వ సంవత్సరప్రాంతమున నాయన తా నిదివర కిచ్చిన రక్షణమును వదలి వేసినట్లు కన్పట్టును. కాబట్టి పై మధురతంజావూర్ల బీజపురముతో సంధి తత్ప్రాంతమున నేయని గట్టిగా చెప్పనగును. శివభారతము (శివాజీచరితము) కూడా యీ సందర్భము లీసంవత్సరప్రాంతమున నేయని చెప్పుచున్నది. ఈ బీజపురదండయాత్రల నన్నిటిని గుదిగ్రుచ్చి షాహాజీ రణదుల్లాఖాను లెవ్వరెవ్వరిని జయించిరో తెలియజేయు శివభారతములోనియీక్రిందిభాగము ననువదింతును:

"అథశాహా[1] మహీపాల మవలం బ్యావలంబనమ్,
బత్ప్రతిపదం లేభే మహమూదో[2] మహాబలమ్.
అథో ఫారదఖానస్య[3] సుతం సమరధూర్వహమ్,

1. శాహాజీ (శివాజితండ్రి.)
2. మహమ్మదు అదిల్ షా.
3. ఫరీదుఖాను.

నిఖిలానీకినీమాన్యం సేనాన్యం రణదూలహామ్.[1]
బలినా శాహారాజేన మహారాజేన సంయుతమ్,
ప్రతాపీ ప్రేషయామాస జేతుం కర్ణాటనీవృతమ్.
తత్రో బిందుపురాధీశం[2] వీరభద్రం మహౌజసమ్,
వృషపత్తన[3]పాలంచ ప్రసిద్ధం కెంగనాయకమ్.
కావేరీపట్టణపతిం[4] జగద్దేవం మహాబలమ్,
శ్రీరంగపట్టణేంద్ర[5]ంచ క్రూరం కంఠీరవాభిధమ్.
తంజాపుర[6]ప్రభుంచాపి వీరం విజయరాఘవమ్,
తథా జింజీ[7]పరివృఢం ప్రౌఢం వెంకటనాయకమ్.
త్రిమల్ల[8]నాయకాహ్వాంచ మధురానాథ ముద్ధతమ్,

1. రణదుల్లాఖాను.
2. బెదనూరు, వీరభద్రపాలితము.
3 బసవాపట్టణము, కెంగహనుమపాలితము.
4. కావేరీపట్టణము, జగద్దేవపాలితము.
5. శ్రీరంగపట్టణము, కంఠీరవ నరసరాజపాలితము.
6. తంజావూరు, విజయరాఘవపాలితము.
7. జింజి, వెంకటనాయక పాలితము.
కృష్ణప్పనాయకు డిప్పటికి మరణించెను.
8. తిరుమలనాయకుడు.

పీలుగండా[1] ఖండలంచ వికటం వెంకటాహ్వాయమ్.
ధీరం శ్రీరంగరాజంచ విద్యానగర[2]నాయకమ్,
ప్రసిద్ధతమ్మగౌడంచ హంసకూట[3]పురేశ్వరమ్.
వశీకృత్య ప్రతాపేన తథాన్యానపి పార్థివాన్,
శాహ స్సంతోషయామాస సేనాన్యం రణదూల
[హం."[4]

శ్రీకృష్ణస్వామయ్యంగారు తమ "Ancient India" గ్రంథమున నీరణదూల్‌ఖానవృత్తాంతము 1638-39-వ సంవత్సరముల జరిగెననియు, నప్పుడు రణదూలుని ప్రవర్తనమున సరిగా నుండలేదనియు, నందుచే పదభ్రష్టుడు కావింపబడినందున ఖాన్‌ఖాన్ అను మరియొక సేనాని రణదూల్‌ఖానుస్థానమున నియమింపబడెనని చెప్పుచున్నారు.[5] బహుశః మిషనరీయుత్తరములు చెప్పు ఖాన్-ఇ-

1. పెనుగొండయా? శివభారత వ్యాఖ్యాతయు నిచ్చట గట్టిగా చెప్పలేదు.

2. సామ్రాజ్యము, శ్రీరంగరాయలు.

3. హోసపేట, తమ్మగౌడపాలితము.

4. శివభారతము, 9, 31-40 (పై ప్రదేశములకు పటములు 5, 6 చూడుడు).

5. Ancient India, pp. 292, 293 & 294.

ఖాన్ యీయాయనయే మోనని యనుమానమునకు తావు కల్గుచున్నది. కాని శివభారతమునందలి యుపోద్ఘాతమున రణదల్లాఖాను రెండవమారు వచ్చినట్లును, శాహాజీసహితుడై పంపబడినట్లును స్పష్టముగా చర్చింపబడి నిర్ధారణము చేయబడినది[1]. బీజపురసేన లుత్తరమునకు వెడలిన తరువాతనైనను ద్రవ్య మిచ్చి యాపత్తు తప్పించుకొన్న మధురతంజావూరులు తమరు కోల్పోయిన ప్రతిష్ఠను పునరార్జించవలెనని ప్రయత్నింపసైరి.[2] పైపెచ్చు మహమ్మదీయులకు లంచమిచ్చిన ద్రవ్యము పునరార్జించుటకు గడంగిరి! తద్ధనసంపాదనమునకై ప్రజలను పీడింపసాగిరి. దానివలన ప్రజల యాదరణమును గోల్పోయి రాజ్యపాడు వదలునా యనుభావము వారిలో పుట్టెను. ఈధనార్జనము పేరున మిక్కిలి ఘోర

1. శివభారతము, ప్రస్తావన 107. 108.

తన తండ్రివలన జయింపబడినందున తనవియని శివాజీతరువాత దక్షిణమునకు వచ్చినట్లుకూడ చరిత్రమువలన తెలియును.

2. తిరుమలుడు బీజపురమునకు కప్పముకట్టునట్లు సంధి చేసుకొనలేదని చూపుటకై సత్యనాథయ్యారుగారు బహు శ్రమపడినారు. కాని వారి వ్రాతలను చదివినచో వారివాదము నిరాధారమని తేలును.

కృత్యములు చేసినట్లు కన్పట్టును.[1] సమయము వచ్చినప్పుడు ప్రజలు సాయపడి యిక్కట్టులనుండి గట్టెక్కించునట్లు చేయుట కిదియా మార్గము? తన ప్రజానురాగమును, బాహుబలమును తన్ను రక్షించునని యావీరవైష్ణవునకు తోచకపోయెను. ఇది తంజావూరుదౌర్భాగ్యము!

శ్రీరంగరాయలు మరల మైసూరుసేనల సహాయముచే తన స్థితిని బాగుపరుచుకొన ప్రయత్నించినప్పు

1. "Delivered from this formidable adversary, the two Nayaks should have felt bound—it would appear—to heal the wounds of this disastrous war, and strengthen themselves from fresh attacks, which they ought to expect, more especially as they had not the intention to fulfil the treaties. But this was the least of their cares. They only thought of oppressing their own subjects, whom their (Nayaks) inprudence and cowardice had already delivered to the horrors of invasion by the enemy. Their arrogance seems to conceal the degradation and meanness which had dishonoured them, in rivetting the yoke of despotism on their own people Extortions and spoliations recommenced with a cruelty which made them universally regret the domination of the Mughals."

(La Mission Du Madure, p. 47.)

కును తిరుమలుని దుర్మార్గమువలననే యది సఫలము కాకపోయెను. తిరుమలుడు మైసూరుసేనలు శ్రీరంగ రాయలకు సాయము చేయుట చూచి వెంటనే బీజపుర సేనాని కీసంగతి తెలియచేయ నాయన శ్రీరంగరాయలను మర్దించుటయెగాక సాయముచేసిన మైసూరుపైనకూడా కోపము చూపినట్లు తెలియుచున్నది. ఇదియే శ్రీరంగ రాయల తుదిప్రయత్నము. తిరుమలుని రాజనీతి సామ్రాజ్యముయొక్క యంతమునకును, శ్రీరంగరాయల యస్తమయమునకును కారణమయ్యెను. మొదట తిరుమ లునిచే కోరబడిన మహమ్మదీయసాహాయ్య మను స్వనా శనబీజము క్రమక్రమముగా తిరుమలునికి తెలియకుండ పెరుగుచుండెను! [1] శ్రీరంగరాయలనుగూర్చిగాని, సామ్రా

1. "Tirumala Nayaka instead of co-operating in the re-establishment of the affairs of Narasinga, who alone could save the Country re-commenced regotiations with the Muhammadans, opened to them again the passage through the Ghats, and urged them to declare war against the King of Mysore whom he should have sought for help. The King of Bisnagar betrayed a second time by his vassal succumbed to

జ్యమునుగూర్చిగాని మన కిక పనిలేదు! తిరుమలుని యహంకారమును, విజయరాఘవుని పిరికిదనమును సామ్రాజ్యమును పొట్టనుబెట్టుకొనెను!

తిరుమలుడు మైసూరుపైన బీజపురమును పురి కొల్పుటచే మైసూరునకు కోపము వచ్చి మైసూరునకును తిరుమలునికిని యుద్ధము తటస్థించెను. కంఠీరవనరసడే యోడిపోయినట్లును తిరుమలుడే గెలిచినట్లును తెల్పు చున్నారుగాని యీజయము కల్గినదని సంతసించులోప లనే తిరుమలుడు క్రీ. శ. 1659-వ సంవత్సరమున మృతి నొందెను. ఆయన మృతిచే మంచికిగాని చెడ్డకుగాని యొక పటుత్వముగల వ్యక్తి యంతరించెను. తిరుమలుని తరు వాత యాయనకుమారుడగు రెండవ ముత్తువీరప్పనాయ కుడు రాజ్యమునకువచ్చెను. ఈయన యెక్కువకాలము రాజ్యముచేయలేదు కాని సదుద్దేశ్యముతో రాజ్యపాలన

the events and was obliged to seek refuge on the confines of his Kingdom, in the forests where he led a miserable life of prince made unhappy by the folly of his vassals, whom his personal qualities rendered worthy of a better fate."

(La Mission Du Madure, p. 48.)

History of Nayaks of Madura, p. 133, 134.

మును ప్రారంభించెను. ఈయన దక్షిణదేశహిందూరాజ్యములన్నియుకలసి మహమ్మదీయుల నెదిరించుట దేశక్షేమమని తలంచి యావంక ప్రథమప్రయత్నముగా బీజపురము వారికి కప్పముకట్టుట మానెను. బీజపుర మింతటితో కోపమువహించి వెంటనే దక్షిణమునకు పెద్దసేన నంపెను. ఇది మహమ్మదీయుల యిటీవలిమూడవదండయాత్ర. దీనికి సగోసీ, మౌలా యనువా రిద్దరును నాయకులు.[1] విజయరాఘవుడుమాత్రము వెనుకటిపద్ధతినే నడచి మహమ్మదు (ఆదిల్) షాకు రాయబార మంపెను. కాని వా రదిసరకు గొనలేదు. మహమ్మదీయసేనలు రెందవ ముత్తువీరప్ప తిరుచినాపల్లియందు తన యావద్బలమును కేంద్రీకరించి సిద్ధముగా నుండుటచే నటు వెడలుటకు జంకి యంబేదయగు విజయరాఘవునిపై బడెను. క్రీ. శ. 1659-వ సంవత్సరము మార్చి 19-వ తేదిన తంజావూరుకోటను మహమ్మదీయసేనలుచుట్టడించెను. పట్టణమును వారికి స్వాధీనపరచకుండా యుద్ధముచేసి చూతమని కోట కావలివారగు రాచవారును, యింకను నితరసైనికులును చెప్పినప్పటికిని విజయరాఘవుడు సలహాల నన్నియు

1. Sagosi and Maula
(La Mission Du Madure, p. 119)

పెడచెవినిబెట్టి ప్రజలను మహమ్మదీయులకు వదలి తాను స్త్రీజనముతో వల్లంకోటకు వెళ్లి డాగొనియెను. కాని శౌర్యవంతులును నీనరరక్షకులునగు రాచవారు కృపాణహస్తులై శత్రువులపైబడి చాలమందిని దునుమాడిరి కాని తుద కల్పసంఖ్యాకు లగుటచే మడిసిరి. పట్టణము శత్రుగతమయ్యెను.[1] వీరి నామము చిరస్మరణీయ మగునుగాక !

మహమ్మదీయులును వారి మనసువచ్చినట్లు తంజావూరును దోచి, నాయకుడు వల్లంకోటకు వెళ్లినట్లు తెలిసి, ముందుగా మన్నారుగుడికి వెడలి యాపట్టణమును

1. "It (the Muhammadan army) fell on Tanjore on 19th March 1659, * * * The Rachavar alone protested against this cowardice. These are warriors of a very noble caste, and renowned for their courage. They use only the sword and the lance, they scorn the bow and the gun, and gave as they themselves say these arms to cowards who dare not face dangers closely. Their maxim is never to retreat before the enemy; to conquer or to die is to them a sacred law. Faithfull to this law, they threw themselves desperately amidst the conquerors and me twith a glorious death which they preferred to a dishonourable life."

(La Mission Du Madure pp. 51, 52.)




షాహజీ రణదుల్లాఖానులు జయించిన రాజ్యములు II
(శివభారతమునందలి యనువాదమును చూడుడు)

దోచుకొని క్రమముగా వల్లంకోటకు పయనమైరి. వల్లం కోట మిక్కిలి గట్టిదియని వెనుక మనకు తెలియును. మహమ్మదీయు లచ్చటకు వచ్చులోపల పరిస్థితులు విజయరాఘవునకు విషమమయ్యెను. సైన్యములో కలకలము కలిగెను. విజయరాఘవుని ప్రవర్తన మెవ్వరికిని తృప్తికరముగా లేదు. ఇట్టివానికి సాయపడి యాపత్తున బడుటకంటె యీయనను డించి తమప్రాణములను కాపాడుకొనుట పాడియని తలచి సైనికు లందరును పారిపోయిరి. ఈయనయు నిక ప్రయోజనములేదని తలచి యడవులపాలయ్యెను. పురజనులును మిగిలిన కొందరు సైనికులును కలసి యచ్చట నాయకుడు దాచిన ద్రవ్యమును శత్రువుల కేల యియ్యవలెనని తామే కొల్లగొట్టి యపహరించి ఖైదీలను విడుదలచేసి[1] మహమ్మదీయసేనలు వచ్చుసరికి నిర్మానుష్యమైన కోటను వారికి స్వాధీనముచేసిరి. మొత్తముమీద నాయకుని ధనమంతయు దొంగలకో, దోపిడిగాండ్రకో స్వాధీనపడెను. ఆధనమునకు మేరలేదు.[2] విజయ

1. వెనుక చూడుడు.

2. "Every one took in his clothes as many pieces of gold & precious stones as he could carry."

(La Mission Du Madure, p. 52.)

రాఘుపుడు ప్రజలను పీడించి యాధన మంతయు కూర్చి నందున మరల నది ప్రజలకు చేరుట సమంజసమే!

ఈయనువదించిన మిషనరీయుత్తరమును వ్రాయు నప్పటికి మహమ్మదీయులు తంజాపూరుమండలము నాక్ర మించుకొనియుండిరి. ఈరాజ్యమున వా రీతూరి దాదాపు రెండువత్సరము లుండిరి. వీరు రాజ్యమున గావించిన దుండగములకును, ప్రజలను పెట్టిన హింసకును మేర లేదు. కాని ప్రజ లూరకుండిరి. తమ రా జింతకంటె బాగుగా పరిపాలించుచున్నకదా వారల కిది కంటకముగ నుండు ను? "ఏరాయియైననేమి తల పగులకొట్టుకొనుట" కన్నట్లు రాజ్య మెవ్వరు చేసినను వారికి పీడ తగ్గలేదు. జింజినికూడ నిట్లే వీరు స్వాధీనపరచుకొని కాలము గడపిరి. మధురమాత్రము భయముగొల్పెను.

మహమ్మదీయచిరంతనపీడవలనను యింకను ఇతర కారణములవలనను దక్షిణదేశమున కాటకము హెచ్చె ను; పంట లడుగంటెను. ప్రజలు తుదకు దేశము వీడిపోవమొదలిడిరి; కొందరు నశించిరి. మహమ్మదీయ సేనలుకూడా యీనాశనమునకు గురియయ్యెను. క్రీ. శ. 1662-వ సంవత్సరమునాటి యొక మిషనరీయుత్తరమున గుఱ్ఱములయొక్కయు, మనుష్యులయొక్కయు పీన్గు

లసంఖ్యాకములుగా నెచ్చట చూచినను పడియున్నట్లు చెప్పబడియున్నది.[1] రానురా నీ మహమ్మదీయసైనికులలో కలతలు కలిగెను. సగోసి తెలివిగలవా డగుటచే తమ యనుభవమును కప్పిపుచ్చి కొంతధన మిచ్చిన తాను వెడలిపోవుదు నని విజయరాఘవునకు కబురంపెను. కాని యాయన వద్ద ధనమేది? "పైసలేనివాడు పర స్త్రీవర్జితు" డన్నట్లు విజయరాఘవుడును మిన్నక యూరకుండెను. అంతట నాలస్యమైనకొలది వారి కష్టములు హెచ్చుచున్నందునను, మరణములు వృద్ధియగుచున్నందునను వారియంతట వారే యెట్టి ధన మియ్యకుండగనే దేశమునువిడచి వెళ్లిపోయిరి. వీరి సైన్యములో సంఖ్య తగ్గిపోవుటచేత తిరుచినాపల్లివారు సేనను చేర్చుకొని మిగిలిన మహమ్మదీయసైన్యము నీప్రాంతమునుండి తరిమివేసిరి.

ముత్తువీరప్ప చాలకాలము రాజ్యముచేయలేదు. ఈయన తన కుమారుడగు చొక్కనాథునకు రాజ్యమును వదలిపోయెను. హూలా శీజపురమునకు వెడలిపోయెను గాని సగోసిమాత్రము దక్షిణదేశమును వదలలేక

1. La Mission Du Madure, p. 120.

జింజిలో స్థావర మేర్పరచుకుని నిలిచిపోయెను. విజయ రాఘవుడును మహమ్మదీయులు వెడలిపోయినట్లు తెలిసి తిరిగివచ్చి తంజాపూరుకోటలో ప్రవేశించి నిర్లజ్జుడై మరల రాజ్యముచేయ సాగెను. ప్రజలును నెవరున్న నేమి యని యూరకుండిరి. బలవద్వనవిహారముచే పొట్టయు బొక్కస మును సడలియుండెను. మరల ధనముకొరకై రాజవిస్వర మెక్కువ కాజొచ్చెను. ప్రజ లిదివరలోనే సమస్తేతి బాధలచే పీడింపబడుచుండిరి. వాని యన్నిటిపైన నీవిజయ రాఘవుని పీడ మరల వచ్చెను. మహమ్మదీయులు పడిన శ్రమనుచూచిన నిప్పటిలో మరల నిటకువచ్చునట్లు కన్పట్ట లేదు. మరియు నుత్తరమునుండి మొగలుల బాధ వారి కధికమయ్యెను. విజయరాఘవున కీపరిస్థితులు సుముఖ ముగనే యుండెను. కాని యట్టివానిని తన యధికార మును ధట్టించుట కుపయోగించక ప్రజలను పీడించుట కుపయోగించెను. ఈపీడను భరింపలేక కొందరు తంజా పురప్రజలు చొక్కనాధుని రాజ్యమును ప్రవేశించి కాల ముగడపినట్లు తెలియుచున్నది. మంత్రి నొకని నియమించి ప్రజలనుండి ధనము లాగుటకు వలయు సాధనముల నన్నిటి నుపయోగింపించెను. తుదకు ప్రజ లిక భరింపలేని స్థితి వచ్చినప్పుడు తాను యంత్రముగా నుపయోగించిన

మంత్రిని ప్రజల కోపాగ్ని కాహుతిగా నొనర్చెను.[1] విజయరాఘవా! ని న్నెవ్వరును నమ్మ వీలులేదుకదా? దుష్ప్రవర్తనమే నీసహజగుణము! మంత్రియు నట్టి శిక్షకు పాత్రుఁడనియే కన్పట్టును.

1. "The Pradhani of Tanjore to fill the Royal treasury and make his own fortune gave to a Brahman the authorisation to dispoil all the vassals without any formality. In conveying this order he has only the largest fortunes in view, but the Brahman who had also a purpose to fill extended the decree to all ranks and employed for its execution means so violent and cruel that the inhabitants seized with consternation sought safety in flight. The artisans suspended their work; the merchants closed their shops, most of the people left their homes and the Kingdom showed the appearance of a desert. The King could not ignore such barbarities; but being himself thirsty of gold he dissembled in the hope of gathering the fruits of these plunderings; then when he thought the moment favourable to strike the blow he understood that the minister had known how to take measures and remove the treasures. He took vengeance on him by giving him up to their anger. * * * * "

(La Mission Du Madure, p. 202.)

తంజావూరున కీ కష్టపరంపర చాలనట్లు డచ్చివా రొకమూలనుండి తమ చేష్టల సాగింపసాగిరి. ఆకాలమున డచ్చివారు బానిసవర్తకము[1] చేయుచుండిరి. వారికీతంజావూరు రాజ్యము పంటభూమిగా కనుపడెను. ఇచ్చట ప్రజ లన్నములేక బాధపడుట వారి వర్తకమునకు సాయమయ్యెను. ఈప్రజలను తా మన్నముపెట్టుదమని లోబరచుకొని నాగపట్టణము గొనిపోయి యక్కడ కొలది కాలము వారిని పోషించి యచ్చటనుండి వారిని ఓడలలో పరదేశములకు గొనిపోయి బానిసలనుగా విక్రయింపసాగిరి. పాశ్చాత్యుల నిప్పుడు కదల్చిన హిందూ దేశప్రజలకు నాగరకత లేదనియు, తాము వారిని నాగరకులను చేయ భగవంతునిచే పంపబడిన దూతలమనియు ప్రగల్భములు చెప్పుకొందురు. అప్పటి వీరి సేత లప్పుడే కొందరకు హేయముగ కన్పట్టెను.[2]

1. Slave trade.

2. "Tanjore suffered more than Madura; the people adandoned their homes and took refuge in Madura, and some at St. Thome. The excessive and fatal religious zeal of Vizayaraghava made him culpably negligent of his subjects' sufferings. To all the mishaps due to Mahammadan scourge and famine was added

ఈడచ్చివారికి విజయరాఘవుడు సాయముచేయుచున్నట్లుకూడ ననుమానము. ఇట్లు చేయుచున్నవారి ప్రవర్తనము రాజునకు తెలియకుండునా? తెలిసిన నూరకుండెనన్న నీయనప్రవర్తనముకూడ ననుమానింపవలసియేయున్నది. క్రీ. శ. 1600 ప్రాంతమున నీడచ్చివారికి విజయరాఘవుడు నాగపట్టణము దానమిచ్చిన శ్లోక వెండిశాసనము కలదు. అది యిప్పుడు బటేవియాలోని మ్యూజియమున నున్నది.[1] అకార్యకరణములను చేయుచున్న డచ్చివారికి దానమిచ్చెనన్న నీయనకుకూడా

the inhuman exploitation of the situation by the Dutch prompted by mercenery motives, A Jesuit writer pathetically describes the atrocities."

(History of Nayaks of Madura, p. 157.)

'Shame! Eternal shame to the Dutch! who cruelly speculated on the misery of the Indians! They ent ced them to the coast by the bait of abundant food; then when their number became pretty large, and their strength a little recouped, they piled them up in their ships and transported them to other countries ta be sold as slaves."

(Bertrand, III, pp. 124, 125.)

1. Inscriptions in Madras Presidency, V. Rangachari, Vol. II. p. 1347.

వారు లంచమిచ్చిరాయను నూహకు తావు కల్గు చున్నది.

పైపరిస్థితులకుతోడు విజయరాఘవుడు చొక్క నాథుని యాగ్రహమునకు పాత్రుడయ్యెను. వెనుక సగో సిమాత్రము జింజిలో నిలచిపోయెనని విన్నవించియుంటిని. ఈకాలమున అనగా క్రీ. శ. 1660–1663 సంవత్సరముల మధ్య నీయన యచ్చట నున్నట్లు దృష్టాంతముగ శాసనా ధారముకూడ కలదు.[1] చొక్కనాథుడు జింజిని నాయకున కెట్లయిన పునరార్జించి యిచ్చుట కృతజ్ఞతయని తత్కా ర్యమును తలపెట్టి యచ్చటనున్న సగోసీని వెడలగొట్టుటకు పెద్దసేన నిచ్చి తన సేనానాయకుడగు లింగమనాయకు నంపెను. లింగమయు జింజికి ససైన్యుడై పోయి యచ్చట రాజాజ్ఞను నిర్వర్తించుటకు మారుగా సగోసీవద్ద లంచ మును గొని మిన్నక యూరకుండెను. చొక్కనాథున కిది తెలసి తాను ససైన్యుడై లింగమను శిక్షించి జింజిని జయించుటకై వెడలెను. ఈసంగతి తెలిసి సగోసీయు, లింగమయు భయపడి తంజావూరు పారిపోయి తల దాచుకొనిరి. చొక్కనాథునకు జింజిని కొనినవెంటనే

1. History of Nayaks of Madura, p. 134.

యీసంగతి తెలిసి తన శత్రువులకు తావిచ్చిన విజయ రాఘవుని శిక్షించుటకై బయలుదేరెను. విజయరాఘవుడు వారిని వెడలగొట్టి, యుద్ధముసేయు నాచారము లేనుగాన యాయనతో సిగ్గులేక సంధిచేసుకొనెను. ఇదియే మధుర తంజావూరుపై యొకశతాబ్దమధ్యమున పొందిన ప్రథమవిజయము. విజయరాఘవా! వంశమునకును, రాజ్యమునకును వచ్చిన కళంకమైనను తెలిసికొనకుంటివా! క్రీ. శ. 1663-వ సంవత్సరమున మరల నొక చిన్నమహమ్మదీయదండయాత్ర వనమియ్యనను[1] నొక మహమ్మదీయసేనానిక్రింద వచ్చెను. కాని యీమారు తాకిడి యంతయు చొక్కనాథునికే తగిలెను. పాప మీయన విజయరాఘవునివైపుకు దృష్టి త్రిప్పలేదు. చొక్కనాథుడును మొదట నీయనతో పోరాడదలచి విజయరాఘవుని సాయ మడుగగా విజయరాఘవుడు నిరాకరించినందున చేయునదిలేక మేటిబంటయ్యె డబ్బిచ్చి శాంతిని కొనుక్కొనెను. తుద కీబీజపురము సేనాని లంచపుకుప్పను గొని వెడలిపోయెను.[2] ఇదియే

1. Vanamian
2. History of Nayaks of Madura, p. 158.

యిప్పటికాలమున తుది మహామ్మదీయదండయాత్ర. ఇక కొన్నివత్సరములవరకు తంజావూరునకు మహామ్మదీయులవలన భయము లేకుండెను. కాని చొక్కనాథుడీరెండవతూరి విజయరాఘవుడు తన్ను మోసగించుట చూచి యెట్లయినను తంజావూరిపైన తన యుద్దేశ్యమును నెరవేర్చుకొనదలచి క్రీ. శ. 1633–1664 ప్రాంతమున తంజావూరుపైకి ససైన్యుడై వెడలి వల్లంకోట ముట్టడించి యచ్చట తన సైన్యమును కొంత యుంచి తాను చెప్పినట్లు విజయరాఘవుడు వినున ట్లాయన నొడంబరచి వెడలిపోయెను.[1] విజయరాఘవుడు రాజ్యప్రారంభమునుండి యింతవరకు నొక్కకార్యమైనను "సెహబా" సనిపించుకొనునది చేసియుండలేదు. తప్పులపట్టిక చాలపొడుగయ్యెను. ఎల్లపుడును తల వంచుకొనవలసివచ్చుచున్నదేయని సిగ్గయినను లేకుండెను. విజయరాఘవునికంటె చొక్కనాథుడు చాల చిన్నవాడయినను, తన రాజ్యస్థైర్యమునకు వలసిన రాజనీతిని శౌర్యమును సమయము వచ్చినపుడెల్ల నుపయోగించుచుండెనుకాని విజయరాఘవున కట్టి పద్ధతియే తోచలేదు. చతుర్వేది

1. La Mission Du Madure, pp. 159, 160.

యొక్క యాశీర్వాదబలమును వీరవైష్ణవముయొక్క నాచరణబలమును కలసి యీయన ని ట్లొనర్చెను.

మధురవలన కలిగిన యీ రెండవ పరాభవ మీయ నను క్రమముగా కొంచెము కలంచినట్లు కన్పట్టును. చొక్కనాథునకు వెంటనే మైసూరుతోను, రామనాథ పురముతోను యుద్ధమువాటిల్లెను. అందుచేత తంజావూరు యొక్క యంతును తెలిసుకొనుటకు వీలులేకపోయెను. మరియు నావంక తీవ్రసంగ్రామము జరుగుచుండుట చేతను, సేనలన్నియు నచ్చట నుపయుక్తము లగుట చేతను విజయరాఘవునకు కొంచె మవకాశము కలిగెను. విజయరాఘవుడు చొక్కనాథుని కార్యాంతరవ్యాపృ తత్వమును కనిపెట్టి వెంటనే సైన్యములను కూర్చుకొని చొక్కనాథుడు తనవద్దనుంచి గ్రహించిన వల్లంకోట మొదలగు ప్రదేశముల నొకదానివెనుక నొకటిగ వెంట వెంటనే పునర్గ్రహించెను. విజయరాఘవునకు విజయ మనుట కిదియే మొదటితూరి. చొక్కనాథున కిది తెలి సియు చేయునదిలేక యూరకుండెను. ఈపరిస్థితులు క్రీ. శ. 1664-వ సంవత్సరమున తటస్థించెను.[1] చొక్క

1. "The Nayak of Madura had been for a considerable time in war with the Nayak of Tanjore and

నాథుడు డచ్చివారిని సాయముకొరకు వేడెనుకాని వారు నిరాకరించిరి.

విజయరాఘవునికి డచ్చివారి స్నేహితము తుద కిచ్చట సాయపడెను. విజయరాఘవుని దండనాథు డెవ్వరో తెలియదు. కాని వెంకటనాయకుడా యని తోచుచున్నది. వెంకటనాయకునియొక్కయు, విజయ రాఘవునియొక్కయు నామధేయములు కలసి "వెళ్ల పిళ్ల యార్ కొరవంజి" యను ద్రవిడనాటకమున కన్పట్టు

taken many places from him. At my time the war was renewed with more vigour than ever, and the Nayak of Tanjore having gathered a great army attacked the Nayak of Madura so briskly that he took from him in a few days all the places be had conquered from him before. The army of the Nayak of Madura being disheartend by the victorious enemies the Nayak of Madura sent to me to Koylang (Quilon) his chief Governor desiring assistance from the company (Dutch). But as it was not our interest to engage on any side I excused it as handsomely as I could."

(John Nieuhoff, Voyages & travels, p. 297.)

చున్నవి.[1] ఈయనయే విజయవెంకటపతి యని మన్నారు దాసవిలాసమున పేర్కొనబడినాడు. మొత్తముమీద దళవాయి యుపయోగించు సమయము వచ్చెను. రఘునాథకుమారుడనని చూపిన ప్రథమతరుణ మిది!

ఈ క్రీ. శ. 1644-వ సంవత్సరమునుండి యారు వత్సరములు నిరంతరాయముగనే రాజ్య మేలినట్లు కన్పట్టును. ఈకాలమున చొక్కనాథు డితరశత్రువులతో వ్యాపృతు డైయుండెను. కాని వరుసను కొన్నివర్షములు సుఖముగా నేలుటచే విజయరాఘవుడు మరల వెనుకటి త్రోవకే వెళ్లెనాయని యనుమానముగా నున్నది. మరల తాతయాచార్యప్రపత్తి వీరవైష్ణవము క్రిందికి దించెనా యని తోచును. ఇప్పటికి విజయరాఘవునికి యరువదికి మించిన వయ సుండును.

1. "వాణాళుం పూమాలై రావుత్తరుం వాళి
* * * * * *
విజయరాఘవస్వామి మెస్మెలుం వాళి
* * * * * *
మెచ్చుత్తళవాయి వేంకటేందిరనుం వాళి."

(Tamil Catalogue of Mss. in Tanjore Library, Vol. I, p. 217.)

ఈ "కొరవంజి" కారుడు మన్నారుగుడివద్దనున్న రంగనాథపుర నివాసియని తోచుచున్నది. ఇప్పటికిని తంజాపురమున నీ వెళ్లపిళ్లయారుకోయిల్ కలదు. పూమాలై రావుత్తరుపేర నొకవీథియు కలదు.

విజయరాఘవుడు రాజ్యమునకు వచ్చినవెంటనే తన ధైర్యసాహసములను తెలిసికొనియేకాబోలు తంజాపూరుమండలమున నాల్గు గట్టికోటలను నిర్మించి తంజాపూరుచుట్టు నున్న పెద్దకోటను కట్టించెను. ఈనాల్గు కోటలపేళ్లీవిధముగా నియ్యబడినవి.

(1) అరంతాంగి
(2) పట్టుకోట
(3) శేళాతల్లి
(4) తిరుపత్తూరు.[1]

ఈపేర్లలో మూడవపేరు కీళానీనై"యనుపేరునకు పొరబాటుగా వ్రాయబడియుండవచ్చునని శ్రీకృష్ణస్వామయ్యంగారు చెప్పుచున్నారు.[2] శరీరబుద్ధిబలము లుపయో

1. "ఆయన (రఘునాధుని) కుమారుడు విజయరాఘవుడు పట్టాభిషిక్తుడై రాజ్యమునకు వచ్చి తంజావూరుకోటను బలపరచి నగరు విస్తారముగా హెచ్చించెను. అరంతాంగి, పట్టుకోట, శేళాతల్లి, తిరుపత్తూరు యీనాల్గు కోటలున్ను ఒకముహూర్తమందే ఆరంభించి రాతికోటలుగా కట్టించెను."

(తంజావూ రాంధ్రరాజుల చరిత్రము.)

2. "of these the first is undoubtedly the modern Pattukkottai, the second is what is now called Aram-

గించెడువాని కిట్టి బలము సాయపడునుగాని శత్రువును చూచినవెంటనే పిక్కబల ముపయోగించు మన విజయ రాఘవునకు వీనిలో నొక్కటియు సాయపడిన ట్లగపడదు. ఈయనప్రాపున జేరిన స్త్రీజనమునకును, పరివారమున కును కట్టిన నగరు చాలనందున కాబోలు నగరు వృద్ధి చేసియుండును!

మైసూరురామనాథపురములతో యుద్ధ మంతమైన వెంటనే చొక్కనాథుడు గృహకృత్యముల నవరించుటకు గడంగెను. తంజావూరు తన స్థలములను మరల గొన్నట్లు తెలిసి యాలోచించెను. ఏదోయొక సాకు పెట్టుకునికదా యుద్ధమునకు వెడలవలెను? అందుచే పన్నుగడ నొక

tangi, and the last is Tirupattur in Ramnad District on the road to Madura from Trichinopoly. The third name seems to be miswritten for Kilanilai. I was able to trace an old road from Aramtangi to Tirupattur for little over a mile on either side of Kilanilai. It's old fort had seen much active war around it in the British campaign against Chinnamarudu and Umayan. The error seems to have crept in owing to a copyst's blunder which is quite possible in regard to this name written in Telugu."

(Sources of Vizianagar History, p. IX.)

దానిని పన్నినట్లు కన్పట్టుచున్నది. తంజావూరుమధుర లకు యుద్ధకారణ మిచ్చుట తంజావూరాంధ్ర రాజులచరిత్రమును, టైలరుగ్రంథమును మిక్కిలి రసవంతములుగా నిచ్చుచున్నవి. అవాంతరవిషయములయందును రెండును నేకీభవించుచున్నవి. చొక్కనాథుడు తాను వివాహము చేసుకొనదలచి విజయరాఘవునివద్ద చక్కని యాడపిల్ల యున్నట్లు తెలసి యాకన్యను తనకు పరిణయము గావింపుమని రాయబార మంపెనట! అదివరలో నుభయ కుటుంబముల కున్న బాంధవ్యము నుగ్గడించుచు రాయబారులు చొక్కనాథుని యుద్దేశ్యము విజయరాఘవున కెరుకసేయ నాయనయు వెనుక తిరుమలుడు నిష్కారణముగా తనతోబుట్టువగు నచ్యుతరఘునాథమ్మను కత్తితో పొడిచిచంపుటను జ్ఞాపకనుచేసి, మరల పిల్ల నియ్యమని కోరుట సమంజసము కాదని మందలించి రాయబారుల నవమానపరచి పంపెనట! వారును చొక్కనాథునికడకు జని తమ పరాభవమును తెల్ప నాయనయు మండిపడి వెంటనే దళవాయి ముత్తుకృష్ణప్పనాయకునితో సేనను తంజావూరుపై నంపెనట.[1] యుద్ధకారణ మియ్యది.

1. తంజావూ రాంధ్రరాజుల చరిత్రము (అనుబంధము. గ).
Taylor's Oriental Historical Mss., Vol. II, p. 191.
(అనుబంధము. ఘ)



రాజగోపాలస్వామి దేవాలయము,గోపురము-మన్నారుగుడి    ౩౨౯ పుట.



పెద్దకోటయొక్క భాగము, అగడ్త సహా
(రాజగోపాలనిర్మితము)

౩౧౮ పుట.

శ్రీకృష్ణస్వామయ్యంగారును నీరెండు సాక్ష్యములను కాదనజాలక కన్య నడుగుట యొక సాకుగా చొక్కనాథుడు పన్నియుండవచ్చుననికాబోలు నీకథయందలి బీజమునుమాత్రము యుద్ధకారణముగా నొప్పుకొను చున్నారు.[1]

కాని యీకథయందలి రెండువిషయములు మిక్కిలి యనుమానాస్పదములుగా నున్నవి. మొదటిది యనుశ్రుతసంబంధము. ఒకటవ ముత్తువీరప్ప కాలమునుండి (అనగా క్రీ. శ. 1610-వ సంవత్సరమునుండి) యీ యుభయ రాజ్యములకు విరోధమేకాని విహితము లేనట్లు మనకు తెలియును. ఈకాలమున నీరెండు రాజ్యములకు సంబంధబాంధవ్యములు కల్గిన ట్లితర దృష్టాంతము లెవ్వియు గానరావు. ఒకవేళ సాక్షాద్యుద్ధములేని కాలమున్నను గర్భశైత్యములుమాత్ర ముండెననుటలో నెట్టి యనుమానమును గానము. అట్టితరి సంబంధమునకు తా వెక్కడిది? మరియొక విషయము. విశ్వనాథుడు పరాక్రమశాలియైనను మధురవారు విజయనగర రాజ్యసేవకులు. కాని తంజావూరువారు రాజబంధు

1. History of Nayaks of Madura, p. 168.

వులు "వివాదశ్చ వివాహశ్చ సమయోరేవ శోభతే" యనికదా పెద్దలు చెప్పుదురు. ఈయంతర ముభయుల ప్రవర్తనమునకు మూలాధారమనికూడ మనకు తెలి యును. ఇట్టియెడ వివాహసంబంధ మున్నట్లు నమ్మ వీలుకలుగుటలేదు. ఈకథకు పూర్వ మిరురాజ్య ములకు యుద్ధమే తటస్థించెను. అనగా విరోధమే! వెంటనే యిట్టి వివాహమునుగూర్చిన రాయబార మసం భవముగ తోచును. రెండవది: తిరుమలుడు తంజావూరు రాజపుత్రిని చంపెనను విషయము. రఘు నాథుని పుత్రికను తిరుమలుని కిచ్చిన శ్లేచ్ఛాటను తగు నాధారములను కానము. తిరుమలుని సోదరు డున్నంత వరకును నాయనకును రఘునాధునకును బద్ధవైరము మనకు తెలియును. ముత్తువీరప్పమరణానంతరము తిరు మలుడు రఘునాధున కల్లుడు కావలెను. అట్లయినసంగతి నిజమే మైన తన కుమార్తెను చంపిన తిరుమలునిపై రఘునాధుడు కసితీర్చుకొనకుండ నూరకుండునా? తప్పక యీవిషయము కారణముగా రెండురాజ్యములకు యుద్ధము తటస్థించియుండును. తిరుమలుడు తంజా వూరుతో కలహము పెట్టుకొనినట్లు చరిత్రదృష్టాంతము లేదు. తంజావూరునగరు పెద్దదియేమైనను తిరుమల

నాయకభవనముతో నందమున తులతూగజాలదు. ఆవం కనుగూడ నైతిహ్యము నమ్ముటకు వీలులేదు. ఒకవేళ నిజముగా తిరుమలుడు రఘునాథుని కల్లుడైనను నిట్టి స్వల్పవిషయమున కోపమువచ్చి చంపుటకు తిరుమలు డేమి యున్మత్తుడా? ఆయన దైవభక్తియు, పాపభీతియు కల్గిన రాజనీతికోవిదు డందురే! ఇట్టి స్వల్పవిషయము నకై భార్యను చంపి మామకోపమునకు పాత్రు డగు నంతటి యవివేకియని యనుకొనుట కెంతమాత్రము నవకాశము లేదు. ఎటుచూచినను నీమైతిహ్యము కేవలము పుక్కిటిపురాణముపై నాధారపడియున్నట్లు తోచును. దీనివలన నొక్కటిమాత్రము ధ్రువమగుచున్నది. తంజా వూరునందలి నగరు మధురపట్టనమునందలి తిరుమలనాయ కనగరని చెప్పదానికంటె పురాతనమనియు, రఘునాథుని కాలమునకే యది సర్వాంగసుందరమై యుండెననియు నీమైతిహ్యము ఋజువుచేయుచున్నది. ఎట్టి విరోధకార ణము లేనిసమయమున నుండవలసిన వివాహసందేశము నైతిహ్యములోనికి జొన్పినందున నీకథ యసంభవ మని చెప్పుట కవకాశము కల్గుచున్నది. అన్నిపక్షముల నాలోచించిన వెనుక నింకను నొకవేళ చొక్కనాథుని దూరదర్శిత్వముచే నీపన్నుగడ పన్నబడెనా యనునూహ

బలవత్తరముగనేయున్నది. కృష్ణస్వామయ్యంగారుకూడ దీని నంగీకరించుటచే నీయూహ యభ్యర్హముగా నున్నది.

విజయరాఘవుడు •జయించినా ననుకొనుచున్నా డుగాన నిర్లక్ష్యముగానే మాటలాడియుండును. రాయబారులు దానికి చిలవలు పలవలు కల్పించి చొక్కనాథుని కోపాగ్నిని రగులచేసియుండురు. ఇదివరకే నివురుగప్పియున్న క్రోధాగ్ని వెంటనే ప్రజ్వరిల్లెను. చొక్కనాథుడు విజయరాఘవునికంటె మానధను డనకతప్పదు. మరియు విజయరాఘవుని పరాక్రమ మెంతయో తెలిసిన వాడుగాన యెక్కువగా నాలోచించవలసిన యావశ్యకము లేకపోయెను.

యుద్ధము నిశ్చయమయ్యెను. మైలరుగ్రంథమున నీయుద్ధవర్ణనమున నడుగడ్డునకును వివాహవార్త వచ్చుచున్నందున నిది నిజమేకావచ్చునని యొక్కొకపుడు తోచును. విజయరాఘవుడు యుద్ధము నిశ్చయమైనవెను కనైనను యుద్ధప్రయత్నముల గావించెనా? ఆయన ప్రపత్తియే తన్ను రక్షించునని చతుర్వేదితాతార్యసహితుడై రాజగోపాలదైవమును నిరంతరము సేవించుచుండెను. "మంత్రములకు మామిడికాయలు రాలునా?" అస్త్రశస్త్రములను మంత్రపూర్వకముగా ప్రయోగించు

కాలము కడచిపోయెను. కాని శత్రునాశనమునకై తంజా వూరున జపములు చేయించినట్లు మైలరుగ్రంథము తెల్పు చున్నది.[1] చొక్కనాథుడుకూడా యిట్టి పిచ్చినమ్మకము కలవాడని తద్గ్రంథమువలననే తెలియును.

ఈయుద్ధమునుగూర్చి తంజావూరాంధ్రరాజుల చరిత్రమును, మైలరుగ్రంథమును దాదాపు సమానములుగానేయున్నవి.[2] ఎక్కడనో స్వల్పభేదములయందుతప్ప ముఖ్యవిషయముల నేకీభవించుచున్నవి. వానియందీ యుద్ధవిషయమే కాక తరువాతి చరిత్రముకూడా 'యేకోజీ' రాజ్యమునకు వచ్చువరకు కలదు.

చొక్కనాథుడు తన దళవాయియగు వెంకట కృష్ణప్పనాయకుని క్రింద చిన్నతంబిమొదలియారును సాయమిచ్చి గొప్పసేన నంపెను. విజయరాఘవుని తల తెమ్మని చొక్కనాథుని యాజ్ఞయట! ఈసేన తిరుచినా పల్లిని కేంద్రముచేసుకొని తంజావూరురాష్ట్రమున ప్రవేశించి మొదట విజయరాఘవుడు పునర్గ్రహించిన వల్లం

1. Taylor's Oriental Historical Mss., p. 192,

2. అనుబంధము 'చ' చూడుడు.

కోటను పట్టుకొని క్రమముగా రాజధానికి చేరెను. పెద్దకోటబయటనుండి ముట్టడి ప్రారంభింపక పూర్వము మరల నొకమారు కన్యనిచ్చి సఖ్యము కోరుమని మధుర దళవాయి విజయరాఘవునకు కబురంపెను. కాని విజయ రాఘవుడు తాను రెండుమాటలవాడను కానని ప్రత్యుత్తర మంపెను. ముట్టడి ప్రారంభమయ్యెను. విజయరాఘవుని సైన్యములును మొదట కొంత శౌర్యముచూపినట్లే కన్పట్టును. బురుజులనుండి ఫిరంగులను మధుర సేనలపై ప్రేలించిరి.[1] కాని విజయరాఘవుడు నిరంతరపూజా మగ్నమానసుడై ప్రోత్సాహ మియ్యకపోయెను. అందుచే సేనలకు నిరుత్సాహ మయ్యెను. పెద్దకోటను గొని లోపలికోటను ప్రవేశించుసమయమున మరల మధుర దళవాయి యదియే కబు రంప విజయరాఘవుడును వెనుకటి ప్రత్యుత్తరమే యొసంగిపంపెను. విజయరాఘవుని సైన్యము చెల్లాచెదరై పారెను. మిగిలినవారు శత్రువులతో సంధిచేసుకొనిరి. అప్పుడు విజయరాఘవుడు తన

1. ఇప్పటికిని విజయరాఘవ ఫిరంగియని పిలువబడు నొక పెద్దఫిరంగి కోటబురుజుపై కలదు. అది యీపట్టణమునందలి దృశ్యములలో నొకటి.

స్థితిని తెలిసికొని తుదిప్రయత్నముగా శత్రుసేనలు నాశన మగును.గాకయని జపించిన తులసితీర్థమును వారిపై చల్లించెనట! ఎంత పచ్చినమ్మకము! శతక్రతువు ని న్నెంతటికి తెచ్చె విజయరాఘవా! తులసితీర్థమునకు శత్రుసేనలు మడియకుండుటగని యప్పటివరకును కారాగారబద్ధుడగు తన యేకపుత్రుని విముక్తిగావించి యాయనతో సంప్రతించెను. మన్నారుదేవుడును తండ్రియాజ్ఞను శిరసా వహింప స్త్రీజనము శత్రువులవాత బడకుండ వారిని మందుసామానుతో ప్రేల్చి చంపుటకు తగుయత్నము గావించి యిద్దరును సంప్రతించి మన్నారుదేవుడు స్త్రీజన సంహారమునకు వెడలెను. తరువాత విజయరాఘవుని గుర్తుప్రకారము తత్సంహారము గావించి మరలివచ్చి[1] తండ్రితోకూడ శత్రుమధ్యమునకురికి తండ్రికుమారు లిద్దరును కృపాణహస్తులై యనేకుల జంపి నిస్సహాయులై యుద్ధరంగమున వీరపురుషోచితముగ మడిసి వీరస్వర్గమును చూరగొనిరి. తంజాపురరాజ్యము మధురహస్తగత మయ్యెను. విజయరాఘవా, మొదటినుండియే నీ విట్లు

1. కొందరు స్త్రీలు కత్తులతో పొడుచుకొని చచ్చినట్లున్నది.

వీరపురుషోచితముగ ప్రవర్తించినచో తంజాపురచరిత్ర మిట్లుండెడిదికాదుగదా! నీ వీరవైష్ణవము నిన్ను పాడుచేసెను. ఎన్నడు గోవిందుని రాజనీతి యాస్థానమున నంతరించెనో యపుడే నాశనబీజములు నాటబడెను. తుదకు సాహసము జూపితివి. రఘునాథుని పుత్రున కెట్టి మరణము వాటిల్లవలెనో యట్లే రణరంగమున శత్రుసేనల జెండాడుచు మడిసితివి! నీపాప మంతయు శాంతించెను! కాని తంజాపుర రాజ్యరమను పరులపాలుచేసితివి! మన్నారు దేవా, నీవు సాకేతరామసముడవు! పితృవాక్యపరిపాలకుడవు! తండ్రియాజ్ఞను శిరసావహించి కారాగారముననుండి రణావనికి నొక్కయడుగుగా పరుగెత్తుకొనివచ్చి తండ్రి కండ్లయెదుట శత్రువుల జీల్చి చెండాడుచు కృపాణహస్తుడవై ప్రాణముల వదలితివి! నీ కీర్తి యాచంద్రతారార్కముగా వర్ధిల్లుగాక![1]

తంజాపూరాంధ్రనాయకరాజ్య మడుగంటెను. ఏనాడు చెవ్వనృపతినిచేపట్టెనోగాని చోళరాజ్యరమ తన

1. ఈయుద్ధము రాజగోపాలస్వామి యాలయము వాకిట జరిగినట్లు చెప్పుదురుకాని యది నమ్మదగినది కాదు.

సహజచంచలత్వమును చాటెను. ఈప్రాంతచరిత్రము చిత్తూరుముట్టడివలె, బొబ్బిలియుద్ధమువలె మిక్కిలి సుప్రసిద్ధము కాతగినది. శత్రువులవాత స్త్రీజనము పడకుండ మానరక్షణమునకై ప్రాణముల గోల్పోయిన యుదంత మెవ్వరి హృదయములను గలంచదు? తురకలకైనను లంచమిచ్చి రాజ్యము నిల్పుకొన్న విజయరాఘవుడు కన్యనిచ్చి శాంతిని కొనడయ్యె! ఇప్పటికిని కోటలోని యీశాన్యభాగమును స్త్రీజనము మడిసిన తావని చూపుదురు. దట్టముగా జిల్లేళ్లు మొలచియున్నవి. క్రీ. శ. 1673-న సంవత్సరముతో నాయకరాజ్య మంతరించెను.[1] దాదా పొకటిన్నర శతాబ్దములకు కొంచెము తక్కువగా నీవంశ మీతంజావూరున నేలెను. ఈయుద్ధ మొక కుటుంబకలహమువంటిది. రెండురాజ్యములును సామ్రాజ్యాంతర్భాగములే! మధురపాపము పండలేదు. ఇంకను కొలది వర్షముల యాయుర్దాయ మున్నది.

ఈవిజయరాఘవుడు వీరవైష్ణవుడైనను కొన్ని శివస్థలముల మంటపాదినిర్మాణము చేసినట్లు కాన

1. Tanjore Dt, Gazetteer, p. 40.

నగును.[1] ముత్తువెంకటకృష్ణప్పనాయకుడు పితృపుత్రుల యిద్దర శిరముల గొనిపోయి చొక్కనాథునకు చూపగా సంతసించెనట! నిజముగా నట్లు సంతసించినయెడల తప్పక నీయన నరమాంసాశనము గావించు రాక్షసులయంశ మున పుట్టినవాడనియే చెప్పనగును.

---

1. "మన్నారుగుడిలో రాజగోపాలస్వామికి గోపురము మంట పప్రాకారాలు విస్తారముగా నిర్మించెను. మాయూరమునందును, మధ్యార్జునమందును, కావేరీ స్నానఘట్టములలో పుష్యమంటపాలు పదివేల ప్రజ ఉండేటట్టుగా విశాలముగా కట్టించెను. అనేక దేవాలయ బ్రహ్మాలయములకు నిరంతరస్థితి కలుగజేసెను. ఆయన ప్రతిదినము ఉదయమున జాములోగా 12,000 బ్రాహ్మణ్యానికి వ్రసోసేతంగా జ్యేష్టాంశ మిప్పించి తరువాత తాను భోజనము చేస్తుండేవాడు."

(తంజావూరాంధ్రరాజుల చరిత్రము.)

ఈయనయు కుమారుడునూ కవులే. విజయరాఘవుని కాల మునందలి సంస్కృతకవులలో భూగోళ వేంకటేశుడను జ్యోతిషికుడు ముఖ్యుడు. రంగాజమ్మయు, కాళకవియు నాంధ్రకవులలోముఖ్యులు.

## ౧. పరిశిష్టము

### క్రీ. శ. 1673—1676.

అంత చొక్కనాథుడు తనకు చిన్నతనమున పాలిచ్చి పెంచిన దాదికుమారుడును, తనతోపాటి సవయస్కుడును, తన కాపాంసుకేళీసఖుడును నగు నళగిరి నాయకుని తంజావూరు నేల నియమించి తద్రాజ్య కార్య నిర్వహణమున కగు వ్యయము పోను మిగిలిన ద్రవ్యము మధుర కంపుపద్ధతి నేర్పాటుచేసెను. మొదటి సంవత్సరమున నాయనయు నాకట్టడి ప్రకారము ప్రవర్తించెను. జాగరూకుడై ప్రజాపాలనము న్యాయదృష్టితో చేయుచున్నందున నీయన ప్రజానురాగమును బడసెను. ఎప్పుడు ప్రజానురాగమును బడసెనో యప్పుడే రెక్కలువచ్చినట్లు భావించి తాను మధురతోపాటు స్వతంత్రుడగుటకు ప్రయత్నింపవలెనని తోచెను. మొదటిసోపానముగా నెట్లుండునో యను పరీక్షకై యొకమారు చొక్కనాథునికి వ్రాయు నుత్తరములో విజయరాఘవుడు వ్రాయునట్లు సమానుడుగా వ్రాసెను. వ్రాసినపద్ధతిని మంత్రి చొక్కనాథునికి విన్నవింప నాయనయు మిక్కిలి యాగ్రహపడి మొదట

నాయనపై దండెత్తి శిక్షింపదలచెను గాని తరువాత రెండవయాలోచనవలన తా నట్లు గావించిన కుటుంబ కలహామగునని పస్తాయించి యూరకుండెను. అళగిరియు వెనుకటి రాజకీయోద్యోగులలో తన కనుకూలురగువారిని తొలగింపకుండ వారిద్వారమున ప్రజల యనురాగమును బలపరచుకొనవలెనని ప్రయత్నించెను. అట్టి యుద్యోగులలో రాయసము వెంకన్న యను నొక నియోగి బ్రాహ్మణు డుండెను. ఈ నామము మనకు పూర్వాపరిచితమే కాని యాయన నేతల నికముందు తెలిసికొందుము. ముందు వచ్చు నాటకములో నీయన ముఖ్యపాత్రధారులలో నొకడు.

తంజావూరున జరిగిన తుదిసంగ్రామములో నొక బాలు డొకదాసిచే రక్షింపబడెననియు, నాయనను నాగపట్టణమునందలి యొకకోమటి పదునారేండ్లవయసువాడైనంతవరకు పెంచి యాయనకు రాజోచితమైన విద్యను గరపినవెనుక నీయన నాగపట్టణమున నున్నట్లు మన వెంకన్నకు తెలిసి, యటకువెళ్లి, యాయనను తీసుకొని బీజపురము సుల్తానుకడకుపోయి మధురనోడించి యీపిల్లవానిని పునారాజ్యప్రతిష్ఠితుని చేయవలసినదిగా కోర, నా సుల్తానును బీజపురమున నప్పుడు సేనానిగానున్న

యేకోజి యను వెంకోజీని[1] ససైన్యముగా పంపెననియు,నా యన వెడలి యయ్యంపేటవద్ద యళగిరి నోడించి పిల్లవానిని రాజ్యమున నుంచె ననియు మైలరుగ్రంథము తెల్పు చున్నది.[2] ఈబాలుని నామధేయము చెంగమలదాసుడు. ఈయన రెండేడ్లవాడని యొక గ్రంథమును, నాలుగేండ్ల వాడని మరియొకగ్రంథమును తెలియచేయుచున్నవి.[3] మరియు నీయనను రాజుగా చేసినతరువాత మంత్రిని నియ మించుటలో దాసిసలహాను గైకొని తన కాపత్కాలమున తలదాచుకొనుటకుతావిచ్చి భరించిన వైశ్యుని నియమింప, నందుపై వెంకన్నకు కోపమువచ్చి, ససైన్యుడై కుంభ కోణమున నున్న వెంకాజీవద్దకు వెళ్లి పురికొల్ప, మొదట విననివాడయ్యు తుదకు కొంతకాలమునకు తన్ను పంపిన సుల్తాను మరణించినట్లు విని, వెంకన్నపంపును చేయుట కియ్యకొనె ననియు, వెంకన్నయు వెంకోజీ రాజగుటకు తంజావూరునందలి ముఖ్యులనోడబరచి యాయనకు

1. ఏకోజీ, వెంకోజీ, వెంకాజి యను మూడునామములను విని యోగించుచుందును.

2. అనుబంధము. "చ"

3. Ibid; Sources of Vijayanagar History, p. 324.

కోటతలుపులు తెరచెననియుకూడ నీ శైలరు గ్రంథమే తెల్పుచున్నది.[1]

ఇచ్చట కొన్ని విషయము లసనమ్మకముగా నున్నవి. వానినిపరిశీలింతును. మధుర తంజావూర్ల యుద్ధము క్రీ. శ. 1673-వ సంవత్సరమున జరిగెనని మనకు తెలియును.[2] క్రీ. శ. 1676-వ సంవత్సరమున ఆండ్రిఫ్రెరి యను నొక మిషనరీ తన స్వదేశమున కుత్తరమును వ్రాయుచు మధుర తంజావూర్లయుద్ధమును గూర్చి తాను క్రీ. శ. 1673-వ సంవత్సరమున వ్రాసిన యుత్తరములోనే వ్రాసితి నని చెప్పినాడు.[3] వెంకోజి తంజావూ

1. అనుబంధము "చ". తంజావూరాంధ్రరాజుల చరిత్రము. శ్రీ జయంతిరామయ్యపంతులు విజయరాఘవుని ప్రేరణమువలననే మహారాష్ట్రులు తంజావూరు వచ్చినట్లు చెప్పుచున్నారు. కాని యది సరి కాదు. విజయరాఘవుడు మధురతో యుద్ధములో మడిసెను.

(J. A. H. R. S. Vol. II, p. 173;)

2. History of Nayaks of Madura, p. 163.

3. La Mission Du Madure, p. 247; Maharatta Rajas of Tanjore, p. 9.

ఆయుత్తరముననే యేకోజి రాజ్యము నపహరించెననికూడ కలదు.

రును స్వాధీనపరచుకున్నది శా. శ. 1596-వ సంవత్సరము మాఘమాసమని శాసనమువలన తెలియుచున్నది.[1] ఇది లెక్కవేసిన క్రీ.శ.1675-వసంవత్సరమగును. కాబట్టి పైపై లరు గ్రంథమునుబట్టి క్రీ. శ. 1673-1675-వ సంవత్సరముల మధ్యను చెంగమలదాసుడు రెండేండ్లనుండి పదునారేండ్ల వాడై యుండవలెను. ఇది మిక్కిలి హాస్యాస్పదము! చెంగమలదాసుడు రెండేండ్లవాడుగాక నాల్గేండ్లవాడని గ్రహించినను నీగ్రంథములు విశ్వసనీయములుగా లేవు. తద్గ్రంథమందే క్రీ. శ. 1676-వ సంవత్సరమున నీ చెంగ మలదాసుడు మంత్రిని నియమించుకున్నట్లు కలదు. అందు లకు యుక్తాయుక్తవివేచనము వలదా? మరియు నీ బాలుడు తనకు సాయముచేసిన యేకోజి సేనల పోష ణమునకుగాను కుంభకోణము పరగణా యిచ్చినట్లు కూడ తెలియును. ఆపని చేయుటకుకూడ వ్యక్తత కావలయును కదా? మంత్రినియామకమున నభిప్రాయ భేదము కల్గుటయు, ఏకోజీకి కుంభకోణ మిచ్చుటయు సత్యములు. చెంగమలదాసుని వయసుమాత్ర మను

1. Inscriptions of the Mahrattas by T. Samba Murti Rao.

మానాస్పదము. ఈయన క్రీ. శ. 1673-వ సంవత్సరపు యుద్ధమునాటికే దాదాపు యౌవనము సమీపించువా డనియు, స్వయముగానే పారిపోయెననియు, పారిపోయి నట్లు తెలిసి విపక్షపుచ్ఛమగు వెంకన్న యీయనను తన వలలో వేసుకొనెననియు, తరువాత నాయనకు తెలిసి వెంకన్నను వదలివేయగా వెంకన్న వెంకోజివద్ద మం త్రాంగమునకు చేరెననియు నాయభిప్రాయము.

ఈ సందర్భమున నీయనవయసు హైలరు గ్రంథము నం దిచ్చినది సరికాదని సకారణముగ చూపెనజాలును. విజయరాఘవుని కాలమునందు వ్రాయబడిన గ్రంథము లన్నియు క్రీ. శ. 1645-వ సంవత్సరమునకు లోపున వ్రాయబడియుండునని వెనుక మనవిచేసియుంటిని. రఘు నాథాభ్యుదయ నాటకమున శ్రీరంగరాయల ప్రశంస యున్నందున శ్రీరంగరాయల మొదటిదండయాత్రతరు వాత అనగా క్రీ. శ. 1642 కు తరువాత వ్రాసియుం డును. అదియు నీ పైవిషయమున ప్రతిబంధకము కాదు. అట్లు వ్రాయబడిన గ్రంథములలో నుషాపరిణయ ప్రబంధమున రంగాజమ్మ సభాంతిరాళమును వర్ణించు నపుడు చెంగమలదాసుని పేర్కొన్నది.[1] కుమారుడగు

1. "మరియు సత్యభాషా హరిశ్చంద్రుండును, సంగరరంగ కిరీటియును, సకల విద్యాచాతుర్య పేటియును, ధరణిజన వినుతభాగ

మన్నారుదేవు డింకను తండ్రిచేత కారాగారబద్ధుడు కాలేదు. తత్కాలమునకే చెంగమలదాసు డుండెను. కాని యప్పటికి బాలుడై యుండును. అప్పటికి మన్నారు దేవుడు 25 సంవత్సరములకు మించిన వయసుకలవాడై యుండును. పుత్రు డుద్భవించుటకు చాలినవయసుండ వలదా? చిన్నతనములో పుత్రోత్సవ మయ్యెనన్నను నిరువదివర్షములైన నుండవలదా? ఈయన పెద్దవాడనియు నప్పటికే నాటకాదులను వ్రాయు ప్రజ్ఞ కలవా డనియు

ధేయుండును, రామానుజమత సిద్ధాంతస్థాపనాచార్యుండను, రాజగోపాల నిత్యకైంకర్య ధుర్యుండును, చతుర్వేది శతక్రతు శ్రీనివాసతాతాచార్య చరణ సరసిజ సేవానిష్ఠాగరిష్ఠుండును, చతురుదధి వేష్టిత సర్వంసహాపాలక శ్రేష్ఠుండును, సామంతరాజ కిరీటరంజిత పాదాంభోజుండును, సరససాహిత్య కళాభోజుండును, రఘునాథనృపాలనందనుండును, రచితకళావత్యంబికానయనానందుండును, నను నవ్విజయరాఘవ దేవేంద్రుండు, రామణీయకవిజిత రాజరాజ సభావిభవంబగు రాజగోపాల విలాసంబునందు, నతులితవిలాసవతులైన కులసతులును, విబుధసన్నుతమతియగు విజయవేంకటపతియు, మహితప్రభావుండగు మన్నారుదేవుండును, రంగద్గుణ విలాసుండగు చెంగమలదాసుండును, మొదలగు నిఖిల ..................నింపియుండ."

(ఉషాపరిణయము. ఆ. 1.)

తెలియును.[1] అందులకుకూడా వయ సుండవలయును కదా! ఈయూహ కింకొకసాక్ష్యము కలదు. విజయరాఘవు డంత్యయుద్ధము జరిగిన క్రీ. శ. 1673నాటికి దాదాపు 80 సంవత్సరములవాడై యుండెనని సైలరుగ్రంథము తెల్పు చున్నది.[2] ఒకవేళ సాక్షాత్తుగా నంతవయ సుండకపోయి నను పెద్దవాడని తప్పక గ్రహింపవలెను. 70 సంవత్సము లున్నవి యనుకొన్నను నాయన కప్పటికి 45 సంవత్సర ముల వయసువాడగు కుమారుడును, 25 సంవత్సరములవా డగు మనుమడును నుండుట యసంభవము కాదు. ఒకవేళ నీ యుషాపరిణయము చొక్కనాథుని జయించిన తరువాత వ్రాయబడినదనుకొనుటకు దీనియందు దా యుద్ధసందర్భమే యుల్లేఖింపబడియుండలేదు. ఇందేయననేల? ఏగ్రంథమునం దును విజయరాఘవుని కాలమున జరిగిన యేవిషయమును కానరాదు. కాబట్టియే నాయూహ సమంజస మనిమనవి.[3]

1. ఈయన హేమాబ్జనాయికాస్వయంవరనాటకమును రచి యించెను. అదికూడా యీదినముల రచించినదేయని నాయాశయము.

2. అనుబంధము. "చ"

3. మన్నారుదేవుడు హేమాబ్జనాయికాస్వయంవరము వ్రాయు నాటి కగ్రహారము లిచ్చిన ట్లుండుటచే నగ్రహారము లిచ్చు

అట్లయిన యుద్ధమునుండి యీచెంగమలదాసుడు స్వయముగానే పారిపోయియుండును. మరియు నొకవం శాంకుర ముండవలయునని స్త్రీజనమును, నితరులు కూడ నాలోచించి యీయనను వెడలనడచియుంచిరి. కావున దాదిగాని యెవ్వరునుగాని కొంపో నవసరము

స్వాతంత్ర్యము, వయసు, నాయన కుండెనని భావింపవలెను. మరియు నప్పటికి తండ్రియాగ్రహమునకు గురికాలేదనికూడ స్పష్టము.

"నిజవంశకర్తయై వాసికెక్కు చెవ్వభూభర్తను కీర్తించి, తనదు ప్రపితామహుని మహామహుని వీరవైష్ణవసార్వభౌముని యచ్యుతాళ్వారుల నభినందించి, తనదు పితామహుని యభినవభోజుని రఘునాథజననాథబిడౌజుని సన్నుతించి, శాశ్వతైశ్వర్యంబున నెలసి విశ్వవిశ్వంభరాచక్రం బాచంద్రతారార్కంబుగా బాలించుచు చాల వర్ధిల్లుచున్న తన తండ్రియగు విజయరాఘవచంద్రుని......గావించి, యతని యనుమతి గాంచి,......అతులకనకతులాప్రముఖనిఖిలమహాదానదీక్షాధురీణుండును,అనేకాగ్రహారప్రతిష్ఠాపనప్రవీణుండును,విజయరాఘవాభ్యుదయాదిగ్రంథనిబంధనచాతురీధౌరేయుండును, అతులితగురుభక్తిపితృభక్తిభాగధేయుండును, మహితానుభావుండు నగు మన్నారుదేవుండు, భువనస్తవనీయంబుగా పావణించు శృంగారరసగర్భసందర్భ విభాసురంబగు హేమాబ్జనాయికాస్వయంవరంబను నాటకంబునకు కథాక్రమం బెట్టిదనిన :" (ప్రస్తావన.)

లేదు. నాగపట్టణము వెళ్లి దాగికొన్నతరువాత వెంక న్నకు తెలిసి నాగపట్టణము వెళ్లి వీరిద్దరును బీజపురము వెళ్లియుందురు. చెంగమలదాసుడు పెద్దవాడేకాన వెం కన్న నెరుంగనివాడు కాడు. తాతగారివద్ద మంత్రాం గము చేయుటయు, తరువాత నళగిరివద్ద చేరుటయు, నెరిగియున్నను తత్కాలమునకు తనకు సాయ మవసర మగుటచే నాయనను చేపట్టెను. ఎప్పుడు తాను తరువాత రాజయ్యెనో యప్పు డీయనను విడనాడి నమ్మకస్తుడును, ఇక్కట్టునాళ్లలో తలదాచుకొనుటకు తావిచ్చి పోషించి నట్టియు, సెట్టిని మంత్రినిగా నియోజించుట యీయన యొక్క స్వబుద్ధియనియు, దూరదృష్టియనియు నెంచ నగును. కాని యింకను కొంతకాలము వేచియుండి సైన్య మును కూర్చుకొని ప్రజానురాగమును బడసినంతవరకు బహిరంగముగా నీయనను విడనాడకుండిన బాగుండెడిది. అనుభవము తక్కువయగుటచేతను, నేకోజీయందలి నమ్మ కముచేతను నట్లు చేసియుండును.[1]

1. కవిత్వవేది మంత్రిగా నియమింపబడిన సెట్టి చెంగమల దాసుని రక్షించిన దాసికి మిండగాడనే మొదలగు నప్రశస్తప్రశంస నొనర్చినాడు. దాని కట్టి యాధారమును లేదు కాన సమాధాన మనావశ్యకము.

ఏకోజీ[1] వచ్చినవెంటనే యళగిరిసేనను తాకినట్లు కన్పట్టదు. వచ్చి కొంతకాలము వేచి శత్రువులయాను పూర్వి తెలిసికొనెను. వచ్చుమార్గములోనే యారణిపట్టణమును ముట్టడించి గ్రహించెను. తరువాత నాయన సేనలకును నళగిరినాయకుని సేనలకును నయ్యంపేటవద్ద యుద్ధము జరిగెను.[2] అళగిరియు చొక్కనాథుని సాయమడుగగా నదివరలో చొక్కనాథుని యాగ్రహమున కళగిరి పాత్రుడైయున్నందున సాయమంపక "నీకర్మము నీయది" యని యూరకుండెను. ఏకోజీ శౌర్యముముం దీయనశౌర్యము దివ్విటీక్రింది దీప మయ్యెను. ఏకోజీ యుద్ధములయం దారితేరిన సేనాని. అళగిరి కీయనుభవము తక్కువ. ఏకోజీ ఛత్రపతి శివాజీకి తమ్ముడు. శివాజీ, శాహజీయొక్క ప్రథమభార్యయగు జీజీబాయి కుమారుడు; ఏకోజి రెండవభార్యకుమారుడు. ఈకాలము నాటికి షాహజీ చనిపోయెను. శివాజి మహారాష్ట్ర సామ్రాజ్యమును తన భుజద్వయముతో నిర్మించుచుం

1. వెంకోజీ.
2. కుంభకోణము తంజావూర్ల మధ్య నున్నది;
Mahratta Rajas of Tanjore, p. 11;
History of Nayaks of Madura, p. 168.

డెను. ఏకోజీ మహమ్మదీయులవద్ద యూడిగ మొనర్చుట శివాజీకి గిట్టలేదు. ఏకోజీకిని దక్షిణమునకు వెడలుట కవకాశము కల్గినంతనే యొకనిట్టూర్పుతో వెంటనే బయలువెడలెను. బీజపురముననే యున్న నొకవేళ నన్నగారితో పోరు సలుపవలసివచ్చునేమో! సుల్తానుకును నేకోజీని దక్షిణమున కంపుట సమంజసమని తోచెను. అచ్చటనే యున్న నొకవేళ సోదరునితో చేరునేమో యనుభయ మాయనకు తోచెను! దక్షిణమునకు వచ్చుట యుభయతారక మయ్యెను.

---

## ౨. చెంగమలదాసుడు

(క్రీ. శ. 1675)

మన్నారు దేవునకును, నీయనకును వీరవైష్ణవ ముగ్గు బాలతోనే లభించెను. ఈయనను ఏకోజీ పట్టాభిషిక్తుని గావించెనని తైలరుగ్రంథము తెల్పుచున్నది. పట్టాభిషేకము కావించి యేకోజీ ససైన్యుడై కుంభకోణమున నుండెను. కుంభకోణముపరగణాను చెంగమలదాసు డాయనసైన్యభరణముగా నొసంగెను. యుద్ధమై తాను వచ్చినపని యైనతరువాత యేకోజీ యెందుల కింత కాల మచ్చట వేచియుండెను? కాబట్టి రాజ్యకాంక్ష మొదటినుండి యుండవలెను. తరువాత చెంగమలదాసుడు వెంకన్నను వదలినవెనుక నిక పూర్తిగా నిద్దరి కుట్రలు ప్రారంభమయ్యెను. వీరిద్దరు నీయనను రాజుగా నున్న స్వల్పకాలమున నిద్రపోనీయలేదు. వయసున పిన్న వాడు. అనుభవము తక్కువ. సలహా సరియైనది కాదు. పట్టణము చాలకాలముక్రిందట వదలిపెట్టుటచే నచ్చటి సందర్భము లీయనకు తెలియవు. ప్రజ లిదివర కీయన తాతపై ననహ్యాత కల్గియుండుటచే వారి యనురాగమన్న

వెంటనే కల్గునదికాదు. వారి హృదయముల నాకర్షించినా గదా వారు సమయమున వచ్చినపుడు సాయపడుట. పైపెచ్చు వెంకన్న మంత్రాంగముతో వారును మానము వహించిరి. విముఖులుకూడా యయిరని చెప్పనగును. ఏకోజీ చెంగమలదాసిచ్చిన ద్రవ్యము ననుభవించుచు వెంకన్నతో కుట్రలు పన్నుచుండుట యాయన ప్రవర్తన మునందు కళంకమని చెప్పకతప్పదు. క్షత్రియునకు బుజా ప్రవర్తన మెక్కడిది? రాజనీతికి సత్యమెక్కడిది? తిన్న యిల్లేకదా గుద్దలింపవలసినది! మైలరుగ్రంథము మొదట మొదట యేకోజీ విముఖుడుగానే యున్నట్లును, తుదకు క్రమముగా నొడబడి బీజపురము సుల్తాను మరణించిన వార్త విన్నందున తంజావూరు నాక్రమింప నిశ్చయించి నట్లును చెప్పుచున్నది. ఇయ్యది చరిత్రమునకు సరిపోవుటలేదు. క్రీ. శ. 1675-1676-వ సంవత్సరమున బీజపురపుసుల్తా నెవ్వడును చనిపోయినట్లు కానరాదు. అంతకుపూర్వమే యదిల్షా చనిపోయెను.[1] ఏకోజీ బయలుదేరునాటికే సికందరుపాషా బీజపురమున నేలుచుం

1. క్రీ. శ. 1673.

Mahratta Rajas of Tanjore, p. 12.

డెను. ఈ సికందరు క్రీ శ. 168౬-వ సంవత్సరము వరకు రాజ్యముచేసి యావత్సరమున నౌరంగజేబు చేతి లో పరాజితుడై ఢిల్లీకి గొనిపోబడి యచ్చట నాజన్మ కారగారవాసము ననుభవించెను.[1] అప్పుడు సికందరు పాషా యేలుచున్న మాట నిజము. పైబరుగ్రంథ మీాయనను పేర్కొనుచున్నది.[2] కాబట్టి చనిపోవు టయు, నందుచే నేకోజీ నిర్ధారణము చేయుటయు సత్యదూరము. ఈయనకు మొదటినుండియే యీా యుద్దేశ్య ముండియుండును. ఈయన వచ్చునప్పటికి బీజపురపుస్థితి యంత సుముఖముగా లేదు. ఒకవంక శివాజీయు, మరియొకవంక మొగలాయీాలును నీరాజ్య మును పీడించుచుండిరి. దక్షిణమున తన సేన మధుర నోడించునని యీాయనకు నిశ్చయముగా తెలియును. అట్లయిన నిక నుత్తరమునకు పోవలసిన యవసరమే తనకు కల్గకపోవచ్చునని తప్పక యీాయన యూహించి యుండును. ఏకోజీ మిక్కిలి దూరదర్శియు, రాజనీతి

1. History of India, V. A. Smith, p. 297.
బీజపురము మొగలుసామ్రాజ్యములోని భాగ మయ్యెను.

2. అనుబంధము "చ"

కోవిదుడునై యుండెను. అందుచే తన యన్న రాజ్యమున కుద్దిగా దక్షిణమున మహారాష్ట్ర రాజ్యమును తాను స్థాపింపవలెననుకోరిక తప్పక యీాయన కుండెననియే నమ్మవలసివచ్చుచున్నది.

ఆగుమాసములు కుంభకోణమున నేకోజీ యున్నట్లు మైలరుగ్రంథము తెల్పుచున్నదిగాని అంతయవకాశము లేదనియే నమ్మవలెను.[1] ఏదో కొలది యవకాశమే చెంగమలదాసపట్టాభిషేకమునకును, నేకోజీ యపహరణమునకును నుండెనని తోచుచున్నది. ఏలన తత్కాలమునందలి యొక మిషనరీయుత్తరము చెంగమలదాసుని పట్టాభిషేకమునే యెత్తుకొనక "చెంగమలదాసుని రాజ్యప్రతిష్ఠితుని చేయుటకు మారుగా నేకోజీ రాజ్యము నపహరించె" నని తెల్పుచున్నది.[2] కాని

1. Mahratta Rajas of Tanjore p.

2. "This is what happened at Tanjore. General Ekoji, instead of placing the son of the late Nayak on the throne, according to the orders of Idal khan, has preferred to usurp the title and authority of an independent king. Thus becoming the absolute master of the kingdom, he seeks to make himself loved by the inhabitants and has already succeeded in it." (La Mission Du Madure, p. 249.)

దీనివలన నీయంతరము జ్ఞాపముంచుకొనతగినంత కాల ముండ లేదని తలంపవలెను.

వెనుకటి నమ్మకమగు దాసీజనమువలన తన తాతగారు దాచిపోయిన ధన మున్న తావు కనుగొని దాని నేకోజీ మొదలగువారలకు లంచము లిచ్చుట మొదలగు పనులకు వ్యయపరచెను.[1] తుదకు నిస్సహాయుడగు నాయకు డేమిచేయగలడు? ఏకోజీ వచ్చుచున్నట్లు తెలిసి చెంగమలదాసుడు భయపడి యాయన యెక్కడ చంపునోయను భీతిచే సపరివారుడై మిగిలిన ధనమును సంగ్రహించుకొని పారిపోయెను.[2] ఒక్కవిషయముమాత్రము తృప్తికరము. ఏకోజీ వెడలి పోయిన చెంగమలదాసుని వెన్నంటి చంపియుండ లేదు. "పోనిమ్ము! జీవించి యితడు నన్నేమి చేయగలడ"ను విశాలభావముతో నాయన నంతటితో వదలివేసెను. పరాక్రమశాలియగుటచేతనే యిట్లు చేసెను. పారిపోవు వాని వెన్నంటిచంపుట శూరకృత్యమా?

ఈయనకుటుంబ మేమయ్యెనను విషయమును గూర్చి రెండభిప్రాయము లున్నవి. అదివరకు శత్రువై

1. History of Nayaks of Madura, p. 168.
2 Ibid, p. 170.

విజయరాఘవుని తలగొనిన చొక్కనాథుడు చెంగమల దాసుని స్థితికి వగచి యాయనకు తన రాజ్యమున నివాస మేర్పరచి యాయనను భరించెను.[1] ఈయనవంశస్థు లల్లె మధురవారిక్రింద చిన్నజాగీరుదారులై యుండిరనియు, చెంగమలదాసుని కుమారుడు విజయరాఘవుడనియు, నాయనకుమారుడు విజయమన్నారప్పయనియు, నీయన చెల్లెలు మధురనాయకుడగు విజయరంగచొక్కనాథునికి భార్య యయ్యెననియు నల్లె వీరికుటుంబము జీవించు చుండెననియు నాంధ్రపత్రికయందలి వ్యాసముల యాధా రముపై కాబోలు "కవిత్వవేది" తన గ్రంథమున వ్రాసి నాడు.[2] కాని మధురక్రింద కొంతకాల మున్నతరువాత సింహళమునందలి "కండి" యను పురము నేలు రాజునకీ కుటుంబములోని కన్య నొకదానిని పరిణయము చేయగా తద్ద్వారమున నీకుటుంబ మచ్చటికి వెడలి వారిచేత పోషింపబడినదని శ్రీ వెంకాస్వామిరావుగారు తెల్పు

1. Tanjore Dt. Manual, p. 753.

2. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము, పు. 214.

చున్నారు.[1] ఆవంశ మంతటితో నంతరించెను. ఇప్పు డా వంశీయు లెచ్చటను లేరు.

చేను కాపాడుట కంపబడిన యేకోజీ రాజ్యము నప హరించెను. వెంకన్న యీ నాయక రాజ్యముయొక్క యంత్యక్రియల గావించెను. ఈయన వరుసను విజయ రాఘవుని, నళగిరిని, చెంగమలదాసుని, నేకోజీని చే పట్టెను. మొదటిముగ్గురి నాశమును చూచి యేకోజీ యీయన నిక తనవద్ద నుంచుకొనకూడదని యాయనతో పనిమైపోయిన వెంటనే దిగవిడిచెను. అందుచేత నే స్థిరుడై నిలువగలిగెను. వెంకన్న మంత్రాంగము ఏకోజీవద్ద తరు వాత సాగలేదు. ఆయనకు చేతులలో పెద్దసేన యుండు టచేత వెంకన్నగాని ప్రజలుకాని నోరెత్తుటకు వీలు లేక పోయెను. ఈయన రాజ్యమునకు వచ్చిన వెంటనే తెలివి గలవాడగుటచేత తన సత్పరిపాలనమువలన ప్రజాను రాగమును బడసెను. పంటలు బాగుగా ఫలించుట

1. Tanjore Dt. Manual, p. 753.

నేను కండిరాజకుటుంబమునందలి యొక్కరితో నీవిషయము చర్చించితిని. వారుకూడ నిట్టికథనే చెప్పిరి. అందుచే నీరెండవది నిజమని తోచుచున్నది.

లేదని తెలిసి వెంటనే కాల్వలు మొదలగు వానికి మర మ్మతులు చేసి ప్రథమరాజ్యవత్సరముననే పంటలు బాగుగా పండున ట్లొనర్చెను.[1] ప్రజ లందుచే తుష్టులైరి. వెంకన్న తుదకు భగ్నమనోరథుఁడై ప్రచ్ఛన్నముగా పారి పోయెను. అట్టివాని కట్టిగతియేకదా వాటిల్లును! వెం కన్న పురుషకారమూర్తి! విధి బలీయమనుట కిది యొక యుదాహరణము!

---

1. The justice and wisdom of his Government begin to heal the wounds of the preceding reign and develop the natural resources of this country, one of the most remarkable in India for the fertility of the lands and the wealth of its production. By repairing the canals and tanks, he has fertilised extensive fields uncultivated for many years, and the last harvest has surpassed all that one had ever seen."

(La Mission Du Madure, p. 249.)



ఏకోజి యనబడు వెంకాజి

(ప్రథమ తంజావూరుమహారాష్ట్రరాజు, శివాజి సోదరుడు)

౩౪౯ పుట.



కృష్ణాధ్వరికృతమగు నాంధ్రనైషధపారిజాతముయొక్క తాళపత్రప్రతి

౩౬౨ పుట.

## 3. ఉపసంహారము

విజయరాఘవుని రాజ్యప్రారంభము వరకును తంజావూరు విజయనగరసామ్రాజ్యమునకు కప్పము కట్టుచునేయుండెను. శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చిన తరువాత కొంతకాలము కట్టినట్లు కానరాదు. కప్పము కంటె నెన్నియో మడుంగులు మహమ్మదీయులకు లంచమిచ్చుటలో వినియోగించెను. ఆవల షాహాజీరణదుల్లాఖానులక్రింద వచ్చిన దండయాత్ర తరువాత బీజపురమునకు కప్పముకట్టుట ప్రారంభించెను.[1] కాని తరువాత నెన్నిసంవత్సరములో యీకప్పము నిచ్చినట్లు కానరాదు. అడవులలోనుంచి బయటకు వచ్చినతరువాత నిక కప్పము నెవ్వరికిని చెల్లించలేదు. విజయనగరముక్రింద నున్నప్పుడు కప్ప మెంత యను విషయమునుగూర్చి యెక్కువగా నాధారములు లేవు. కాని యొక మిషనరీ యుత్తరముమాత్రము కప్పము మూడవవంతని తెల్పుచున్నది.[2] మధురరాజ్యము విశాలమైనను కొంతభాగము

1. క్రీ. శ. 1645 ప్రాంతము.
2. History of Nayaks of Madura, p. 246.

ఫలవంతము కాకపోవుటచే కప్పము తంజావూరుతో సమానమని చెప్పబడినదిగాని[1] తంజావూరువారు బంధువు లగుటచే కప్పము మధురయంత యుండకుండునని వెనుక మనవిచేసియుంటిని. ఏది యెట్లున్నను ఆదాయమున మూడవవంతని లెక్కవలన కనుపడును. తంజావూరా దాయము దాదా పొక కోటిరూపాయ లుండును.[2] ఈసంగతి నిజమేనని మైలరుగ్రంథము తెల్పుచున్నది.[3] కోటిరూపాయలనగా 180 లక్షల ఫ్రాంకులగును.[4] తంజావూరుమధురల యాదాయ మింత యుండెనని మదింపు వేయబడినది. కాబట్టి దీనిలో మూడవవంతు అనగా 60 లక్షల ఫ్రాంకులు కప్పమని మిషనరీయుత్తరము తెల్పుచున్నది.

1. Though Madura was more extensive than Tanjore and Gingi, she does not appear to have been more wealthy."

(History of Nayaks of Madura, p. 247.)

2. తెలియుటకై యిప్పటి నాణెము పేర్కొనబడినది.

3. అనుబంధము "చ"

4. నాయకరాజచరిత్రమునందలి లెక్కలను గమనింపుడు.

P. 247, 248.

రాజ్యాదాయముగాక రాజులకు స్వంతభూము లును, ఇతరాస్తియు నుండెడిది. దానినుండి కొంత యాదాయము వచ్చుచుండెను. ఆదాయము రెండుద్వార ముల వచ్చుచుండెను.

1. పన్నులు.

2. సామంతరాజుల కప్పములు.

సామంతరాజుల కప్పములు కేంద్రము కప్పము వలెనే వారి యాదాయములో మూడవవంతని తలంప వలయును. దేనినుండి యెంత వచ్చుచుండెనో చెప్పుట కెట్టి యాధారములును కానరావు. ఈపన్నులు వసూలు చేయు పద్ధతి యిదివరలో చోళులకాలమున పద్ధతినే వీరును అవలంబించినట్లగపడును. పదునేనవ శతాబ్దము లోనే విజయనగరసామ్రాజ్యమున పన్నులు ధాన్యరూప మున నేగాక ధనరూపముననుఇయ్యబడుచుండెను. చెవ్వ ప్పయు నట్లే ధాన్యధనరూపమున వసూలుచేయుచుండె నని యనుకొనవలెను. పన్ను గ్రామమొత్తముమీద నింతయని విధింపబడెను. దానిని వసూలుపఱచుటకు గ్రామపెద్ద కధికారమిచ్చునట్లును, నాయనకు కొందరు పంచాయతీదార్లవంటివారు సాయమొనర్చుచున్నట్లును తెలియుచున్నది. చోళుల కాలమున నీ పంచాయతీలే

(పరిషత్తులు) కోర్టుగా నుండెనని చెప్పుచున్నారు.[1] పన్నులు రాహితీ చేయబడునపుడు మొత్తము గ్రామముమీదగాని, లేక . యొకసంఘముమీద గాని రాహితీ చేయబడినట్లు కనపడును.[2] ఇతర పరిపాలనక్రమమంతయు చోళుల క్రింద నున్నట్లే యుండెను. దానిని శ్రీకృష్ణస్వామయ్యంగారు సమగ్రముగా నిచ్చియున్నారు.[3] ఆస్థానమున పెట్టబడు ఖర్చులుతప్ప నిక వేరు ఖర్చులు లేవు. ఇప్పటివలె ప్రభుత్వమనేక శాఖలుగా చేయబడలేదు, యుద్ధపుఖర్చు లప్పుడప్పుడు వచ్చుచుండెను. మిగిలిన ద్రవ్య మంతయు రాజు బొక్కసములోనే యుండెను. నాయకరాజులు కాలువలయొక్కయు, చెరువులయొక్కయు, మరమ్మతుల కొరకును, ప్రజాసామాన్యమునకుపయుక్తములగు పుష్యమంటపములు, నదులకు సోపానములు మొదలగు నిర్మాణములందును, గుళ్లు గోపురములు కట్టుటయందును

1. Journal of Oriental Research, Vol. VI, Part I. p. 83.

2. వెనుక వచ్చుచుండు కమసాలుల కందరకు పన్నులు రాహితీచేసిన శాసనమును కనుగొనియున్నాము. 22 of 1897.

3. Ancient India, Ch. VI.

మిక్కిలిగా వినియోగించి నట్లు కానవగును. అచ్చటచ్చట పాఠశాలలుకూడా స్థాపించిన ట్లున్నది.[1] సంస్థానరక్షణ మునకు వలసిన పరిమితమైన సేనతప్ప నెల్లప్పుడును సైన్య మును భరించునవసరము లేకుండెను. సైనికులు మామూ లుగావారి వృత్తులయందుండి యవసరము తటస్థించినప్పుడు రాజు పిలువ యుద్ధమునకు వెడలుచుండిరి. ఈ సైనికులకు యుద్ధమునకు వెడలినప్పుడుతప్ప నితరకాలముల వేత నము లిచ్చినట్లు నిదర్శనములు కానరావు. అందుచే నిప్పటియంత సైన్యవ్యయము లేకపోయెను. నాయక రాజుల కాలములో దక్షిణదేశమున ధారాళముగా ఫిరం గులు, తుపాకులు నుపయోగించినట్లు కన్పట్టును. పోర్చు గీసువారు వచ్చినతరువాత వారిచేత సైనికులను తరిఫీ యతుచేయించుట మొదలిడిరి.

ప్రభుత్వమంతయు రాజహస్తగతమై యుండెను. ప్రజలకు రాజ్యములో నెట్టిపాలును లేదు. ప్రభుత్వము యొక్క బాగోగులు రాజగుణానుసారములై యుండెను. అందులకు రఘునాథవిజయరాఘవులే తార్కాణము. రాజు శూరుడై శత్రువుల దునుమాడగల్గి సన్మార్గప్రవర్త

1. J. A. H, R. S., Vol. II, Parts III & IV.

ఖుడైన/ప్రజలు సుఖించిరి; లేకున్న పీడింపబడిరి. ప్రజలు రాజుపైన తిరుగుబా టొనర్చు పద్ధతి యింకను తలయెత్త లేదు. రాజుధనము ప్రజలకును, ప్రజల ధనము రాజున కును పరస్పరము ప్రవహించుచుండెను. పర దేశమున కిచ్చుటి ద్రవ్యము గొంపోబడుట మొదటిమారు మహమ్మ దీయసేనానులచే చేయబడెను. రాజకార్యమున ముఖ్యు లగు నుద్యోగీయులు నల్గురు

1. మంత్రి
2. దళవాయి
3. రాయసము (కార్యదర్శి)
4. తోశేఖానాఅధికారి (కోశాధ్యక్షుడు.)

దళవాయిప్రధానికములు రెండును కలసి నడచు చుండెను. సామాన్యముగా రెండుద్యోగములును నొక వ్యక్తిలో నుండెను. కాని రాజే స్వయముగా సేనల నడుపుచుండెను. మన నాయకరాజ్యకాలమున దళకర్త ప్రధానికము చాలాకాలము గోవిందదీక్షితునియందే యుండెను. గోవిందు డెప్పుడును యుద్ధమున పాల్గొని నట్లు కానరాదు. రాయసము సంస్థానమునందలి వ్రాత కార్యమునంతను చేయుచుండెను. కోశాధికారికి ధనాగార

మును రక్షించుటయు, నాదాయవ్యయములను లెక్కవ్రాసి విన్నవించుటయు ముఖ్యమైన పనులు. రాజునకు తరువాత మంత్రి ముఖ్యాధికారి. ఆస్థానముల కుట్రలు మెండుగా నుండెను. రాజులు బహుపత్నీగ్రహణము చేయుచుండిరి. రాజస్త్రీలకు ఘోషా యాచార ముండెను.

అనాదినుండియు నీచోళ రాజ్యమున కొన్ని రేవు పట్టణము లుండి యోడవర్తకము సింహళము మొదలగు నితర దేశములతో చేయబడుచుండెను.[1] మన నాయక రాజుల కాలములో నట్టివి నాల్గుండెను.

1. నాగూరు,
2. నాగపట్టణము,
3. అధిరాంపట్టణము,
4. తరంగంబాడి.

వీనిలో మొదటిరెండును మిక్కిలి ప్రాచీనములు. నాగపట్టణము టాలెమి (Ptolemy) యనుపాశ్చాత్యయా

1. చోళుల కొకకాలమున రాజధానియై గొప్పయోడ రేవని యనేకులచే కొనియాడబడిన కావేరీపట్టణ మిప్పటికి చాలకాలము క్రిందటనే యిసుకతిన్నెగా పూడిపోయెను.
(Ancient History of India, V. A. Smith, p. 481.)

త్రికునిచే నిగమా (Nigamos)సని చెప్పబడినది. మిక్కిలి విశాలమైన యోడవర్తకము చేయుచుండెను. అనాది నుండియు నీచోళమండలము శాలిధాన్యమునకు ప్రసిద్ధమని మనకు తెలియును. కాబట్టి యీవర్తకస్థానము నందలి వర్తకద్రవ్యములలో వడ్లు, బియ్యము ముఖ్యములు. పొగాకు మొదలగునవి కూడ నెగుమతి యగుచుండెను. పరిమళద్రవ్యములు మొదలగునవి దిగుమతి చేయబడుచుండెను. ఇతరదేశములనుండి గుఱ్ఱములు కూడ దిగుమతి చేయబడుచుండెను.

నాయకరాజ్యకాలమున సారస్వతవ్యాపన మపారముగ జరిగెను. అందును రఘునాథుని యాస్థానమున సంస్కృతాంధ్రముల నత్యుత్తమగ్రంథములు వెలువడెను. విజయరాఘవునికాలముననే నాటక మనునది యాంధ్రమున మొదట పొడసూపినది. ఈ గౌరవము విజయరాఘవునికిని తత్పుత్రునకు నియ్యవలెను. రఘునాథాభ్యుదయనాటక మనునది యాంధ్రమున ప్రథమ నాటకమని చెప్పవలెను. తన్నాటకము మన మిప్పుడు చూచువానివలె గద్యపద్యాత్మకమై యుండెను. ఎట్టి నాటకలక్షణము ననుసరింపబడి యుండలేదు. విష్కంభము చేయవలసిన పని కవియే చేయుచుండెను. నాటకరచనమున

ద్విపదయు, కీర్తనములును ముఖ్యస్థానము నలంకరించెను. ఈ కీర్తనములు సామాన్యముగా పాత్రలు ప్రవేశించు సందర్భమున నుపయోగింపబడెను. ఇప్పు డీ నాటకములు రంగమున సాఫల్యప్రదర్శనయోగ్యములు కావు గాని కొన్నిమార్పులతో ప్రయోగింప నవకాశమున్నదని నా యభిప్రాయము. ఈ కాలముననే యాంధ్రమున ప్రత్యేక వచనకావ్యములు వ్రాయబడుటకు ప్రారంభము. పదములు, గీతములు నిర్మింపబడెను. క్షేత్రయ్యపదము లని యాంధ్రమున సుప్రసిద్ధములు. ఆక్షేత్రయ్య విజయ రాఘవునకు సమకాలీనుడు. ఆయనపైన కొన్నిపదముల నుకూడా వ్రాసెను.[1]

1. పంచరత్నములని యైదుకీర్తనల వ్రాసెను. వానిలో నిది యొకటి,

సైంధవి రాగము: మిశ్రచాపు

పల్లవి:—

దొంతరవిడెములోను
చెంత రాకు నీకు నాయమా!

అనుపల్లవి:—

ఇంతకు నే తాళగలనా యేరా
విజయరాఘవజాణ!

సంస్కృతవాఙ్మయమున నీకాలమున షడ్దర్శనములను గ్రంథములు వ్రాయబడెను. గోవిందమఖి యీ వాఙ్మయవ్యాపనమునకు కారకుడు. కర్ణాటద్రావిడవాఙ్మయములనుకూడా వీరు వృద్ధి నొందించినట్లు కన్పట్టును. సెవ్వప్ప అళగీయదేశికునిచే సేతుపురాణము భాషాంతరీకృత మొనర్పించెను.[1] గోవిందమఖి క్రీ.శ. 1605-వ సంవత్సరమున పంచనదమాహాత్మ్యము నరవభాషలో వ్రాయిం

చరణము :—

చక్కని విజయరాఘవసామిగా
న న్నేలినావా?
ఆటక్కు లాడియింటికి పోవా?
మక్కువతోడను,
యెక్కడి వాడిన విరులు,
చిక్కుపడ్డవి నీకంఠసరులు
నిక్కము దానిపై మరులు
నీవు దా నింటికేతరలు.

ఈయననుగూర్చి తంజావూరాస్థానమునకు సంబంధించి యనేక గాథలను చెప్పుదురు.

(సంగీతసంప్రదాయప్రదర్శిని.)

1. A Catalogue of Tamil Mss. in the Tanjore Palace Library, p. 390.

చెను. దీనికి శాసనాధారము కలదు.[1] ఇవిగాక విజయ రాఘవుని కాలమునాటికి తెనుగును, నరవమును సమాన గౌరవ మందినట్లు కన్పట్టును. అరవభాషయం దీయన యాజ్ఞచే ననేకగ్రంథములు వెలువడెను.

ఒక్క సాహిత్యమేకాక సంగీతవిద్యకూడ వీరి కాలమున మిక్కిలి ప్రశస్తి కెక్కెను. రఘునాథుడు సంగీతచక్రవర్తి. ఈయన నూతనతాళరాగముల నిర్మింప గల ప్రతిభాశాలి. ఈయనకాలమున "సంగీతసుధ" యను నత్యుత్తమసంగీతశాస్త్రగ్రంథము వెలువడెను. తరువాత వెంకటమఖి "చతుర్దండిప్రకాశిక" యను నుత్తమ సంగీతగ్రంథమును రచియించెను. వెంకటమఖి సంగీత శాస్త్రమున కొక యుద్ధర్త. ఈయన యనేకకీర్తనము లను కన్నడభాషలో రచియించెను.[2]

అల్లసాని పెద్దనార్యునిచే సర్వాంగసుందరము గావింపబడిన ప్రబంధకవిత్వము తరువాతిశతాబ్దముల తంజావూరాస్థానమున ననుసరింపబడెను. విజయవిలాస మందులకు తార్కాణము. పింగళిసూరన రామరాజ

1. J. A. H. R. S., Vol II, Parts 3 & 4, p. 225.
2. సంగీతసంప్రదాయప్రదర్శినియందు కలవు.

భూషణులచే ప్రారంభింపబడిన ద్వ్యర్థికావ్యకవిత్వము రఘునాథుని యాస్థానమందలి కృష్ణయజ్వచే ననుసరింపబడెను. ఈయన శృంగారనైషధపారిజాతమను నుత్తమ ద్వ్యర్థికావ్యమును రచియించి మించెను. స్త్రీకవుల సంగతి వెనుక ముచ్చటించియున్నాను. మొత్తముమీద నాంధ్రసారస్వతకన్య కీనాయకరాజాస్థాన మొక గొప్పరంగస్థలమయ్యెను. తరువాతి మహారాష్ట్రరాజులును నీరాజుల పద్ధతినే యనుసరించుచు తెనుగునుకూడ పోషించినట్లును, శాహరాజు మొదలగువారు కవులుకూడా యైనట్లును కానగును. అన్ని విషయములు సమగ్రముగా గమనించిన నీరాజులు దేశక్షేమముకొఱకే రాజ్యము చేసినట్లు చరిత్రకారుల యభిప్రాయము.

"The Nayaks of Tanjore appear to have governed the country with moderation and a tolerable measure of equity."

(Tanjore Dt. Manual, p. 751.)[1]

"Aliens though they (The Nayaks of Tanjore) were they made Tanjore their home and continued the traditional policy of protection of the subjects, and patronage of religion, arts, and

1. Tanjore Dt. Gazetteer p. 41.

letters. There has been an exuberant growth of Sanskrit and Telugu literature during the Nayak rule. Govinda Dikshita, the Minister of Atchuta, the second Nayak, regent for sometime and then minister to Raghunatha was a sound scholor and a friend of the famous Appayya Dikshita. His son Yegnanarayana wrote Sahityaratnakara which deals with the work of Raghunatha. The Kings themselves were accomplished men. Govinda's Sahitya Sudha[1] says that Raghunatha was a musician, a Sanskrit aud Telugu scholar and author of half a dozen works. A grear warrior he replaced the King of Jaffna on his ancestral throne after suppressing the Portugese. Very pious and charitable he divided whatever money could be spared between the Gods and the poor. He knew eight languages, and Madhura Vani and Ramabhadramba two rare poetesses adorned his court, and enriched literature. Professed Vaishnavas though they were the Nayaks endowed Saiva temples. Also Raghunatha patronised two Madhva gurus, Sudhindra and Raghavendra. They built choultries for the poor, and made gifts for pious and learned Brahmans.

1. ఇది యనుమానాస్పదము.

There were the traditions to which the Mahrattas succeeded. **** Meanwhile the Nayaks did not forget the temporal interests of the state."

Mahratta Rajas of Tanjore, pp. 13 & 14.

"తంజాపురాంధ్రరాజానాం
చరితం లిఖితం మయా,
దోషాన్ సర్వాన్ పరిత్యజ్య
గుణాన్ గృహ్ణంతు పండితాః"

ఓం తత్సత్

---

# అనుబంధము

## 'క'

"On this usurpation occuring Chandrasekhara Pandiyan again went to Rayar and complained saying, 'He has taken the Kingdom for himself.' The Rayar instantly despatched an Imperial Mandate commanding Nagama Naicker to restore the Kingdom to Pandyan to whom he entrusted the order, and dismissed him. But the usurper treating the mandate with contempt rejected it, and selecting from amongst those who came with him, and had served him while he was in subjection to the Rayar * * he gave them certain districts in charge writing out grants of tenure; * * *. The Pandyan again went to the Rayar and said to him "Your general has treated me, and your official messenger who accompanied me, and your mandate also with contempt; and keeping the country for himself, has delivered whole of it to the defence of his creatures." On recieving this intelligence the Rayar was thoroughly incensed; and calling the whole of his counsellors together thus addressed them, 'So, he instead of crowning the Pandyan as he was ordered, has taken possession of the Kingdom as if his own—now you are sons of lords and skilful commanders. Speak which

of you will undertake to go and bring me the head of Nagama Naicker.' The whole of the assembly silently heard this inquiry. Thereupon Visvanatha Naicker rose up and approaching the Rayar said, " If you will give me leave I will go and bring it." The Rayar replied, "What! will you go and join your father," (That is to strengthen his rebellion), to which Visvanatha replied, " As I eat your food, your service is my duty, and in comparison with the service of my master, never mind about my father; as you command I shall act and in no manner." On receiving his permission according to his request, he assembled an army and coming to the Madura country he made a descent on one of the Districts, and thence wrote to his father, to the following purpoit, "That as his father has transgressed the Rayar's order, he himself was sent to cut off his father's head, and carry it back, but that if his father re-instate the Pandyan as he had been commanded, and would then peaceably come over to himself, he would use suitable means of appealing the Rayar and remove all existing displeasure against his father," But the father kindling with rage, hastily assembled his forces and going forth encountered Visvanatha by whom he was conquered and taken prisoner. Being placed in a howda on an Elephant, Visvanatha caused him to be well-guarded; then re-instating the Pandyan he returned to the presence of the Rayar and said, "If you order

me to punish my father, I will now bring you his head." But the Rayar greatly pleased said "For your sake we pardon your father's fault," And after giving him robes and presents allowed all things to be adjusted, and remained as he was before these circumstances had occured. Matters being thus situated the King of Madura died; and his son having been crowned after a short time died also; so that the Pandyan race became entirely extinct. In consequence the Rayar took counsel and desiring a meritorious person to rule that Kingdom he sent and called for Visvanatha Naiker to whom he said, "All that country was as you know under your father's control and now as there is no heir to the throne through defect of posterity to the Pandian, and seeing that you, on a public emergency killed the wild buffalo and by offering it to the goddess Durga prevented the occurence of public calamity; moreover as you conquered several Northern Rajas when they revolted and refused to pay tribute; making their countries our own, by right of conquest, and besides when your father disobeyed our commands, you considered the right of your sovereign as entitled to precedence over that of your father, and brought him here; further as you must remember when we formerly gave you a throne like our own, we promised you also a Kingdom, therefore, be now the King of Madura country." Agreeably to this grant the Rayar had water from the Ganges at Kasi brought and causing him to be anointed gave him the title of

"Lord of the Pandian throne," and delivered to him the Pandian country, as also all suitable presents, and said, "Be the Kingdom yours and that of your posterity even as long as the sun and moon endure."

* * * *

and Visvanatha received audience of leave to depart."

Taylor's Oriental Mss. pp. 11-13.

---

# అ ను బం ధ ము

'ఖ'

"అప్పుడు పాండ్యరాజు తిరిగిపోయి రాయలవారిదగ్గర "మీ రైతే మాకు రాజ్యంయావత్తు కట్టియిమ్మని నాగమనాయనివారిని అంపించినారు గాని ఆయన చోళరాజును కొట్టి ఆరాజ్యం పాండ్య రాజ్యం రెండు తానే కట్టుకున్నాడు." అని ఫిర్యాదుచేసు కొన్నంతలో, రాయలవారు నాగమనాయనిపేరను ఆజ్ఞ వ్రాయించిరి. "పాండ్యరాజ్యం పాండ్యునికి పట్టంకట్టమంటే నీవు అపహరించు కొన్నావు. నిన్ను ఆవిధంగా రాజ్యం యేలడానికి మేము అంపించ లేదు. కనుక యీఆజ్ఞ చూస్తునే చంద్రశేఖరపాండ్యునికి పట్టంకట్టి అతిత్వరితంగా నీవు లేచిర మ్మ"ని వ్రాయించినారు. అప్పుడు నాగ మనాయనివారు బదులువ్రాసిన దేమనగా—"యీగ్రామాలు యావత్తు జాగ్రత్తచేసేటప్పటికి నేను అనేకద్రవ్యం ఖర్చుచేసినాను. ఈపాం డ్యుడు యింతకులోనైనం మీవద్దకు రారాదా ? ఇంత అరాజకంగా వున్నరాజ్యం మనకు స్వాధీనానకు రాదని యిదివరదాకా వూరికే ఉన్నాడు. ఇప్పుడు చోళరాజును కొట్టి రాజ్యంకట్టడంకాకుండా అరాజకంగావున్న రాజ్యంకూడా స్వాధీనములోనికి తేవడం చూచి నాడు. ఇంతకుమునుపు— రాజ్యం నాకు స్వాధీనానకు రాదు. మీరు యావత్తు కట్టుకుని నాకు అన్నవస్త్రాలకు జరిపిస్తే చాలు నని చెప్పుకుంటూ ఉండేవాడు. ఇప్పుడు అతనికి ఆశ పుట్టింది. అయితే నేమాయెను. అతనికి రాజ్యం యిస్తే నగరికి తోఫా(కప్పము)రూకలు

కూడా రావు. మరిన్ని యితను పాండ్యవంశమని చెప్పుకోవడం మాత్రమేకాని జాతికి తక్కువ. దాసికొమారుడు. రాజ్యం యితనికి అర్హం కాదు కనుకనే చోళరాజు కట్టుకొని యితణ్ణి వెళ్లగొట్టినాడు. మారంగా వున్నాముగనక యీజాతినీతులు మనకు తెలియలేదు. ఇంతకు నేను బహుదినములు తమకొలువు కొలిచినాను. ఇకకొన్ని దినములైనా సుఖపడవద్దా! ఇదిగాక అనేకద్రవ్యం యీసంస్థానము మీద పెట్టి యింతమాత్రం రాజ్యం స్వాధీనములోనికి తెచ్చినాను. నాఅర్థం యావత్తు నేను రాబట్టుకొని నేనువస్తానుగాని అంతపర్యంతం నేనువచ్చేదిలేదు"—అని సమాచారము వ్రాసిఅంపించినంతలో, రాయలవారికి బహుకోపము వచ్చింది. "నాగమనాయడు మాఆజ్ఞకు తప్పి నడిచినాడు గనక ఆతనితల మీరెవరైనా తేగలరా" అని అడిగెను. అప్పుడు నాగమనాయనికుమారుడు[1] విశ్వనాథనాయనివారు లేచి రాయలవారిసమక్షానికి వచ్చి, "నాకు త్తరువుయిప్పిస్తే తెస్తా"నని అన్నారు. అప్పుడు రాయలవారు, "మీతండ్రిగారిదగ్గరకు మీరు కూడా పోయి కలుసుకోవడానికి ఆజ్ఞ అడుగుతారా" అని ఆక్షేపిస్తే అప్పుడు విశ్వనాథనాయనివారు, "ఎక్కడనైనా కద్దా? ఏలినవారి సొమ్ము తింటూవున్నాము. స్వామికార్యం ప్రధానంకాని తండ్రి యెక్కువకాద"ని అన్నారు. అప్పుడు సర్కారురాణువు అక్కర లేకుండా తనయొప్పటిబలం రెండువేలసవ్వంతో ఆరువేలకాలిబలంతో మధురసీమకు వచ్చి తండ్రిగారివద్దికి అంపించినవయనం యేమంటే:—

1. విశ్వనాథు డిప్పటికే యనేకవీరకార్యముల నొనర్చి కళింగమున ననేకరాజులను జయించి ప్రఖ్యాతవీరుడని పేరుగాంచి రాయలకు నమ్మకమైన దండనాయకులలో నొకడై యుండెను.

మీరు రాయలవారిఆజ్ఞకు తప్పినడిచినారు. మిమ్మను తలకొట్టి
తెమ్మని ఉత్తరువు అయింది. అయితే నేమాయెను. ఇప్పుడయినా
పాండ్యరాజ్యం పాండ్యుడికి పట్టంగట్టి మీరు లేచివస్తే రాయలవారితో
చెప్పి మాపు చేయిస్తాను రం" డని సమాచారము అంపిస్తే తిరుగ నాగ
మనాయనివారు తనకుమారునివద్దకు కబురంపినవైనం—రాయలవారి
పట్టున నీవు సమస్తరాజ్యాలు సాధించినావుకదా! ఇదిగాక నేనున్నూ
చాలారాజ్యం సాధించినాను. రెండుమూడుమారులు పోయినసంస్థా
నము నిలవబెట్టినాము.1 నీవు యెంతమెహన్నతు చేసినా ఆఘనత
నన్ను చెందవలెనుకాని మరివకటి లేదు. రాయలు విశ్వాసము కలిగిన
వాడే కనక అయితే పాండ్యరాజ్యం అన్నప్పుడు దాసికుమారుడు
అనుభవిస్తే ఆయనకు వచ్చిందేమి? మనము అనుభవిస్తే రాకపోయిం
దేమి? నిన్ను బహుతపస్సుచేసి కన్నాము. ఏకపుత్రవిషయము.
కాబట్టి నిష్కారణంగా నాతో యెందుకు యుద్ధంచేస్తావు? ఇంతహూ
యీరాజ్యంకట్టడం నీనిమిత్తంకాని వేరే లేదు. తమతో"ర"మ్మని
సమాచారం అంపిస్తే విశ్వనాథనాయనివారు తండ్రిగారికి సమాధానము
అంపించినవైనం యేమంటే—"స్వామికార్యానికి తప్పి నడచినారు
గనుక మీరు తండ్రులు కారు; నేను కొమారుణ్ణి కాను. మీరు సంపా
దనచేసినరాజ్యమున్ను నాకు అక్కరలేదు. తిన్నగా వస్తిరా ప్రభు
వుగారిసమక్షానికి తీసుకొనిపోయి ప్రాణానికి భయంలేకుండాచేయి

1. విశ్వనాథుడు అంగవంగాదిరాజ్యములు జయించినట్లు
కైఫీయతు గ్రంథము తెల్పునుగాని చిన్నరాజుల నెవ్వరినో యోడించె
నని యనుకొనవలెను.

(T. O. H. Mss. Vol. II, P. 107)

స్తాను. అనవా వకవేళ యుద్ధంచేసినా గెలిచేపాటిబలం భగవంతుడు మీకు యివ్వడు. నామనస్సులో ప్రతిజ్ఞ యేమిసంచేతనూ మిమ్ము తీసుకొనిపోయి రాయలవారియెదుట పెట్టడమే. అదే సకలసాం బ్రాజ్యాలు యేలడం గనక తండ్రి అని విచారించను"—అని సమా చారం అంపించి సంతలో నాగమనాయనివారు బహుకష్టపడు తూ అన్నమాటలు—"నేను యీ కొమారుడు కలగవలెనని బహు తపస్సు చేసి విశ్వనాథస్వామి వారిని ప్రార్థించినందుకు నామీవ కత్తియెత్తేకొమారుడు కలిగినాడు. ఈకొమారుడు బ్రతికినాసరే చచ్చినాసరే"—అని తనతాలూకు రాణువు యావత్తు కూర్చుకొని యుద్ధానికి వచ్చెను. అప్పుడు ఘోరయుద్ధము అయింది. నాగము నాయనివారు కుమారునికి చాలక ఓడిపోయి దొరికినారు. దొరక గానే విశ్వనాథనాయనివారు యింతమాత్రం ప్రాణాలతో దొరికి నారు. మనంచేసినతపస్సుయొక్కబలం అని అంభారీమీద యెక్కించి చుట్టుతనపారా కడాయించి తీసుకువస్తూ ముందు అతిత్వరగా తమ తండ్రిగారికిన్ని తమకున్ను అయినయుద్ధమున్ను, ఆయనదొరికినదిన్ని, తాను ఖైదుచేసి తీసుకొనివస్తూఉన్నదిన్ని సమాచారం వ్రాసి అంపిం చిరి. నాటికి రాయలవారు కచ్చేరికి గొప్పసేనానాయకులను పిలిపించి సెలవిచ్చినమాటలు—"నాగమనాయనిమీదికి దండెత్తమంటే యెవ్వరు మాచేత అయ్యేపని కాదు. మీరు చూచి ఉత్తరువుయిస్తే అన్యా యంగా పోయి చచ్చిపోతా మంటిరి కదా! విశ్వనాథనాయడు స్వామికార్యంచోట తండ్రిని చేయించినపని చూచినారుకదా!" అని ఆయన అంపించిన జాబులు చూపించినంతలో కూర్చున్న సభయావత్తు ఆశ్చర్యపడి—"స్వామి! అతను మనుష్యులలో పరిగణన అయినవాడు కాడు. కేవలము విశ్వనాథస్వామే"—అని సభవారంతా స్తోత్రము

చేసిరి. రాయలవారు యిరుభుజాలుపొంగి, యింతటిబంటును మనము యేలినాముకదా! అని సంతోషపడి అందరు వుండగా అన్నమాటలు—"విశ్వనాథనాయడు మనుష్యులలో పరిగణనఅయినవాడు కాడు అని మీరుచెప్పినమాటలే నిబద్ధి. ఆయన మనకొలువుకింద ఉంచుకోవడానికి యోగ్యుడయిన మనిషి కాడు. ఇక ఆయనచేత కొలువు చేయించితే మనకు దోషం వస్తుంది మనతోను సమంగా సింహాసనాధిపత్యమునకు యోగ్యుడు. ఇదిగాక అడివిదున్నపోతును నరికినవాడున్ను పరాయి దేశపురాజులదేశం కట్టుకొన్నవాడున్ను అయి రెండు మార్లు సంస్థానం నిలిపినాడు. గనుక ఆయనవచ్చినతరువాత యెక్కడైనా రాజ్యం యిచ్చి మనతో సమానంగా ఉంచవలెను"—అన్నారు. అప్పుడు సభవారంతా విన్నసముచేసినమాటలు—"స్వామీ! విశ్వనాథనాయనివారికి రాజ్యం అపేక్షవుంటే తండ్రిగారివద్దకు పోయి నప్పుడు యిద్దరు పోటీఅయి ఆరాజ్యం కట్టుకుని మనమీదకుకూడా దండెత్తితే యెదురు పోజాలకపోగును. ఆయన కేవలం స్వామివారి యొక్క అంశముగనక తమచోట బహువిశ్వాసంగా అంతకార్యం చేసుకొని వస్తూవున్నారు. తమరు సర్వజ్ఞమూర్తులుగనక తమకు తెలియనిదేమున్నది?"—అని విన్నపంచేసినారు. మరి పదిదినములకు విశ్వనాథనాయనివారు తండ్రిని తీసుకునివచ్చి రాయలవారియెదుటను నిలపబెట్టెను. రాయలవారు నాగమనాయణ్ణిచూచి యింతవిశ్వాసఘాతం చేసినావని అడిగితే అప్పుడు నాగమనాయనివారు విన్నపము చేసినమాటలు—"పాండ్యరాజ్యం మీతండ్రిగారు మాయొక్క తోశేఖానామీదను తనఖా యిచ్చినారు. నాటనుంచి అనేకద్రవ్యం నష్టపెట్టుకొన్నాము. ఇదిగాక యిప్పుడు చోళరాజును కొట్టి పాండ్యరాజుకు రాజ్యం యిమ్మని సెలవుయిచ్చినారు. ఆయుద్ధంలో యిక్క

డనుంచి తమరు యిప్పించి అంపించిన అర్థం కాకుండా అనేకఅర్థం కర్చు అయింది. ఇట్లా బహుశ్రమపడి చోళుణ్ణి కొట్టి పాండ్యరాజ్యం యితనికి పట్నం కట్టించి పోతాము అంటే యీపాండ్య డన్నమాటలు— చోళరాజును కొట్టడానికి తమరేగనక సాధ్యపడినది. లేనట్టు అయితే యెన్నటికి స్వాధీనానికి రాకపోను. ఇప్పటికిన్ని రాజ్యం అరాచకంగా యెవరిగ్రామాలు వారు అనుభవిస్తూ మనకు స్వాధీనానకు రాకవున్నారు. చోళరాజు మమ్మ అన్యాయంచేసి రాజ్యంకట్టినాడని పేరు మాత్రమేకాని ఆయనకూ యీగ్రామాలు యావత్తు స్వాధీనానికి రాలేదు. ఇంతకు మాయొక్క శత్రువును కొట్టినారు. ఇదే పదివేలు. ఇదిగాక నాకున్ను సంతానము లేదు. ఉన్నవారంతా ఉంపడందానికొడుకులు. నాజీవంవున్నంతవరకు మర్యాదగా జరుపుతూ నాకు అన్నవస్త్రాలకుమాత్రం యిచ్చి నాపగవాడైన చోళరాజుకుమాత్రం చెందనివ్వక నాపేరుగా మీరే యేలుకుంటూవుంటే చాలున-న్నాడు. అప్పుడు యీరాజ్యాలు యావత్తు బహుఅరాచకంగా వున్నవి. బహుధనం వ్యయంచేసి రాజ్యం బందోబస్తు చేసినాను. ఇప్పుడు మీదగ్గిరికి ఫిర్యాదికి వచ్చినాడు—"అని వారికి తమకు జరిగిన తకరార్లున్ను, తమరు వ్రయంచేసిన అర్థమున్ను రాయలవారికి తెలియపరచిరి. రాయలవారు చూచి అప్పుడు పాండ్యుణ్ణి పిలిచి— "నీవు చాలాపెద్దమనిషివని నీమాట బహునిబద్ధి అని మేము నమ్మకొని యింతమద్దత్తు చేసి అంపించినాము ఈసంగతులు నిజమునా కాదా—" అనిఅడిగితే —"నిజమే నేను అన్నది కద్దు గాని నాశరీరండున్నంతవరకు మర్యాదగా గడుపుమన్నాను. అందుకు అట్లాకాపు అయిందిగనక ఫిర్యాదుకు వచ్చినా—" నని అంటే మనుపు యిట్లాచెప్పరాదా అని బహుకోపము చేసిరి. అప్పుడు విశ్వనాథనాయనివారు రాయలవారిని మననిపూర్వకంగా పాండ్యునిపై గర్విితం

లేకుండా మాట్లాడవలెనని మనవి చేసుకుంటే విశ్వనాధనాయనివారి మాటలు చెల్లించిరి. అప్పుడు తిరుగ రాయలవారిని చూచి పాండ్యుడు అన్నమాటలు— "నేను యితనికొమారుడు విశ్వనాధనాయనివారికి రాజ్యం వ్రాసియిచ్చినాను. నేను యిప్పటికి ఆమాట తప్పలేదు. రాజ్యం విశ్వనాధనాయనివారికి పట్టంకట్టితే బహుసంతోషం"—అన్నంతట విశ్వనాధనాయనివారిని ప్రభువుగారు చూచి—"మీతండ్రిని ఖైదిలో తెచ్చిపెట్టి రవంతైనా తండ్రిఅన్నమాట విచారించక స్వామి కార్యం ప్రధానం చేసుకొని తల కొట్టుతానని అన్నావుగనక నిన్ను చూచి మీతండ్రిచేసినతప్పు క్షమించినాము. ఈదినం యింటికి పొమ్మని ఆజ్ఞాపించినారు. అప్పుడు నాగమనాయనివారికి ఖైదు విడిపించి యింటికి తీసుకొనివచ్చి—"యిక మీరు తండ్రులు నేను కుమారుణ్ణి యింతపర్యంతం నేను మీకు శత్రువను"—అని అనేకవిధాలను తండ్రిగారిని వేడుకొని స్నానంచేయించి నూతనవస్త్రములు కట్టబెట్టి అనేక దానధర్మములు చేసి ఆమరునాడు అనేకబ్రాహ్మణభోజనములు చేయించి తండ్రికొమాళ్లు బహుయిష్టంగా వుండిరి. నాయనివారు కొమారుణ్ణిచూచి—"నీవు రాజ్యాంగం చేస్తువుండవలెనని యింతపనికి వొప్పుకొన్నానేకాని వేరుకాదు. ఇక నేను పరలోకసాధనం చూచుకొంటాను. నాకు యిక కావలసిన దేమున్నదిగనక! నేను సంపాదనచేసిన అర్థము యావత్తు వున్నది. అంతా తీసుకో. ఇదిగాక నీకు రాయలవారు రాజ్యం యిస్తారు. మర్యాదగా కాపాడుకొ"మ్మనగా కొమారుడు—"మీరు ఆర్జించినఅర్థం నాకు అక్కరలేదు. మీరే దానధర్మములు చేసుకొని పరలోకసాధనం చూచుకొండి"—అని అన్నారు. అందుకు నాగమనాయనివారు—"యెక్కడనైనా కద్దా! బహుదినములు తపస్సు చేసి కన్నందుకు నీకు యింతమాత్రం అర్థమైనా పెట్టకపోతే బాగావుండ"దని తమపెద్దలు సంపాదనచేసినఅర్థమున్నా యిచ్చి

గాక తాముసంపాదనచేసినఅర్థమున్నూ కొమారునికి కనుపరచినం తలో విశ్వనాధనాయనివారు కన్నులుతిరిగి యింతఅర్థం యెట్లా సంపా దనచేసినారో తెలియదని ఆశ్చర్యపోయిరి. నాగమనాయని వారు కొమారుణ్ణిచూచి తిరుగా అన్నమాటలు.— "పాండ్యరాజ్యంలో మధురలో మీనాక్షిసుందరేశ్వరస్వామివారిదివ్యస్థలంఉన్నది. ఆ మీనాక్షిదేవిప్రత్యక్షదైవం గనక నాకు వకనాటిరాత్రి స్వప్నంలో నీకొమారుడు విశ్వనాధనాయడు నాసన్నిధానాన వుండి రాజ్య మంతా యేలడానికి బహుయోగ్యుడని చెప్పివున్నది. ఈఅర్థ మంతా తీసుకొనిపోయి పాండ్యదేశంలో దేవస్థానాలున్నూ యింకా యేళ్లకు రాతికట్లున్నూ కట్టి అనేకధర్మాలు చేస్తే నాకు పరలోకం కలుగు తుంది"—అని అన్నారు. తరువాత రాయలవారు విశ్వనాధనాయణ్ణి పాండ్యుణ్ణి కూడా పిలిపించి ప్రత్యేకం పాండ్యునితో అన్నమా టలు—"నీకు వుంపుడుదానికొమారుడుమాత్రం వున్నాడుగాని తగిన సంతానం లేదుకదా? విశ్వనాధనాయనివారికి దేశము యివ్వడం బహుసమ్మతి అని ఆయన పేరటికి వ్రాసియిచ్చివున్నావు అదిసమ్మ తమా"—అని అడిగినారు. అప్పుడు పాండ్యుడు అన్నమాటలు— "నాకు సర్వథా దేశము అక్కరలేదు. ఒకవేళ నేను దేశము కావలెనని కోరినా చోళరాజు నన్ను ప్రాణంతో నిలవనివ్వడు. ఇదిగాక మా తండ్రితాతల ఉంపుడుసంబంధాలకు పుట్టినవారు త్రిచిల్లిపుత్తూరు, తెంగాశి, రాజుపాలయం, ఆస్థలములలోవున్నారు. వారు నన్ను తల చూపనియ్యరు. నాగమనాయనివారు అన్నిస్థలములు సాధించినారు గాని ఆఅయిదుస్థలములలోమాత్రం సాధించలేకపోయినారు. వారు పంచపాండువులని పేరెత్తివున్నారు. ఇంతకు నాపగవార్లు అయిన చోళరాజుకు యీపాండ్యులకుమాత్రం రాజ్యం యివ్వక విశ్వ

నాథనాయనివారు యేలుకుంటే. నాకు పరమసంతోషం.[1] ఇప్పుడు రక్షించడానికి విశ్వనాథనాయడు నాకు తండ్రివంటివాడు" —అనగా అప్పుడు రాయలవారు విశ్వనాథనాయనివారిని పిలిచి — "పాండ్య రాజ్యానికి పట్టంకట్టుతాము. మాకు సమంగా దక్షిణసింహాసనాధిపతిగా వుండుమని ఆశీర్వచనంచేసి * * * నిన్ను మరిస్తే మాకు దైవం సహాయము కాదు. లోనైనం నీవు రెండుమూడుపనులు చేసి మాదయ సంపాదన చేసుకొన్నప్పుడు నీకు రాజ్యం మాతో సమానంగా కల్పిస్తామని అన్నాము. ఇదిగాక యీరాజ్యం నీపరంగా ఉంటేనేగాని నగరికి తోఫారూకలుకూడా రావు. ఇక నీవు పాండ్య రాజ్యానికిపోయి దేశం బందోబస్తుచేస్తేనే గాని అనుకూలం కాదు. గనుక త్వరగా వెళ్లి, దక్షిణసింహాసనాధిపతివి కమ్మ"ని సమాధానం పరచినారు— అంతట విశ్వనాథనాయనివారు దుర్గామహాలక్ష్మిని తీసుకొని మధురకు వెళ్లేటప్పుడు తమసేనంతా యిచ్చి బహుసంభ్రమంగా అంపించినారు.

* * * *

వెనుకటిపాండ్యరాజును విశ్వనాథనాయనివారు యెంతో గౌరవంతో నడిపిరి. వృద్ధుడుగనక ఆయన కొన్నిమాసములకు స్వర్గస్థుడాయెను. విశ్వనాథనాయనివారే చోళరాజ్యం పాండ్యరాజ్యం రెండురాజ్యాలు తమయేలుబడికింద పెట్టుకొని విద్యానగరంరాయలవారికి లోనుగా పరిపాలనం జరుపుతూ వుండేవారు. * * *"

(తంజావూరాంధ్రరాజులచరిత్ర.)

---

1. O. H. Mss. Vol. II P. 109.

# అనుబంధము

## 'గ'

"కొన్ని దినాలకు పిమ్మట రాజా చొక్కనాథనాయనింగారు తమవివాహార్థముగా తంజావూరు రాజావిజయరాఘవనాయనివారి వద్దకు తమబంధువులను స్థానాపతులను కూర్చి వారిభేటికి యోగ్యమైన వస్త్రభూషణాదులున్ను యిచ్చి అంపించిరి. వారున్ను వచ్చి భేటిచేసుకున్నందున విజయరాఘవనాయనివారు వచ్చినవర్తమానమేమిటి యని అడిగిరి. వారున్ను "మాయేలినస్వామివారు తమవివాహానికి కన్యకార్థం దేవరసముఖాన మనవి చేయవలసినదని అంపించగా వచ్చినాము. రాజా పెద్దవీరప్పనాయనివారు మొదలుకొని రాజా తిరుమలశౌరివరకున్ను నడచి వచ్చిన సంబంధముకాని నూతన చుట్టరికము కాదుకదా? దేవరవారు దయచేసి శుభవార్త ఉత్తరువు దయచేయవలెను" అని అడిగినందుకు రాజావిజయరాఘవనాయనింగారు మహాకోపముతో "ఇంతైనా భయము లేక కన్యకను యిమ్మని అడుగ వచ్చినందులకు తగినశాస్తి చేయవలెను. గతమే వీరిపితామహుడైన తిరుమలశౌరికి మాఅచ్యుతరఘునాథమ్మగారిని పట్టమహిషిగా వివాహం చేసినారు. అతడు క్రొత్తగా నగరు కట్టించి మా అచ్యుతరఘునాథమ్మగారికి కనుగొనుపించినప్పుడు ఆమె హాస్యముగా తమతండ్రినగరుకు సమానము రాదని వకమాట అన్నందుకు సహింపులేక బాకుతో పొడిచినాడు. ఆసమాచారము విన్నప్పటిమావారందరు యిటువంటి దుష్కృత్యములకు తెలియక వివాహము చేస్తిమి. ఇక

మీద వారికి మనకు సంబంధములే అక్కర లేదు అని ప్రతిజ్ఞ చేసినారు. ఇట్లా జరిగివుండగా తిరిగీ సంబంధము కావలెనని యే బుద్ధితో మావద్దికి మిమ్ములను పంపించినాడు" అని వారుకొంచుకవచ్చిన భేటీ వస్తువులు అంగీకారము చేయక వారికి బత్తెం భరణం విచారించక "మరేమయినా వేరు పనులు కలిగితే నావద్దికి రావచ్చును. ఇటువంటి పనులు కోరి యికమీద వస్తే తగినశిక్ష చేయింతు"మని ఉత్తరువిచ్చి కోటకు బయట కొంచుకొని పోయి విడువమని సేవకులకు ఆజ్ఞాపించినారు. ఆమేరకు కోటకు బయటకు కొంచుకొని పోయి విడిచినారు.

(తంజావూరాంధ్రరాజుల చరిత్ర.)

---

## అనుబంధము

## 'ఘ'

"Matters being thus situated Atchuta Vijayaraghava Naicker, the ruler of the Tanjainagaram capital (Tanjore), had a daughter born to him, and carefully brought up, endowed with superior sense and great personal attractions. Information of this circumstance having been recieved by Dalavayi (general) named Tirusirapuram Venkata Krishnappa Naiker, and by the treasurer named Chinnatambi Mudaliar, they agreed that it was desirable to obtain such a person for their King Chokkanatha Naicker. They made known the matter to him, and by his sanction sent suitable persons to negotiate the marriage. These accordingly proceeded to Tanjore; and sent before hand to announce to Atchuta Vijayaraghava Naicker, that such and such persons were coming; at the consequent interview they addressed him saying, "Our King Raja Chokkanatha Naicker desires that you will present your daughter to him in marriage." So soon as Atchuta Vijayaraghava Naicker heard these words he became incensed and said, "Our daughter cannot be given to your King." But not stopping there, he freely indulged himself in ribaldry, and without rendering the proper courtesy to the messengers, he told them to return

whence they came. When, in consequence, they returned to Trichinopoly, they caused the unhandsome treatment they had experienced at Tanjore to be fully understood to Dalavayi Venkata Krishnappa Naicker, and by the treasurer Chinnatambi Mudaliar, in the immediate presence of the King Chokkanatha Naicker. On the simple hearing of the expressions, that had been employed, Sri Raja Chokkanatha Naicker was incensed to the highest degree, and on the instant, took measures for assembling together many elephants, horses and infantry; as also many large cannons and small arms, with connected matters; then addressing the Dalavayi Venkata Krishnappa Naicker he said. "Do you forthwith set out with this assembled force, and storm the fort of Tanjore; conquer the whole of the people connected with that capital; and having subdued the entire country return. By this means. you must add to your martial renown * * * As you are a very skilful man take with you the treasurer, Chinna Tambi Mudaliar; and assembling all the forces, proceed against the Tanjorians."

(Oriental Historical Mss. Taylor. Vol. II, p. 191.)

---

# అనుబంధము

## 'చ'

"On recieving this command (to go with an army, inva e Tanjore and conquer the country) the Dalavai (Venkata Krishnappa Naicker) placed the Royal order on his head and replied, "We will do according to the King's command" Then taking his dismissal and placing himself at the head of the whole army, he quitted Trichinopoly, and passed over the boundaries of Tanjore country. An encounter took place between the Tanjore troops stationed there and the invading force; and blood ran like water in the irrigation channels. There was then great destruction and many slain in the Tanjore force; many were wounded. Those who remained went to Tanjore and reported what had occured to the King. * * * * * A fierce encounter took place between them (two armies) * * * and the Tanjore army being beaten retreated and entered the fortress of Tanjore.

Hereupon the Dalavai being greatly rejoiced gave to the whole of his army presents of jewels rejoicing them also: and then putting the camp in motion he proceeded and e camped near to Tanjore. Immediately afterwards the Dalavai sent a message by suitable persons to Atchuta Vijayaraghava Naicker to this effect "notwithstanding all past occurences you are a great King and illustrious personage. Moreover

as you refused to bestow your daughter all this discussion between your's and our's has occured. But wherefore should it be continued? Consent with the marriage of your daughter with our King, and let a conciliation take place. If so we will cause our army to retire". On their delivering this message, Vijayaraghava became very angry at hearing its purport and sent to them the following reply: "The former speech was different. Now that you have seen the army does the tone vary? It must not be so if you are such brave persons then fight on." At that time there were on the ramparts of the Tanjore fort 20,000 musketeers and otherwise a great force. Although the beseiging army saw all these, yet they did not in any wise give way; but posted the army and mounted the cannons upon raised breast works, and having fixed the mark on the fort and the troops upon it, they discharged against it with great rapidity some tens of thousands of cannon shot. The defending troops were not able to sustain the infliction from the discharge of cannons and coming over to the side of beseigers sent them terms of capitulation declaring themselves their own people. At that time the mark being against the gates these were struck and split in pieces; and at the same time the ditches were filled up by bringing up and casting into them great quantities of wood; when the place was entered and taken by storm, some ascended by the breaches made by the cannon-shot and some going in by the gates. Vijayaraghava at this critical

juncture was at his devotions praying with his eyes shut and making the Vaishnava mark on his forehead. Some of his own people came and said, "O! Great King! The enemy had entered our fort by storm and are now inside." As he was a great devotee of Narayana he did not abandon his home but merely made a sign .to siginfy, "Let them Come, we shall see."

(ఇచ్చట మరల కుమార్తెనిమ్మని కబురంపినట్లున్నది.)

In the interim Vijayaraghava having finished his homage and hearing that the enemy's troops had advanced to the gates of the palace became very angry and arming himself alone with a weapon with great courage he gave direction to assemble to his crowned wives, little children, and all the rest of their attendants, in a place of refuge; and surrounding them with earthen vessels filled with gun powder he said, "At whatever time I may send word, at that time you may apply fire to those vessels charged with gun powder, and attain the possession of Vaikuntha.' Having given these orders and while he was about to come forth out of the palace he was accompanied by his people * * * and especially near to him in order to guard his sacred person was the Dalavai Rangappa Naicker* Timma the conductor of Royal elephant, Chokkanathan, Verabanu—Chinaraja and Akkiraja. These five persons, well armed, were round about him

* ఇచ్చట మరియొక దళవాయి చేరియ్యబడినది. విజయవెంకటపతి తరువాత నీయనను నియమించియుండవలెను.

as he came out, also being armed, from the principal entry of the palace, and fronted the enemy's army who had been eagerly enquiring "Where is the King; we do not see him come out." The appearance of Vijayaraghava at that time was that of a youthful well-looking person though more than 80 years of age; his extremely over-hanging eyebrows had gold wires attached to them to keep them up; his shrivelled waist was wrapped round with valuable robes; and his dress studded with many gems; he held in both of his hands two very large and highly furnished and glittering swords; and thus presenting himself before his enemies assailed himself to commence war. Now it had happened sometime before this, that in a transient fit of anger he had put irons on his son Mannarappa Naicker, and confined him in prison, and the wish appeared now to Dalavai Rangappa Naicker to release him; taking advantage of the present juncture. He in consequence spoke on this point to Vijayaraghava who consented saying, "It is well. Let Mannaruswami be released and brought". Some persons immediately went and cast off his fetters, and brought him with them. Then Mannaru Naicker regarding his father uttered the following verse:

క. మణిక్రిందుపరచి జలనిధి
తృణముఁ బై నుంచె నతనిదే కొదువసుమీ
మణి మణియె తృణము తృణమే
రణవిజయదిలీప విజయరాఘవభూపా.

He at the same time stood before his father in almost suppliant attitude, and with his hands closed together in the manner of prayer; while Vijayaraghava beholding his son and yeilding to unrestrained parental affection, folded him in his arms * * * "The Royal queens with the children and others are all in the mahal; and it is certain that notwithstanding that we may fight a little, and afterwards obtain Vaikuntha, yet that if they remain there when we are dead, those of Trichinopoly will accomplish their own word and taking our daughter thither they will establish their own pretention; therefore we ourselves must cause the whole of them to obtain the divine form". Thus consulting and speaking Vijayaraghava despatched his son and Akkiraju on this errand into this mahal. Meantime the whole of the Royal family held in their hands drawn swords and were constantly waiting anxious to know if the King's mandate of death would come or not. When they saw the two persons approaching, they inquired. "Is the King well? What command has he sent?" As soon as Mannarappa Naicker announced the fatal mandate, the Royal queens began immediately to cut each other into pieces with swords and axes; and some received deadly wounds and forthwith attained heavenly bliss. As a great number of domestics were within the palace, the whole of the remainder set fire to the gun pouder; previous to which act the before-mentioned persons quitted the place and stood before the king after having given in the report. No sooner

had the fire been applied to the gunpowder within the mahal, than a loud double explosion took place; and the fire and the smoke surrounded the whole palace setting it on fire. Vijayaraghava did not give way to the least grief of mind on beholding that cumbustion, but said, "O! Mannarudeva! This is a requital for you" and then putting no restraint on himself he rushed on to the battle.

(ఇచ్చట గాడె మన్నారదళవాయి ఎరల కబురంపినట్లున్నది.)

* * * *

There upon Vijayaraghava and his son Mannarappa Naicker taking sword in hand ,entered into the enemy's army and for a time bravely fought with much strength each one killing many persons; after which they both of them obtained Vaikuntha.

At the time of these occurences the nurse who had nourished the child of Mannarappa, taking the said child now two years old in her arms, escaped without any one knowing it, and went to Negapatam and there reared it with great care.

* * * *

He Dalavai) also had the heads of Vijayaraghava and of his son [1] cut off, and taking them together with many rich jewelled garments to as full an extent as desired; he returnd together with the army to Trichinopoly; and on recieving the king's orders entered the town and presented the two heads of

1 మన్నారుదేవుడు మధురనాయకునకేమి యపకృతినొనర్చెనో!

Tanjore persons, * * * * and Raja said with great joy; "Our determined resolve has now been accomplished according to our purpose".

Subsequently he bestowed the Viceroyalty of Tanjore on one Alagiri Naicker whom he regarded with the greatest affection calling him elder brother, because he was the son of the nurse who had nourished the king when an infant, and they had both partaken of the same milk; the king having made a regulation that with the exception of the necessary public expenses the whole of the remainder of the revenue should be transmitted by him to Trichinopoly, sent Alagiri Naicker to Tanjore. Accordingly he, having recieved king's orders proceeded to Tanjore and settled the whole country; and as before in the time of Vijayaraghava the latter had acted with equity, so he also conducted himself, and after deducting expenses he transmitted the remainder of the revenue to Trichinopoly.

* * * *

While so goverving the Kingdom, (After sometime) he (Alagiri) now addressed a letter composed in terms of equality to the presence of the King Chokkanatha. Whereupon the Rayesars (secretaries) who were in the presence of the King * * said, "Alagiri Naicker of Tanjore instead of writing a petition as heretofore customary, has now written in this kind of style". The King much displeased opened and looked at that letter,

and became greatly incensed, so that he put his hand on his moustaches and his eyes sparkled with rage. He instructed his secretaries to write a reply in these terms, "Thou understandest the nature of thy power. Does thou not? As thou and we were nourished with milk from the same breast, we placed our favour upon thee, and so soon after sending thee to Tanjore, what means this beginning of treasson, this withholding of revenue and other things; and this want of fear in sending a letter as if to an equal? If for the future we percieve this thy mistaken conduct we shall not forbear. Therefore see and conduct thyself with good sense." According to those instructions the secretaries wrote. As soon as the letter reached Alagiri Naicker, he read it over, and thinking highly of it returned an answer concieved in ironical and equal terms to this effect, "Did we not write according to the constant practice of Tanjore rulers, when addressing those of Trichinopoly. Where is the difference?" On this letter coming to the presence of the King. * * * and ordering all the troops to be assembled, he sent for the Dalavai, and after making him well acquainted with all the circumstances connected with the letters, he gave him orders in these terms:

"Set cut forthwith for Tanjore with the army, and taking Alagiri Naicker by the hand, conduct him thither."

Thereupon the whole of the court advisers formed a deliberate council in which they came to these conclusions: "There is sufficient cause to order the marching of an army against Alagiri Naicker. But it would be needful to proceed against him with a much greater force than heretofore sent against Vijayaraghava. Should the matter be thus hurried on, how can this be managed? Therefore it will be expedient to proceed regularly according to the rules of Sama, Dana, Bheda & Danda and having done so we may conquer Alagiri Naicker. Agreeable to which counsel they all with faithful integrity, pacified the King.

Such being the state of affairs we advert to the infant Sengamaladoss that was concealed by his nurse who took refuge in the house of a petty merchant. He recieved her hospitably and abundently supplied both her and child Sengamaladoss with food and clothes and thus continued to protect them. While they were there, it came to the knowledge of Rayasam Venkanna who had been employed as secretary by Vijayaraghava, that the offspring of the king was cencealed at Nagapatam; he accordingly came to that place, and had an interview with the nurse and Sengamaladoss in the house of the merchant; and all three resided in that house for some years. When Sengamaladoss had attained at ten years of age he took with him the nurse * *, and proceeding

to Visiapur [1] and had an interview with the Padsha of Secunderabad (Secunder-Padsha ?); and explained to him that their capital and dominion had been taken away by force. As the replies to questions proposed were acceptable, the Padsha distinguished them with much favour, and calling for the son of the Vaji Rao late named Ekoji Raja, he gave him orders in these terms, "Thou will take with thee 12,000. horse as also Sengamaladoss and conquer Alagiri who had taken these peoples kingdom; and having captured the fort, thou wilt cause Sengamaladoss to be crowned, and reinstated in the kingdom, and then return"

Accordingly Sengamaladoss and Ekoji Raja with 12,000 cavalry proceeded to Tanjore and fought with Alagiri Naicker. (ఇచ్చట అళగిరి చొక్కనాథుని సాయము కోరుటయు నాయన నిరాకరించుటయు చెప్పబడినది. ?) Thereupon Ekoji Raja captured the fort of Tanjore, and reinstated Sengmaladoss in the possession of the Kingdom. Sengamaladoss afterwards gave Ekoji Raja and others with him a great many splendid robes, and appropriated the revenue from Kumbakonam district for the maintenance of their army; and they. upon being sent to that place, remained there with the

1. బీజపురము.

whole army on account of the money arising from the revenue.

Subsequently Sengamaladoss preparatory to the bestowing of the post of Dalakarta—pirathani, (దళకర్తప్రధాని) got ready a great many presents, and calling for one Yenusannavai, he consulted with him on whom to bestow the office of Dalakarta; when it occured to him to ask the opinion of the nurse * * * (చెంగమలదాసునికిని దాసికిని జరిగిన సంభాషణ మిచ్చట నియ్యబడినది). And as Sengamaladoss was merely a child, he did not reject her counsel, but gave the post of Dalakarta to the merchants, delivered up to him his own seal, bestowed on him all kinds of presents, and mounting him on the Royal Elephant gave him a public entry to the town. At all this the Rayasam Venkanna was deeply grieved. (వెంకన్న విషాద మిచ్చట వర్ణింపబడినది.) * * * With these reflections he quitted Tanjore, and going to Ekoji at Kumbakonam, he said to him as follows: "You came from a great distance, and after great and varied efforts you took the fort; but wherefore give it over to Sengamaladoss? Who (besides you) would thus have given over so large a tract perfectly in their power, and yeilding an annual revenue of a crore [1]". On hearing this speech Ekoji Raja replied, "Hari Hari! why dost thou gabble

1. తంజాపురరాజ్యాదాయము.

on at this kind of rate?" and was angry. But Rayasam Venkanna, not ceasing on that rebuke, continued to carry on the like insinuations every day for a period of six months. Ekoji Raja did not assent and said, "Should Secunder Pasha (?) hear this speech, severe punishment would visit us, and therefore we dare not act contrary to written orders," which was the usual reply. * * About the same period Secunder Pasha died. Of this intelligence Ekoji Raja recieved written information, Availing himself of this opportunity, the Rayasam Venkanna addresed Ekoji Raja in the following terms, " you have no need of any precautions; come into fort; they are by no means people of war. We will give you the kingdom, and ensure its subsequent peaceful regulation." Induced by such suggestion sand as Secunder Pasha was deceased, Ekoji Raja consented, and sending forth Rayasam Venkanna, he entered Tanjore by the eastern gate accompanied by his troops. As Sengamaladoss had no persons capable of making resistance, he himself with the whole of personal attendants, went out by the western gate from the fort, and took refuge in the Trichinopoly country. Ekoji Raja took possession of the rich country of Tanjore. Thenceforward down to the present time the Mahrattas have ruled over the Tanjore Kingdom."

(Taylor's, O. H. Mss. pp. 191, 203.)

---

## గ్రంధరచనమునం దుపయోగింపబడిన పుస్తకములు.

---

1. Sources of Vijianagar History; S. K. Iyengar.
2. History of the Nayaks of Madura; Satyanatha Iyer.
3. The Mahratta Rajas of Tanjore; K, R. Subrahm niam.
4. History cf the T njore Nayaks; T. S. Kuppuswami Sastri
5. Oriental Historical Manuscripts; Taylor.
6. Descriptive Catalogue of Skt. Mss, Oriental Mss., Library, Madras.
7. Journal of Musical Academy, Madras.
8. Tanjore Dt. M nual; T. Venkasami Rao.
9. Tanjore Dt. Gazetteer; F. W. Hemmingway.
10. Descrip ive Catalogue of Skt. Mss. in the T. M. S. M Libr ry, Tanjore—Prof. P. P. S. Sastri
11. Elements of Indian Paleography; Dr. Burnell.
12. Inscriptions in Madras Presidency; V. Rangachari.
13. Sewell's For otten Empire.
14. Journal of the Andhra Historical Research Society.
15. A classified index to Skt. Mss. in the Tanjore Palace Library; Dr. Burnell.

16. Ancient India; S. K. Iyengar.

17. Some contributions of South India to Indian Culture; S. K. Iyengar

18. Early History of India; V. A. Smith.

19. Aravidu Dynasty of Vijianagar; S. J. Heras.

20. Descriptive catalogue of Tamil Mss. in the Tanjore Library; Olaganatha Pillai

21. Inscriptions of Maharattas; T. Sambamurti Rao.

22. Journal of Oriental Research; Madras.

23. Tanjore (The city of the mammoth Bull); Major H. A. Newell (Indian Army)

24. వరదాంబికాపరిణయము; తిరుమలాంబాకృతము.

25. మన్నారుదాసవిలాసము }
26. ఉషాపరిణయము } రంగాజమ్మకృతులు.

27. రఘునాథాభ్యుదయకావ్యము; రామభద్రాంబాకృతము.

28. విజయరాఘవవంశావళి }
29. రాజగోపాలవిలాసము } చెంగల్వాల కాళకవికృతములు.

30. సాహిత్యరత్నాకరము; యజ్ఞనారాయణదీక్షితకృతము.

31. రఘునాథాభ్యుదయనాటకము; విజయరాఘవనాయకకృతము.

32. వాల్మీకిచరిత్రము; రఘునాథనాయక కృతము.

33. విజయవిలాసము; చేమకూర వేంకటకవికృతము.

34. రాజగోపాలస్వామి ప్రబంధము; విజయరాఘవనాయకకృతము.

35. హేమాబ్జనాయికా స్వయంవరము; మన్నారుదేవకృతము.

36. సంగీతసుధ; గోవిందదీక్షితకృతము.

37. హిందూదేశ కథాసంగ్రహము; కె. వి. లక్ష్మణరాయకృతము.

38. రుక్మిణీపరిణయకావ్యము
39. ఆనందరాఘవము
40. కమలినీ కలహంసము
} రాజచూడామణిదీక్షిత కృతములు.

41. రఘునాథభూపాలీయము
42. అలంకారరత్నాకరము
} యజ్ఞనారాయణదీక్షిత కృతములు.

43. చతుర్దండిప్రకాశిక; వేంకటమఖికృతము.

44. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము; కవిత్వవేదికృతము.

45. శివభారతము; కవీంద్ర పరమానందకృతము.

46. రాఘవేంద్రవిజయకావ్యము; నారాయణకవికృతము.

47. కంపరాయచరిత్రము; గంగాదేవీకృతము.

48. సంగీతసంప్రదాయప్రదర్శిని.

49. తంత్రశిఖామణి; రాజచూడామణిదీక్షితకృతము.

50. అప్పయ్యదీక్షితచరితము; శివానందకృతము.

---

# అకారాదిపదసూచి

